

చెన్నపట్టణము, అక్టోబరు ౧౯౩౧

సంపుటము ౮ ప్రజోత్పత్తి సంవత్సరము ఆశ్వయుజమాసము సంఖ్య ౧౦

# ప్రభాతస్తవము

జి. జాషువగారు

కుంకుమపంకముం బులుముకొన్నవి తూరుపుఁగొండ నెత్తముల్,
పంకజబాంధవుం డరుణపాదముల న్నిగిడించె మింట, నే
గాంతుఁడు చిన్నవోయి, చరమాచలసానుతటంబు లెక్కె, మై
జింకయుఁ దాను గడ్డి గఱచెన్, బెనుచీఁకటు లార్చెఁ గాకులై.

*　　　*　　　*　　　*

విత్తనంబున మహావృక్షంబు నిమిడించి, చిత్రించి, గారడీ చేయువాఁడ!
కడుపులో శిశువును గల్పించి, పదినెలల్ మోయించి, యూపిరిఁబోయువాఁడ!
పొటమరింపక ముందె పుష్పసంతతులకు వింతగా రంగులు వేయువాఁడ!
సద్భక్తవరులకు సాక్షాత్కరించియు, నున్నచో నెఱిఁగింప కున్నవాఁడ!
చెలువ మొప్పఁ బుడమి సృష్టించి నా కిచ్చి-అనుభవింపు మనుచు నాన తిచ్చి
నిలువ నీడ లేక నిల్చిన కలవాఁడ!-కడుపు నిండ నన్నుఁ గన్నవాఁడ!

నాకుం దోడయి నిద్ర మేలుకొని యుంట న్నీదు కన్గోనలన్
రేకల్ త్రెన్ జిగురాకువన్నె లవి, నిండెం బూర్వదిగ్భిత్తులన్
నీ కేకానుక లీసమర్థుం డగు నీ నిర్భాగ్యుం డీదేహము
న్నీ కిత్తుం దల వాల్చి హా మ్మొలమిం దండ్రీ! నామనశ్శయ్యలన్.

గాలికిం దూంగిరూడు గిజిగాని కులాయముం జూపి నాకు, నీ
పోలిక లాత్మలోం గరంగిపోసితి, ధన్యుండ నైతిం, గొండలం
దేలిన మబ్బులోన నెలుం గెత్తి శరీరము పుల్కరింప, రా
గాలపనం బొనర్చితివి, యర్థము గా దది యేమి యీశ్వరా!

కరమున నీవు సున్నితముగాం జికిలీ లొనరించి, పుష్పవ
ల్లరుల నలంకరించుచు, దళంబులు మోడిచి, వాడి వత్తులై
తొరగిన వృద్ధపుష్పముల దుఃస్థితికిన్ గరుణించి, యశ్రువుల్
గురియుదె? యట్టి నీకనులలోనం జెమర్చు నజాండ భాండముల్.

అలసట లేక హోరుమని యార్చుచుం బారెడు నమ్మహానదిన్
గులుకు తరంగమాలికలకుం గిలిగింతలు వెట్టి, ఫేనపం
క్తుల నటనావిలాసములకుం దల యూంచుచు, నేను మ్రొక్కినన్
గిలకిల నవ్వి, నన్నుం దిలకింపని కారణ మేమి యీశ్వరా!

నన్నుంబోలు కోటినరుల మృత్తికనుండి- వెలువరింప శక్తి గలిగియుండి
నన్ను విడువలేక కన్ను మూయ వదేల?-యెట్లు దీర్చుకొందు నీఋణంబు?

---

సాహిత్యవిద్యాప్రవీణ బులుసు వేంకటరమణయ్యగారు

గీర్వాణాలంకారశాస్త్రమునఁ గాలానుసారముగ నొక్కొక్కపుడు కొన్నికొన్ని కావ్యాంగములకుఁ బ్రాధాన్యము కలుగుచు వచ్చెడిది. అందుఁ బ్రాచీనుఁడగు భామహాచార్యులును, దదనుసారులగు నుద్భటరుద్రటులును నలంకారములకే ప్రాముఖ్యము నొసంగి యున్నారు. అట్లే ధ్వనివాద మానందవర్ధనునితోఁ బ్రారంభమైనది. కుంతకుఁడు వక్రోక్తిని, మహిమభట్టనుమానమును ప్రధానములని నిర్వచించియున్నారు. ఇందు వక్రోక్తిజీవితకారుని (కుంతకుని) మహిమభట్టునుమాత్రము మఱెవ్వరు ననుసరింపలేదు. తక్కిన వారి ననుసరించినవారుమాత్రము కొలఁదిగనో యెక్కువగనో యున్నారు.

ఈమీఁద చెప్పఁబడినవారు స్వతంత్రమార్గముల నవలంబించినరీతినే పదునొకండవ శతాబ్దమునందలి క్షేమేంద్రుఁడను కాశ్మీర దేశ పండితుఁడుకూడ 'ఔచిత్య'మను నొక క్రొత్త దారిని తీసెను. ఆమార్గముకూడ సమంజసమై యుక్తియుక్తమై సర్వపండితాదరణీయమై యున్నది.

కావ్యమున జీవితభూతమగు రసమును, దదుత్కర్షత నాపాదించు గుణాలంకారాదికములు నెన్ని యున్నను, ఔచిత్యము లేనిచో నవి నిష్ఫలము లనియు, ననఁగా నవి యుండియు లేనివానిలోనే లెక్కయనియుఁ, గవులు బాగుగ నాలోచించి యౌచిత్యదూరములు కాని వర్ణనములనే యొనర్పవలెననియు క్షేమేంద్రుని యభిప్రాయము. దేని కెయ్యది తగియుండునో యట్లు జతగూర్చుటయే యౌచిత్య మని

"ఉచితం ప్రాహు రాచార్యాః
సదృశం కిల యస్య యత్,
ఉచితస్య హి యో భావ
స్తదౌచిత్యం ప్రచక్షతే."

అను నతని లక్షణమువలననే తెలియుచున్నది. దేని కెయ్యది యనుగుణముగ నుండునో యారీతి వర్ణింపక తగనిరీతిని నిబంధించిన కవి హాస్యాస్పదుఁడుకాక మఱేమగును? ఈవిషయమునే కవి దృష్టాంతపూర్వకముగ నిట్లు చెప్పినాఁడు—

"* చ. మెడ మొలనూలునుం గటిని
మేలిమిహారమునుం, గరంబులన్
గడియము బాజుబందు పద
కంజమునన్ ఘటియింప, నమ్రుపై
వడిగొను శౌర్యమున్ రిపుని
పైఁ గరుణన్ బ్రకటింప—హాస్యమౌఁ
గడఁగి యలంకృతుల్, గుణము
కల్లలె, యౌచితి లేక యున్నచోన్."

* క్షేమేంద్రుని పద్యమునకు నా యాంధ్రానువాదము.—బు. వేం. ర.

కొందఱు కవు లిట్టి సర్వోత్కృష్టమును, ముఖ్యమును నగు నౌచిత్యమును బాటింపక పోయిరి. అట్టివారి పద్యములతోఁగూడ నాయ నౌచిత్యముం జూపించి క్షేమేంద్రుఁ డట్టివెల్ల నెట్లు సరిచేయవలెనో సోదాహరణముగఁ దన యౌచిత్యవిచారచర్చయందు నిరూపించి యున్నాఁడు.

కాఁగా నౌచిత్య మనఁగాఁ దేలిన విషయ మేమన-తగినరీతినేగాని తగనిరీతిని వర్ణింపకుం డుట-అని. దీని నంగీకరింపనివారు సామాన్య ముగ నుండరనియే చెప్పవలెను. కాన నెపుడు కావ్యరచన మారంభమైయుండెనో యంతటి నుండియు నీయౌచితి కావశ్యకత యుండనే యున్నది. కాని "ఔచిత్య ముండవలె" నని చెప్పినవారు తక్కువ. అట్లు చెప్పనిమాత్ర మున వా రౌచిత్యమును బాటింపలేదని చెప్పుట సమంజసము కానేఱదు. అట్లైనచో రామాయణాదిమహాగ్రంథము లౌచిత్యవిరహితము లని చెప్పవలసివచ్చును. అట్లు చెప్పుట సరి కాదుకదా?

ఇంచుమించుగ సాహిత్యశాస్త్రమునం దలి విషయములకు భిత్తిపెట్టి మార్గదర్శకుఁ డైనవాఁ డొక్క యానందవర్ధనాచార్యు లని చెప్పవచ్చును. అతఁ డితరులు చెప్పని ధ్వనిమార్గమును నిరూపించుటయే గాక, అతని తరువాతివారు నూతనమార్గములు నిరూపించుట కెంతయు సాయపడినాఁడు. కుంతకుఁడు ముఖ్యముగఁ దీసికొనిన వక్రోక్తికి భామహుని తర్వాత దారిచూపి, దానిని బోషించి కుంతకుని కెక్కు డుపచ రించిన దీయానందవర్ధనుఁడే కాని వేఱొకఁడు కాఁడు. మఱియు నౌచిత్యము ముఖ్యముగఁ బాటింపఁబడవలె నని దానికిఁ బ్రాధాన్య మొసఁగి క్షేమేంద్రునికి దారిచూపినదియు నీయానందవర్ధనుఁడే. ఇంతకంటెఁ బ్రాచీను లౌచిత్యవిషయమున నేమియుఁ జెప్పియుండ లేదు. అతఁడు

"అనౌచిత్యా దృతే నాన్య ద్రసభంగస్య కారణమ్,
ప్రసిద్ధౌచిత్యబంధస్తు రసస్యోపనిష త్పరా."

అని కావ్యజీవితమగు రసము నౌచిత్యమే పోషింపవలెనని నుడివియున్నాఁడు. విభావభావాద్యౌచిత్యమును నిరూపించినపిదప నతఁడు చెప్పిన

"ఇతి వాక్యార్థవివేకో యోఽయం
చేతశ్చమత్కృతివిషయీ,
సూరిభి రనుసృతసారై
రస్మదుపజ్ఞో న విస్మార్యః."

అనుశ్లోకముంబట్టి యౌచిత్యము పాటింపఁబడ వలెనని చెప్పినవాఁ డాతఁడేయని స్పష్ట మగు చున్నది.

ఆనందవర్ధనుని యీయాశయము నంగీక రించి యతని తర్వాతివారును, క్షేమేంద్రుని కంటెఁ బ్రాచీనులు నగు కొంద ఱౌచిత్య ప్రాశస్త్యము నిట్లుగ్గడించిరి. అందు ధ్వని కారుని ప్రతిస్పర్ధియగు మహిమభట్టుగ్రంథ మునుమాత్రమే యిట నుట్టంకింతును.

"అనౌచిత్యబంధో హి పరం రసభంగకారణం కవయో వదన్తి, యత్స్వాహ – 'అనౌచిత్యాదృతే నాన్య ద్రసభంగస్య కారణమ్.......' ఇతి."

క్షేమేంద్రుని తర్వాతివారు కూడ నీ యౌచిత్యము నంగీకరించిరి. ఇందులకు జగన్నాథపండితుఁడు మొదలగువారి గ్రంథములు దృష్టాంతములు.

పై కారణములను బట్టి క్షేమేంద్రునికంటెఁ బ్రాచీనకాలమునందే యౌచిత్యతత్త్వము నిరూపింపఁబడినది కానఁ గ్రొత్తగా క్షేమేంద్రుఁడు చెప్పలేదని తెలుచున్నది.

మఱియు నలంకారశాస్త్రమునందలి అలంకారమార్గము, రీతిమార్గము, రసమార్గము, ధ్వనిమార్గము మొదలగువానివలె నౌచిత్యమును నూతనమగు మార్గాంతరముగఁ దీసికొనుట కవకాశము తక్కువ. అలంకారప్రాధాన్యవాదులు రసము నప్రధానముగాఁ జెప్పుదురు. రసవాదు లలంకారముల నట్లే చెప్పుచుందురు. కాని యందఱును గూడ నౌచిత్యము నంగీకరింపక తప్పదు. ఔచిత్య మున్నచోఁదనే తక్కినవి శోభించును. లేనిచో నిష్ఫలము లగునని యిదివఱకే చెప్పఁబడినది. వ్యాపకమగు నౌచిత్యమును గ్రాహ్యీకరించి వ్యాప్యముగా నొనర్చి యది నూతనమార్గమని దానికి వేసము వేయుట యంతటియుచితమైనది కాదు.

పదుగురుకవు లౌచితి నతిక్రమించి తమ యిచ్చకు వచ్చినట్లు కవితను సాగించుట చూచి యట్టివాని నన్నిటి నొకచోఁ జేర్చి యందలి యనౌచిత్యమును, నట మార్చవలసిన రీతిని నిరూపింప క్షేమేంద్రుఁ డౌచిత్య విచారచర్చను వ్రాసెనని చెప్పనగును. కాని యౌచిత్యమును దానే కనిపెట్టితినని చెప్పుకొనుట యతని యుద్దేశ్యము కానట్లు తోఁచుచున్నది. కావుననే కావ్యమున రసమే ముఖ్యమని యాతఁడు నంగీకరించుచున్నాఁడు.

"అలంకారా స్త్వలంకారాః
గుణా ఏవ గుణాః స్మృతాః,
ఔచిత్యం రససిద్ధస్య
స్థిరం కావ్యస్య జీవితమ్."

ఔచిత్యములేనియెడ రసభంగ మగును గావున రసపరిపోషకమగు నౌచిత్యమున జీవితత్వవ్యవహార ముపచారికమని యెఱుంగవలెను. కాని యదియే జీవితమనిమాత్రము కర్తృహృదయము కాదు.

మఱియు నొక్కయెడల నౌచిత్యము లేక యనౌచిత్యమే యున్నను బాధకము కాఁజాలదని కొందఱిచేఁ జెప్పఁబడినది. అట్లనౌచిత్యమే యట నున్నను, అట్టిది యుత్తమమగు కావ్యముగనే పరిగణింపఁబడుచున్నది. ఔచిత్యమే కావ్యజీవితమని యంగీకరించినచోఁ బ్రకృతాంశము సరిపడఁగలదా?

ఎంతటి యనౌచిత్యమును నిబంధించిన రసభంగము తటస్థింపదో యంతటి యనౌచిత్యమును నిబంధింపవచ్చును. కాఁగా నౌచిత్యముకంటె రసమే ముఖ్యమని తేలినది. ఇందులకుఁ బ్రమాణముం గనుఁడు:

"యావతా త్వనౌచిత్యేన రసస్య పుష్టి స్తావత్తున వార్యతే, రసప్రతికూలస్యైవ తస్య నిషేధ్యత్వాత్ అతఏవ

బ్రహ్మన్! అధ్యయనస్య నైష సమయ
స్తూష్ణీం బహిః స్థీయతాం,
స్వల్పం జల్ప బృహస్పతే! జడమతే!
నైషా సభా వజ్రిణః;
వీణాం సంహర నారద! స్తుతికథా
లాపై రలం తుంబురో!
సీతారల్లకభల్లభగ్నహృదయః
స్వస్థో న లంకేశ్వరః.

ఇతి కస్యచి న్నాటకస్య పద్యే విప్రలంభశృంగారాంగీభూతవీరరసాక్షేపకపరమైశ్వర్యపరిపోషకతయా స్థితదౌవారికవచనస్య బ్రహ్మాద్యధిక్షేపపరస్యానౌచిత్యం నదోషః."

—రసగంగాధరః, పృష్ఠమ్ ౩౩.

ఈపీఁడి జగన్నాథపండితుని గ్రంథమునుబట్టి యనౌచిత్యము బాధకము కాకపోవుటయేగాక రసపుష్టికి సాధక మగుచున్న దనికూడఁ దెలియుచున్నది. పీఁడిపద్యమున రావణుని దౌవారికుఁడు సీతావిరహమున స్వస్థచిత్తుఁడుకాని రావణునికి అధ్యయనాదికములకును, స్తోత్రములు వినుటకును నిది యదనుకాదు; కావున నూఱకయుండవలెనని యతని యూడిగకాండ్రుగా నున్న బ్రహ్మాదిదేవతలను మందలించుచున్నాఁడు. ఇందు ద్వారపాలకుఁడు బ్రహ్మాదిదేవతలను నిరసనవాక్యముచే మందలించుట యెంతయు ననుచితము. కాని బ్రహ్మాదిదేవతలుసైతమురావణుని సేవించుచు నతని యనుగ్రహము నాకాంక్షించుచున్నారనుటలోను, తన్మూలమగు రావణుని వీరములోను, ఈయనౌచిత్యము మిగుల నుపకరించుటచే దీనిని జెప్పుట దోషావహము కాదు. మఱియు రసమును బోషించును. కాన ననౌచిత్య మెుకయెడ బాధకము కాకపోవుటయేగాక గుణము కావచ్చును. కావుననే హాస్యరసమున ననౌచిత్యము గుణ మగుచున్నది. ఈరీతినే యస్థానభూషణవిన్యాసరూప మగు విభ్రమము దూష్యముకాక గుణమే యగుచున్నది. ఆలంకారికు లందఱును విభ్రమము నంగీకరించియున్నారు. అస్థానభూషణవిన్యాసమనౌచిత్యాధాయకమే యనుచో నీవిభ్రమము నిర్విషయకము కాఁగలదు. విభ్రమలక్షణములఁ గనుఁడు.—

"వివిధానా మర్థానాం
వాగంగాహార్యసత్త్వయుక్తానామ్,
మదరాగహర్ష జనితో
వ్యత్యాసో విభ్రమో నామ."

—నాట్యశాస్త్రమ్, అధ్యా ౨౪. శ్లో ౧౬.

"వాగంగసత్త్వాభినయ
భూషాస్థానవిపర్యయః,
త్వరయా కల్పితో ఒభీష్ట
దర్శనే య స్స విభ్రమః."

—భావప్రకాశనమ్, అ ౧. పృష్ఠమ్ ౯.

"విభ్రమ స్త్వరయా కాలే
భూషాస్థానవిపర్యయః."

—ప్రతాపరుద్రీయమ్, రసప్రకరణమ్.

"త్వరయా హర్ష రాగాదే
ర్దయితాగమనాదిషు,
అస్థానే భూషణాదీనాం
విన్యాసో విభ్రమో మతః."

—సాహిత్యదర్పణః, తృతీయఃపరిచ్ఛేదః.

"రాగాదినా విపర్యాసః
క్రియాణా మథ విభ్రమః"

......హస్తే నాదాతవ్యే పాదే నాదానం, కటియోగ్యస్య కంఠే నివేశన మిత్యాదిక శ్చేష్టావిపర్యాసో విభ్రమః.......

—నాట్యదర్పణమ్, ౪ వివేకః. పృ ౧౦౫.

“విభ్రమ స్త్వరయా కాలే భూషాస్థానవిపర్యయః.”

—దశరూపకమ్, ద్వితీయః ప్రకాశః.

కావున విభ్రమవిషయమునమాత్ర మనౌచిత్యమును బరిగణింపరాదు. అట్లు విపర్యయమే యుచిత మగును. ఉదాహరణమును గనుఁడు-

“యశ్చాప్సరోవిభ్రమమండనానాం
సంపాదయిత్రీం శిఖరై ర్బిభర్తి,
వలాహకచ్ఛేదవిభక్తరాగా
మకాలసంధ్యామివ ధాతుమత్తామ్.”

—కుమారసంభవమ్, ౧ సర్గః.

ఇచట నాకాశము నంటుచున్న హిమవంతుని శిఖరములందుఁ గల గైరికాదిధాతువులు సంజకెంజాయ నొప్పుటచే సాయంకాల మైనదని భ్రాంతిఁ గొని యప్సరసలు తొందరగా నలంకరించుకొనుచుండుటచే నాయలంకారములు తారుమారగుచున్నవని భావార్థము. అనుకొననియంతటి వేగముగ సాయంకాల మగుటచే-ఇంక నలంకరించుకొనుటకుఁ జాల వ్యవధి యున్నదని యుపేక్షాభావమును వహించిన యచ్చరలు, తొందరపడుటచే నలంకారములు తారుమారుచేసికొనుట యెంతయు సహజము. ఇట్టియెడ నామారు పెంతయు నుచితముగ నున్నది.

ఇట్టి విభ్రమము క్షేమేంద్రుని మతానుసారముగ నెంతయు ననుచితమని కొందఱు భ్రాంతిగొని “యశ్చాప్సరోవిభ్రమ” అనుశ్లోకమునందలి విభ్రమపదమునకు విలాసమని యర్థము నెంచి యచ్చరమచ్చెకంటులు విలాసముకొఱకైన యలంకారములు ధరించుచున్నారని చెప్పవచ్చును. కాని విలాసార్థములగు మండనములను ధరించుకొనుట యెల్లపుడును పొసంగవచ్చును. గైరికాదిధాతువుల చాయఁ గని సంజ యైనదని భ్రమసియే ధరింప నక్కఱలేదు. కావ నిచటి విభ్రమపదమునకు విలాసమనియే యర్థము చెప్పు నెడల “సంపాదయిత్రీం, అకాలసంధ్యామివ, ధాతుమత్తామ్,” అనుపదములు నిష్ప్రయోజనములు కాఁగా రసభంగము కలుగవచ్చును. కావున విభ్రమపదమున కలంకారశాస్త్రప్రసిద్ధవిభ్రమపదార్థమే యర్థమని గ్రహించి యౌచితి నాపాదించుటయే యెంతయు సముచితము. కావున రసభంజకమగు ననౌచిత్య మనౌచిత్య మనియు, రసపరిపోషకమును, రసబాధకము గానిదియు నగు ననౌచిత్య మనౌచిత్యము కాదనియుఁ దేలిన సారాంశము. సామాన్యముగ నౌచిత్యమును బాటింపవలె ననుట అందఱి యభిప్రాయమనుటలో బాధకము లేదు.

ఔచిత్యము క్షేమేంద్రునికంటెఁ బ్రాచీనమగు కాలముననే చర్చకు వచ్చినను క్షేమేంద్రుఁడే దానిని విశదముగ విమర్శించి యుదాహరణములను మిక్కిలి కుశాగ్రమగు బుద్ధితోఁ బర్యాలోచించి దాని కుచితమగు స్థానము నొసంగెను. రసజ్ఞు లాతనియెడ మిక్కిలి కృతజ్ఞతను జూపవలసియున్నది.

౨

నేటి కది సత్యమగుచు ఘనీభవించె-నవ్యయౌవన ప్రణయసన్నాహ వేళ
భావముల్గుపూయు మన్మనఃఫలకమందు-నెన్నడో నేను చిత్రించుకొన్న ప్రతిమ.

నీ కమనీయ రూప మెద నిల్పి జపించిన యిన్నినాళ్లు నీ
లోకములెల్ల జీకటులలో బడిపోయెను, నేడు నీదు లీ
లాకరుణావలోకనముల౯ జగమెల్ల జిగిర్చె బ్రేయసీ
నీకనుపాపల న్మెలగు నీడలె నాకు, జగంబు లారయ౯.

నాచెలి, నాడు నందనవనంబున దివ్యసుమాళిసౌరభ
శ్రీ చెలువార నంగుళుల జిక్కడలించుచు నీవు నిల్వ, నే
నీచెవిజేరి నీకురుల నీడల మంతనమాడుజాడ లే
యీ చిగురాకు పూబొదరుటీరమినీడల నిల్వ దోచెడు౯.

నీచిరునవ్వుమొగ్గ లవనీస్థలిపై వికసించెనేమొ నా
బూచిన దీర్ఘజాళి ప్రతిపుష్పరసోదయలీల, లోననా
లోచన లేచి లోజవుల లోతులు, పాతులు పెల్లగించి యే
వో చిరకాలవిస్మృత శుభోద్యమలీలల ద్రవ్వియెత్తెడిన్.

కోయిలపాటతో నెచటికో చనుచున్నది నాదుప్రాణ మీ
వాయుతరంగ డోలికలపైబడి లోకముదన్ని భావమై
హాయసవాహినీతటవిహారవిలోలతఁ జొక్కి-చొక్కి- యీ
పోయిన పోకగా నెగిరిపోయెడు హాయి గరంగ లోకముల్.

నీయూనందము పూవులై చిగురులై నిర్వేల సమ్మోహన
శ్రీయై యేలె లతాంగి, పుష్పమయమహా సింహాసనం బిందు నీ
కై యేర్పడ్డది; కొల్వుదీరు మిట, నీకర్పించుచున్నాడ రా
జ్ఞీ, యీనాప్రణయైకజీవితము, న న్నేలందగున్ నీ విక౯.

---

# శ్రీయుత బుర్రా శేషగిరిరావుగారికి విజ్ఞప్తి

తురగా వేంకటరామయ్యగారు (కవితాసమితి).

ఆంధ్ర దేశమునందు గల విజ్ఞానులయం దొకరగు శ్రీయుత బుర్రా శేషగిరిరావు గారు ఆంధ్ర గ్రంథాలయసభకు నగ్రాసనాధిపత్యము వహించుటయు, నాటి మహోపన్యాసమునందు నవీనకవితను, ఆతరగతిని ప్రోత్సహించు భారతిని మందలించుటయు జరిగినది. అయ్యది శుభావహము.

సత్యాన్వేషణము కొరకు వీరు నిష్పక్షపాత బుద్ధితో నిట్టిపనికి బూనినచో వీరి వాక్యములు నవీన కవులు తలదాల్చవలసియుండును. ఏలన, విద్యావయ స్సంపన్నులును, "ఆంధ్రభారతీతీర్థ"మను సంస్థను దలంచినవారు ననుటంజేసియును, ప్రాచ్యప్రతీచీ విజ్ఞానముల నెఱుంగఁగోరువారు ననుటంజేసియును.

'నవకవి' యనఁగ నెటువంటివాఁడో వీరు నిర్ణయించిన విధానము ప్రప్రథమమున విమర్శనీయము.

"పూర్వఛందస్సును కాదని తా నేర్పరచుకొన్న ఛందోనియమములనైనను సరిగా పాటింప నేరక భావమును భావములను విశదపరచుటకు గాక దాచిపెట్టి గ్రహణవీథికి రాకుండఁజేసి అంతేయును అనవసరమగు విచారసాగరములో మునుఁగువాఁడు నవకవి."

"అపశబ్దభయం నాస్తి అప్పళాచార్య సన్నిధా" అన్నట్లు, దేశమునం దొక విధమైన పేరు నార్జించిన విద్వాంసు లేవిధముగ మాటలాడినను చెల్లువని ధైర్యమైన కావలెను, ఉపన్యాసకులకు నవీనకావ్యములు దృష్టిపథమున బడనైనైన కావలెను. ఏమాత్రమైనను వీరికి నవీన వాఙ్మయముతో బరిచయ మున్నచో నీ నవీన యుగమున నొకరైన తమ భావముల నుచితభాషలో వ్యక్తీకరించిన వారు పొడగట్టక పోదురా? అటుల పొడగట్టియుండిన నవకవి యనఁగ నిట్టివాఁడని ఒక్క కర్ర దెబ్బతో నిర్ణయింపఁగలరా యని సందియము వొడముచున్నది. వీరి మతమున గవిత యనఁగ నేదియో నిర్ణయించియు, ఛందోనియమముల పుట్టుకను బ్రయోజనమును బర్యాలోచించియు, నాంధ్రచ్ఛందోనిర్ణేతల పద్ధతుల నతిక్రమించినందువలన కావ్య ప్రయోజన మేరీతిని భంగమైనదో వివరించియు, నెచట భావార్థములకు విరోధము కలిగినదో హేతుపురస్సరముగ వివరించియు జెప్పినచో వీరి యుపదేశము నందలి సత్యాసత్యములను బరిశీలించుకొని నవకవులైనను, పత్రికలైనను, లోకమైనను అనుసరించునుగాని వీధిబడిపంతులు వలె ఈవైపునుండి యావైపునకు బహుమతు లిచ్చినచో శిక్షావిధానమునకు వ్యతిరేకఫలము గలుగును.

"ఆంగ్లమునందలి లిరిక్కు పద్ధతి ననుకరింపబోయి దానితో ఠాగోరుమహాకవి రచనల యందలి వ్యంగ్యతను జోడిచేయబోయి మన నవకవులు శృంగార రచనల గావించి భావకవిత్వమని క్రొత్త నామకరణము జేసినారు. ఇది శృంగారమో, శృంగారాభాసమో, శృంగారవికారవికారమో, విప్రలబ్ధమో, శృంగారప్రేరితకరుణమో లాక్షణికులే నిర్ణయింపజాలరు."

నవకవి యనఁగ నిట్టివాఁడని నిర్ణయించిన వారికి ఇందులకుమాత్రము లాక్షణికు లెందులకు గావలయునో? అలంకారతత్త్వము గాని, కవితాతత్త్వముగాని వీరికి బోధపడదా? ప్రాచ్యపాశ్చాత్య వాఙ్మయ విహారధీరు లగు పంతులుగారే రసస్వరూపనిర్ణయ మొనరించి, తదాభాసము నవకవిత యని స్పష్టీకరించి నవీన యుగమునందు దమ స్థానమును నిర్మించుకొన బ్రార్థితులు.

ఏదారియు నిర్ణయింపక, ఇది వికారము, అది నిరాకారము నని యుద్రేకకంపితులై చెప్పినచో నవీన యుగమునకు వీరి సందేశమువలన నేమి ప్రయోజన ముండును? యువకులకు వీరు గురుప్రాయు లెట్లగుదురు?

లిరిక్కు లాంగ్లమునసే కాదు, ఆస్థాయి గలవే ఆంధ్రదేశమున నెన్నియోవందల యేండ్లనుండియుపాకం పర్యముగ దంబురా శ్రుతితో బాడుకొను గేయములు లేవా? ఠాగోరుమహాకవి సంప్రదాయమే కాదు భక్తి పరము లైనవియు, వ్యంగ్యప్రధానము లైనవియు నగు వైష్ణవ సంప్రదాయ సంబంధము లగు గేయములు లేవా? స్వజాతీయములగు నా గేయములను పంతులుగారు వినినచో నవీనకవుల గేయములును, వ్యంగ్యతయు జాతీయతను చంపుటలేదనియును, వానినుండి క్రమాభివృద్ధి నందుచున్న వనియు గ్రహింపగల్గుదురు.

అట్లు గాక నవీనరచనములు విదేశీయ విజాతీయ సంప్రదాయముల ననుసరించుచున్న వనెడి దృష్టితోనే చదివి, వానితో వ్యతిరేక మగుటచే నవీనకవులు ప్రయత్నపడి విఫలులైనారని వచించుట విరుద్ధము.

అదియునుగాక యుగధర్మము ననుసరించి యుక్త మాదర్శములుగల విజాతీయ సంప్రదాయముల ననుసరించుటయు గొందరు కృతకృత్యులగుటయు, గొందఱు కాలేకపోవుటయు పరివర్తనమునకు సాధనచేయు నేదేశమందైనను ఏకాలమందైనను ఏశాస్త్రములకైనను సహజము. వైవిధ్యములందు దమ ప్రత్యక్షానుభవములను వెల్లడింప లేకపోయినను వీరు చూచిన ట్లొకటిమాత్రము నిజమని చెప్పిరి. "పిచ్చివానిరాతికి సరియైనట్లు" వీరిదృష్టి పథమున నున్న యువతీమణు లెవరో "పరాకున వీథి గుమ్మములో నిలబడుటచే" నవకవుల పద్యాలకు సరిగ్గా నారట. నిజముగ నట్టిదృశ్యములును, పద్యములును నవకవులలో నున్నవని వాని నూతగొని భారతిని, నవీన కవుల నందరిని నిందించుట కంటె నట్టి కావ్యములను క్రీడాభిరామమును, వీథినాటకమును నేతరగతిలో వీరు చేర్పదలంతురో ఆతరగతిలో జేర్చి విమర్శించుట సమంజసము కదా!

"ప్రాబంధికశృంగారకవులు చూపిన తేజముకాని, వైవిధ్యము గాని, చిత్రకళ గాని, రసభావభాషా నాగరికత గాని, గేయలాలిత్యము గాని, కళారహస్య పాండిత్య గాని, కడకు మానసతత్త్వవివేచన గాని సరిగా కనపడవు."

ఈపదప్రయోగము బహుధాటిగా నున్నది కాని వీరి యూహమాత్రము సరస్వతీదేవికైన నుదవగాహము: ప్రాబంధికయుగములో అలసాని పెద్దన మొదలు ముద్దు పళని వరకు వీరి హృదయమునకు, వీరి చిత్తవృత్తికి నచ్చిన రీతిని తేజము, చిత్రకళ, కళారహస్యపాండిత్యము రసభావభాషా నాగరికతలు, మానసతత్త్వ వివేచనము గాన్పించినపుడు ఇందులో నొకగుణమైనా అప్పారావు నాటి మొదలు వీరియుపన్యాసము నాటివరకు గల కవుల గ్రంథములందు గన్పించ లేదా? ఈకాలపు కవుల గ్రంథ మేదియు వీరు చదువ లేదా? చదివియున్నచో నేదయిన నొకపద్యము, చివర కొక్క పేరునైన నుచ్చరింప మరతురా? చదివినను కావ్యములయందలి సుగుణములను మరచి యవగుణములనే జ్ఞాపక ముంచుకొనిరా?—అని సందియములు గలుగుచున్నవి. ఇకనైనను వీరు నవీన రచనలను జదివి సక్రమ విమర్శనము బ్రకటించి తమ సందేహముల దీర్చుకొనుట మంచిది.

"ఇట్టి కవితలకు బత్రికాసంపాదకుల యనుగ్రహము ప్రకాశనసాధన మగుచున్నది."

ఇటువంటితీవ్రత విద్వాంసుల నావహించుట దురదృష్టము. ఆంధ్రదేశమున బత్రికాధిపతులు మూఢులు గారని వీరు గుర్తించుట ధర్మము. విరుగులు గాని, పట్టములుగాని లేకున్నను బత్రికాధిపతులును, నవీన కవులును లోకమునందు దమకు గల బాధ్యతను గుర్తెరింగియే, తాము సత్యములని నమ్మినయే నూత్నపథముల నవలంబించుచున్నా రనియు నుపన్యాసకులు తలంచుట ముఖ్యము.

విద్వాంసుల విమర్శలవలన లోకమునకు మేలు కలుగు ననెడు వాక్యము సత్యమే కాని పైశాచభాసములును, దాక్షిణాత్యలికో(?)ద్రేకజనితములును నగు విమర్శలు పండితుల నోటినుండి వెలువడినప్పటికిని లోకము త్రోసి పుచ్చుటకు జంకదు.

"భారతిపత్రిక సామునగరిడీ యగుచున్నది. దానం జేసి తగనిప్రచారము గలుగుచున్నది."

పాముగరిడీలకు ఆదర్శ మేమి? భారతి యాదర్శ మేమి? ఈ రెండింటికి సాదృశ్యము గూర్చిన పంతులుగారి యభిప్రాయ మేమి? ఉపన్యాసవేదికలు సర్కసు డేరా లైనవా నేడు?

భారతికి ఆంధ్రవిజ్ఞానప్రవర్ధన మాదర్శ మగుటంజేసి ప్రాచీనకవులను, నవీనకవులను, చిత్రకారులను, గానకళాభిజ్ఞులను, ప్రాచ్యశాస్త్రీయ పరిశోధకులను, పాశ్చాత్యశాస్త్రీయ పరిశోధకులను, అన్ని పక్షముల వారిని, నటునిటు తెంపనివారలను నిష్పక్షపాతముగ నాదరించుచున్నది. ఏదేని యొక వాదమును మాత్రమే సమర్థించుట పురోభివృద్ధికి కారణ మగునో నిట్టియూహకు పంతులుగారే మొదటివారు.

"1. ఇందలి నూతనత్వము పూర్వభావను క్రొత్తఛందములలో నిగికించుట. 2. ఉత్తమ నాయక నాయికాహావభావవిన్యాసమును మననాటి మోటుజీవితములకు పట్టించి వర్ణింపదలచుట, (సైకో అనాలసిసు) మానసతత్వవిచారదృష్టిని చూచినయెడల, ప్రపంచములో తీరనేరని యింద్రియ లౌల్యమును భావప్రపంచములో తీర్చుకొన ప్రయత్నించుట యని తేటపడును."

ఈదృష్టితో వీరు కవిత్వమునే తుడిచివేయగలరు. శంకరాచార్యులవారి దృష్టిలో శాస్త్ర పరిశోధకులు వ్యర్థపరిశ్రమ చేయుచున్నా రనిపించును గనుక కళాశాలలు మూసివేయవలెనా? ఇంద్రియాతీతమగు నానందము అనుభవైకగోచరము. ఇంద్రియలౌల్య మెక్కటియే నవీనాంధ్రవాఙ్మయమునం దున్నదని నుడువుట సాహసము. రత్యుపరతులను, సంసర్గములయందలి బంధనములను పచ్చిగా వర్ణించిన ప్రబంధయుగమునందలి గ్రంథములందే పంతులుగారికి తేజము, కళారహస్యము బోధపడి నహో ప్రేమజీవుల భావపరిణామముల నుజ్జీవింప చేయు కావ్యములును గల నవీనరచనలయందు వీరికి ఇంద్రియ లౌల్యమమాత్రమే గోచరించుటకు కారణము దురూహ్యము.

"మన నవకవులు...... ఇట్టివారే తమ కవితలలో చలాక్షీవిలాసవిలోకనములే యారాధ్యదైవతములుగ భావించుకొని యింద్రియలోలత్వమే కవిత్వమని భ్రమపడి పరమేశ్వరుడు తమ కొసగిన కళానైపుణ్యమును, లోకకల్యాణకరములగు నుత్తమాశయములను వర్ణించుటలోను, ఉత్తమార్గములను విశదపరచుటలోను వినియోగపరుపకుండుట శోచనీయము. మన యాంధ్రావని దురదృష్ట మనకలసియున్నది."

మానవజీవితమునకు నుత్తమాదర్శ మేది యను నన్వేషణము నవకవుల కావ్యములందు ప్రదర్శింపఁబడుచునే యున్నది. మానవభ్రాతృత్వమునకు ప్రణాళిక నవీనవాఙ్మయమున నిర్మింపబడుచునేయున్నది. "పాడు నేనే లేదురా నీభావమే బీడాయెరా" యని నవీన వాఙ్మయము ఘోషించుచునేయున్నది. "మురళినేకాదు మ్రోడు వెదుర, శిథిలజీవితమునూడ" మ్రోయింపగలరస స్వరూపుని నవీనకవి ప్రతిష్ఠించుచునే యున్నాడు. "ఏల గిరవాటునైచెద వీవిషణ్ణకుటిలకర్దమ సంకీర్ణ కూపమున" కనియు, స్వర్గభూమి సృజించు హస్తముల తోడ నేల రచియింప జూచెదోయీ మహోగ్రతర భయావక నరకసీమ" అనియు భగవానుని నూత్నకవి ప్రశ్నించుచునే యున్నాడు. "ఏ రాజు పంచెనో యిచట శౌర్యప్రభాయసమ్ముల" నెఱుంగుదురా యని యాంధ్రపౌరుషమును నవీనకవి యుత్తేజితహృదయుడై పాడుచునే యున్నాడు. పంతులుగారూ! నవీన వాఙ్మయమును మరల జూడుడు. తెనుగుతోట నిర్మించినవాడు నవకవి, తొలంకరింప జేసినవాడు నవకవి, శ్రావణమాసనభోవిపంచిక మీటినవాడు నవకవి, ఊహాగానమున సందేశము వినిచినవాడు నవకవి, వసంతగానము నాలపించినవాడు నవకవి, ప్రకృతి సౌందర్యమునకు ముగ్ధుడై మెఱుపుకన్నె దృగంచలమ్ముల విహరించువాడు నవకవి, మామిడిచెట్టు నల్లుకొన్న మాధవీలతనుండి మానవలోకమునకు సౌజన్యము నుపదేశించినవాడు నవకవి, "ఆయేపు వోయేరు, ఈయేపు నోయేరు, యేళ్ల రెంటికి నడుమ జీవితసౌందర్యమును ప్రదర్శించినవాడు నవకవి. ఇంక నవకవి లక్షణ లక్ష్యము లెన్నియేని గలవు. ఇంత వాఙ్మయమునందు స్థూలప్రపంచము

సందు తీర జేరని యింద్రియలౌల్యమే మీకు గోచరించునా? కవితనే కాదు, శిల్పమునే కాదు, శాస్త్రమునే కాదు, ఒకజాతినే కాదు, మొత్తముమీద నేకాభిప్రాయము నిచ్చుట విమర్శకుని యుత్తమలక్షణమగునా? విద్యుత్కాంతివలన నొకమనుష్యునకు ప్రమాదము సంభవించినచో ప్రకృతి శాస్త్రజ్ఞులు నరహంతకు లనుట పాడియగునా? హైందవులు మర్యాదాహీనులని ఒక ఐరోపియనుద్యోగి తన కోపోద్రేకసమయమున బల్కిన పలుకులు భారతజాతీయతత్త్వ నిరూపణ మగునా?

కనుక తమరు నవీనయుగవాఙ్మయముపై దయయుంచి దానిని సాకల్యముగ జదివి సరియగు విమర్శనమును బ్రకటించినచో నవీనకవులును, పత్రికాసంపాదకులును మీబోధనల నంగీకరించి యనుసరించుటకైనను, వలయుచో వారివారి మతానుసారముగ కళారహస్య వివేచనమును మీకు బోధించుటకైనను వీలుగ నుండునని యును, సత్యము నన్వేషించుటకు ప్రయత్నించు లోకసామాన్యమున కేని యుపకరించునని యును వినమ్రుడనై విన్నవించుచున్నాను.

---

## సముద్రుఁడు

సన్నిధానం సూర్యనారాయణ శాస్త్రిగారు

ఆ మహాప్రభుదర్శనం బబ్బెఁ; గాక - అంత పొంగుచుఁ బొరలునే? యాసముద్రుఁ
డా మహాత్ముపదాబ్జంబు లంటెఁ; గాక - అంత యాడుచుఁ బాడునే సంతతంబు.

అల నదీసుందరాంగులు వలపుఁ బూని - పవలు రే నాక తనపైనిఁ బడుచునున్నఁ
దాను నెదురొత్తులిడునట్లు కానఁబడిన - జ్ఞానగంభీరుఁ డగుట లోఁబడఁ డతండు.

వినఁబడఁగ దవ్వులందలి జనులకెల్ల - నలసట వహింపఁబోక యహర్నిశంబు
తన సహస్రముఖంబులఁ దత్త్వకథలు - పరఁగ నుచ్చైస్స్వరమున నుపన్యసించు.

తనకడకు వచ్చు పిన్నపెద్దలను గాంచి - చెలిమి జ్ఞానంపు స్నానంబుఁ జేయఁజేయు
భక్తి నవ్వా రొసంగిన వస్తువులను - అలలచేతులఁ దాఁకి యావలకుఁ ద్రోయు.

తన విశాల మనస్కతయును గభీర - భావము నెఱింగి శుశ్రూషఁ బడయ వచ్చి
తనయడుగు లంటి కొలువ నిత్యంబు గిరులు - ఆ మహాభాగుఁడు సముద్రుఁ డలరుచుండు.

---

# పదునేనవ శతాబ్దమందలి వాఙ్మయము

యస్. శ్రీకంఠశాస్త్రిగారు, యం. ఏ.

(వెనుకటి సంచిక తరువాయి)

### చతుర్థఘట్టము (౧౪౮౭—౧౫౦౦)

తృతీయఘట్టమునందు సాహిత్యసరస్వతి మల్లికార్జున సర్వజ్ఞసింగమరాజుల నాశ్రయించి ప్రవర్ధిల్లినవిధము సూచింపఁబడినది. సాళ్వ నరసింహుఁడు శా. శ. ౧౪౦౭ యందు చక్రవర్తి విరూపాక్షదేవు నోడించి చక్రవర్తి బిరుదము వహించెనని శాసనాధారములచేఁ దెలియవచ్చుచున్నది. తన సేనానాయకులగు తుళువ-ఈశ్వరదేవ, ఆర్వీటి బుక్కదేవులు ఉదయగిరి, భువనగిరి, ధారాపురి, జింజి, పెనుకొండ, బెంగళూరు, గండికోట, నెల్లూరుపట్టణములను సాధించి కాశీ రామేశ్వర పర్యంతము తీర్థయాత్ర జేసి రాజ్యమును సాళ్వ నరసింహుని కొసంగిరి. ఈరాజకీయవిప్లవములచే సాహిత్యలోకమునందు నూత్నోద్యమములు బయలుదేరెను. సంగమవంశీయచక్రవర్తు లందఱు కర్ణాటకులగుటచే నిదివఱకు కర్ణాటక సంస్కృతసాహిత్యములకే విజయనగరమందు ముఖ్యస్థానము నిచ్చుచుండిరి. సాళ్వ, తుళువ వంశీయ చక్రవర్తులు కర్ణాటకరాజ్యాధిపతులయినను ఆంధ్రసంపర్కమే హెచ్చుచువచ్చి తెనుఁగుభాషాభివృద్ధి కాస్పదమాయెను. నంది మల్లయ్య, ఘంట సింగయ్య, పిల్లలమఱ్ఱి పినవీరభద్రాదులచే ఆంధ్రకవితావనిత సాళ్వరాజు లాశ్రయమందు ప్రవర్ధిల్లి, పెద్దన తిమ్మన ధూర్జటికవులచే తుళువరాజులక్రింద నత్యున్నతస్థితికి వచ్చెను. సంస్కృత కర్ణాట ద్రవిడ గ్రంథము లెన్నియో రచింపఁబడినను, తెనుఁగే ముఖ్యస్థానమును వహించియుండె ననుటకు కృష్ణదేవరాయుని కాలమును( Augustan Age of Telugu literature) అని నిర్దేశించియుండుటే సాక్షి!

ఈఘట్టమునందు ముఖ్యమయినకవు లెవరనిన, తెరకణాంబి బొమ్మరస, కోటీశ్వర, శ్రీధరదేవ, గుమ్మళార్య, చాచరస, శుభచంద్ర, స్వతంత్రసిద్ధలింగ, గుమ్మళాపురద సిద్ధలింగ, మల్లికార్జున, నీలకంఠ, కవిలింగ, చతుర్ముఖబొమ్మరస, విరక్త మహాలింగ, సింగిరాజ, నిజగుణ శివయోగి, సురంగకవి, ద్వితీయ చెన్నబసవ, గురునంజ, కుమార వాల్మీకి, ఈశ్వరకవి, శ్రీపాదరాయ, మాధవ, లక్ష్మణాంక, చాకరాజ నంది మల్లయ్య, ఘంట సింగయ్య, పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి, దూబగుంట నారాయణకవి, వెన్నలకంటి సూరన్న, రాజనాథ ఇత్యాదులు.

సాళ్వ నరసింహుఁడే కవిత్వము చేయుచుండెనని యతఁడు రచించిన రామాభ్యుదయము చెప్పుచున్నది.

ఇత్యుద్దామవర ప్రసాదకవితా
సింహాసనాధ్యాసినః
క్షోణీమానరగండగండయుపతేః
శ్యామ్లకంటకోత్ఖండినః;
విష్ణోః శ్రీ నరసింహవిగ్రహభృతో
భావోర్మిసేతాకృతా
శ్రీరామాభ్యుదయేఽత్ర పూర్తి
మగమత్సర్గ శ్చతుర్వింశకః.

వీరనరసింహుఁడు భాషాభిమానిగ నుండె నని "రాయవాచకము" దెలుపుచున్నది :

"విద్యానగరమందు వీరనరసింహరాయలువారు బ్రహ్మముహూర్తాన లేచి, ఆరాధ్యుల నామావళులు, ఆధ్యాత్మ సంకీర్తనములును, పాండవగీతలు, గజేంద్రమోక్షము, భ్రమరగీతలు, భారతసావిత్రి సధినామనస్తోత్రము, గంగావతరణము...బద్దెనీతి ... అన్నియువిని దర్పణావలోకనానంతరం..."

ఇత్యాది. మాధ్వగురువులయిన శ్రీపాదరాయులు వీరనరసింహునిచేఁ బూజ గొనిరి.

కర్ణాటాంధ్రకవులు నూతనమార్గములను వెదకుచుండి రనుటకు నిదర్శనము లనేకము లున్నవి. ఆంధ్రసాహిత్యము దుదివఱకు పురాణకవులను గ్రహించి ప్రాచీన సంప్రదాయాను సారముగ తెనుఁగు పరివర్తనములను గావించు పద్ధతిని వదలుటకు పిల్లలమఱ్ఱి పినవీరభద్రుఁడే మొదలని చెప్పవలెను. ప్రాచీన కథావస్తువును నవీనరీతి మార్చి పెద్దన, పింగళి సూరనాదు లకు మార్గసూచకుఁ డాయెను. "వాణి నా రాణి" యని చెప్పుకొని, నరసింహునికి "సరస సత్కావ్య సరణి వినోదించు నతిపుణ్యున కమృతము" వర్షించెను. కన్నడమునందును జైమినిభారతమును షట్పదికావ్యముగ వ్రాసిన లక్ష్మీశకవి పినవీరభద్రునివలె ఖ్యాతిగాంచి యున్నాడు.

కన్నడవాఙ్మయమునందు షట్పదికావ్యములే హెచ్చుగా బయలుదేఱెను. కుమారవాల్మీకి తన "తొరవెరామాయణము"ను రచించి కుమారవ్యాసుని "కవిపుత్రు"డని (Poetical Son) ఖ్యాతి గాంచెను. పోతనవలె నీషట్పదీకావ్యకవులు అక్షరల భేదములను, యతిప్రాసనియమములను గణించలేదు. బొమ్మరసుఁడు

ఓరంతె శివశరణిరొళమినం ప్రాసక్కె
సేరిసి దనికావ్యదొళగె వర్ధకకవి
శ్రీరాఘవాంక పండిత నాదియాద కబ్బిగరు
నిజగ్భ పెరుమెగొళిదా.

కారణం నాగవర్మం వినిర్మిసిద "అర
దైశివ అతాః ప్రయత్నయాత్"ఎనిప
చారు కర్నాటకవ్యాకరణ సూత్రమొదలాదు
వుంటునిమిత్తం.

అని వచించియున్నారు.

కాలక్రమముగ వీరశైవ కవులందును సంస్కృత సంప్రదాయములే హెచ్చుచువచ్చెను. తృతీయఘట్టమందు విరూపాక్షునికాలమున తోంటద సిద్ధలింగయతి, గుమ్మళాపురద సిద్ధలింగ, స్వతంత్రసిద్ధేశ్వర గుబ్బిమల్లణార్యాదులు గ్రంథములను వ్రాసిరి. వీరందఱు సంస్కృత పాండిత్యము గలవారగుటచే, జంగముల వచనములు కుపనిషత్పురాణేతిహాసములనుంచి యాధారములను సమర్థన చేయుచువచ్చిరి. చతుర్థఘట్టమునందును, శుద్ధకన్నడశబ్దములను విడిచి సంస్కృతము నధికముగా గలుపుచు వచ్చిరి.

# రామదాసుచరిత్ర విమర్శనము

ఉభయభాషాప్రవీణ మిన్నికంటి గురునాథశర్మగారు

“తహశీల్ చేసి గుడిగోపుర్ణంబులను సం
స్థాపించి రామాది వి
గ్రహముల్ భద్రగిరిం బ్రతిష్ఠసలుపం
గావించు “దానీష” యా
గ్రహవృత్తిం జెఱవేయ రాముఁడు దయన్
రక్షించె నే గోపనా
ఖ్య మహాధ్యానపరు న్వశంబె యతనిం
గొండాడ హింపూరమా!”

—నా ‘స్మరణము’.

ఆంధ్రమండలమున రామదాసునామము నచ్చరింపనివారు లేరను టతిశయోక్తి కాఁజాలదు. ఆమహాభక్తుని జీవితవృత్తాంతమును ప్రబంధములుగను, నాటకములుగను, హరికథలుగను, గుమ్మెటకతలుగను రచించి యనవరత మాంధ్రులు స్మరించుచున్నారు. ప్రధానకథ నాధారము చేసికొని పెక్కురు పెక్కు తెఱఁగుల నూతన కల్పనలం జేర్చినారు. ఆప్రధానకథయైనను రామదాసు కీర్తికాయుఁడైనపిదప రమారమి ౨౦౦ ఏండ్లకు నాగండ్ల వరదరామదాసుచే హరికథరూపమునఁ గూర్పఁబడుటచే నం దెన్నియో నూతనములుం గూడఁ జేరియున్నవి. ఇటీవలివా రందఱకు నాగ్రంథమే ప్రాతిపదిక మగుటచే నేఁటి రామదాసుచరిత్రలయం దెన్నియో చారిత్రకదోషము లున్నవి. దానికిం దోడు శాఖాభిమానముంగూడఁ దోడ్పడ రామదాసు నావలికి నీవలికి నాధునికులు లాగ మొదలుపెట్టిరి.

రామదాసుచరిత్రముం బరిశీలించిన నెన్నియో సంశయములు వెల్వడును.

౧. గోపన్నయే రామదాసా?

౨. ఈయన దేశాఖ?

3. ఈయనకు మాదన్నకుం జుట్టఱిక మున్నదా?

౪. రామదాసుగురు వెవరు?

౫. ఈయన చెఱలోనే మృతిఁ బొందెనా?

౬. ఈయనకష్టములకుం గారకు లెవరు?

మొదలగు ప్రశ్నములు కుప్పలుగా బయలుదేఱును. వీనికిం దగిన ప్రత్యుత్తరము లిచ్చుట మిక్కిలి కష్టమైనను విమర్శకు లిందులకుం బూనుకొనఁగలందులకు నే నొకదారి దీయఁగడంగెదను.

## 1. గోపన్నయే రామదాసా?

దీనికిం బ్రత్యుత్తర మవుననియే చెప్పవలయును.

“లక్కసాని” యని కొండొకచోఁ దన మాతృదేవతను వ్రాసియుంటచే బమ్మెర పోతనామాత్యుఁడు వేశ్యాకులజుఁడై యుండవచ్చునని యిచ్చకు వచ్చినట్లు పలుకుచుండు విమర్శకాగ్రేసరులకు నచ్చచెప్పుట సులభము కాదు కాని శిష్టజన పరంపరాగతాభిప్రాయముల వలనను, ఇరువురును భద్రగిరిదాశరథినే పేర్కొని యుండుటవలనను, రామదాసను పద మాదియందు వృత్తి వలననే జనించిన దగుటవలనను, గోపన్న యను పితృదత్తనామము క్రమక్రమముగా వాడుకలోఁ దొలఁగి యుండును. మఱియు నిరువురిశాఖలు, గోత్రములు, సూత్రాదికాభిధేయములు తుల్యములు. ఫోర్టుసెంటుజార్జి గెజెట్టులోఁ బేరు మార్పు ప్రకటింపఁబడినదా? అని మ మ్మడిగిన నేమనఁగలము?

## 2. రామదాసే శాఖవాఁడు?

ప్రథమశాఖానియోగి బ్రాహ్మణుఁడని నా సమాధానము.

ఉ. “అల్లన లింగమంత్రిసుతుఁ
డత్రిజగోత్రజుఁ డాదిశాఖకుం

చెర్ల కులోద్భవుం డనఁ బ్ర
సిద్ధుఁడ నై."

—దాశరథిశతకము.

అని తాను స్పష్టముగాఁ జెప్పికొనియున్నాఁడు గదా!

కొందఱు రామదాసార్వేల నియోగి యని రెంచిరి.

కంచెర్ల శరభనకవి తన యధ్యాత్మరామాయణములోఁ దాను శైవగురుశిష్యుఁడ ననియు, నాపస్తంబ సూత్రుఁడ ననియు, మంత్రికులమువాఁడ ననియు వివరించుచుఁ దనశాఖవారు

గీ. "కొండపల్లిని గొందఱు గొల్లపూఁడిఁ
గొంద ఱుండిరి తంజాపురందుఁ గొంద
ఱెలమి వసియించి ప్రబలిరి చెలువు మిగుల
మీఱి కంచెర్ల వంశంబువారు ధరణి."

అని ఓ.-లై.-వ్రాతప్రతిలోఁ గల దని కీర్తిశేషులైన వంగూరి సుబ్బారావుగారు వ్రాసి, ఇందలి 'మంత్రి' పద మార్వేలనియోగిం దెల్పుచున్న దని భ్రమించి, "కంచెర్లవారు కొండపల్లిలో నియోగులు కలరని దీనివలనఁ దేలుచున్న" దని వివరించిరి. ఏకొండపల్లి? నేలకొండపల్లి యేనా? అవునని యొప్పుకొన్నచో, నేలకొండపల్లి నివాసస్థులగు గంచెర్ల యింటిపేరిటివారు నేఁటికిని యాజ్ఞవల్క్యులు వాత్రేయగోత్రులు కలరే! ఇఁక దీని కేమి సమాధానము? మఱియు మంత్రి పదమును "అల్లనలింగమంత్రిసుతుఁడు" అని గోపన్నయు వాడుకొనెనుజూఁడీ.

ఇఁక నీ "రాదిశాఖ" యనుటకు సమాధాన మియవలసియుండెను.

౧. ఆదిశాఖ యనఁగా బ్రాహ్మణక్షత్రియవైశ్యశూద్రులలో బ్రాహ్మణుఁడనని చెప్పుకొనుట కట్లనెనేమో యనియు, లేక

౨. ఆదివేదమగు ఋగ్వేదములకుఁ జెందినవాఁడనని చెప్పుకొనుట కట్లనెనేమోఅనియు,

౩. కంచెర్లవారిలో జ్యేష్ఠశాఖకుఁ జెందితి ననుట కట్లనెనేమో యనియు వ్రాయుచు,

౪. "ఆదిశాఖశబ్దము కులపరముగాఁ గవి వాడినయెడల నది 'శాఖి' యని కాని, 'శాఖీయుఁడ' నని కాని వ్రాయవలసియుండెను" అని వంగూరి సుబ్బారావుగారు శతకకవుల జీవితములో వ్రాసియుండిరి.

పై మొదటికారణము నిస్సారమైనది.

రెండవకారణము యుక్తమైనది కాదు. ఆదిశాఖలది యజుర్వేదమే. అందును శుక్లయజుస్సే. కనుకనే కదా వారిని 'శుక్లయజుస్సు' లనియు నందురు.

మూఁడవకారణము : యాజ్ఞవల్క్యులు, కాణ్వులు, శుక్లయజుస్సులు, ప్రథమశాఖులు — ఇవి సమానార్థకములు. వీరిలో ౫ ఉపశాఖలు కలవు: ౧. ఆరువేలు, ౨. కాశులపాడులు, ౩. ద్రావిడులు (దక్షిణాదివారు), ౪. దువ్వలు, ౫. అనుమకొండులు. ఇందు మొదటిదగు నార్వేలశాఖకుం జెందె నన్న నాకును సమ్మతమే. కలదుగదా

"ఆత్రేయసగోత్రంబునఁ గంచె
ర్లాంధ్రార్యుల వంశమునన్ —"

అని రామదాసుచరిత్రలో. ఇం 'దార్య' శబ్దము తన తెగను దెల్పుటకే గోపన్న వాడెను గాని యార్యులు, దస్యులు ననుజాతులను దెల్పుటకుఁ గాదని సూక్ష్మముగఁ బరికించిన గోచరింపఁగలదు.

శుక్లయజుస్సు, కృష్ణయజుస్సు నని యజుర్వేదము రెండుశాఖలు గలదగుట, నం దాదిశాఖ తనదనుట కట్లనెనని తలంచుట యుక్తము కాదా?

నాలుగవకారణము : మహాభక్తశిఖామణి "ఆదిశాఖ కంచెర్లకులోద్భవుండు" నను నీకవి సంస్కృతాంధ్రములఁ బ్రవేశము కలవాఁడే కాని వైయాకరణి కాఁడు. అందువలన నందం దపశబ్దములు గలవు. భక్త్యుద్రేకముచే నమ్మహనీయుని భావములు ఛందోరూపముగా వెల్వడిన వనియే మనము గ్రహింపవలసినది. లేకున్న బహువ్రీహిం జేసికొనరాదా? ఆదిశాఖ గల కంచెర్లకులమునం దుద్భవించినవాఁడని సమసింపరాదా? వ్యస్తము చేసి తప్పు మోప నేల?

ప్రథమశాఖాబ్రాహ్మణులలో వృత్తినిఁబట్టి, నియోగులు వైదికులు గలరు. అనుమకొండ లచ్చముగా లౌక్య లే.

కనుకనే గోపన్న లౌకికుఁ డగుటచే "అల్లనలింగ మంత్రిసుతుఁడు" అని మంత్రిపదమును వాడియున్నాఁడు. మఱియు,

క. "భూసురవరుఁడు నియోగియు
భాసురకంచెర్ల కులజ భవ్యయశుండున్."

అనియు,

తే. "ఆత్రేయసగోత్రంబునఁ గంచె
ర్లాంధ్రార్యుల వంశమునన్
బుత్రుఁ డగుచు లింగనమంత్రికిఁ దాఁ
బుట్టెను గోపన యనఁగన్."

అనియు రామదాసుచరిత్రమునం గలదు. ఇందలి "నియోగి" పదముంజూచి రామదా సార్వేలనియోగి యైయుండె నని తలంచి, దాశరథిశతకము బాధింప, గోపన్న వేఱు, రామదాసువే అని కొందఱు వాదించి, యదియు నిలువమిచే గోపన్నంగూడ నార్వేలనియోగిం జేయ నుంకించి, లేక గోపన్న ప్రథమశాఖవాఁడు కాఁడనుటకేని తలపడి "ఆదిశాఖా" దిపదముల కనర్థముల నాపాదించుట సమంజసము కాదు. ఒకవేళ పింగళిదాసున కీభేద మంతయుఁ దెలియకయేని వృత్తినిబట్టి వాడియుండు ను. శాఖాభిమానమువలన వృథావాదము సల్పుచుండక రామదాసు ప్రథమశాఖానియోగిబ్రాహ్మణుఁ డనియే విశ్వసించెదరుగాక!

### 3. రామదాసునకు మాదన్నకుఁ జుట్టఱికముఁ గలదా?

మ. "తమ రాటంబును గేలఁ ద్రిప్పునటు లు
ద్యన్నీతి నై జాముదా
జ్యము మంత్రిత్వముఁ బూని త్రిప్పి యల పా
శ్చాత్యప్రజా ప్రార్థనీ
య మహోజ్ఞాభిధనాఖ్యులై నృపునికై
ప్రాణంబు లర్పించి రు
త్తము లయ్యక్కన్న మాదనాఖ్యుల సెడం
దం గొల్తు హిందూరమా!"

—నా 'స్మరణము'.

గోలకొండ నవాబగు "అబూ హసన్ కుతుబ్ షాహ" యనునామముగల తానీషా చెంగట మాదన్న ప్రధానామాత్యుఁడుగా నుండెను. ఈయన 'మదనపంత్' అను పేరును గలవాఁడనియు, మావాఁడేయనియుఁ గారణములు చెప్పకయే మహారాష్ట్రులీటీవలివా రనుచుండి రఁట. అది యట్లుండె. మన తెలుఁగువాఁ డనుటకుం బ్రబలకారణములు గలవు.

"అక్కన్న మాదన్న లార్వేలనియోగు లనియు, ఋగ్వేదులనియు, వారి యింటిపేరు పింగళివా రనియు, వారి వంశికులగు పింగళివారును సిద్దలూరివారును నిప్పటికి నున్నారనియు, వారికి గోలకొండ వేపారులతో సంబంధబాంధవ్యము లున్నవనియు సాక్ష్యముగఁ దెలియుచున్నది." (See Local Records, Mackenzei)

మఱియు, క్రీ. ౧౬౭౦-౧౬౮౬ మధ్యమున్న తిమ్మజగపతి యాస్థానపండితుఁ డగు నేమఁగు లక్ష్మణకవి తన తుల్యామాహాత్మ్యమున

సీ. "సుల్తనబ్దుల్ హసన్ క్షోణీశ్వరునిచేత
మాటిమాటికి బహుమాన మంద
మఱియును బింగళిమాదన్న భానుజీ
మంత్రిజ్ఞవలన సమ్మాన మొందె
అక్కన్న మొదలైనయట్టి పెద్దలచేత
మేలుభూషణములు మెప్పు లందె."

అనుటవలనను, మఱియుఁ గిమ్మూరుసీమ కైఫీయతులోఁ గూడ,

"సుల్తానుశేహాబహద్దరు అబ్దుల్ హసన్ అనే ప్రభువున్ను పింగళిమాదన్నగారున్ను విశేషమైన బహుమతీలున్ను జగపతి అనే బిరుదనామమున్ను ఇప్పించినారు" అని యుండుటవలనను మాదన్నగారి యింటిపేరు 'పింగళి' వారనుట స్పష్టము కాఁగా,

సీ. "శ్రీభిశాపస్తంబ సూత్రు గౌతమగోత్రు
సుచరిత్రుఁ బింగళి సూరసుకవి."
—కళాపూర్ణోదయము.

అని స్మరణమునకు వచ్చి పింగళిసూరన్నయు మాదన్నయు జ్ఞాతులా అని పరిశీలింపఁ గాదనియు, మాదన్నగారిది భారద్వాజగోత్ర మనియుఁ గొన్ని పురాతన గ్రంథములవలనఁ దెలిసికొంటిమనియుఁ గీర్తిశేషు లైన కె. వి. లక్ష్మణరావుగారు మహమ్మదీయమహాయుగమున వ్రాసియుండిరి. ఈపింగళివారు గోలుకంటిలోఁ గలరట. వారి శాఖలోనివారిని విచారింపవలయును.

మహామాత్యశేఖరుఁ డైన మాదన్నగారు బందరు, బెజవాడ, చెన్నపురి మున్నగు పట్టణముల కేగియుండిరి. అప్పుడు దానధర్మము లాచరించి శాసనములు వేయింపకుందురా? ఈస్టిండియాకంపెనివారు మాదన్నకొడుకగు మల్లన్నకు, వరని పినతండ్రికిఁ జివర కతని సుబేదారు పదవ నేకబహుమతు లంపి మాదన్నగారి యనుగ్రహము వడయ విశ్వప్రయత్నములు చేయుచుండిరఁట. ఫ్రెంచివారు, శివాజి మొదలగు రాజులు నాయనయాన సత్కరించుచుండిరఁట. నౌకావ్యాపారము నుండెనఁట. ఇన్ని వ్యవహారములు జరపిన మాదన్నగారి సమగ్రచరిత్రము బ్రకటింపఁ బ్రబలాధారములుగల గ్రంథములు గాని, కాగితములు గాని, శాసనములుగాని గోలకొండలోనైన లేక, యేస్థానికచరిత్రలం దైన లేకుండునా? పరిశోధించి ప్రకటింపకేల యాంధ్రు లూరకుండిరి.? చివరకుఁ బురాణములలోనికింగూడ నె క్లెక్కిరో చూడుఁడు:

"ఏతస్మిన్నేవ కాలేతు ప్రయాగే ద్విజసత్తమః,
శిష్యవ్యయసమాయుక్త స్తప శ్చరితి దారుణమ్.
శివాసనే సమావిష్ట స్తామ్రపాత్రే పయః పిబన్,
సహస్రైకం పంచశతం వత్సరాస్తు గతే శకే,
శాలివాహనరాజస్య వేదవేదాంగపారగః,
తద్దోషాత్స్వ విప్రస్తు జాతో యవనసంశకే,
మ్లేచ్ఛభాషా ప్రయుక్తేన నామ్నా తానిష నామకః,
విప్రవంశే తస్య శిష్యౌ జాతౌ పరమధార్మికౌ,
అర్కాణ్ణ మదనశ్చైవ ద్వావేతౌ మంత్రిణౌ వృతౌ".

అని (మార్కండేయపురాణోత్తరభాగము) మఱికొన్ని ప్రతులలో

"అర్కామాధవనామానౌ ద్వావేతౌ మంత్రిణౌ వృతౌ"

అని కలదని శ్రీ కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రిగారు పెద్దాపురసంస్థానచరిత్రవిమర్శనమున వ్రాయుచున్నారు.

కనుక శివదిగ్విజయము, లోకల్ రికార్డ్సు, కంపెనివారి ప్రతినిధియగు వీరరాఘవుఁడు గాని, పోడేలలింగప్ప గాని జరిపిన యుత్తరప్రత్యుత్తరములు, నైజాములోని రికార్డ్సు మున్నగువానినిం బరిశోధించి మాదన్నగారి చరిత్రమును సమగ్రముగ వ్రాయుటకు శ్రద్ధాళువుల సప్రశ్రయముగ వేఁడుకొనుచున్నాఁడను. ప్రకృత మనుసరింతము.

ఇట్టి సుప్రసిద్ధుఁడగు మాదన్నగారి యల్లుఁడే నా రామదాసు? అని విచారింపఁగా నొకరామదాసుచరిత్రమున *

"అక్కన మాదన్నయు నని యిద్దరు
నన్నదమ్ము లతిప్రియులు"

అనియు,

క. "అనఘుల శాస్త్రవిధిజ్ఞుల
ననురక్తులఁ బితృపితామహక్రమమున వ
చ్చిన విప్రుల మంత్రులుగా
నొనరించెను గార్యసంప్రయోగముకొఱకున్."

అనియుఁ గలదు.

అక్కన్న సేనాపతి, మాదన్న మంత్రి అని చరిత్ర నడుపుచున్నది. కవి యది యెఱింగియున్నను

* ఈరామదాసుచరిత్రము నాగండ్ల వరదరామదాసుచే వ్రాయఁబడినది. ఈయనయే మొదట హరికథగా వ్రాసినది. ఈయనది కంచి నివాసస్థానము. పిదపఁ దూము లక్ష్మీనృసింహదాసుగారి శిష్యుఁడై ౧౭౩౧-వ వత్సరమున సకుటుంబముగా భద్రాచలమున కేగి జీవితశేషము (౧౭౩౪) నచటనే గడపెను. ఈయన సర్వసమర్పణశాసనము భద్రాద్రిదేవాలయమునం గలదు. ఈయన రచించిన కీర్తనల నేఁటికిని భద్రాద్రిం గైంకర్యావసరములఁ బాడెదరు.

నిరువురు నవినాభావసంబంధము గలవా రగుటచే నట్లు పద్యమున "మంత్రులుగా నొనరించె" నని యనె నను కొందము, సరే. ఆమంత్రి తండ్రితాతలు మంత్రు లైనట్లు నిదర్శనములు లేవే, ఇ దెట్లు? ౧౬౨౬–౧౬౭౨ వఱకు రాజ్య మేలిన అబ్దుల్లా హుసేన్ కుతుబ్ షాహదగ్గఱ మీర్ జుమ్లా దివానుగా నుండి గడబిడ చేసినట్లు చరిత్ర వలనఁ దెలియుచున్నది. పిదప ౧౬౭౨–౮౭ వఱకు నేలిన తానీషాదగ్గఱ మాదన్నయే మంత్రిగా నుండెను. కనుక మాదన్నతండ్రితాతలు మంత్రు లైయుండిరనుట సత్యేతరమని నాయూహను.

ఆరామదాసుచరిత్రమునన్నే,

క. "మామలు మంత్రులు నాకును
నే మచ్చికఁ జూడఁ గోరి యిటు వచ్చితి మా
మామల కెఱిఁగింపుండని
వేమరు వేఁడెద నటంచు వెస వచ్చి తమిన్.

అనియు,

తే. "తెప్పున లేచియు నెదురుగ వచ్చిరి
యప్పసుతునిఁ జూడ
అప్పు డపరిమితసంతోషంబునఁ
గప్పిన మోహముతోడ
వందనములు చేసిన తమ యల్లున
వార్యమైన కృపతోడన్
సుందరాంగ రమ్మని యక్కున
నరుదందఁ జేర్చి వగతోడన్".

అనియుఁ దమతల్లిమృతిని గోపన్న చాటఁగా,
"......................మమున్
ఘనదుఃఖంబునముంచి నీవరిగితే కామమ్మ యేమమ్మ"
అని యక్కన్నమాదన్న లేడ్చినారనియుఁ గలదు.

"వరదరామదాస్ రచియించెను సూచనగా
...సింగరిదా సీకథ ప్రకటనపఱచెనుబాగా"
అనియుం జెప్పుకొన్న సింగరిదాసు
"హైదరబాదున మేనమామలు అక్కనమాదనగారు సాదృతి తానీషాకు మంత్రులై సౌఖ్యముతో నున్నారు అని యోజించుచు హైదరబాదున కరిగెను నెన్నికతోను అనయమువారలవలనఁ బాదుషాయధిపుసమ్ముఖముగనెను" అని తేల్చివేసెను. ఈసంబంధమునందలి సత్యమును నిర్ణయించుట కాధారములు నాయల్పదృష్టికి గోచరింపలేదు. కాని పెద్దాపురసంస్థానచరిత్రవిమర్శనమున "పోర్చుగీసువారి గ్రంథానుసారముగాఁ బ్రకటింపఁబడిన ఆర్కిలాజికల్ రిపోర్టులో దాసుగారికి నక్కన్నమాదన్నగార్లకు సంబంధము లేనట్లు వ్రాయఁబడియున్న"దని శాస్త్రిగారు వ్రాసిరి.

పైకము చెల్లించిన వదలిపెట్టెద నని తానీషా యన్నప్పుడు రామదాసున కుద్యోగ మిప్పించినవాఁడును, మహోదారుఁడును, మహైశ్వర్యవిరాజితుండును, మహామేధావియు నగు మాదన్నగారు పైకము చెల్లించి తన మేనల్లుని విడిపింపక మాచుచుండునా? పైఁగాఁ జెఱలో నన్నికష్టములు పెట్టుచుండఁ జూచి సహించుచుండునా? ప్రధానామాత్యుని మేనల్లునే నేవరు లన్నిబాధలు పెట్టఁగలరా?—అనియు, రాజాజ్ఞ నమాత్యుఁడుమాత్ర మెట్లు నిరసింపఁగలఁ డనియుఁ బరిపరి విధములఁ దలంపవచ్చును. కాని భారద్వాజగోత్రులగు పింగళివా రార్వేలనియోగులు కాక కాణ్వులే యైనచో మాత్రము గోపన్నకు మాదన్న మేనమామయే యైయుండునని యొప్పుకొనక తీరదు. ఇతరుల వ్రాఁత లెటులుగని వరదరామదాసు మాదన్న హైందవుండనిమాత్ర మెఱింగి యీముడి వేసియుండునని తలంపనై యుండెను.

## 5. రామదాసు గురు వెవరు?

కబీరు మాత్రము గాఁడు. రఘునాథభట్టరాచార్యుఁ డని నాతలంపు.

జనశ్రుతి యొండొకనో తార్మారుచేయుచుండును. ఈలోకప్రవాదాఘాతములకుఁ గొండలుసైతముగూలును. సముద్రములుసైతము వట్టిపోవును. మూఢుఁడు: ౧౭ వ శతాబ్దిమధ్య మున్న రామదాసునకు ౧౩౯౮ – ౧౫౧౮ లోనున్న కబీ రెట్లు గురు వయ్యెనో? ప్రప్రథమమున రామదాసు కీర్తనల నన్నిటింగూర్చి సొంతకవనముం దూర్చి హరికథఁగా మార్చిన నాగండ్లవరదరామదాసీ కాలవ్యత్యాసముం గమనింపంజాలఁడయ్యెను, అదియునుం

గాక నాకాలమున వ్యక్తుల కాలనిర్ణయము చేసికొనుటకు సాధనసంపత్తియు సమృద్ధిగా సంభవింపదయ్యెను. అందు వలననే వృద్ధులమాట నాధారము చేసికొనుట సాధారణ మయ్యెను. బహుగ్రంథపరిశోధకుఁ డగు నప్పకవియే

క. "అవధారు శబ్దశాసనుఁ
డవనిఁ గలియుగమున కాది నారాజమహేం
ద్రవరంబునఁ జెప్పిన యాం
ధ్రవచో వ్యాకరణసూత్రతతిఁ దనిగింతున్."
—అప్పకవీయము.

అనినం జెలువారిం దపువ నేల?

ఆపరదరామదాసు హరికథనే మాతృకఁగాఁ గొనిన సింగరిదా సాదోషమును విచారింప నేరఁడయ్యె. క్రమముగా సింగరిదాసుహరికథే యాంధ్రదేశము నంతయు నలముకొని యెల్లరి హృదయపీఠముల నాక్రమించుకొనియె. ఆగింజ నానుటచే నాటకములు ప్రబంధములు వెలికెత్తినవి. ఆకవులైన విచారించినవారు కారు. చూడుఁడు, శ్రీయుత ధర్మవరము గోపాలాచార్యుల గారిచే రచింపఁబడిన రామదాసురూపకమును. నాటకరంగముల సందర్శించి కబీరుపాత్ర మనోహరముగా నున్నదని పండితపామరు లందఱు ననుచున్నారే కాని యొక్కరైనఁ బదునాల్గవశతాబ్ది నున్న కబీరు పదునేడవ శతాబ్ది మధ్యమున నున్న రామదాసున కుపదేశించు టెట్లు? ఇది యనౌచిత్యమని విమర్శించినవారు లేరు. రామదాసునకు గురువను విషయమును స్మృతిపథమునం దుంచుకొనియే గోపాలాచార్యులవారు తమ నాటకమున రామదాసును జెఱనుండి విడిపింపవలసినదని కబీరుచేఁ దానీషాకుఁ జెప్పించుటయే కాక యతని రామదాసు నొద్దకు రాయబారింగూడఁ జేసిరి. మఱియుఁ జెక్కురంగములఁ జెక్కుతెఱంగులఁ గబీరు నౌచిత్యముకొలందిఁ ద్రిప్పిరి. వారు తమనాటకము నాల్గవకూర్పునఁ బీఠిక "నేను హైద్రాబాదునగరమున చిరకాలము వసించి భద్రాచలరామదాసుచరిత్రను విమర్శించియున్నాఁడను. ఈనాటకముయొక్క కథాభాగము చరిత్ర ననుసరించి యున్నది. ౨౦౦ సంవత్సరములక్రిందట గోలకొండ రాజ్యపాలకుఁడగు తానీషాకాలమున నక్కన్నయను నియోగిబ్రాహ్మణుఁడు రాజమంత్రియై యుండెను. అతనికి గోపన్న మేనల్లుఁడు. ఇతఁడే రామదాసు. ఇతఁడు కబీరుదాసువలన రామమంత్రోపదేశము వడసి" రనియు వ్రాసియుండిరి. "విమర్శించియున్నాఁడను" అనుటకు మఱొక యర్థము కలదా?

"కపీరుదాసుని కటాక్షమునఁ గాఁ
గాంచె రామనామమును"

అని రామదాసుహరికథలో నుండుటవలనను, జనశ్రుతివలనను రమారమి నూఱువత్సరములనుండి విశ్వసించుచున్నదానిని నేఁ డెట్లు త్రోసివేయఁగలమని యాధునికు లనవచ్చును.

మఱియుఁ, గబీరు (విక్రమశకము ౧౪౫౫-వ వత్సరమున జ్యేష్ఠశుద్ధ పూర్ణిమనాఁడు) క్రీ. శ. ౧౩౯౮ లో జనించినవాఁడైనను ౨౫౦ వత్సరములు బ్రదుకుట యణిమాదిసిద్ధులం బొందిన యోగాభ్యాసకుల కొక లెక్కలోనిది కాదు. "పీవంచ ధారణాః పంచ కుర్యాద్యోగీ విచక్షణః, తతో దృఢశరీర స్స్యాత్ మృత్యు స్తస్య న విద్యతే" అని యోగతత్త్వోపనిషత్తునం గలదు. మఱియుఁ బాతంజలమందును మృత్యువును జయింపవచ్చుననియు, "కాయరూపసంయమా త్తద్గ్రాహ్యశక్తిస్తంభే చక్షుఃప్రకాశాసంయోగే౽ంతర్ధానం"(పాతం. ౩ అధ్యా. ౨౧ సూ.) అనుటచే నంతర్ధానాదులంగూడఁ బొందవచ్చు ననియుఁ గలదు. కావునఁ గబీరు భీష్మునివలె మృత్యువు లోఁబఱుచుకొని జీవించియుండఁగూడదా? అనియు, మఱియు,

"काशीमें हम प्रगट भये हैं रामानंद् चेताये।
सम रथका परवा ना लाये हंस उबारन आये॥"
—కబీరశబ్దావలి.

అని తన్ను దేవదూతగఁ జెప్పుకొనియెం గనుక నతండు చిరంజీవియై యుండరాదా? అనియు మీరు నన్నడుగ వచ్చును.

నా యుత్తర మేమన, రామదాసు చరిత్రలోని తోహారా లోకప్రవాదము ననుసరించి రచింపఁబడిన దగుట నవిశ్వసనీయము. ఇఁక యోగతత్త్వోపనిషత్తు

పాతంజలసూత్రములకు సమాధాన మేమనఁ గబీరు యోగాభ్యాసపరుఁడు గాఁడు. ఆతఁడు పాతంజల సూత్రములఁ జదివి యాచరించిన ట్లాధారములు లేవు. పైఁగా నాయన యవతారవాదము, మాయావాదము, విగ్రహారాధనము, కర్మకాండము, వ్రతాదికములు, తీర్థయాత్రలు, వర్ణాశ్రమధర్మములు మొదలగు వానికిం బ్రతికూలవాది. కనుక నాతం డా సూత్రములఁ బాటించి యుండఁడు. ఎఱఁగియుండఁ డనియు ననవచ్చును. భక్తివాదము నాతఁ డంగీకరించిన నేకేశ్వరవాదియేచుఁడీ. రామరహీముల కైక్యము గూర్చినను నవతారముల నమ్మఁడుసుఁడీ.

"दुनिया ऐसी बावरी, पत्थर पूजन जाय।
घरकी चकिया काहे न पूजै, जिसका पीसा खाय॥"

(లోకము పిచ్చిది. ఎందుకన, రాతిని బూజింతును. గృహమందలి తిరుగలి నేల పూజింపరాదు? అది విసరిన పిండిని మనము తినుచుంటిమిగా!) అనియె. మఱొకచో "జాతిని బూజించిన భగవానుఁడు కనిపించినచో నేను బర్వతమునే పూజింతు"ననియె. ఇట్టి వాఁడా రామదాసునకు గురువు? శిష్యుఁడు భద్రాద్రి రాములఁ బూజించుచున్న గురువు పల దనఁడా?

మఱొకచోఁ గబీరు "రాళ్లు, కంకర ప్రోగుచేసి మసీదును నిర్మించెదరు. పూజారి దానిపై నెక్కి గొంతు పగుల నఱచును. భగవంతునకుఁ జెవుడు వచ్చెనదా యేమి?" అనెను. ఇట్టివాఁడు తన శిష్యుఁడు భద్రాచల మందలి యాలయనిర్మాణాదుల కాఱులక్షలు వ్యయము చేయుచుండఁ జూచుచు మిన్నకుండునా?

ఇకఁ దాను దేవమాతనని ప్రజల నమ్మించుటకుఁ జెప్పెను. ఎవరు నమ్మెదరు? నమ్ముటకుఁ బ్రబలాధారము లెవ్వి?

కబీరు కాశీక్షేత్రమున వదలి 'బస్తీమండలము లోని 'మగహర' అను గ్రామమున కేఁగి యక్కడనే విక్రమశకము ౧౫౫౨లో నాశ్వయుజశుద్ధైకాదశినాఁడు పరమపదముఁ జెందెనని "భక్తిసుధాబిందుస్వాద" మను గ్రంథమునందున్నది. అయనకళేబరమును సమాధిచేయ మహమ్మదీయులును, దహనముచేయ హిందువులును బోరాడి చివర కట్లో సమాధానపడిరిగదా. ఎవ రేది చేసినను ౧౫౭౨ శకాబ్దిమధ్యమున రామదాసున కుపదేశింప లేచివచ్చుట యసంభవము కాదా?

ఇక స్వప్నగోచరుండై యుపదేశించె ననిన నది తప్పుకొనుట యగును. లేకున్నఁ 'దల్పుథావలంబకునిఁ గబీ రందురనియు నట్టివాఁ డెవఁడో యొకండు వచ్చి మంత్రోపదేశము చేసియుండరాదా? అనియు నొక చేయి యడ్డముపెట్టవచ్చు. "అయ్యో! రామదాసునకు గురువు కాఁదగినవాఁ డంత యనామకుఁడా? ఏల యీ యూఁకదంపు." అనినచో,

"అభివ్యంజకాధీనత్వా న్న స్వభావాత్"(ఈశ్వరదర్శనము ౩-౩౩.) (పూర్వసంస్కారము లభివ్యంజకాధీనములు. అవి స్వతస్సిద్ధముగా బయటికి రావు.) కనుక గురు వుండితీరవలయును. రామదాసు గూడ "ఎన్ని జన్మము లెత్తఁగవలయునో"—అను కీర్తనలో "అనుదినమును గురు నుపదేశయోగము నభ్యసింపనైతి గా" అని తన యసంతృప్తిని వెల్లడించినాఁడు. కనుక నాగురు వెవరు? ఈభక్తుఁడు గురుధ్యానమునే చేయలేదా? అనినచో నిదిగో స్పష్టముగానే యొకటి రెండుసారులు స్మరించియున్నాఁడు.

"ఆర్యుల కెల్ల మ్రొక్కి విన
తాంగుఁడనై రఘునాథభట్టరా
చార్యుల కంజలెత్తి" —దాశరథిశతకము, ౬.

అనియు,

"పట్టితి భట్టరార్యగురు
పాదము లిమ్మెయి నూర్ధ్వపుండ్రముం
బెట్టితి మంత్రరాజ మొడిఁ
గట్టితి నయ్యమకింకరాళికిం
గట్టితి బొమ్మ మీచరణ
కంజములందు తలంపు నెట్టి పో
నట్టితిఁ బాపపుంజముల
దాశరథీ! కరుణాపయోనిధీ!"
—దాశ. ౧౦౩.

అనియుఁ దాశరథిశతకమునం గలవుగదా. గోపన్నయు వైష్ణవమతసంప్రదాయము కలవాఁడని యతని నడవడియే నుడువుచున్నది. కనుక రామదాసు తాను వ్యంగ్యముగాఁ గాక, ఘంటాపథముగా రఘునాథభట్టరాచార్యుల వలన మంత్రరాజమగు తారకము గ్రహించితి ననుచుండ నీఁడాంకతిరుగుడులు, సంశయములు నేల?

ఇకనైనఁ గబీరు రామదాసునకు గురువు కాఁడని విశ్వసింతురుగాక!

మఱి యీవాదమునకు వచ్చుటకుఁ గారణ మరయ వ్యాసము విస్తరించునని భయము.

## ౬. రామదాసు చెఱలోనే మృతిఁ బొందెనా?

మండలచారిత్రములో "నీరామదాసు కారాబద్ధుఁడై యాకారాగారముననే మృతిఁ బొందినట్లుగూడఁ దెల్పఁబడియున్నది."

(పెద్దాపుర సం. వి. ౭౫ పేజీ.)

ఈజిల్లామాన్యులు వ్రాఁత యెంతవఱకు సత్యము?

"అక్కడనే మృతిఁ బొందిన భద్రాద్రిరామున కీనైజామువా రిప్పటి కట్టికైంకర్యములఁ జెల్లించు నవసర మెట్లు కలిగె నను శంక రాఁగా నది తానీషాగారి కుమార్తె రామదాసును వలచి యామె కృత్రిమము చేసి విడిపించెనని కొందఱు వ్రాసిరట" అని కావ్యవ్యాకరణతీర్థులచేఁ బరిష్కృతమైన యానంద ముద్రణాలయమువారి రామదాసుచరిత్రమునఁ గలదు. ఆకొందఱెవరో కాని కల్పనలోను మిక్కిలి యన్యాయమునకుం బాల్పడిరి. మహాభక్తశిఖామణి కీనిందఁ గట్టుటకుం దూర మాలోచింపరైరి. ఈవ్యాజారాపవాదముం దొలఁగింపఁ గాఁబోలు గోపాలాచార్యులవారు తమ రూపకమునఁ దానీషాభార్యయగు సీతారామాలమున సాచిత్యముం బాటించుచు రామదాసును రక్షింపంజూచిరి.

భద్రాద్రిరాముని కైంకర్యము లెట్లు జరుగుచుండెననుటకుఁ దదాలయమందలి రామలక్ష్మణనామక స్తంభముల మీఁద నున్న శాసనముం జూతము.

"స్వస్తిశ్రీ విజయాభ్యుదయ శాలివాహనశకవర్షంబులు ౧౫౯౪ అగు నేటివర్తమానవ్యవహారిక చాంద్రమాననందననామసం. చైత్ర శు ౯ భానువారం శ్రీభద్రాచలసీతారామచంద్రమహాప్రభువారి సన్నిధిని శ్రీరామదాసుగారు శ్రీతానీషాగారి యనుమతివెంబడిని జరిగించిన దేవబ్రాహ్మణవృత్తులు......వ్రాసియున్న శాసనం ధంసాప్రపంచములో శ్రీవారు పోలవరంపలను వేంచేసినపుడు ఒకదుర్మార్గుడు శాసనం చెక్కివేసినందున సర్వజనులకు దెలిసి సంతోషించేటందుకు లేకపోగా ఆదుర్మార్గుడు పుత్రమిత్రకళత్రాదులతోటి నశించిపోయినాడు. తదనంతరము శాలివాహనశకవర్షంబులు అగు నేటి ౧౬౫౪ నందననామసం. చైత్ర శు ౯ ఇందువారం భద్రగిరి, వరదరామదాసు అనే రామదాసువంశమున జన్మించిన భక్తుడు [1]..................అదివఱకు దుర్మార్గులు ప్రపంచపరిపాలన జేయుటచేతను దేవబ్రాహ్మణవృత్తులు నిరాటంకముగా జరుగుట లేనందున;.........హాసనాబాదుపరగణాలో వుండే దేవబ్రాహ్మణవృత్తులు అగ్రహారములు విమర్శించి సర్వదుంబాలా జరుగగలందులకు యేర్పాటు చేసినవివరములు—"[2]

దీనివలన నదివఱకు (వరదరామదాసుకుఁ బూర్వము) భద్రాద్రిరాముల కన్నివిధములఁ గైంకర్యములు జరుగుచున్నట్లును, ఆస్వామివారికి మాన్యము లున్నట్లును స్పష్టముకదా! శాసనమున నందందు "దేవబ్రాహ్మణవృత్తులు పునరుద్ధారంచేసి" అనియుం గలదు. కనుక రామదాసు కారాగారవిముక్తుఁడై సగౌరవముగాఁ దానీషావలన నధికారమును స్వీకరించి భద్రాచలమునకు వచ్చి స్వామికి మాన్యముల నేర్పాటు చేసియుండవలయును. కావుననే శాసనములో "తానీషాగారి యనుమతి

1 ఈయనననుసరించిన వివరములు నేను వ్రాసిన 'తూము లక్ష్మీనృసింహదాసు చరిత్ర' లోఁ గలవు.

2 ఈశాసనమును విస్తరభీతిచే నవసరమైనదానినే వ్రాసితిని. సమగ్రశాసనము 'రామదాసు కైంకర్యము' అను పేరుతో శ్రీ సీతారామవిలాసినీ గ్రంథమాలవారు ద్వితీయపుష్పముగాఁ బ్రకటించిరి. భద్రాచలము. వెల ౧ అణా.

వెంబడిని జరిగించిన" అని కలదు. అట్లు కాకున్నచో ధర్మకర్తలు, పూజారులు, నధికారులు మున్నగువారెవరికిఁ జిక్కిన మాన్యముల వారనుభవించుచు స్వామికైంకర్యముల విముఖులై యుండుటయు, వరదరామదాసు నృసింహదాసులు గోల్కొండకుఁ బోయి చందాలాలు ద్వారమున నవాబునలన నధికారము స్వీకరించి వచ్చి మఱల యథాప్రకారము పూజారుల 'దేవబ్రాహ్మణవృత్తులఁ' బునరుద్ధరించుటయు నెట్లు జరిగియుండును?

రామలక్ష్మణులు మారువేసములతో వచ్చి ధనముఁ జెల్లింపనీ, లేక సంబంధమున్నచో మాదన్నయే యితరులం బంపి ధనముఁ జెల్లింపనీ, లేక దయార్ద్రచిత్తుఁడగు తానీషాయే యతని భక్తికి మెచ్చుకొని ధనము ముట్టినదని ప్రకృతివర్గమును (స్వీయుల) వంచించి వదలనీ, యెట్లయిన రామదాసు చెఱనుండి విడువఁబడియుండినమాట నిజము. కాకున్న రామదాసు రామలక్ష్మణులు ధనము చెల్లించిపోయిన వృత్తాంతము నేల గానముచేసియుండును? అన్నివిధముల నన్నికీర్తనలు గలవే? అని కొంద అనవచ్చును. నిజమే. ఇతరుల చెయి కలియని రామదాసుకీర్తనలం జూచిన నీవిషయమై కొంత తేలునేమో? తంజావూరిలో గ్రంథాక్షరముల రామదాసుకీర్తనలు గలవట. వానిం జూచినచో రాముఁడు ప్రత్యక్షమగుటయు, డబ్బు చెల్లించుటయు మున్నగు విషయములు తేలుటయే గాక హరికథలలోని యితరవికృతములగు కీర్తనలను చేర్పుటంచుటయు సులభమగు. 1

శాసనములో "తానీషాగారి యనుమతివెంబడిని జరిగించిన" అని కలదుగదా? ఇఁక సందియ మేల? అనిన నీవ్రాఁత వరదరామదాసుగారిదని నాయనుమానము. కాకున్న శాసనమున శాలి. ౧౫౭౪ అని కలదే. అనఁగా క్రీ. ౧౬౫౨ అనుట. తానీషా రాజ్యమునకు వచ్చినది క్రీ. ౧౬౭౨ కదా: ఎట్లుపొసఁగును? పోనీ తెనుఁగంకెలలో ఒకరకపు తొమ్మిదికిని ఏడునకును రూపసామ్యము కలదు. అది శిలయందు స్పష్టముగా గోచరింపకపోయెనని యెంచి శాలి. ౧౫౯౪ అయియుండునని యూహించిన నిది చెఱనుండి విడువఁబడినపిదపనే వేయఁబడెననుట కాధారములం గూర్చుకొన నవకాశమిచ్చుం గాని యీసంవత్సరము (క్రీస్తు. ౧౬౭౨ అగును) నందనసంవత్సర చైత్ర శు. ౯కి సరిపోదే? 2

ఇంతకు నా తురక రామదాసు శాసనముం జెక్కవైచుటచే నింతచిక్కు వచ్చినది. శాసనపరిశోధకులీవత్సరనిర్ణయముం జేయరైరి.

శాసనాంతమున రామదాసు వ్రాసిన పద్యమెందు గన్పించుటచే, లోకములో దేవాలయాదుల నిర్మాణముచేసి యప్పుడే శాసనము చెక్కించుట కలదు గాన రామదాసు భగవంతునిపై భారమువేసి తాను దహశీల్దారగుటచే దేవాదులకు మాన్యములసయితము నేర్పఱచి యిదియంతయుఁ 'దానీషాయనుమతివెంబడిని జరిగించిన' దని వ్రాయించిన నిది ధర్మకార్యమగుటచేతను, దనచేత జరుపుటచేతను నేను వేఁడుకొన్న తానీషాగారెట్టకేల కియ్యకొనకపోదురా? అనియు సాహసించి శాసనము వేయించియుండుననియు నూహింపవలయును.

చరిత్రజ్ఞులు ప్రబలకారణములు లభింపనిది రామలక్ష్మణులు మాఱురూపముల వచ్చి ధనము చెల్లించి దాసును జెఱవిడిపించెనన్న నమ్మక జిల్లామాన్యులవ్రాఁత

1 పరిశోధనమున దక్షులగు శ్రీయుత మల్లంపల్లి సోమశేఖరశర్మగారుగూడ రామదాసుకీర్తనల భద్రముగాఁ గూర్చుకొని యున్నకరయే యుండిరి.

2 నిజమున కీవరదరామదాసు నిమిత్తమాత్రుఁడే. శాసనము వేయించినదియు, గోల్కొండకుఁ బోయి చందాలాలును దర్శించి రాజాభిరుచమును, దహశీల్దారుద్యోగమును స్వీకరించినదియుఁ దూము లక్ష్మీనృసింహదాసే. ఈ నృసింహదాసు యశోభిమాని గాని నిష్కాముఁడగుటచేఁ దన కత్యంతప్రియశిష్యుఁడగు వరదరామదాసుగారినిఁగూడ నావ్యవహారములం జేర్కొనుటయేగాక శాసనమును నతని పేరనే వేయించె. ఈవిషయములు కల్పితములు గావు. ప్రబలాధారములు నేఁటికింగలవు. చూడుఁడు: నేను రచించిన తూము లక్ష్మీనృసింహదాసుచరిత్ర.

నే విశ్వసించి యతండు చెఱలోనే మృతిం బొందెనని తలంతురు.

అయిన దేవుని మాన్యము లెట్లు సాగుచుండె నన, దాసు చెఱకుఁ బోకపూర్వమే మాన్యముల నేర్పాటుచేసి యుంటచే, హిందూమహమ్మదీయులం దుల్యదృష్టి నరయు సార్థకనాముండగు తానీషా,—జరిగిన దేదో జరిగినది. స్వామిమాన్యముల నేల హరించి పాప మొడిగట్టుకొన వలయు నని తూష్ణీంభావము వహించి గాని, లేక వాని నంగీకరించి గాని యుండునని తలంతము.

## ౨. రామదాసుకష్టములకుం గారకు లెవరు ?

పూర్వజన్మజ్ఞానము గల మార్కండేయపురాణ పఠితు లా క్రౌర్యముం దానీషాకుఁ గల్గింపక యేసితారాణో, లేక 'షాహలమ్కార్' అధికారమునుండి తొలగింపఁబడిన మహమ్మద్ ఇబ్రాహీముకో, లేక యేయుమాయాపరులకో తగిలింతురు.

చరిత్రవిదులుమాత్ర మాకాలమందు సిస్తు లీయని వారి నెవ్వరినైన నన్ని బాములఁ బెట్టుట కలదనియుఁ దానీషాయే విధి లేక పెట్టియుండుననియు నందురు.

కవులు తమతమ కావ్యముల వ్యుత్పత్తికొలంది నౌచిత్యము నాదరించి కల్పనలం జేయుదురు. "సత్కవి కల్పనావిభూషాసహపూర్వవృత్తములు సానలందీరిన జాతి రత్నముల్" అని భట్టుమూర్తి భిక్షవెట్టెఁ గదా. కనుకనే రామదాసుచరిత్రమునఁ గొన్నిపాత్ర లెక్కుడుగఁ గన్పట్టుచున్నవి. ఈకల్పన రసపిపాసువుల కాహ్లాదముఁ గల్గించినను చరిత్రపరిశోధకుల కావేదననే కల్గించును. నిజచరిత్రలలోని కల్పనలు పరిణామదారుణములు సుఁడీ!

రామదా సంత్యకాలమున విమానము రాఁగా దాని నెక్కి వైకుంఠమున కేఁగెనని కొందఱుఁ, దా నెక్కిన గుఱ్ఱముతోఁగూడ భద్రాచలమందలి శ్రీరామ విగ్రహముతోఁ జొరఁబడెననియు, నేఁటికిం గూడ నగుఱ్ఱము వెనుక కాలిగిట్ట సర్తుగాఁ గాన్పించుచున్నదనియుఁ గొందఱు పలుకుదురు. సూక్ష్మదృష్టి గలవారెవరైన వీనిని విశ్వసింతురా? ఏమో? ఈస్థూలశరీరమే పరలోకమున కేఁగెనట నేమతస్థులును విశ్వసింపరు. తానీషా రామదాసుల పూర్వజన్మవృత్తాంతములు మొదలగునవి పాపభీతి లేని పామరులను సన్మార్గులం జేయుట కుపయుక్తము లగును. ఒకండన నేమి, రామదాసునడవడి రెండవులం దిద్ది తీర్చునది కాదు! ఆయనభక్తి యచంచలము. ఆయన త్యాగము నిరుపమానము. ఆయనస్థైర్యము వర్ణనీయము. ఆయన జీవితము నిత్యస్మరణీయము. ఆంధ్రుల ప్రతిరక్తకణము నందును నాయన ప్రతిధ్వనించుచుండును. అట్టి

"రామదాసుకథ వరదరామదాస్
రచియించెను సూచనగా
ప్రేమతోడ సింగరిదాసీకథ
ప్రకటనపఱిచెను బాగా."

నాగండ్ల వరదరామదాసు, సింగరిదాసు మనకు ఋణదాతలు. వారిగ్రంథముల సత్యాసత్యము లున్నను వానినిం జదువుచున్న నానందామృతపయోనిధి నోలలాడుచు బాహ్యప్రపంచమును మఱవకుండఁజాలము. తన్మయులమై భక్తిరసముం జొక్కకమానము. అట్టిగ్రంథమును గుఱించి యింత వ్రాయుట సత్యాన్వేషణమునకే యని నమ్ము మన్నింపుఁడు. తూము నృసింహదాసు, వరదరామదాసు, సింగరిదాసు, మఱియు నితరులు రచించిన కీర్తనలఁ, బద్యముల, శ్లోకముల నేర్పఱిచి తత్తత్కవినామసహితముగా రామదాసుసమగ్రచరిత్రను, మాదన్న చరిత్రను శ్రద్ధాళువులగు చరిత్రపరిశోధకులు ప్రకటించుటకుఁ బ్రోత్సహింపనే యీ నా యల్పప్రయత్నమని మనవి.

---

# గాంధి లండను ప్రయాణము




మహాత్మా గాంధి—ఏడెను సన్మానము




మహాత్మా గాంధి—మార్సెల్సునందు (ఫ్రాన్సు)

# వరలక్ష్మి

కాటూరి వేంకటేశ్వరరావు, పింగళి లక్ష్మీకాంతంగార్లు

[కృష్ణాపత్రిక (౧౨-౯-౧౯౩౧ నాటి దాని) నుండి]

రసపూర్ణ హృదయులై రత్నాకరాలింగన త్వరమాణలౌ నదులపర్వు
విరియు గ్రొన్నన తావి విశ్వమ్ము నించు గాంతారాళి యానంద తాండవమ్ము
ఉరుము మద్దెల మ్రోత కుబ్బి మెుగిత్తెరచాటు విద్యున్నటి యాట మర్వు
నిట్టుపానమ్ముల నింగి నల్లాడు చాతక చిరంటీ వ్రతోద్యాపనమ్ము
నొక్క దెసయౌచు జగముల కుబ్బువుట్ట - ధాత్రి శాద్వలరోమాంచితమ్ము గాగ
వర్ష ధారల చల్వ దువ్వలువ దాల్చి - ద్వారభూమి శ్రావణ శుక్రవార వేళ
నిలిచి తెవరమ్మ, వరలక్ష్మి పొలుపు దోప.?

ఎన్నడు రాని తల్లి జగదీశ్వరి కామిత దాత్రి చేర వ
చ్చె న్నిరుపేద గేహముల చెంతకు బిల్వని పేరటమ్ము, నం
పన్నుల యాడుబిడ్డ తలవాకిట నిల్చిన, రిక్త చేతులన్
గన్నుల నప్పగించి నిలగా నయితిన్ గడు మందభాగ్యనై.

ఆయన యూరలేరు నెల లైదు గతించె ప్రవాసియై, యెటో
త్రోయుచు నుంటి కాల మిసిరో! యొక గవ్వయు చేత లేక నీ
కే యుపచారముల్ సలుప నెట్టుల నేరుతు నీ యభాగ్య రా
లీ యనురాగ భారమున నెంతయు కుమ్మెలు వోయి క్రుంగెడిన్

అచ్చపుటీ యనుగ్రహమునాత్మ దలంచి మదీయ భాగ్యమున్
మెచ్చి నుతించుకొందునొ? సమీపగవో నిను కల్గి నంతలో
పొచ్చెము లేని బత్తిమెయి పూజ లొనర్పగ నీయకున్న ని
ష్పచ్చరమున్ దలంచికొని పాపము లాడుదునో, దయామయీ!

శ్రావణ మాసమ్ము చనుదెంచె నని సున్నమలదిన యట్టి కుడ్యములతోడ
పసుపున గలపమ్ము బాటించి చెందిర తిలకమ్ము లిడిన దేహళుల తోడ
చివురు దోరణల గైసేసియు, దీవ్రముగ్గులు దిద్ది నట్టి ముంగిళులతోడ
గమ గమ ధూప ధూమములు పూజా ద్రవ్యసమితి నిండిన చత్వరములతోడ

కొల్వు చవికెలు నా నీకు గొమరు మిగిలి - శుక్రవార వ్రతమ్ముల సొంపు లొలుకు
భాగ్యశాలుల గృహముల వజ్జ కరుగ - కీకుటీరమ్ము దరిసితి వేమి తల్లి!

నోములు తొంటి జన్మముల నోచిన తల్లులు, నూతనాంబర
స్తోమము, లంగరాగములు, దోయపు సొమ్ములు దాల్చి, పూచు లే
మామిడి మ్రోకలో యనగ మాటికి పేరటముల్ చనంగ, గ
న్నామెతగా గనుంగొనుచు కాని వ్రతమ్ము లెఱుంగ మెన్నడున్.

విందవైన నిన్ను వెడల నంపను లేను - వ్రత మొనర్ప సజ్జరాలగాను
ముందు నోతునన్న ముందేమొ? నేనేమొ? కులము వారి బిలుతు నిలుము తల్లి!

రావె కాదంబినీ! క్షణప్రభరో రమ్మ! - చాతకీ! రమ్ము; కేతకీ! జాగు సేయ
కీవు నీవారు రారె; మాయింట నేడు - విందు వరలక్ష్మి; మీకెల్ల పేరటమ్ము.

నవ వర్ష సలిలార్ద్రిమా మెత్త మెత్తని మొగలిపూ ల్గిల్గంట ముడువరమ్మ!
పాపటన్ దురుమరమ్మా! పుష్పాడులు వాలు కడిమిపూవుల నింపు గడలు కొనగ
కై సేయరే! మాలికలు గ్రుచ్చి గళము వేబోక విరిసి రాలు పొగడ పూలు
కర్ణరంధ్రము లలంకరణమ్ము నల్పరే! ఫుల్ల నీలోత్పలమ్ములను గూర్చి
జాజి పూవుల మొత్తముల్ సంతరించి - భద్రపీఠ మ్మమర్పరే! భక్త వరద
కారతుల నెత్త రారె! క్షీరాబ్ధిపట్టి - కాగడము మాని శంపా లతాంగులార!
నారికేళాంబుల నవవర్ష జలముల నభిషేక మిదె యబ్ధియాడుబిడ్డ
కగరు గంధమ్మున మొగలిపూరజమున చర్చయిదే జలజాత నిలయ
కంభోజ నేత్రు నిల్లాలికి సుమగంధవహా పృషద్వాహన వ్యజన మిదిగో!
అర్థికల్పద్రుమంబైన మా యమ్మకు సజల కాదంబినీఛత్ర మిదిగో!
అహరహం బప్సరః కన్య కాళినృత్య - సేవ లంగీకరించెడు దేవి కిదిగో!
ఊఱుము మద్దెళ్ల లయ తప్పకుండ నాడు - నెమ్మినట్టువ లొనరించు నృత్యసేవ!
నేరిచి నేరకే నలుపు నేటి సపర్యల నందుమమ్మ! మా
వారు సుఖమ్ముమై మరలివచ్చిన గన్నియ పెండ్లి సేసి మా
కూరిమి బిడ్డగూడి నినుగొల్తుము శ్రావణ శుక్రవార ల
క్ష్మీరమణీ! మమ్ముఁ మనుపుమీ! పదపద్మము లంటి మ్రొక్కెదన్.

---

# ‘గీర్వాణవాఙ్మయపంచచరిత’ విమర్శము*

## [‘వైదికకాలిక’ (ప్రథమభాగ) సమాలోచనము]

ఈయున్ని వేంకట వీరరాఘవాచార్యులుగారు (ఆంధ్రగీర్వాణసాహిత్యపరిషత్తు)

మార్చినెల (ప్రమోదూత - ఫాల్గుణమాసపు) భారతిలోఁ బై గ్రంథమునందలి ‘లౌకికకాలిక’ మను ద్వితీయభాగమును విమర్శించియుంటిని. ఇపుడు ‘వైదికకాలిక’ మను ప్రథమభాగమును [౧-౧౩౫ పు.] విమర్శించెదను. ఈభాగము ద్వితీయభాగముకంటె నించుక జాగరూకతతో రచింపఁబడినట్టులు చూపట్టెడి. అట్లనుటచే నీభాగము నిర్దుష్టముగను, సర్వంకషముగను, సర్వథా తృప్తికరముగ నున్నదని నాయభిప్రాయము గాదు. రెండుభాగములఁ దులనాత్మకముగఁ జూచినచో నీభాగమించుక మెఱుఁగుగాఁ జూపట్టునేమో! ద్వితీయభాగరచనముకంటెఁ బ్రథమభాగనిర్మాణము కష్టతరము.

గ్రంథస్థ విషయసూచిక :—

ప్రకృతగ్రంథములో ‘వైదికకాలిక’మను ప్రథమభాగమున ౧౩ అధ్యాయములు [౧౩౫ పుటలు] గలవు. జిజ్ఞాసూపయోగార్థ మందలి విషయముల సూచించెదను :

౧ అధ్యాయము [౧-౧౦ పుటలు]: ఇది ‘మెక్‌డానెల్’ పండితుని ‘సంస్కృతసారస్వతచరిత్రము’నందలి పీఠికారూపమగు ప్రథమాధ్యాయము [౧-౨౯ పు.]నకించుమించు భాషాంతరీకృతి యనఁదగు. కాని ‘మెక్‌డానెల్’ వివరించిన పాశ్చాత్యపండితుల గీర్వాణవాఙ్మయసేవంగూర్చి యిట నేమియు వ్రాయఁబడదయ్యె. అనన్యాపేక్షము, నవిచ్ఛిన్నము నగు భారతీయవిజ్ఞానము యొక్క యభ్యుదయము, తద్వాఙ్మయమున యుగ (Period) విభజనము, భారతీయచరిత్రలోపము, హేతువులు, వైదేశికయాత్రికుల గ్రంథములలో భారతవర్షముంగూర్చిన విషయములు, లేఖనోత్పత్తి, లిపులు, లిఖితగ్రంథములు, లేఖనసాధనములు, వైదికసంస్కృతసారస్వతముల వైలక్షణ్యము, ప్రాచీన గ్రంథాలయములు, ప్రాచీనభాషాస్వరూపము, గీర్వాణభాషావ్యవహారము, పాళీప్రాకృతాదిభాషలు మొదలగువానింగూర్చి యిట వ్రాయఁబడియున్నది.

౨ అధ్యాయము [౧౧-౧౪ పు.]: ఇది ‘మెక్‌డానెల్’ పండితుని గ్రంథమునందలి ‘వైదికకాలవిచారము’ [Vedic Period — ౨౯-౩౦ పు.] అను ద్వితీయాధ్యాయమున కనుకృతి. ఇందుఁ జతుర్వేదవర్గము, బ్రాహ్మణారణ్యకోపనిషద్వర్గము, సూత్రవర్గము అను వైదికకాలవర్గత్రయవిభాగముంగూర్చి వివరింపఁబడెను.

౩ అధ్యాయము [౧౫-౧౮ పు.]: ఇందు ఆర్యులు, దస్యులు, ద్రావిడులు, పారసీకులంగూర్చి వ్రాయఁబడెను.

౪ అధ్యాయము [౧౯-౨౫ పు.]: ‘మెక్‌డానెల్’ పండితుని గ్రంథములోని ‘ఋగ్వేదవిచారము’ [‘The Rigveda’—౪౦-౫౯ పు.] అను తృతీయాధ్యాయమున కిది ప్రతిధ్వనివంటిది. ఇందు ఋగ్వేదమునందలి మండలదశకవిచారము, దశమమండలసంధానచరిత్రము, తన్మండలార్వాచీనతాప్రతిపాదనము, మండలాంతరీయసూక్తములయొక్క యవాంతరకాలభేదనిర్ణయమున లిఙ్గాభావము, వేలకొలఁది వత్సరములనుండి ఋగ్వేద మత్యంతావధానముతో సంరక్షింపఁబడుట, ఋగ్వేదముయొక్క యవస్థాన్వయము, సంహితాపాఠము, తదుత్పత్తికాలము, వేదరక్షణార్థ మవలంబితము లగు పదపాఠాద్యుపాయములు, ఋగ్వేదీయపాఠాంతరవిచా

* ఈ వ్యాసమందలి సంశయములను - (??) - ఈ గుర్తుతో సూచించియున్నాము. —భా. సం.

రము, స్వరవిచారము, ఛందోవిచారములు వివరింపఁబడి యున్నవి.

౫ అధ్యాయము [౨౬-౩౯ పు.]: ఇది 'ఋగ్వేదముకంటె నర్వాచీనములగు వేదములు' ['Later Vedas'—౧౭౧-౨౦౧ పు.] అను 'మెక్ డానెల్' గ్రంథమునందలి సప్తమాధ్యాయమున కనువాద మనఁదగు. ఇందు, సామసంహిత, తత్సామాన్యవిభాగములు, గానము, సామవేదకాలవిచారము, సామవేదీయశాఖలు, యజుస్సామముల వైలక్షణ్యము, యజుర్వేదవిభాగములు, శుక్లకృష్ణయజుర్వేద వివరణము, వేదముల పరస్పరసంబంధము, యజుర్వేదశాఖలు, ఋగ్యజుర్వేదమతవిచారము, అథర్వణసంహిత, తద్విభాగములు, శాఖలు మొదలగువానింగూర్చి వ్రాయఁబడెను.

౬ అధ్యాయము [౪౦-౬౦ పు.]: 'మెక్ డానెల్' పండితుని గ్రంథమునందలి 'ఋగ్వేదీయకవితావిచారము' ['Poetry of the Rigveda'-౫౯-౧౧౫ పు.] అను తురీయాధ్యాయము దీనికి మూలము.

ఋగ్వేదవిషయవిచారము, వేదవ్యాఖ్యామార్గవిచారము, యాస్కుని నిరుక్తమును, సాయణభాష్యమును వాస్తవికార్థబోధకములు గావను ప్రతిపాదనము 'రోథ్' (Roth) అను జార్మణ్యదేశీయసంస్కృతపండితుని వ్యాఖ్యాపద్ధతియొక్క సాధుత్వప్రతిపాదనము, గాథా, ఋగ్వేదస్వరూపనిరూపణము, దేవతాస్వరూపవిచారము, ఋగ్వేదోక్తులగు ఋషులు, మృగదేవతలు, ఓషధివృక్షారణ్యదేవతలు, యూపాదులకు దేవతారోపణము, అసురవిచారము మొదలగువిషయము లిందు విస్తృతములు.

౭ అధ్యాయము [౬౧-౬౬ పు.]: 'ఋగ్వేదకాలిక (??) ఋషుల యాధ్యాత్మికవిచారము'. 'మెక్ డానెల్' పండితుని గ్రంథములోని ఋగ్వేదీయ దార్శనికవిచారము ['Philosophy of the Rigveda'-౧౧౬-౧౨౦ పు.] అను పంచమాధ్యాయము దీనికి మూలము. యమలోకము, పితరులు, సంవాదసూక్తములు, అభిచారసూక్తములు, వైవాహికసూక్తములు, ఔర్ధ్వదైహికవిచారము, దానస్తుతులు, హితోపదేశసూక్తములు, ప్రహేళికాసూక్తములు, విశ్వోత్పత్తిసూక్తములు నిందు వివరింపఁబడి యున్నవి.

౮ అధ్యాయము [౬౭-౭౫ పు.]: 'ఋగ్వేదకాలవిచారము'. 'మెక్ డానెల్' గ్రంథమునందలి ['Rig-vedic Age'—౧౩౯-౧౭౦ పు.] షష్ఠాధ్యాయము దీని కాధారము. ఋగ్వేదోక్తములగు నదీపర్వతములు, ఋగ్వేదోత్పత్తిప్రదేశము, ఋగ్వేదోపవర్ణితములగు వృక్షములు, లతలు, మృగములు, పక్షులు, ఋగ్వేదమునందు లవణము స్మరింపఁబడకుండుట, ఋగ్వేదనిర్దిష్టలోహములు, భారతవర్షీయాదిమనివాసులు, ఆర్యవర్గములు, పౌరోహిత్యోత్కర్ష, జాతిభేదోత్పత్తి, ఆర్యుల సాంఘికధర్మములు, తద్వ్యవహారము, వారి యుద్యోగములు మొదలగువానింగూర్చి యిట వ్రాయఁబడియెను.

౯ అధ్యాయము [౭౬-౯౭ పు.]: 'బ్రాహ్మణాదివిచారము'. మెక్ డానెల్ పండితుని గ్రంథమునందలి 'బ్రాహ్మణములవిచారము' ['The Brahmanas'—౨౦౨-౨౪౩ పు.] అను సప్తమాధ్యాయము దీని కాధారము. బ్రాహ్మణారణ్యకోపనిషత్స్వరూప విచారము, ఋగ్వేదీయబ్రాహ్మణములు, శునశ్శేఫోపాఖ్యానము, యజుస్సామాథర్వముల బ్రాహ్మణములు, ఉపనిషత్స్వరూపవిచారము, ఉపనిషత్తులలోని పరమసిద్ధాంతము, పునర్జన్మసిద్ధాంతము, ఉపనిషదుత్పత్తిసమయనిర్ణయము, ఋగ్యజుస్సామాథర్వముల యుపనిషత్తులు, గౌడపాదకారికలు మొదలగువానింగూర్చి యిట వ్రాయఁబడియెను.

౧౦ అధ్యాయము [౯౮-౧౦౪ పు.]: 'సూత్రకాలవిచారము.' ఇది 'మెక్ డానెల్' పండితుని గ్రంథమునందలి 'సూత్రవిచారము' ['The Sutras'—౨౪౪-౨౬ పు.] అను నవమాధ్యాయమునకుఁ బ్రతిధ్వనివంటిది. శ్రౌత, గృహ్య, ధర్మసూత్రగ్రంథములు, ప్రాక్కాలిక కర్మములు, ప్రయోగగ్రన్థములు, పద్ధతిగ్రన్థములు, అనుక్రమణీగ్రంథములు, 'వ్యాకరవైదికవిచారము' (??) మొదలగు విషయము లిందు విస్తృతములు.

౧౧ అధ్యాయము [౧౦౫—౧౧౯ పు.]: 'మహాభారతరామాయణవిచారము'. దీనికి 'మెక్ డానెల్' గ్రంథమునందలి 'పురాణవిచారము' ['The Epics' ౨౬౬-౩౧౬ పు.] అను దశమాధ్యాయ మాధారము. కాని పురాణముల వివరించు నిందలి ౨౯౯-౩౦౨ పుటలు మాత్రము శర్మగారి గ్రంథమునందలి ద్వాదశాధ్యాయమున కాధారము. ఈయధ్యాయమున నితిహాసాఖ్యానపురాణములు, మహాభారతము, తదుత్పత్తివిచారము, తత్కాలవిచారము, తదవస్థలు, కుమారిలస్వామి క్షేమేంద్రులకృతులు, భారతవ్యాఖ్యాతలు, భారతమునందలి యుపాఖ్యానములు, రామాయణవిచారము, తదుత్పత్తి, తన్నిర్మాణకాలము, రామాయణమునందలి రెండుభాగములు, ప్రక్షిప్తములు, రామాయణము సర్వజనమనఃపీఠికోట్టంకితమై యుండుట మొదలగువిషయములు వివరింపఁబడినవి.

౧౨ అధ్యాయము [౧౧౯-౧౨౧ పు.]: 'పురాణవిచారము.' దీనికి 'మెక్ డానెల్' గ్రంథమునందలి ౨౯౯-౩౬౨ పుట లాధారములని చెప్పియుంటిమి. పురాణముల కాలము, పురాణపంచలక్షణములు, శైవవైష్ణవపురాణములు మొదలగున వింకు విస్తృతములు.

౧౩ అధ్యాయము [౧౨౨-౧౩౫ పు.]: 'షడ్దర్శనములు.' దీనికి 'మెక్ డానెల్' గ్రంథమునందలి 'దర్శనవిచారము' ['Philosophy'—౩౭౫-౪౦౬ పు.] అను ౧౫-వ యధ్యాయ మాధారము. న్యాయము, వైశేషికము, పూర్వోత్తరమీమాంసలు, సాంఖ్యయోగములు, షడ్దర్శనసూత్రకాలవిచారము నను విషయము లిందు వివరింపఁబడియున్నవి.

సూత్రములు :—

'బ్రాహ్మణములయొక్క గ్రంథవిస్తారముచే నందుఁ బ్రతిపాద్యమగు విషయములను సూక్ష్మముగాఁ దలిపికొనుటకుఁ గష్టసాధ్యముగా నున్నందున నీసూత్రము లావశ్యకము లైనవి.'

—గీ. వా. ప్ర. చ. ౨ అ. ౧౩-౧౪ పు.

ఇది సత్యదూరము. వేదములు, బ్రాహ్మణములు, లేఖనము, లేఖనసామగ్రి తెలియని కాలపు వాఙ్మయము; అందువలననే ప్రతిగ్రంథమును నాఁడు వచ్చినవారికి వల్లించి, వచ్చినవారికి నెమరువేసికొనుచుండెడివారు. నాఁడునాఁటికి బ్రాహ్మణములు విపులము లగుచుండెను. ఎంతటిమేధానిధికైన నంతగ్రంథమును గంఠస్థము చేసికొనుటకుఁ జాలిన ధారణాసంపద లేకుండెడిది. అందుచే దిగ్దంతి నద్దములో నిమిడ్చినట్లు ఎంతబృహద్గ్రంథమైనను సూక్ష్మములో మోకు మన్నట్లు, సూత్రములలోనికి కుదింపఁబడుచుండెడిది.

ప్రతిశాస్త్రగ్రంథము, అమరము మొదలగు నిఘంటువులను గంఠస్థముచేసికొనుట కనుకూలముగా నుండుకొఱకే ఛందోబద్ధములుగా రచింపఁబడుచుండెడివి. మొదట సంగ్రహములుగా నున్న యీసూత్రములు రానురాను వ్యాఖ్యాపేక్షము లైనవి. మొదట సూత్రము, దానికి భాష్యము, దానికి వ్యాఖ్యానము, దానికి వివరణము, దానికిఁ డీక, దానికి లఘుటీక—ఇట్లు గ్రంథ మపారమైపోయినది.

శ్లో. 'అల్పాక్షర మసందిగ్ధం సారవ ద్విశ్వతోముఖమ్;
అస్తోభ మనవద్యంచ సూత్రం సూత్రవిదో విదుః.'

అని సూత్రనిర్వచనము (లక్షణము ??). నాఁటి శబ్దశాస్త్రవేత్తలు మాత్రలాఘవమును (మాత్రాలాఘవమును??) బుత్త్రోత్పత్తితుల్యముగా నెంచెడివారఁట. అందుచే సూత్రములలోఁ జెప్పఁబడిన విషయము సందిగ్ధావస్థలోఁ బడి సుగమము గాకుండెను. 'ఋగ్వేదము, వైదికమతము' అను గ్రంథములో 'క్లేటన్' అను పాశ్చాత్య సంస్కృతపండితుఁ డిట్లు వ్రాసియున్నాఁడు :—

"The Brahmanas, being in prose, they were therefore not so readily learned by rote as if they had been in verse. It will be obvious, then, that as they increased in number, and as the number of subjects taught by the sages were multiplied, their disciples had to find a method that would insure the faithful memory of essential

rules and doctrines. Hence, series of aphorisms, strings of aphorisms, or sutras were formulated, reduced to the utmost brevity, indeed so condensed that they are all but intelligible".

[A. C. Clayton: 'The Rigveda and Vedic Religion', P. 37, 1913.]

రామాయణ విచారము:—

[౧౧ అధ్యాయము, ౧౧౭ పు.]:—

(అ) 'లౌకికపద్యకావ్యములయందు శ్లోకవృత్తావతారకథ సుందరముగా వర్ణింపఁబడియున్నది.'

ఇటఁ గవిహృదయ మేమో!

(ఆ) "ఒకనాఁడు వాల్మీకిమహర్షి యనుష్ఠానము చేయుచుండుసమయమున నొకవ్యాధుఁడు క్రౌంచపక్షులలో నొకపురుషపక్షిని చంపెను. దానిని జూచి శోకోద్విగ్నులయిన వాల్మీకివాక్కునుండి వారికిని దెలియక 'మా నిషాద' యనెడి శ్లోకము వెలువడినది."

ఇందలి రేఖాంకితపదములు హాస్యజనకములుగా నున్నవి.

రామాయణనిదానమును గాళిదాసుఁ డిట్లు మనోజ్ఞముగ వర్ణించియున్నాఁడు:

శ్లో. 'తా మభ్యగచ్ఛ ద్రుతి(ది??)తానుసారీ
కవిః కుశేధ్మాహరణాయ యాతః,
నిషాదవిద్ధాండజదర్శనోత్థః
శ్లోకత్వ మాపద్యత యస్య శోకః.'

—రఘు. ౧౪ స. ౭౦ శ్లో.

ఈవిషయమే కావలయును వీరు చెప్పఁదలఁచినది.

(ఇ) 'వాల్మీకి రామాయణమును తఱచు శ్లోకవృత్తరూపముగానే వ్రాసిరని ప్రఖ్యాతియఁట. ఔరా! వాల్మీకిరామాయణము గద్యపద్యాత్మకమనియా వీరి యభిప్రాయము? ఎంతతప్పు! వాల్మీక మామూలచూడము ఛందోబద్ధము కాదా!

షడ్దర్శనములు [౧౩ అ. ౧౨౨ పు]:—

షడ్దర్శనములను సంగ్రహముగా వివరించినపిదప మధుసూదనసరస్వతి 'ప్రస్థానభేదము'లో షాదర్శనముల దైక్యముంగూర్చి యుద్ఘోషించియున్నాఁడు.*

'బ్రహ్మబిందూపనిషత్తు'లోఁగూడ నిట్లు చెప్పఁబడియున్నది:

శ్లో. 'గవా మనేకవర్ణానాం క్షీరస్యాఽప్యేకవర్ణతా,
క్షీరవ త్పశ్యతే జ్ఞానం లింగినస్తు గవాం యథా.'

జ్ఞానము క్షీరమువంటిది. గురువన్నో గోవృకుఁడు. గోవులలో బహువర్ణత్వ మున్నను వాని క్షీరము మాత్ర మేకవర్ణమునే కలిగియుండునుగదా.

'యోగసూత్రములకు భోజరాజు భాష్యము వ్రాసియున్నాఁడు' [౧౨ అ. ౧౩౪ పు.]:

శ్లో. 'యోగేన చిత్తస్య పదేన వాచాం
మలం శరీరస్యచ వైద్యకేన,
యోఽపాకరోత్తం ప్రవరం మునీనాం
పతంజలిం ప్రాంజలి రానతోఽస్మి.'

పతంజలి తన చిత్తముయొక్క మలమును యోగగ్రంథనిర్మాణముచేతను, వాక్కుయొక్క మలమును శబ్ద

* దీనినే మోక్షమూలర్ పండితుఁడు [Prof. Max Muller] తన 'షడ్దర్శనవిచారము'న నిట్లు ఉట్టంకించియున్నాఁడు: "In reality, all the Munis who have put forward these theories agree in wishing to prove the existence of the One Supreme Lord without a second...... These Munis cannot be in error, considering that they are omniscient and these different views have only been propounded by them, in order to keep off all nihilistic theories and because they were afraid that human beings, with their inclinations towards the objects of the world, could not be expected at once to know the true goal of man." [Quoted in Max Muller's 'Six Systems of Indian Philosophy,' P. 107-08.]'

శాస్త్రరచనముచేతను, శరీరముయొక్క మలమును వైద్య గ్రంథవిరచనముచేతను నిర్మూల మొనరించుకొనెను. పతంజలివలెనే భోజదేవుఁడును తాదృశగ్రంథత్రయమును నిర్మించి మానసిక వాచిక కాయికములగు మలములం బోఁగొట్టుకొనెను. భోజుని ‘రాజమార్తాండము’ పతంజలి ‘యోగసూత్రముల’ పై భాష్యము. ‘సరస్వతీకంఠాభరణము’ [తన్నామకమగు సుప్రసిద్ధాలంకార గ్రంథముకంటె భిన్నము] భోజుఁడు రచించిన వ్యాకరణగ్రంథము. ‘రాజమృగాంకము’ అను గ్రంథ మీతఁడు రచించిన వైద్యగ్రంథము, అని అడయార్ ప్రాచ్యగ్రంథాలయములోఁ బండితులుగా నుండిన శ్రీ యస్. భాష్యాచార్యులవారు వ్రాసియున్నారు.* కాని యీవిషయము లింకను బరిశోధనార్హములు.

షడ్దర్శనసూత్రకాల విచారము [౧౭౯ పు. మొదలుకొని]:—

“బ్రహ్మసూత్రములకు నుపవర్షుఁ డనువారొక భాష్యమును వ్రాసినట్లు శంకరాచార్యులవారు చెప్పుచున్నారు.”

ఇది సరికాదు. సంపూర్ణమీమాంసాసూత్రముల మీఁద బోధాయనులు ‘కృతకోటి’ యను వృత్తిని నిర్మించియున్నారు. తిరువాన్కూరుసంస్కృతగ్రంథావళిలోఁ [౮౫-వ గ్రంథము] బ్రచురింపఁబడిన ‘ప్రపంచహృదయము’ వలన బోధాయనవృత్తి ‘కృతకోటి’ నామకమని తెలియుచున్నది. తద్వృత్తిసంక్షేపకారుఁ డుపవర్షుఁడు. సుప్రాచీనతమిళగ్రంథమగు ‘మణిమేఖలై’ లో వేదవ్యాసజైమినుల కృతులును, ‘కృతకోటి’యును బరమప్రమాణములుగ నుల్లేఖింపఁబడియున్నవి.†

“శంకరులకుఁబూర్వము ద్రవిడాచార్యులు ‘బ్రహ్మసూత్రము’లకు భాష్యము వ్రాసియున్నారు. టంకాచార్యులు (మొదలగువారలు) ఈసూత్రములకు భాష్యములు వ్రాసియున్నట్లు రామానుజభాష్యమువలనఁ దెలియుచున్నది.” [౧౩౧ పు.]

‘బ్రహ్మసూత్రముల’మీఁద భగవద్వేదాంతదేశిక పూజ్యచరణులు రచించిన ‘తత్త్వటీక’ వలన టంకాచార్యుల [వాక్యకారుల] నిజనామము బ్రహ్మనంది యని తెలియుచున్నది.

ద్రమిడాచార్యులు: ఉపనిషద్వ్యాఖ్యలు రచించిరి. వీరు ‘భాష్యకారు’ లనియు వ్యవహరింపఁబడుచుండెడివారు. వైష్ణవప్రపన్నప్రపంచమున సుగృహీతనాములగు ‘తిరుమొంజిషియాళ్వారులు’ [భక్తసారులు]ను వీరు నొకరని యొకానొకరు వ్రాసిరి కాని యిది సరికాదు.

ప్రకృతగ్రంథమును శ్రీయుత శేషమళ్ల రాజగోపాలరావుగారు శుక్ల-మార్గశీర్ష పు ‘భారతి’ [౬ సంపు. ౧౨ సంచిక డిసెంబర్ ౧౯౪౯: ౧౦౦౨ పు.]లో విమర్శించుచు, “ఇది ఆంధ్రవిశ్వవిద్యాలయము నుండియు, మదరాసు విశ్వవిద్యాలయమునుండియు ప్రాచ్యభాషాపరీక్షలకుఁ బోవు విద్యార్థుల కత్యంతోపయుక్తమైనది. గ్రంథకర్తగారు ప్రాచ్యప్రతీచ్యవిమర్శనములను సంశోధించి యీచరిత్రమును తేటతెలుఁగున వ్రాయుటచే నిది విద్యార్థులు కానివారికిని ఉపకరించును. * * * * ప్రాచ్యభాషాపరీక్షలకుఁ బోవువిద్యార్థు లెల్లరును నీగ్రంథమును దప్పక చదువవలయునని మాయాశయము” అని వ్రాసియున్నారు. గ్రంథముం జూడకపోయిన నేమో కాని చూచినపిమ్మటఁ బైవిమర్శముతో నేకీభవింపఁ జాలము.

ఈ గ్రంథమునందలి భాషావిషయిక (??) దోషముల దిఙ్మాత్ర ముదాహరింపవలసియున్నది.

౧. ‘గోవుకు’ (౩ సారులు): ‘గోవునకు’ అని యుండవలెను. ఇట్లు ‘పాముకు’, ‘నిప్పుకు’ (౨సారులు).

౨. ‘దేవతాద్వంద్వములుగూడ యేర్పడియుండవచ్చును: ‘కూడ నేర్పడి’ యనవలెను. ఇట్లనే ‘గృహ

* From ‘The Age of Patanjali’, Re-printed from ‘The Theosophist’ of Sep. 1889.

† చూ. ఆ. రంగస్వామిసరస్వతి: ‘బోధాయనోపవర్షులు’ — ‘Journal of Indian History’.

పత్నికి యధికారము'; 'కావ్యతిలకము అను యితర లక్షణగ్రంథము'.

౩. 'పుస్తకము'(౩ సారులు):'పుస్తక' మనందగు'

'ఉదహరించుట' (౩ సారులు): 'ఉదాహరించుట' యనవలెను.

౪. 'తరువాతప్రవాఁదరా (౩ సారులు): 'తరువాతివాఁ' డనదగు.

౫. 'వృషభానజ' (౨ సారులు): 'వృషభానుజ' యనవలెను.

వెనుకటి కెవరో ప్రబోధచంద్రోదయము, సంకల్పసూర్యోదయముల సామ్యముమీఁద 'విజ్ఞానభానోదయ' మని వ్రాసిరట. నలోపాఖ్యానమని యున్నదికదా యని 'శంతనోపాఖ్యాన' మనిరట. శర్మగారు భానుశబ్ద మకారాంత మనుకొనిరో?

౬. 'దేవతులు' [౧౫ సారులైనను ప్రయోగించిరి]: ముద్రాపకదోష మైనచో దిద్దికొనఁగూడదా?

౭. 'దశమమండల డెబ్బదిరెండవ సూక్తము'. (౬౪ పు.).

'దశమమండలపదునెనిమిదవసూక్తము' (౬౫పు.).

'దశమమండలముప్పదినాల్గవ సూక్తము' (౭౦పు.).

'క్రీస్తుశక ఏడవశతాబ్ది' (౧౦౪ పు.).

౮. 'స్యాయనాచార్యులు' (౩ సారులు): 'సాయణాచార్యు'లనఁదగు.

ఉపసంహారము:—

ఆంగ్లాదిపాశ్చాత్యభాషలలో సంస్కృతసారస్వతమునందలి యాయాశాఖల చరిత్రము లనేకములు రచింపఁబడి యున్నవి. ౩౫ సంవత్సరములక్రిందట ఫ్రాన్స్ దేశసంస్కృతపండితశిరోమణియగు 'సిల్వన్ లెవి' [Sylvain Levi] సంస్కృతనాటకచరితమును రచించియున్నాఁడు. ఏ. బెరిడేల్ కీత్ పండితుఁడు [Prof. A.B. Keith] ౧౯౨౪లో నాంగ్లమున సంస్కృతనాటకచరితమును నిర్మించియున్నాఁడు. జకరయా [Prof. T. Zacharia] అను జార్మన్యాదేశ సంస్కృత విద్వాంసుఁడు ౧౮౯౭లో సంస్కృత నిఘంటు చరితమును రచించెను. స్వర్గీయ, మహామహోపాధ్యాయ, సాహిత్యాచార్య, పండిత రామావతారశర్మ మహోదయులు, 'గైక్వాడ్ ప్రాచ్యగ్రంథావళి'లోఁ [౪౨ సంఖ్య] ప్రచురింపఁబడిన [౧౯౨౮] కేశవపండితుని 'కల్పద్రుకోశము' నకుఁ బీఠికగా సంస్కృతనిఘంటుచరితము నాంగ్లమున రచించి ప్రచురింపించిరి. వారచించిన 'సంస్కృతదూతకావ్యచరితము' ['సంస్కృతదూతకావ్యోత్పత్తివికాసములు', ఆంధ్రసాహిత్యపరిషత్పత్రికలోఁ ప్రకటితము] అనుగ్రంథము నిటఁ జేర్కొనుట యప్రస్తుతము గాకపోవచ్చును. న్యాయదర్శనముంగూర్చి తెనుఁగులో నొక యధ్యాయముమాత్రము స్వర్గత కొమర్రాజు లక్ష్మణరావుగారు రచించియున్నారు. శ్రీమత్పండిత మేడేపల్లి వేంకటరమణాచార్యులవారు వైశేషికదర్శనముం గూర్చి తెనుఁగున నొకకృతిం బ్రచురించియున్నారు. ఆంగ్లాదిభాషలలో షడ్దర్శనచరితాత్మకములగు గ్రంథము లనేకము లున్నవి. అందు కొండుకంటిం జేర్కొనియెద:

౧. మోక్షమూలర్ పండితుని "భారతీయదర్శనషట్కవిచారము" (ఆంగ్లము).

౨. గోపీనాథకవిరాజు: "న్యాయవైశేషికవాఙ్మయచరితము, తదీయగ్రంథప్రణాళి;" సతీశచంద్ర విద్యాభూషణుని "భారతీయన్యాయశాస్త్రేతిహాసము" (ప్రాచీనము, మధ్యకాలీనము, ఆధునికము).

౩. ఏ. బి. కీత్: "కర్మమీమాంసావిచారము;" శ్రీధరమజుందార్: "వేదాంతదర్శనము."

౪. ఏ. బి. కీత్: "సాంఖ్యదర్శనము"; గార్బె పండితుని "సాంఖ్యయోగవిచారము."

ఇట్లు సంస్కృతసారస్వతమునందలి యాయాశాఖల చరితమును విచారించుగ్రంథము లాంధ్రమున రచింపఁబడవలెను. మన కట్టిభాగ్య మెన్నఁటికో! శర్మగారు ద్వితీయముద్రణమున నైన దోషముల సవరింపించి, గ్రంథమును సంస్కరించి సంస్కృతశారదారాధనము నొనరింతురని యాశించుచున్నాము.

# శబరి



చింతా దీక్షితులుగారు

3

[ఋశ్యమూకపర్వతముదగ్గర ఒకరాతిమీద ఇఱ్రి కూర్చుని ఉన్నది. ఎదురుగా పంపాసరస్సు కనిపిస్తూ ఉంది. చుట్టూ పెద్దపెద్ద వృక్షాలు, ఇసుక చెట్లూ, దుబ్బులూ మొలచిఉన్న ఋష్యమూకము; ఇఱ్రి ఇదివర లోలాగే బట్ట కట్టుకొంది. ఉత్తరీయం నడ్లో పడవేసు కొంది. జుట్టు జాగ్రతగా సవరించి ముడివేసుకొంది. జుట్టులో రకరకాల పువ్వులూ, పక్షి నెరులూ పెట్టుకొన్నది. మెడలో గురివిందదండలూ, రకరకాల పువ్వుమాలలూ వేసుకొంది. ఇఱ్రిబుజంమీద ఒకచిలక కూర్చుని తలలో పువ్వులు ముక్కుతో లాగుతూ ఉంది. ఇఱ్రి చేతులో గింజలు ఉంచుకొని పక్షులకు చల్లుతూ ఉంది. పక్షులు కొన్ని కింద పడ్డ గింజలు తింటున్నవి. కొన్ని ఇఱ్రిచేతుల మీద వాలి గింజలు లాగుకొంటున్నవి. పక్షుల ఆటలు చూస్తూ ఇఱ్రి, నెమ్మదిగా పాడుకొంటున్నది.]

ఇఱ్రి

పాడేటిపిట్టలారా రండి ఆడదాము
వినువీథిమబ్బుల్లో కలిసిపోదాము.
మబ్బుల్లో పాటలకు మనచిన్నపాటలకు
వియ్య మందింతాము వేవేగ రండి.
వానచినుకులవెంట మరల దిగి వద్దాము
దిగి వచ్చి చెట్లమీ దాడుకొందాము.
హనుమాను డేసుమా అందరికి రారాజు
హనుమానుకొరకె మనపాట లన్నీని.

[హనుమంతుడు వెనుకనుంచివచ్చి పాటవినును]

హనుమంతుడు

దొంగా, దొరికావు లే!

ఇఱ్రి

[వెనుకకు తిరిగి నిలబడును. ఉత్తరీయం బుజంమీద వేసుకొనును. పక్షులు దూరదూరము పోయి హనుమంతుని కేసి వింతగా చూచును.]

నాతో చెప్పకుండా నాపాట ఎందుకు విన్నావు?

హనుమంతుడు

నాతో చెప్పకుండా నామీద ఎందుకు పాటలు పాడావు?

ఇఱ్రి

ముసలిదానిదగ్గిర కూర్చోక ఇక్కడి కెందుకు వచ్చావు?

హనుమంతుడు

నీదగ్గిరికి నే వచ్చానా, మాకొండదగ్గిరికి నీవు వచ్చావా?

ఇ ద్రి

పోనీ, నాకోసం రాకపోతే, నే వెళ్లిపోతాను లే!

హ ను మ ం తు డు

నీకోసమే, నీకోసమే-నే వస్త! నీకోసం రెండురోజులబట్టి తిరుగుతున్నాను. ఇప్పటికి నీవు దొరికావు.

ఇ ద్రి

నాకోసం ఎందుకు తిరుగుతున్నావు?

హ ను మ ం తు డు

నీవు పాడేపాట తప్పని చెప్పడానికి!

ఇ ద్రి

పాటకు తప్పేమిటి? ఆముసలిదాని సావాసం చేస్తే నీకు మతి పోతోంది.

హ ను మ ం తు డు

జింకపిల్ల ఏదీ? ఎక్కడ దాచిపెట్టావు?

ఇ ద్రి

నేను వస్తూ ఉంటే నాతో కూడా వస్తానని ఏడ్చింది. కాలు నొప్పి పెడుతుంది రా వద్దని ఇంటివద్ద నిద్రపోగొట్టి వచ్చాను.

హ ను మ ం తు డు

పాపం, ఇంకా కాలునొప్పి పోలేదూం?

ఇ ద్రి

ఊరికే పరుగెత్తి పట్టుకుంటావేమోనని అడిగితే దానికాలు విరగగొట్టావు, నీమూలాన్నే—

హ ను మ ం తు డు

నేను కొడుతూఉంటే ఎందుకు వద్దన్నావు కావు?

ఇ ద్రి

ఎందుకు వద్దన్నాను కానా? ఎందుకు వద్దన్నానుకానా? కోతీ, నీదగ్గిర ఉంటే నీవు చేసే పనులన్నీ మంచివనే అనిపిస్తుంది నాకు.

హ ను మ ం తు డు

మరి?

ఇ ద్రి

నా కేం తెచ్చిపెట్టావు ఇవాళ?

హ ను మ ం తు డు

చెప్పకో?

ఇ ద్రి

పువ్వులూ, పళ్లూ.

హ ను మ ం తు డు

కాదు.

ఇ ద్రి

నాకు పువ్వు లక్కర్లేదు లే.

హ ను మ ం తు డు

ఎంచేత?

ఇ ద్రి

నేను వస్తూఉంటే పిట్టలు నన్ను 'కో' అని పిలిచి నామీద కొమ్మలు ఆడించి పువ్వులు రాల్చాయి.

హ ను మ ం తు డు

నే నేం తెచ్చిపెట్టానో చెప్పకోలేవూ?

ఇర్రి

నేను చెప్పకోలేనమ్మా! నువ్వు చెప్పు.

హ ను మం తు డు

[ఒకరాతిపక్క దాచిన తేనెపట్టు తీసికొని వచ్చి చూపించును.]

ఇర్రి

ఇలా తే, ఇలా తే. [అని అతని చేతిలో నుంచి లాక్కొనును. ఇద్దరూ ఒకరాతి మీద కూర్చుని ముక్కలుగా చిదిపి తింటూ మాట్లాడుకొంటారు. పక్షు లన్నీ వెళ్లిపోయినవి.]

హ ను మం తు డు

ఏమిటి ఆలోచిస్తున్నావు?

ఇర్రి

నీసంగతే! నీ వాముసలిదాని దగ్గిరికి ఇంకెప్పుడూ వెళ్లవుగదా! నీకు ఆటలూ, పాటలూ అన్నీ చెప్పతాను!

హనుమంతుడు

శబరి మహాతపశ్శాలిని సుమా!

ఇర్రి

పోదూ, నీమాటల కేమిటి! చూడు, ఆ మర్రిచెట్టు ఊడలు భూమికి దిగి ఎలాగ వేళ్లాడుతున్నవో. చెయ్యెత్తి పిలుస్తున్నవి మనను ఉయ్యాల ఊగమని; ఊగుదాం వస్తావా?

హనుమంతుడు

తరువాత ఆడుకొందాంలే. ముందు నే చెప్పే మాట విను.

ఇర్రి

నే వినను. చూడు చూడు, ఆ చెట్టుమీద రెండుగువ్వలు కూర్చుని ఎలాగ గుసగుసలాడుకొంటున్నవో!

హనుమంతుడు

నీవు వట్టి అల్లరిపిల్లవు.

ఇర్రి

మనం ఇద్దరం ఆగువ్వల్లాగ ఆకొమ్మమీద కూర్చుని పాటలు పాడుకొందాము! రా, రా, హనుమా, రా, రావూ?

హనుమంతుడు

గువ్వల్లా కొమ్మ లెక్కి కూర్చోగలము గాని గువ్వల్లా ఎగరగలమా మనము?

ఇర్రి

నువ్వు ఎగరగలవు కాదూ? సూర్యుణ్ణి ఎగిరి మింగివెయ్య బోయావు కాదూ చిన్నప్పుడు? నువ్వు ఎగిరితే నన్నుకూడా తీసుకుపోతా వన్నమాట!

హనుమంతుడు

నేను చెప్పినమాట వినకపోతే నిన్ను తీసుకు వెళ్లను.

ఇర్రి

వింటే తీసుకు వెళ్లుతావా?

హ ను మం తు డు

ముందర విను.

ఇ ర్రి

ముందర తీసుకు వెళ్లు. చూడు, చూడు హనుమా! అమబ్బులో ఆచాతకాలు ఎలాగ దోబూచు లాడుతున్నవో.

హ ను మ ం తు డు

అయితే ఇర్రీ! ఒక కథ చెప్తాను, వింటావా?

ఇ ర్రి

ఇప్పుడు కథ లేమిటి? అమబ్బులు, ఆసూర్యుడు, ఆ ఆకాశం, ఆచెట్లు, ఆపక్షులు, లోకమంతా నవ్వుతూ ఉంటే ఆనవ్వు చూచి ఆనందించక కథ లంటా వేమిటి యిప్పుడు?

హ ను మ ం తు డు

ఇర్రీ, ఒక్క ప్రశ్న వేస్తాను. సమాధానం చెప్ప చూతాము?

ఇ ర్రి

అడుగు చూతాము?

హ ను మ ం తు డు

లోకం నవ్వు నీ కిష్టమా, నా నవ్వా?

ఇ ర్రి

ముందు నీ నవ్వు, తరవాత లోకంనవ్వూ!

హ ను మ ం తు డు

అవును గదా మరి. నానవ్వు నీ కెందు కంత యిష్టం?

ఇ ర్రి

నీవు లోకంకంటె గొప్పవాడవు గనుక.

హ ను మ ం తు డు

నన్ను గొప్పవా డంటూఉంట ఎవరు?

ఇ ర్రి

ఎవరో అనడం నాకు లె క్కే_మిటి? నేనే అంటున్నాను.

హ ను మ ం తు డు

సరే; నీకు నేను గొప్పవాడినే! నాకు కూడా గొప్పవాడు ఉండవచ్చు గదా!

ఇ ర్రి

నీవే అందరికంటె గొప్పవాడి వంటే మళ్లీ నీకిన్న గొప్పవా డేమిటి! అయ్యో, మందమతా!

హ ను మ ం తు డు

నాకన్న గొప్పవా డింకొక డున్నా డని నాలో నే ననుకోవచ్చును కాదూ?

ఇ ర్రి

నీ వెందు కనుకోవడం?

హ ను మ ం తు డు

ఎందుకు అనుకోకూడదూ?

ఇ ర్రి

నీవు ఎంతటిమ్మృగా నైనా వేటాడగలవు. ఏనుగును తొండము పట్టుకు తిప్పి నేలకు కొట్టగలవు. పర్వతాలూ చెట్లూ పెకలించగలవు. సింహాలనూ, పెద్దపులులనూ కలియబడి చంపెయ్యగలవు.

హ ను మ ం తు డు

చాలు ఈపాటి ఏకరువు పెట్టడం. ఇంత కన్న ఎక్కువకార్యాలు చెయ్యగలిగితే ఆ చెయ్యగలిగినవాడు నాకంటె గొప్పవాడేనా ?

శ్రీ

ఇంతకంటె గొప్పకార్యా లేమిటి ?

హ ను మ ం తు డు

సంకల్పమాత్రంచేత లోకాన్ని సృష్టించడం, నాశనము చెయ్యడం.........

శ్రీ

అమ్మో ! ఇంకా, ఇంకా.

హ ను మ ం తు డు

కొండలు సముద్రాలు చెయ్యడం, సముద్రాలు కొండలు చెయ్యడం......

శ్రీ

నిజంగా !

హ ను మ ం తు డు

సుఖం కష్టంగా మార్చడం, దుఃఖాన్ని సుఖం చెయ్యడం...

శ్రీ

నే నమ్మను!

హ ను మ ం తు డు

శాశ్వతసుఖాన్ని, శాశ్వతయవ్వనాన్ని, శాశ్వతజీవనాన్ని నమ్మినవారికిదయచెయ్యడం.

శ్రీ

ఆ, అమ్మా అంతా వేళాకోళం.

హ ను మ ం తు డు

ఎప్పుడూ ఆటలే, ఎప్పుడూ పాటలే. ఎప్పుడూ సౌఖ్యమే, ఎప్పుడూ తృప్తే, ఆనందమే...

శ్రీ

ఎవ డాగొప్పవాడు చెప్పు?

హ ను మ ం తు డు

ఎవరో చెప్పుకో?

శ్రీ

వాలి.

హ ను మ ం తు డు

కాదు.

శ్రీ

సుగ్రీవుడు.

హ ను మ ం తు డు

కాదు.

శ్రీ

వాయుదేవుడు.

హ ను మ ం తు డు

కాదు.

శ్రీ

అంజనాదేవి.

హ ను మ ం తు డు

కాదు.

శ్రీ

సూర్యుడు.

హ ను మ ం తు డు

కాదు.

శ్రీ

ఆకాశం.

హ ను మ ం తు డు

కాదు.

ఇ ద్రి

ఇంక నే చెప్పుకోలేను బాబూ! నువ్వు చెప్పు.

హ ను మ ం తు డు

నే చెప్పితే నువ్వు నమ్ముతావా?

ఇ ద్రి

నువ్వు చెప్పితే నే నమ్మనూ?

హ ను మ ం తు డు

అందరికంటే గొప్పవాడు భగవంతుడు.

ఇ ద్రి

భగవంతు డంటే ఎవరు?

హ ను మ ం తు డు

భగవంతుడు వాలిసుగ్రీవాదులకంటె బలమైనవాడు.

ఇ ద్రి

ఊఁ.

హ ను మ ం తు డు

సూర్యుడూ, చంద్రుడూ, నక్షత్రాలూ, మబ్బులూ—అన్నీ అతని ఆటవస్తువులు.

ఇ ద్రి

నిజంగా! నిజంగా!

హ ను మ ం తు డు

సముద్రాలూ, పర్వతాలూ, నదులూ అన్నీ అతనివే.

ఇ ద్రి

అమ్మో!

హ ను మ ం తు డు

అగ్నికంటె తేజశ్శాలి, హిమవంతునికంటె చల్లనివాడు, పువ్వులకంటె మృదువైన మనస్సతనిది.

ఇ ద్రి

పాటలు పాడతాడా?

హ ను మ ం తు డు

పక్షు లన్నీ అతనివే. పక్షులకు పాటలు అతను నేర్పినవే. నీమనస్సులో ఉండి నీచేత పాటలు పాడిస్తున్నవా డతనే!

ఇ ద్రి

నామనస్సులో ఎవ రున్నా రమ్మా!

హ ను మ ం తు డు

మంచివాళ్ల మనస్సులలో అత డెప్పుడూ కాపురముంటాడు!

ఇ ద్రి

నాతో ఆటలు ఆడుతూ, పాటలు పాడుతాడా భగవంతుడు?

హ ను మ ం తు డు

ఎవరు అతనికోసం ఎదురుతెన్నులు చూస్తూఉంటారో వారికి అతను కనిపిస్తాడు.

ఇ ద్రి

నాకు కనిపించి పాటలు పాడుతాడా?

హ ను మ ం తు డు

నువ్వు అతనికోసం ఎప్పుడూ కనిపెట్టుకు ఉంటే, అతనిమీదే పాటలు కట్టి పాడుతూ ఉంటే, అతన్ని గురించి ఆటలు ఆడుతూ

ఉంటే, అతను నీకు కనిపించి నీతో ఆటలు ఆడి పాటలు పాడుతూ ఉంటాడు.

ఇర్రి

నీలాగ ఎప్పుడూ సంతోషంగా ఉంటాడా?

హనుమంతుడు

నాకంటె వెయ్యిరెట్లు సంతోషము నీ కిస్తాడు. ఆయన సంతోషపు ముద్ద.

ఇర్రి

నీలాగ అందంగా ఉంటాడా?

హనుమంతుడు

ఆయన సౌందర్యరాశి. ఆయన అందాన్ని ఒకమారు చూస్తే నీవు వదలిపెట్ట వన్నమాట.

ఇర్రి

నీ ఆటలంత బాగా ఉంటాయా అతని ఆటలు?

హనుమంతుడు

అతని కెన్నో ఆటలు తెలుసు. అతనితో ఆట లన్నీ సౌఖ్యప్రదాలే.

ఇర్రి

నాతో జట్టు కడతాడా?

హనుమంతుడు

చెప్పాను కాదూ, నీమనస్సులో ఎప్పుడూ అతన్ని తలచుకుంటూ ఉంటే నీకు కనిపించి జట్టు కడతా డని?

ఇర్రి

నిన్ను చూడకపోతే, హనుమా, నామన స్సెంతో దిగులుగా ఉంటుంది గదా, ఇప్పుడు నిన్ను మరిచిపోయి అతన్ని తలచుకుంటూ ఉంటే నాకు దుఃఖం ఎక్కువ కాదూ?

హనుమంతుడు

అతన్ని తలచుకోవడం మొదలుపెట్టా వంటే నీకు దిగులు పోయి సంతోషం వస్తుంది.

ఇర్రి

మరీ, మరీ, నేను కోపగించి కూర్చుంటే నన్ను ఓదారుస్తాడా నీలాగ?

హనుమంతుడు

ఒక్కమాట చెప్తాలా విను ఇర్రీ. అతడు చెయ్యలేనిపను లంటూ లేవు. నేను చాలా పనులు చెయ్యలే నన్నమాట! అతడు ఆడ లేనిఆటలు, పాడలేనిపాటలు లేవు. అతడు ఎక్కలేనికొండలు, చెట్లు, ఎక్కడా లేవు. అతడు ఈదలేనిసరస్సులూ,సముద్రాలూ లేవు.

ఇర్రి

ఆఁ! సముద్రాలు ఈదుతాడా?

హనుమంతుడు

ఆ, అతడు చెయ్యలేని దేమిటి?

ఇర్రి

నువ్వూ నేనూ ఈపంపాసరస్సు ఈదినట్టు?

హనుమంతుడు

అంతకంటె బాగానే.

ఇర్రి

అయితే అతన్ని చూపించు, అతనితో జట్టు కడతా!

హ ను మం తు డు

అతనిమీద పాటలు కట్టి పాడాలి. నీపక్షు లన్నింటిచేతా అతనిమీద పాటలు పాడిం చాలి.

ఇ ద్రి

అలాగే చేస్తాను.

హ ను మం తు డు

అతడు పుణ్యాత్ములకే గాని కనపడడు.

ఇ ద్రి

నాకు కనపడతాడా!

హ ను మం తు డు

నీవు మంచిదానవై, నే జెప్పినట్టు చేస్తే అగుపిస్తాడు.

ఇ ద్రి

అలాగే చేస్తాను.

హ ను మం తు డు

అతడు ఎప్పుడో గాని, మన లోకానికి రానే రాడు.

ఇ ద్రి

ఎప్పుడు వస్తాడు?

హ ను మం తు డు

పుణ్యాత్ములతో జట్టుకట్టడానికి, పాపాత్ము లయిన రాక్షసులను చంపడానికి వస్తాడు.

ఇ ద్రి

ఎప్పుడువస్తాడు?

హ ను మం తు డు

ఇప్పు డీలోకంలో ఉన్నాడు.

ఇ ద్రి

ఉన్నాడా, ఉన్నాడా! నాకు చూపించవు హనుమా?

హ ను మం తు డు

మనుష్యరూపంతో అవతరించి పుణ్యా త్ములదగ్గిరికి వస్తున్నాడు.

ఇ ద్రి

నా కెప్పుడు చూపిస్తావు?

హ ను మం తు డు

మన కొండలమీదికి ఆయన ఒకర్ని చూడ డానికి వస్తాడు.

ఇ ద్రి

నన్నేనా?

హ ను మం తు డు

కాదు.

ఇ ద్రి

మరి నిన్నా?

హ ను మం తు డు

నన్నూ కాదూ.

ఇ ద్రి

మరి ఎవరిని?

హ ను మం తు డు

శబరిని!

ఇ ద్రి

ఆ ముసలిదాన్నా?

హ ను మం తు డు

శబరి అతనికోసం నిద్రాహారాలు మాని కనిపెట్టుకు ఉంది.

ఇ ద్రి

శబరితో కూడా జట్టు కడతాడా?

హ ను మ ం తు డు

శబరి గొప్ప తపస్విని!

ఇ ద్రి

అంత గొప్పదా?

హ ను మ ం తు డు

అతడు వచ్చినప్పుడు పాటలు పాడుతుంది. అతనికాళ్లు తనకన్నీళ్లతో కడుగుతుంది. అతనికి తనహృదయాన్ని కానుకగా సమర్పిస్తుంది.

ఇ ద్రి

శబరికి పాటలు వచ్చునా?

హ ను మ ం తు డు

నీవు నేర్పుదువు కాని!

ఇ ద్రి

నేనా?

హ ను మ ం తు డు

నీవు నేర్పితే నీకూ శబరికీకూడా కనిపిస్తాడు.

ఇ ద్రి

నేను నేర్పుతాను అలా గయితే.

హ ను మ ం తు డు

నీపక్షులనుకూడా తయారు చేస్తావా?

ఇ ద్రి

అలాగే.

హ ను మ ం తు డు

నీకు నే నెంతగొప్పవాడినో శబరికూడా అంతగొప్పదిగా ఉండాలి. అందరికంటె గొప్పవాడు శ్రీరాముడు!

ఇ ద్రి

శ్రీరాము డెవరు?

హ ను మ ం తు డు

భగవంతుడు భూమిమీద అవతరించాడని చెప్పాను కాదూ?

ఇ ద్రి

అవును.

హ ను మ ం తు డు

ఆ అవతారపురుషునిపేరు శ్రీరాముడు.

ఇ ద్రి

శ్రీరాముడు, శ్రీరాముడు! పేరు ఎంచక్కుంది!

హ ను మ ం తు డు

ఆపేరు ఎప్పుడూ మరిచిపోకు. శ్రీరాముని గురించి ఎప్పుడూ పాడుతూ, పాడిస్తూ ఉండు.

ఇ ద్రి

శ్రీరామ శ్రీరామ శ్రీరామ రామ
శ్రీరామ నీనామమే నాకు శరణు!

హ ను మ ం తు డు

బాగు! అలాగ, అలాగ పాటలు కట్టాలి. 'శ్రీరాముడు ఎప్పుడు వస్తాడు, ఎప్పుడు వస్తా' డని ఆత్రతతో ఉండాలి.

ఇ ద్రి

శ్రీరామనామం జపిస్తూనా?

హ ను మ ం తు డు

శబరిలాగ. శబరికి శ్రీరాముడే సర్వమూను. అంచేతనే ప్రపంచాన్నంతా ప్రేమిస్తుం దామె.

ఇ ఱ్రి

నన్నూ ప్రేమిస్తుందా?

హనుమంతుడు

నిన్ను కడుపున బుట్టిన కూతురుకంటె ఎక్కువగా ప్రేమిస్తోంది. నీకు శ్రీరాముడిసంగ తంతా చెప్ప మన్న దావిడే.

ఇఱ్రి

శబరి, శబరి, అదుగో పంపదగ్గిర పువ్వు లేరు తోంది. అవ్వా అవ్వా శబరీ, శబరీ, ఇలా రా, ఇలా రా. [అని గొంతెత్తి పిలుచును.]

శబరి

[పువ్వులు చేత్తో పట్టుకు ప్రవేశించి]

మాఅమ్మే, మాఅమ్మే, ఇఱ్రీ! విన్నా వమ్మా — శ్రీరాముడు వస్తున్నాడట, పాటలు నాకు నేర్పాలిసుమా, నీవు బాగా పాడాలి సుమా! లేకపోతే నాతండ్రికి శ్రీ రామమూర్తికి కోపం వస్తుంది.

[హనుమంతుని చూచి] నాయనా, ఇఱ్రికి శ్రీరామునిసంగ తంతా చెప్పాలి.

హనుమంతుడు

చెప్పుతున్నా నమ్మా! ఇఱ్రీ, నేనూ నీకు ఏవిధమైన సహాయం చేయవలసినా చేస్తాము.

శబరి

మానాయనే, మాఅమ్మే! మరవకం డమ్మా, శ్రీరామమూర్తిని మరవకండి. పంచ వటివస్తారుట, నాతండ్రి శ్రీరాములూ, నా తల్లిసీతమ్మానూ; విన్నావా ఇఱ్రీ?

ఇఱ్రి

[మాటాడకుండా శబరికేసి నిర్ఘాంతపోయి చూచును.]

శబరి

శ్రీరామచంద్రుడికి పాదములు నొస్తే వేమో నని బాటంతా పువ్వులు చల్లుతున్నా నాయనా, పువ్వులు.

హనుమంతుడు

నేనూ, ఇఱ్రీ ఆపని చేస్తాములే అమ్మా.

ఇఱ్రి

నే నవ్వో మంచిపువ్వులు తెస్తా.

శబరి

నాచిట్టితల్లి, నాచిట్టితల్లి. [ఇఱ్రిగడ్డం పట్టుకు వదలిపెట్టి] మరచిపో కమ్మా పాటలు. శ్రీ రామచంద్రుడిమీద పాటలు అన్నిపక్షుల చేతా పాడింతామమ్మా, పాడింతాము. ప్రకృ తిలో సౌందర్యం అంతా ఆమహాత్ముడికి ధార పోద్దాము. మరవకండి శ్రీరామమూర్తిని. హనుమంతుడూ, ఇఱ్రీ, మరవకండమ్మా! ఏమిటి నాయనా, ఏమిటి, నా ఇఱ్రీ, నువ్వూ తింటున్నారు?

హనుమంతుడు

తేనెపట్టు శబరీ!

శబరి

అయ్యో, నాయనా, ఎంతపని చేస్తున్నావు.

హనుమంతుడు

ఏ మమ్మా ఏమి?

శ బ రి

ఆలాంటిపనులు చేస్తే నా శ్రీరామచంద్రుడికి కోపం రాదూ?

ఇర్రి

ఏం పనులు శబరీ?

శ బ రి

హనుమా, ఇర్రీ! మీరు ఎప్పుడూ మరచిపోకండమ్మా. ఎప్పుడూ ప్రాణిహింస చెయ్యకండి. తేనెపట్టు తేవడంమూలాన తేనెటీగలు దుఃఖించి చచ్చిపోవూ?

ఇర్రి

[హనుమంతుకేసి చూచి నవ్వుతూ]నువ్వే!

హ ను మ ం తు డు

ఇకనుంచి హింస చెయ్యములే శబరీ.

శ బ రి

చెయ్యకండి నాకూనల్లారా, చెయ్యకండి. నారామచంద్రమూర్తి మనదగ్గిరికి రావద్దూ? మనని రక్షించవద్దూ ఆలాంటిపనులు చెయ్యకండి. విన లేదుటే, ఇర్రీ, తేనెటీగలు పాడుకునేపాటలు?

ఇర్రి

పాటా! నాకు చెప్పు శబరీ, పాట! నేను హనుమంతుడికి చెప్పతానులే.

శ బ రి

చెప్పతా తల్లీ, చెప్పతా విను. నారాముడికి కోపం రాకూడదు. అంచేత పాట జ్ఞాపకం చేసుకొంటూ ఇంకెప్పుడూ హింస చెయ్యకండి.

ఇర్రి

చెప్పు, చెప్పు, శబరీ, చెప్పు.

శ బ రి

* బుజ్, బుజ్, గామ్లెగూతా ఇ
తర్బాపోజ్ ఇజ్ తాఇపోజ్, ఎజ్జాపోజ్
బుజ్, బుజ్, గామ్లెగూతా ఇ
ఉడా-తార్ జా ఇజ్ తాఇపోజ్ ఎజ్జాపోజ్
బుజ్, బుజ్ గామ్లెగూతా ఇ
కెడ తార్ జా జ్ తా ఇపోజ్ ఎజ్జాపోజ్
బుజ్ బుజ్ గామ్లె గూతా ఇ
బుజ్ బుజ్, గామ్లె బె- బె- తార్తేనా ఇ
సూజ్- ఖోః రు సూజ్ తె నా ఇ- గామ్లె
బుజ్, బుజ్, గామ్లె బే- బె- తార్తేనా ఇ

---

* బుజ్ బుజ్ అంటూ ఝుంకరిస్తున్నా
పువ్వు ఏదైనా దొరుకునో లేదో, బుజ్...
మావిపువ్వైనా దొరుకునో లేదో, బుజ్...
మొగలిపువ్వైనా దొరుకునో లేదో, బుజ్...
బుజ్ బుజ్ అంటూ పూలు పీలుస్తాను
పీల్చి నా యింటిలో పోసుకొందామని
బుజ్ బుజ్ అంటూ పూలుపీలుస్తాను
పీల్చినా పిల్లలను పెద్దగా చేస్తా
బుజ్ బుజ్ అంటూ పూలు పీలుస్తాను
పెద్దగా పెరిగి అవి ఝుంకరిస్తాయి
బుజ్ బుజ్ అంటూ ఝుంకరిస్తు న్నా.

ఈసవరపాటా, దీని తెలుగుతర్జుమా శ్రీరావు సాహేబు గిడుగు రామమూర్తిపంతులు, బి. ఏ. గారు దయచేయించారు.

ఓన్ ఖాన్ జి మ్రరజ్ తాజి- గాల్మె
బుజ్ బుజ్, గాల్మె బె- బె- తార్తేనా ఇ
మరజ్ లేంజి అకిడి జ్ గూప తేజి గాల్మె
బుజ్, బుజ్, గాల్మె గూతా ఇ

విన్నావుటే ఇర్రీ, పాటా, విన్నావా హనుమా? ఎప్పుడూ జంతుహింస చెయ్యకండమ్మా నా రామచంద్రులవారికి కోపం వస్తుంది; మరిచి పోకండమ్మా, మనతండ్రిని ఎప్పుడూ మరిచి పోకండి. మనతండ్రేగా మన దగ్గిరికి వచ్చి మనను రక్షిస్తాడు. మరవకండమ్మా శ్రీరామ మూర్తిని. వెళ్లుతా, నాయనా, నాపావురాలు వచ్చేవేళయింది. మరవకండి శ్రీరామచంద్ర మూర్తి వారిని, ఏలాగు పూజించాలో ఆలోచించండి. శ్రీరాముల్ని మరవకండి అమ్మా!

[శబరి వెళ్లిపోవును.]

ఇర్రి

వెళ్లుదాము, రా, హనుమా. నేను శ్రీ రాములమీాద పాట చెప్పతాను నీకు. ఇంకెప్పుడూ నాకోసం తేనెపట్లు తేకుమా!

హ ను మం తు డు

తేనులే. నీవు వెళ్లు, ఇర్రీ! నేను సుగ్రీవుడి దగ్గిరికి వెళ్లాలి. శ్రీరామనామం నీవు జపిస్తూ ఉంటే నేను నీదగ్గిర ఉన్నట్టే నీకు తోస్తుంది.

ఇర్రి

అలాగే ఉంది, హనుమా! వెళ్లు, హనుమా, వెళ్లు.

హ ను మం తు డు

వెళ్లుతా ఇర్రీ. వెడతా, ఇంకోమారు పాటలు. ఏం!

[వెళ్లును.]

ఇర్రి

హనుమద్వారా శ్రీరామనామం నాకు దొరికింది; శ్రీరామనామముద్వారా హనుమంతుడు నా కెప్పుడూ ప్రత్యక్ష మవుతాడు.

మబ్బులో నవ్వేటి వా డెవ్వ డమ్మా
రాముడే రాముడే రాముడే నమ్మా
ఆకాశమంతవా డతె డెవ్వ డమ్మా
రాముడే రాముడే రాముడే నమ్మా
సూర్యమండల మధ్యవర్తి ఎవ రమ్మా
రాముడే రాముడే రాముడే నమ్మా
హనుమంతుహృదయాబ్జ మందెవ్వ రమ్మా
రాముడే రాముడే రాముడే నమ్మా.

[అని పాడుకొంటూ నిష్క్రమించును.]

[తెర]

---

వెడఁదయురఃస్థలంబుఁ, గురువిందనిభంబులు కన్నుఁగొల్కు, లు
బ్బెడుభుజమ్ముల్, పెనల్గొనుచు పీఁగెడు బాహులు, పట్టెదీరి బ
ల్మెడుతలతోడి ఫాలమును మున్సిరికడ్డియుఁ బోని వ్యక్తి యొ
క్కఁడు మరణించె ముప్పది కొకండొ మఱొండొ కొ అంతయా స్థితిన్.

పల్లె యదేమొ కాదు పురపాలకసంఘసురక్షితంబు పూ
ర్తిల్లజ(?) మర్థహీనుఁడొ వరాలపయి న్నడచు, న్నిశేషసం
పల్లసితు ల్సుమిత్రులు, స్వభావము సవ్యము, పుత్రవంతుఁ, డో
చెల్ల యకాలమృత్యు వెటు చెందెనొ చిత్రము వైద్యకోటికిన్.

ధనదునొద్ద నవనిధానము ల్గలవు, నా - కవియు రెట్టి యనెడునట్లు రెండు
తొమ్మిదులను జూపు తోరపుఁగర్ణముల్ - దీర్ఘకాలజీవి తెరువు గాదె.

ముడుత కిరువది యేం డ్లనఁబడెడు లెక్క - నొసలు దెల్పుచునుండెఁ గన్గొనఁగ నాల్గు
గావు పెక్కుండె నవి యెట్లు కల్లయయ్యె - ననుచు సాముద్రికుఁడు నోటి నట్టె తెఱచె.

ఒకనాఁ డున్నని యూర్చె, రెండవదినం బుండె న్నిరాహార మా
యొకనాఁడుం జన మానఁ డంగడికి వైద్యు ల్వచ్చి పేర్వెల్లఁకుల్
పెకలింపన్ గడువైన లేక యడపుం బెంపయ్యె లోతామ్మునం
బ్రకటం బింతయు, నెంత గావలయుఁ జావన్ దైవయోగంబునన్.

ఏమి కారణ మయ్యె నీ డింతలోన - నిరుగుపొరుగును నెఱుఁగని యిట్టిరీతి
మరణ మందె నటం చనుమానమునను - బల్కెఁ గధికృతుఁ డొకఁడు నప్పటనమున.

కాని కృతాంతుఁ డాపురుషుఁ గాంచి వచించెను చిత్రగుప్తసం
ధానముతోఁ గనుం డితని తత్త్వ మకాలమృతిం గనంగ నె
ట్లైను దృఢాంగుఁ డారయుఁడు వ్యాధియొ లేక మఱొక్కఁ డేదియో
కానఁగఁ గ్రొత్తరోగములు గల్గుచునున్నవి కాలవక్రతన్.

అనిన న్వారు బహుప్రకారముల నాయాత్మం బరీక్షింపఁగా
మును మర్త్యంబున నుండి వచ్చినఘనుల్ ముఖ్యాగదంకారు లా

ఘనవాఁక్ సేనుఁడు దొట్టి పల్వురను "డాక్ట ర్వండితే" త్యాది స
ద్వినుతోద్యద్విరుదాంకులం బిలిచి వేవే చెప్పి రాసంగలిఁ.

ఒక్కఁడు చేయి చూచె నొకఁ డూపిరితిత్తుల నొత్తి చూచె, నిం
కొక్కఁడు గుండె గొట్టుకొను, టొక్కఁడు నాడులు తొమ్మిదింటిలో
దక్కువ యెక్కువ ల్గనిమెఁ, దట్టిను వ్రేలిడి వ్రేలిపైని లో
డొక్కను నొక్కఁ బ్లీహమును డొంపులు గన్గొనె నొక్కఁ డిమ్మెయిఁ.

గాలిలో నెగిరినయట్లు కలగనియెనో-యేమొ యెపుడైన పీఁపున నేరు వుట్టె
నేమొ, వ్యత్యస్తముష్కుఁడో, కామచారి-యేమొ, పానప్రియుఁడో యంచు నెఱుఁగఁ
[దలఁచి.

*   *   *   *

ఏమిటికైన మంచిదియె యెల్లి యొనర్తము శస్త్రశోధనం
బేమియుఁ దోఁప దీగతిగ మృత్యువు చట్టున రాకకుం గతం
బేమయియుండునో తెలియ టొక్కపు డెవ్వరికేని మంచిదే
పో మఱి యంచు నల్వురను బూనిరి తత్క్రియ కేకచిత్తులై.

కోసి గుండెకాయకును గొంత వెనుకను - దాండ్రబెత్తువంటి గుండ్రనైన
యొక్కవస్తువుఁ గని "ఊఁ ఊఁ" యిదేమిటి - దొరకెనయ్య దొంగ దొరకె" ననుచు.

ఇంతటి పెద్దవస్తు వెటు లెక్కటి మ్రింగెనో యాత్మహత్యకై
యెంతటి దైన మ్రింగినను నిట్టులె యాకడఁ గూరుచుండునా!
త్రుంతమ, వల్దు, పైపటిమ రోసి యనంతర మట్లు చేయఁగా
నెంతయు లెస్స యందు మది నేమియుఁ దోఁపకయుండి యంతటన్.

గాజుబరణిలోన గాలి రాకుండఁగ - మూసి "దూర్బి"నులను బూని చూచి
యొకరివెన్క నొకరు నురక వెత్తెత్తఁగ - గాఢమగు పరీక్షఁ గడఁగి చేసి.

చేసిచేసి విసిగి సీయని వదలిరి - కొండ అట్లు గాదు కొంతదాఁకఁ
జూచి వదలవలయుఁ జూడనివింతలు - విడిచిపెట్టరాదు వికలబుద్ధి.

ఈపగిదిఁ గొండ అనికొని - రోపిక నొక్కొక్క రెత్తి యూరక యిటున
ట్టూపుచు నుండిరి కొందఱు-గోపాలాచార్యుఁ డంతఁ గుప్పియ యెత్తెన్.

ఎత్తి దానిమీఁద నేమి తోఁచెనో రెండు - నూనెబొట్లు వైచెను దనయంత
మట్టివాసనయును గొట్టను జేపట్టి - నలఁప నొక్కకొంత నలఁగజొచ్చె.

* * * * *

ఇది యొక మట్టిముద్ద యనినెం గవిరా జొకఁ డంతలోన ని
ట్టిది యెటువంటిచోట జనియించునో భూమితరంబు గట్టువా
రిది గద యావిచారణ వరించిన వారు వచింతు రంచు నొ
ప్పిదముగ వారిఁ బిల్చి వినిపించిరి సర్వముఁ జూపి రద్దియున్.

ఒక్కవృద్ధవేత్త యుర్విలో నాది నా-రాయణాఖ్యఁ బరఁగు నతఁడు పల్కె
గడియ మనెడు నొక్క గ్రామంబుచేరువఁ - గనులు వెట్టి త్రవ్వఁ గనుడు మనుచు.

ఇంతవట్టుఁ జెప్ప నెబ్బె యి దేమిటి - వృష్ఠతాడనమున నెట్లు పొడము
దంతభగ్నత యన దర్పితుఁ డొక్కఁడు - కాదు కూడ దనియె గర్వి యొకఁడు.

ఈతని కాఁపురం బెచట నేమిపనిం బొనరించు నెట్టిచో
నీతము నుండు నీతఁ డిది నేరుపుగా నడుగుండు దానిపైఁ
జూతము నా నొకండు చని సుద్దిసమస్తముఁ జెప్పుమన్న నా
ఖ్యాతచరిత్రుఁ డిట్లు ~~[illegible]~~ందొడఁగెం దనవాస్తవస్థితిన్.

పదిసంవత్సరము లొసంగితిని నేఁ బ్రాగ్దిక్పురశ్రేణిలో
నిదియా రాజనపట్టనంబునను డుంఠీరావుభోజ్యాలయం
బుదరిం జట్టలకొట్టు పెట్టుకొని యేప్రొద్దు న్నిశీథంబుదాఁ
క మకాణంబున నుండు నింతకును నెక్కార్యంబు లేదెప్పుడున్.

వచ్చి పదియేండ్లు నే నత్తవారియింటి - కంతకును మున్ను నొక చిన్న చెంతపల్లె
లోన నుండితి నెన్నఁడు గాని యెఱుఁగ× - జిజ్ఞనం బిది యనుచును జెప్పె నతఁడు.

ఆమాట ల్విని వైద్యశేఖరులు పర్యాలోచనాదీక్షతో
నామూలాగ్రము చూచుచుండ నొక బాల్యవ్యక్తి తచ్చర్య స్వే
చ్ఛామార్గంబున రాకపోకలను నిచ్చల్ దాఁ గనుంగొంచు నా
కేమంచుం జనువాఁ డిదేమి కథయో యిన్నాళ్లుగా సాగెడున్.

పోయి యడిగెద నేమే నపూర్వవృత్త - మగునో యని వారి ననివారితాంతరంగ
మున నటంచును దత్సభాముఖమునకును - నరిగ సర్వంబు వారన నాకళించి.

ఈనాఁ డొక్కటి నాకు మీరు గడువిం డే నింత యోజించెదన్
నేనైనన్ ఘనబుద్ధిశాలినని కానీ కాదు మీకంటె మీ
లోనా కెక్కుడిసాటి కొన్నిదినముల్ తూర్పిండియాసంఘస
మ్మానం బంది "రిసర్చి" చేసితిని దన్మార్గంబునం జూచెదన్ .

పిలువకుండ వచ్చి పీఁ డెవ్వఁ డనఁబోకుఁ - డాజ్ఞ యిందు దీని కనుచుఁ బలుక
నెంతమాట, యెవ్వ రెంతటివారలో - దీన బాధ యేమి తెలుపుమయ్య!

చూడు మప్ప నీవుఁ గూడ నీనాఁ డేల - రెండుమూఁడునాళ్ళపరిశ్రమంబు
చేయు మనిరి వారు. చేసెను బరిశోధ - కాగ్రసరుఁడు నేర్చినంతవట్టు.

*   *   *   *   *

ఏ నొకకొన్నినాళ్లు చని యీతని రాజనపట్టనంబులోఁ
బూని యొనర్చినాఁడఁ బరిపూర్వకశోధన నాగరప్రసం
ఖ్యానమువేళ రెండవది యయ్యె నటందురు "చెన్న" వెన్కఁ దా
నైన నగుం దగుం బురమునం దెటఁ జూచిన భోజ్యశాలలన్.

అతతిమార్గసంచయ నిరంతరసంచరదానసప్రజా
యాతరజఃపరంపరల సంధత వాటిలుఁ బౌరకోటికిం
జూత మనంగ లేద యొకచోటను నిశ్చలరథ్య సాగర
స్ఫీతతటంబ కాని యెట శీతలవాతము వీవ దెన్నఁడున్.

*   *   *   *   *   *   *   *

అది యేమీ కడువింత! యుండెఁగద వీథ్యాసేచనార్థాంబుపూ
రదివారాత్రసమగ్రసేవకము యంత్రస్ఫారమౌ బండి యే
లదుమారంబులు లేఁగు మార్గముల — వాల్లభ్యాగ్రగణీధిష్ణ్యభా
క్పదసంచారమె తీరు దానికిని జక్కంబడ్డ యన్నాళ్లలోన్.

ఎప్పుడు నేదియో యొకటి యిక్కడ నక్కడఁ బోయె నన్నటుల్
చెప్పుచు విప్ప మాంద్యగుణశీలుఁడు చోదకుఁ డింద్లు గాలుచు
న్నప్పుడుఁగూడఁ దేఁడు వినుఁడా! యొకమా టటు వచ్చి పోయెదన్
రప్పున మార్గమధ్యజనరాజి కతంబున విప్పకట్లతోన్.

*   *   *   *   *   *   *   *

రోగి గాఁడు గాని రోమముం జనరాదు - వీథికిఁ బూజ్యతకును విఘ్నకారి
యైన నాసికాంతరారోగ్య కేశాళి - తక్కువగుట వీని కొక్కకొఱఁత.

కడియపు కంకరవీథుల - పాడుగునఁ బఱచెదరు దానఁ బొడమెడు ధూళుల్
తడుపని కారణమున నెగ - సెడుఁ గెంజాయలను నింగి క్షితియు న్నిండన్.




గుమ్మములుఁ దిన్నెలును వెల్లగోడ లిండ్లు - నిప్పు నీరును నెత్తియు నేల యిప్పు
డిపుడు వెడలెడు పౌరుల యెడమకాలి - మీఁద జీరాడు గోఁచుల మీఁతె నెఱుపు.

వానగురిసిన నెత్తురువఱదవలెనె - యుండు వీథులు బురదతో నుండి మాంస
మిశ్రరణభూమి యననొప్పు మేదినీత - లంబు రాదారు లానగరంబులోన.

*        *        *        *        *        *        *        *

బళిరా బుద్ధిమదగ్రణీ, తెలిసె నీవ్యాఖ్యానమూలంబునం
దెలవార్జామునఁ బట్టి రాత్రివఱకున్ దీక్షించి మీయంగడి
న్నిలువన్ నీవనినట్లు ముక్కరముల న్నిండారెఁ బెందూళి లో
పలకుం జొచ్చి ఘనీభవించె నిటు చంప న్నెత్తురూపంబునన్.

అనుచు వారువారు నందఱు యమరాజు - కడకుఁ బోయి యిట్టి కారణం బ
టంచుఁ జెప్ప వింత నంది యెక్కింపుఁడీ - పద్దులోనఁ గ్రొత్తవ్యాధి యనియె.

స్వప్నలబ్ధచర్య జాగ్రదవస్థలో - నెఱుకవడినయంత యీవిధమునఁ
గూర్చినాఁడ దీనఁ గొన్ని యసందర్భ - ములునుగలవు నింద చలుపకుండి.

---

# సాగర సంగం

శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

"కాటంరాజు మామా!"

"సోమాలూ ?"

"అవును మామా! ఏం చేస్తున్నావూ ?"

"పావిడి తుడుస్తున్నాను. ఇలా వచ్చావేం ?"

"కాపుగారు శీతపుగింజలు కొలుస్తా మన్నారు. నేనూ వస్తా నందు మామా!"

"ఇది యింతట్లో కాదు. గాడి దిగితే యీవేళకి మళ్లీ యెక్కరు కాపుగారు."

"ఇవాళ కాకపోతే రేపిస్తారు. ఇంటో రెండు కుంచాల నూక లున్నాయిలే. వస్తాను మామా!"

"వుంటే మాత్రం పోనిచ్చుకోవడం యెందుకూ?"

"ఎక్కడికి పోతాయీ ?"

"నువ్విక్కడ యిలాగ పొద్దు గడిపేస్తే మీ బాబు తిట్టడూ?"

"మా బాబు నలా అనకు మామా! వస్తున్నాను. 'ఊ' అను మరి."

"నీ కెందుకు సోమాలూ యీ కష్టం ?"

"కష్టం యేమిటి కష్టం? కాకపోయినా మన లాంటి వాళ్లకి కష్టపడక తప్పుతుందా? రమ్మను మామా!"

"మీ బాబుకి మంతకి పా డెక్కి పోదూ ?"

"మాలచ్చయ్యతాత కిచ్చే వచ్చాను."

"..............."

"ఏం? వచ్చేస్తున్నాను. ఊ! ఎంతసేపటికీ రమ్మనకపోతే యేమనుకున్నావు మరి? నువ్వొక్కడవే కష్టపడుతూ వుంటే నేను చూడలేను మామా!"

"దయ వుండి కనక, క్షణంలో అయిపోయేదానికి నువ్వుకూడా చెయ్యి చేసుకోవడం యెందుకని గాని నువ్వంటే యిష్టం లేకా సోమాలూ?"

"ఇష్ట మన్న యిష్టమా? నా మీద నీ కిష్టమే లేకపోతే నేను బతగ్గలనా? ఆవేళ నువ్వు వెలగపండు కోసిపెట్టావు. ఎంత కష్టపడ్డావో అంత చిటాచిగురు కెళ్లడానికి. వుడత లాగ నువ్వు వురక వేసుకుంటూ పైకి పోతూ వుండగా నా రాజా! నా మనస్సు యేలా పొంగిపోయిందో యేం చెప్పను మామా? ... ఎవళ్లూ యెక్కలేకే దాన్ని విడిచిపెట్టేశారు. ఈ వూళ్లో నీతో సమానంగా యెవ డెక్కగలడు మామా చెట్లూ ?"

"లక్షమంది వున్నారు నా నొష్టనే పొడిచిందా పొద్దు? కాని సోమాలూ! పండు చేతిలో పెట్టాటప్పటికి నీ మొగమ్మీద మెరిసిపోయిందే సంతోషం? అది చూశాటప్పటికి నా రంగా! వొళ్లు తెలవలేదు నాకు."

"నేను చెప్పుకోవడం కాదు మామోయి! నా కోరిక తీర్చినందుకు నీ కాళ్లకాడ పడి చచ్చిపోవా లని తోచింది నాకు. బతికుండగా నీ ఋణం తీర్చుకోగలనా కాటంరాజూ ?"

"ఋణమా? నీ దయ వుంటే నా కదే చాలు. ఆశే లేం? గపితి వుందా? చెరుకుతోట కాడ నువ్వు కనపడకపోయినా, కనపడి పలకరించకపోయినా నే నీపాటి రంకంలోనో, మోళ్లేనులోనో వుండు నుకూరు మంటూనూ. నువ్వు 'యెక్కడికి మామా?' అనేటప్పటికి నాకు నవుం లటుక్కు మనిపోయింది."

"నువ్వు చెప్పేదాకా బరమా వెళ్లడానికి బయలు దేరా నని నాకు తెలవనే తెలవదు. నువ్వావేళ వెళ్లే వుంటే నే నిప్పటిదాకా బతికి—ఏ నుయ్యో, ఏ గొయ్యో—మామోయి! ఇం కెప్పుడూ అలాంటి తలంపు చెయ్యకు సుమా."

"ఇంకానా? ఇక యెవ రేనా గెంటినా—తోసేసినా వెళ్లగలనా? కానీ సోమాలూ! పెద్ద గండ రగోళం వుడుతుంది."

"అందులో పడ్డవాళ్లు అందులోనే మగ్గిపోతారు చివరికి. మన కేం?"

"కాని వాళ్లే కెందుకూ మన గొడవలూ?"

"పూసిపోవద్దూ?"

ఇలాగ కబుర్లు చెప్పుకుంటూ కాటన్నా, సోమాలూ పేర్రెడ్డి పశువుల సాల బాగు చేస్తున్నారు. పాపం కాటన్న పని చేస్తూ వుంటే సోమాలు చూసి "నా కే" మని వూరుకోలేకపోయింది. "నేను సాయం చేస్తా" నంది." "ఏ మంటా" నంది. "రమ్మని పిలవ" మంది. "ఇక వుండలే" నంది. అయితే సోమాలు పని చెయ్యడం కాటన్న కిష్టం లేకపోయింది. వద్దంటే ఆమె మనస్సు చివుక్కు మంటుంది. రమ్మనడానికి తనకి నోరు రాదు. మాట మళ్లించా లని చూశాడు; గాని లాభం లేకపోయింది. గంప అక్కడ పడేసి సోమాలు గభీ మని పనిలో వురికింది.

తరవాత యిద్దరూ పారవశ్యం కలిగించే పూర్వ ప్రసంగా లేవో చెప్పుకుంటూ శ్రమ ఎరక్కుండా పని చేస్తున్నారు.

౨

సరిగా యిలాంటప్పుడు పేర్రెడ్డి భార్య రంగమ్మ యాదాలాభంగా అక్కడికి వచ్చింది. ఆయిద్దర్నీ చూశా టప్పటి కామెకి ముచ్చ టయింది. ఆనందం మొగ మంతా కమ్మేసింది. ముప్పయి సంవత్సరాల యువతి. సుఖమయకల్పనలు అతిజటిలంగా పుట్టే వయస్సు. పైగా, రంగమ్మ విలాసవతి; ప్రణయవతి. కా నైతే వాళ్ల యిద్దరి మధ్యా అతిగభీర మైన అగడ్త వొకటి వుండడం నిజమే. అయినా పదిహే నేళ్ల పిల్లా, ఇరవై యేళ్ల పిల్లాడూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ—రంగమ్మ తా నేదో పరమరహస్య మైన వొక సంగతి గ్రహించేశా ననుకుంది. "తొందరపడి యెదటికి వచ్చా" నని కించపడింది. అయినా వూరుకునే స్వభావంకా దామెది.

"నువ్వు కూడా తుడుస్తున్నా వెందుకే?"

"తుడవకూడ దండీ రంగయ్యమ్మగారూ?"

"నువ్వు సాయం చెయ్య మన్నావా యేమి టిరా?"

"కాపుగారు గాది యెక్కేరా అమ్మగారూ?"

రంగమ్మకి మాపైన జవాబుకి బదులు లౌక్యం యెదు రైంది; కాని దానికంటే యిదే నయం. జవా బైతే డొంకల్లోకి యీడ్చుకుపోయి వుండును. ఇప్పుడు తన సందేహానికి బలకర మైన సన్నివేశం చూచాయగా కనపడింది. ఏదో లేకపోతే యీ లౌక్య మెందుకూ?

"పెళ్లి మాట లాడుకుంటున్నారా యేమిటే పిల్లా?"

"కాటన్న మాలా, నేను మాదిగ పిల్లనిని; ఎలా గండి రంగయ్యమ్మగారూ?"

"మా బాబుకి తెలిస్తే నన్ను చీరేస్తాడు. అసు మంటి మాట లనకం డమ్మగారూ."

"పోనీ దాని బాబుకి ఇష్ట మేనా?"

"పెద్ద కులం అయితే మాత్రం మా బాబు వొప్పు కుంటాడా రంగయ్యమ్మగారూ?"

"ఏమా మాట చెబుదురూ వేషాలకి పోకా."

దీనికి సమాధానం తోచక కాటన్నా, సోమాలూ మొగమొగాలు చూసుకుంటూ వుండగా పేర్రెడ్డి పిలుపు మీద పిలుపు చొప్పున నాలు గైదు మాట్లు పిలవడంచేత యిష్టం లేకపోయినా విధి లేక, సిద్ధమైన ఫలాన్ని బోర్ల తోసుకున్న దానిలాగ రంగమ్మ కాళ్లీడ్చుకుంటూ చక్కాపోయింది.

ఆమె వెళ్లిపోయాక సోమాలూ, కాటన్నా వొక్కమాటు ఫక్కున నవ్వుకున్నారు; కాని వెంటనే వారి మొగాలమీద అనంతగాంభీర్యం అలుముకుంది.

3

"నీ కూతురి కింకా పెళ్లి చెయ్యవుటరా గంగడూ?"

"చెయ్యకపోతే యెలా గం డమ్మగారూ?"

"మ రెప్పుడు చేస్తావూ?"

"ఏమీ తోచడం లేదండమ్మగారూ! నా బతుకు నట్టడివి అయిపోయింది కదాండి. పోతూ పోతూ యెంకిపిల్ల నా గొంతు కోసేసిందండి. మా సోమ లింత కాఢి పోస్తోంది కనక రోజులు దొర్లిపోతున్నాయి. యీ నాలు గేళ్లనుంచీ నే నేడవని రోజు లేదండమ్మా! సోమాలికి ఎప్పుడో వోకప్పుడు పెళ్లి చెయ్యక తప్పదు. చేస్తే మొగుడు మొన్నాడే తీసుకు పోతాడు. నాకు గంజినీళ్లకోసం బెంగ లేదు కానండి—ఏలినోరి గుమ్మం కనిపెట్టుకుంటే — నా కింత కావాలండి రంగయ్యమ్మగారూ? తమ రింత గంజి పోస్తూ వుంటే నా కిదే చాలు. ఇక కూలీ అక్కర్లేదు, నాలీ అక్కర్లేదూ. కానండి రంగయ్యమ్మగారూ! నా బిడ్డ మాటే నండి. నేను చెప్పుకోవడం కాదు కానండి—మహా నాజూకైన పిల్లండి. మాట పడదు. ఎంత పని చెప్పినా కష్టమని చూడదు. దానికి తగిన మొగుడు దొరుకుతాడో దొరకడో. వచ్చిన వాడు దాన్ని నిబ్బరంగా చూస్తాడో చూడడో. తల్లి లేని పిల్ల. దాని రోజు లెలా వెడతాయో తోచడం లేదండి. మొగాణ్ణి నే నేం చూడగల నండీ అమ్మగారూ?"

"వోసేయి! అది లోకంతోపాటిది కాదు. దాని మాట పుచ్చుకోకుండా యెవణ్ణీ నిరుకు చెయ్యకు సుమా. నీవు చేత కాకపోతే నేను చూస్తాను తగినవాణ్ణి. మా గుమ్మంలోనే పందిరి వేయించి చేయిస్తాను దానికి పెళ్లి. పెళ్లికొడుకుని నువ్వు సొంతంగా చూసినా నాతో చెప్పకుండా మాట ఇవ్వకు."

"చిత్త మండి, చిత్త మండి. తమ కింత దయ వుంటే—"

"మాదూ గంగడూ! తీరుపాటయితే దాన్ని మా యింటి కెప్పు డేనా పస్తూ వుండ మనరా."

"ఇంత కంటేనా రంగయ్యమ్మగారూ? తప్ప కుండా పంపుతా నండి. అది యింక పనికే వెళ్లదండి. ఆ పనీ, యీ పనీ చూసుకుంటూ యేలినవారి పాదాల దగ్గిరే పడి వుంటుం దండి."

"తప్పకుండా పంపాలి సుమా!"

"చిత్త మండి."

"మరిచిపోకు."

"చిత్తం. మరి సెల వియ్యండి పొలం పోతాను."

"వెళ్లి రా."

గంగన్న వెళ్లిపోయాక "ఇదేలా సాగుతుందీ?... చేసి తీరాలి" అనుకుంటూ రంగమ్మ యింటోకి చక్కాపోయింది.

## ౪

గంగన్న పుల్లిట్లోకి వెళ్లేటప్పటికి సోమాలు నార్లంకపంపులో కోతిపిర్రల మామిడికింద చితుకు లేరుతోంది. కాటన్న చెట్టుమీద వుండి యెండిపోయిన కొమ్మలు విరిచి కింద పడేస్తున్నాడు. ఇద్దరూ అచ్చటా ముచ్చటా చెప్పుకుంటూ ఆనంద తరంగాలమీద వూగిపోతున్నారు.

బోదిగ గట్టెక్కేటప్పటికి గంగన్నకి ముందు సోమాలు కనపడింది. అనాసమడి తిరగవేసుకొని వెళ్లేటప్పటికి కాటన్న కిందికి వురికేడు. గంగన్నని చూసి వాళ్లిద్దరూ కూడా వులిక్కిపడ్డారు; కాని కాటన్న వెంటనే సమాళించుకొని "ఏం మామా? ఎందాకా?" అని అడిగాడు. సోమాలు మాత్రం మాట్లాడ లేకపోయింది.

"ఈ చితుకు లన్నీ నువ్వు—"

"ఏం కష్టం?"

"అది కాదు కాటంరాజూ! నువ్వు విరిచినవి మా యింటికి—"

"అ దేమన్న మాటా? మా అమ్మ పొద్దున్న మూడుగంపల తాటి టెంకలు పట్టుకు వెళ్లింది. నిన్న సందాల మాబాబు రెండుకావిళ్ల తాటికమ్మలు మోసుకు వెళ్లాడు. ఇంకా నేనుకూడా పట్టుకు వెళ్లాలా?"

"నువ్వు మంచివాడవు. వారందినాలు ఎలా తగుల పెట్టినా—ఏం అమ్మీ?"

"ఔను బాబూ! వారందినాలు బెంగ వుండదు. కాటంరాజుని తలుచుకుంటూ సుఖంగా మాచో వచ్చు."

"అలా వుండాలి విశ్వాసం. చేసిన మే లెప్పుడూ మరిచిపోగూడదు. కాటంరాజూ! నీసంగతి నాకు బాగా నచ్చింది. చేసుకున్న పెళ్లాన్ని మంబాగా సుఖపెడ తావు నువ్వు. చూస్తున్నాను కామా పేర్రెడ్డి కాపుగారి కమతంలోకి వచ్చినప్పట్నుంచీనీ? కాపుగారికి నీమీద చాలా చాలా దయ."

"కాపుగారు చాలా మంచివారు మామా!"

"మంచన్న మంచా? నలభైయేళ్ళనుంచి వారి సుమ్మం కనిపెట్టుకుని వున్నాను నేను. రంగారెడ్డి కాపుగా రున్నప్పుడు నా కేమీ లోటు జరగలేదు; కాని ఆ మారాజుకంటే పేర్రెడ్డికాపు ఎంతో మంచివారు. రెడ్డిగా రంటే ధర్మరా జనుకోవేం."

"అవు నవును."

"రంగయ్యమ్మగారు ఆమారాజుకి తగిన భార్య. ఆయమ్మకి చేతు లెత్తి మొక్కితే యెక్కడికి పోయినా కూడు పుడుతుంది."

"ఈ రైక నాకు రంగయ్యమ్మగారే యిచ్చారు. వెలా పదేను రోజుల కిందట కుట్టించుకున్నారట. రూపాయి మూడు పావలా లయిందిట. 'తొడుక్కోవే పిల్లా' అంటూ మీద పడేశారు మొన్న."

"మాడమ్మా! నీకూ నాకూ ఆయమ్మే దిక్కు. ఆయమ్మని కొలుచుకుంటూ వుండు."

"అలాగే బాబూ."

ఇలాగ ఇంకా స్త నేపు మాట్లాడి గంగన్న బాడవలోకి వెళ్లిపోయాడు. పెద్ద ఆపద తప్పించుకున్నట్లు సోమాలూ కాటన్నా వొకరికేసి వొకరు చూసి పెద్ద నిట్టూర్పు విడిచారు.

తరువాత యిద్దరూ చితుకు లన్నీ తెచ్చి గంపలో పోసి కట్టారు. కాటన్న సాయం చెయ్యగా గంప యెత్తుకుని కళ్లు చేర దేసి చేసుకొని వొక్కమాటు కాటన్నని నిలువునా చూసి, "వెళ్లిపోతాను మామా!" అంటూ సోమాలు బయలుదేరింది. కాటన్న మాట్లాడలేక అలాగే నుంచోగా అంత బరు వెత్తుకునీ కూడా పది బారల కొకమాటు నిలుస్తూ, మలుపుదాటేదాకా వెనక్కి తిరిగి తిరిగి చూస్తూ చివరికి సోమాలు ఏదో వస్తువు పోగొట్టుకున్నట్లు దిక్కు మొగంతో వెళ్లిపోయింది.

౫

మాల మాదిగల కందరికీ సోమాలు దర్శనం కరువైపోయింది. ఆమె కాకులు కూశాటప్పుడు విడిచిన గుడిసెకి రాత్రి పది దాటితే గాని చేరుకోవడం లేదు. తండ్రికి రాత్రంతా పొలం పని వున్నప్పుడామె గుడిసెకే వెళ్లడం మానేసింది. వెడితే అక్కడ ఆమె వొక్కత్తే పడుకోవడమే కామా? రెడ్డిగారి గాదుల సావట్లో పడుకుంటే వంట ముసలమ్మ యించక్కటి కథలు చెప్పి నవ్విస్తుంది. తొరగా పెళ్లాడ మనీ, మొగుణ్ణి యెలా సుఖపెట్టాలో, యెలా లోపు చేసుకోవాలో—ఇలాంటి వన్నీ చెప్పి పూరిస్తుంది. తెల్లవారితే రంగమ్మ యిక క్షణం విడిచిపెట్టదు. తండ్రి యింటికి రావడానికి వీ ల్లేనప్పుడు ముంత పట్టుకు వెళ్లడం తప్ప సోమాలికి బైట పనే లేదు.

సోమాలు వేషం పూర్తిగా మారిపోయింది. వారానికో తలగడుగు. ప్రతీ రోజూనా తల దువ్వుకోవడం. రంగమ్మ కొంచెం నలిగిన చీర లన్నీ దాని కిచ్చేసింది. రంగమ్మే పట్టు పట్టి అందెలూ, కడియాలూ చెరిపించి ప్రత్యేకంగా కడియాలు చేయించింది. చేతుల నిండా గోకరజాజా గాజులు; చెవులికి యెర్రపాళ్ల దుద్దులు; ముక్కులికి "అత్తు"లికి బదులు ముక్కుపుడకలు. మొత్తానికి మునుపు గాజు రాయిలాగ వుండిన సోమాలిప్పుడు పట్టెలు తీర్చిన నీలం లాగ నిగనిగ లాడుతూ మెరిసిపోతోంది. కాటన్న సోమాలిని మొదటి రోజున హాశాత్తుగా చూసి రెడ్డిగారిచుట్టం అనుకున్నాడు.

కాటన్న మునుపు పొలంపని నింపాదిగా చేసుకుని, నిదానంగా పాటలు పాడుకుంటూ వచ్చేవాడు.

ఇప్పుడు పొలంలో పని క్షణాలమీద అయిపోతోంది. పాటలూ, పద్యాలూ మూడో కాలంలో మెలికలు తిరిగి పోతున్నాయి. మునపటి గూడ్సుబండి నడక యిప్పుడు మేల్గాడీ పరుగై పోయింది. ఏమంటే, రెడ్డిగారి యింటికి తొరగా వచ్చేస్తే సోమాలి నింకో మాపు యెక్కువ చూసుకోవచ్చు.

పోకవాడు అప్పుడే భోంచేసి వచ్చి బల్లమీద కూచుంటూ రెడ్డి చుట్ట అంటించాడు. కాటన్న యెదట నుంచుని కొత్తగా వచ్చిన సరెడ్లని గురించి ఏమిటో చెబుతున్నాడు. సరిగా ఆసమయంలోనే వచ్చి సోమాలు చిన్న పాలికాపు కేదో పురమాయిస్తోంది. ఆమెని చూశాటప్పటికి కేం తోచిందో యేమిటో, పెద్రెడ్డి కాటన్నతో, "వోరేయి! సోమాలు పెళ్లికూతురులాగ వుందిరా. నువ్వింకా గోచీగుడ్డతో ఘోటకబ్రహ్మచారి లాగే వున్నావు" అన్నాడు. అప్పుడే వాకట్లో అడుగు పెడుతూ వున్న రంగమ్మ అదివిని, "సోమాలు పెళ్లికూతురులా వుంటే మీరు కాటణ్ణి పెళ్లికొడుకుని చెయ్యం"డంది. దానిమీద రెడ్డి "అవునా?" అని అడగ్గా కాటన్న "యెప్పటికేనా నాకు పెళ్లి చేసే పూచీ యేలినవారిదే" అన్నాడు. అందుకు రంగమ్మ "సోమాలికి పెళ్లికొడుకుని చూడవలసిన భారం నామీదా, కాటడికి పెళ్లికూతుర్ని తేవడం పూచీ మీ మీదా పడిందండోయి" అంటూ నవ్వింది. "అయితే యిక ఆలోచన యెందుకూ! సోమాలిని పెళ్లాడతావుటరా మరి?" అని రెడ్డి అడిగాడు.

ఆమాట వినేటప్పటికి కాటన్న హృదయం గుబగుబలాడిపోయింది. సోమాలి గుండెలు దుడుకూ దుడుకూ కొట్టుకున్నాయి. సోమాలు కాటన్న కేసి చూసింది. కాటన్న సోమాలి కేసి చూశాడు. ఆ రెండు చూపులూ కలిశాటప్పటికి వాక లంతా మెరుపు మెరిసినట్లయి పోయింది. రెడ్డిదంపతుల కళ్లు మిరుమిట్లు గొన్నాయి.

సోమాలు, ఎక్కడ లేని సిగ్గు వచ్చి, గోడచాటుకి పోయి, "నువ్వు పొలం వెళ్లిపో" అన్నట్లు తల వూపింది; కాని కాటన్న కదలలేదు. రెడ్డి తెచ్చిన ప్రస్తావనవల్ల కాటన్నకి గొప్పరాజ్యం వచ్చినట్లుంది. ఇంకా యెదటే వుంటే రెడ్డి యింకా యెలాంటిమాట లంటాడో? అసలు ధోరణి ఇలా మార్చేసిన రంగమ్మ చివరి కెలా తేలుస్తుందో?

ఇదేమిటో చూస్తే కాని కాటన్న అక్కణ్ణుంచి కదల తలుచుకో లేదు. అయితే యింతట్లో గంగన్న వచ్చి కాటన్నని పొలం తీసుకు చక్కాపోయాడు. చేసేది లేక కాటన్న కాళ్లీడ్చుకుంటూ వెళ్లాడు.

"అల్లుడూ, మామగారూను."

"నిజమే అంటావా ?"

"బాగానే వుంది. ఇంకా బోధపడ లేదుటండీ?"

"బోధపడింది; కాని అంత పని జరుగుతుందా?"

"మీరు కలగ చేసుకుంటే పెళ్లి. లేకపోతే స్వయంవరం."

"అబ్బా!"

"పున్నమి వెడితే కాటడు రంగం దూకేస్తాడు."

"సోమాలు ?"

"వాణ్ణి కదిపేదే అదీ."

"అయితే యిక చూస్తూ వుండు."

ఇలా చెబుతూ రెడ్డి పొలం వెళ్లిపోయాడు. ఆవేళ అస్తమానూ అతనికి ఇదే ఆలోచన.

## ౬

ఇక్కడ యిది యిలా వుండగా అక్కడ మాలపల్లిలో కొంప లంటుకున్నాయి. "కాటన్న పనేమీ బాగా లేదంటోయి వరిసీములూ" అంటూ, మూడు కాళ్ల ముసలి సోమన్న వచ్చి నిప్పు రాజేశాడు. తరవాత చంద్రన్న వచ్చి "మీవాడు కులం చెడ్డాడన్న మాటే" అంటూ ఆనిప్పు వూదాడు. నిలవతీసి అడగ్గా, "మీవాడు సోమా లిచ్చిన నీళ్లు తాగా డంటోయి" అని బుచ్చన్న చెప్పాడు. "మొన్న చద్దికూట్లో సోమా లిచ్చిన చింతచిగురు పచ్చడి నంజుకున్నా డంట కాటన్న" అని సీతన్న చెప్పాడు. "మీవాడికి సోమాలు

ముంత అందిస్తూ వుండగా కావామంది మాశా రంట కాపులు" అని పోతురాజు ఝాడించి చెప్పగా, "ఇక కులమా ? కొడుకా ?" అంటూ టకాయించి అడిగి సోమన్న చక్కాపోయాడు.

నరిసీములికి కొండ విరిగి మీద పడ్డట్టయింది. ఒక్క కొడుకు. గారాబ్బ కూచి. తనకి ముసలితనం అలుముకుంది. అన్నిటికీ యిక కాటన్న రెక్కలే ఆధారం. తిండి మాట కేం? ఆవొక్క కొడుకూ తన నింత బూడిద చేస్తాడా చెయ్యడా?

అతనికి వెన్నెట్లోనించి చీకట్లో పడ్డట్టయిపోయింది. కులం అయితే యెలాంటి పిల్లయినా సమాధాన పడవచ్చు. పెద్ద కులం అయితే పేచీలు వచ్చినా కులం చెడను. ఇదేమిటి యిది? ఎటు మాసినా సర్వనాశమే. కూడు లేకపోయినా బతకవచ్చు; గాని కులం లేకపోతే యెలాగా?

నరిసీములు యిలా కుమిలిపోతూ వుండగా నీళ్ల కడవ పట్టుకొని పోలమ్మ వచ్చింది. పెనిమిటి మొగం మాశాటప్పటి కామె కేదో భయం కలిగింది; కాని అనుగలేకపోయింది. పోలమ్మని మాశాటప్పటికి నరిసీములికి కళ్లు నీళ్లు కమ్మాయి. అది చూసి పోలమ్మ యిక నంచోలేక, కడవ అక్కడే దింపేసి, పెనిమిటి దగ్గర కూచుని, "ఏం? యెందుకూ? యేం వచ్చిందీ?" అని అడిగింది. ఒకటి రెండు నిమిషాల పాటు నరిసీములికి మాట తిరిగింది కాదు. ఆస్థితి చూసి పోలమ్మ దుఃఖిస్తూ మీద వాలగా బ్రహ్మాండంమీద నరిసీములు జరిగిం దంతా చెప్పాడు.

"ఏమిటీ" అంటూ పోలమ్మ వులికిపడింది.

- "ఏమవకు, ఇది నిరుకా? కిట్టనివాళ్లు కల్పించి వుంటారు."

"నిరుకైతే యేమిటి చెయ్యడం?"

"కాటన్న నాదగ్గిర ఏమీ దాచడు. అడుగుదాం."

"నిజమే చెబుతా డనుకో. నిరుకైతే? కులం మాట చెప్పు. 'కులమా ? కొడుకా ?' అని అడిగాడు చింతన్న గారి సోమన్న."

"ఇటు మాలలకీ, అటు మాదిగలకీ కూడా దూరమైపోతాం" అని నరసీములు దీనంగా అన్నాడు.

"అందుకోసం వాళ్ళ నిద్దరినీ విడదీస్తే పాపం కాదూ?" అని పోలమ్మ అడిగింది.

నరిసీములు మాట్లాడలేకపోయాడు. ప్రేమోపాసన అతని మనస్సుని మృదువుపరిచి వుంది. అయినా అశ్చైర్యం పోలేదు. ఇది కనిపెట్టి పోలమ్మ "యిక్కడ కాదు" అంటూ అతగాణ్ణి గుడిసెలోకి తీసుకుపోయింది.

౭

పోలమ్మా, నరిసీములూ కూడా దీన్ని గురించి చాలా రహస్యంగానే ఆలోచనలు చేశారు. కాని యిది

పూర్వస్మృతి నరిసీముల్ని గుంజేసి విడిచిపెట్టింది. బొబ్బిలికథ పాడడంలో నరిసీములికి వున్న నేర్పుచూసి పోలమ్మ, చేస్తూ చేస్తూ వున్న పండు వంటి కాపరం విడిచిపెట్టి నరిసీములుమీద వాలింది. నిక్షేపం లాంటి మూడు యకరాల భూమి ప్రేమ యెదుట ఆమెకి గడ్డి పరక లాగ కనపడింది. తండ్రి గదిమాడు; అన్నదమ్ములు పాడిచేస్తా మన్నారు. వదినలూ, మరదళ్లూ దెప్పిపొడిచారు. తల్లి గొల్లున గోలపెట్టింది. మొగుడు ఛార్జి యివ్వడానికి సిద్ధపడ్డాడు; కాని పోలమ్మ విన లేదు. జంకనూ లేదు. నరిసీములు అప్పుడు విజయగర్వాన్ని చూపించాడు. అయితే అది కులంలో కులం కనక సరిపోయింది. ఇప్పుడు?

"కొడుకే అని చెప్పలేకపోయావా?"

"అయితే ముందు దారి?"

"కులం కూడు పెడుతుందా? వొక్క కొడుకు. మాట తీసెయ్యడం యెరగడు. రాచకొమారుడులాగ వుంటాడు. మొగం చూస్తేనే కడుపు నిండిపోతుంది."

"అంచేతనే పోమాలం కన్నేసింది."

"అబ్బరమా? నే నెయ్యలేదూ నీ మీదా? యకరం భూమి అమ్మగారికీ, యేదుం భూమి అక్కడిదీ వొదులుకో లేదూ నీ కోసం? కోరుకున్న పెనిమిటి దొరికితే కుల మెందుకూ? కూ డెందుకూ?"

మాలపల్లీ, మాదిగపల్లీ కూడా పాకిపోయింది. ఎక్కడ చూసినా యిదే గొడవ. చివరికి మాలపెద్దలు వరిసీ మళ్ళీ అడిగినట్లే మాదిగపెద్దలు "ఏం చెబుతావోయి దీనికి?" అని గంగన్నని నిలవదీసి అడిగారు.

గంగన్న వులిక్కిపడ్డాడు. ఇప్పటికింకా అతగాడు తన కూతురు చిన్నపిల్లే ననుకుంటున్నాడు; గాని ఆమె ప్రణయాభిరాలస అయివుందని గ్రహించలేదు. మొదట్నుంచీ గంగన్నకి ఏడుకొండలవాడిమీద వున్నంత ధ్యానమూ, దృష్టీ మరి దేనిమీదా లేదు. పెళ్ళాం బతికి వున్నప్పుడు అతను సంసారం కేసే చూడలేదు. కూలో, నాలో తీసుకువచ్చి చేతిలో పొయ్యడమూ, ఆమె భోజనం చెయ్యమంటే చెయ్యడమూ, కాపుగారి పని మితి యెరక్కుండా చెయ్యడమూ, హాయిగా పడుకోడం,—ఒక్క నిద్రపోయేటప్పుడు తప్ప తక్కిన అన్ని సమయాలలోనూ వెంకన్నబాబుని తలుచుకోడం, పాడుకోడం—ఇంతికంటే అతను మరోపని యెరగడు. అంచేత అతను జరుగుతూ వున్న సంగతులేమీ గ్రహించలేదు. పైగా రెండుమాసాల కిందట దగ్గరిచుట్టం వొకడు వచ్చి తన కొడుక్కి సోమాలి నిమ్మని అడగ్గా, "చిన్నపిల్ల. దానికిప్పుడే యేం పెళ్ళి బావా?" అని కూడా అని వున్నాడు. అలాంటివాడు ఇలాంటి ముదలకింపు విని వులిక్కిపడడంలో ఆశ్చర్యం యేం వుంది?

మునుపటి లాగే అత నిప్పుడు కూడా కులపెద్దలతో "చిన్నపిల్ల. దానికేం తెలుస్తుంది? మీరు చెప్పేదు మాటలు విన్నారు" అన్నాడు; కాని వాళ్ళు అంతటితో విడిచిపెట్టలేదు. ఆ పెద్దలికి కులంమీద వుండే అభిమానం కంటే సోమాలిమీద అసూయ హెచ్చయి పోయింది. ఉప్పు లేకుండానే ముప్పందుం రకంలో చేరిన కుల పెద్దలు భీష్మించారంటే ఆశ్చర్యం యెందుకూ?

ఆడాళ్ళయితే యేమి, మొగాళ్ళయితే యేమి, యిరవై మంది దాకా గంగన్నని ముట్టడించారు. రెండు గంటల సేపు తర్జనభర్జన చేశారు. ఎంత సేపూ గంగన్న "మా పిల్ల అలాంటిది కా" దంటాడు. కులపెద్దలు "బుకాయించ" కంటారు. "జాగ్రత్త" అని వాళ్ళనరు. "కూకలేస్తా" నని యిలాగా డనడు. చివరికి వ్యవహారం మితిమించిపోయింది. "వారంరోజుల్లో నీకూతురికి పెళ్ళి చెయ్యకపోతే కులంలోనుంచి నిన్ను కేటాయించేస్తా" మని ఖచితంగా చెప్పి వాళ్ళు వెళ్ళిపోయారు.

గంగన్నకి కష్టం తోచింది. ఎటు చూసినా యేమీ కనపడలేదు; కాని హఠాత్తుగా రంగమ్మ అనిన మాట నెమరుకి వచ్చింది. "కాపుగా రస్సు డలాగ యెందుకన్నారో యెరుగుదువా?" అని యెవరో అడిగినట్లు కూడా అయింది.

గంగన్న యిక మంచో లేకపోయాడు. "రంగయ్యమ్మగారి నడిగితే అంతా తేలిపోతుం" దని నిశ్చయించుకొని బయలుదేరాడు. మనస్సు చిమచిమలాడిపోతోంది; గాని నాలిక మాత్రం "ఏడుకొండల వాడా! గోవిందా, బాబు" అని అందుకుంది.

పది బారలు వెళ్ళాడు. పాట ఏ డెనిమిది చరణాలు నడిచింది. అప్పటికి కొత్త గోదావరి నీటిలో యిందుగు గంధం కలిపినట్లయింది. మరో పది బారలు వెళ్ళేటప్పటికి బుద్ధి నావరించుకుని వున్న కల్మషానికి దిగతీత మొదలయింది. తిరపతి స్టేషను సమీపిస్తూ వున్నట్లూ, యాత్రీకుల గోవిందబొబ్బలతో భూనభోంతరాళాలు నిండిపోతూ వున్నట్లూ తోచింది. దీనితో గంగన్న, శరీరం మరిచిపోయాడు. అన్యచింతలు తుడిచి పెట్టుకుపోయాయి.

అలాగ పారవశ్యంలోనే నడిచి అతను పేర్రెడ్డి గుమ్మంలోకి వెళ్ళేటప్పటికి రెడ్డి కొత్తగా అచ్చు పోసి విడిచిపెట్టిన ఆబోతుకి రంగమ్మ దగ్గిర వుండి సోమాలిచేత పులపగ్గిళ్లు పెట్టిస్తోంది.

ఈ దృశ్యాన్ని చూసేటప్పటికి గంగన్నకి వెంకటరమణమూర్తి సాక్షాత్కరించినట్లే అయిపోయింది. వెంటనే పాటకి స్థాయి హెచ్చించాడు. వొట్టి చేతులతోటే తాళం వేస్తూ, గజ్జెలు లేని కాళ్ళతోటే నృత్యం చేస్తూ ఆవృషభానికి ప్రదక్షిణం ప్రారంభించాడు. అది కొత్తదైతే కొంచెం బెదరి వుండును; గాని చిన్నప్పట్నుంచీ కూడా దానికి గంగన్నకీ చాలా స్నేహం.



మహాత్మా గాంధి—స్టీమరులో నూలువడకుట



ఫెడరలుస్ట్రక్చరు కమిటీ

అసలు గంగన్న ప్రోత్సాహంచేతనే పేర్రెడ్డి దాన్ని అచ్చోసి విడిచిపెట్టాడు. అంచేత అది నదురూ బెదురూ కూడా లేకుండా తాపీగా దావా తిని వీథిలోకి బయలు దేరింది. చెరువు గట్టుమీదికి వెళ్ళేదాకా దానికూడా నే వెళ్ళి, తరవాత గంగన్న పల్లెప్పాలెం వెళ్ళిపోయాడు.

౫

పోలమ్మ సంగతంతా చెప్పి మధురాన్ని సలహా అడగ్గా, మధురం దేవసహాయానికి చెప్పి, "నువ్వు కలగ చేసుకో" అంది.

దేవసహాయం అంటే ఆదిలో కులానికి దేవాంగి. పేరు దేవయ్య. పదమూడో యేట తల్లిదండ్రు లిద్దరూ వొక్కమాటే చచ్చిపోయారు. ఇటూ అటూ కూడా అతనికి "నా" అన్నవా ళ్లెవరూ లేకపోయారు. అయినా కులవృత్తిలోనే కూలిపని చేసుకుంటూ అత నెలాగో కాలం గడపేస్తూ వుండేవాడు.

ఇలా వుండగా పద్దెనిమి దేళ్ల వయస్సులో అత నోమాటు ద్రాక్షారం సంతనుంచి వస్తూ రామచంద్రపు రానికీ, పసలపూడికీ మధ్య కలరా వచ్చి పడిపోయాడు. కులస్థులు కొందరు కూడానే వస్తున్నారు; గాని భయంవల్ల విడిచిపెట్టి పారిపోగా వొక మిషనరీ మాసి, తీసుకువెళ్ళి, చికిత్స చేసి బతికించాడు. గ్రామస్థులూ, కులస్థులూ అయినవాళ్లలా చెయ్యగా ఎక్కడో పాతాళంలోనుంచి వచ్చిన కిరస్తానీదొర యిలా చెయ్యడం అతని విశ్వాసాన్ని తిప్పేసింది. వెంటనే దేవయ్య మతంలో కలిసి దేవసహాయం అయిపోయాడు.

తరవాత నాలుగేళ్లకతను రాయవరంలోనే కిరస్తానీల పాఠశాలలో పంతులుగా ప్రవేశించాడు. అప్పటి కతను బ్రహ్మచారే; కాని వచ్చిన యేణ్ణర్థానికే గృహస్థు అయినాడు. వెలమ కులం మారెమ్మ మొగుడు చచ్చిపోగా మతంలో కలిసి, మధురం అయి, దేవసహాయాన్ని చెట్టపట్టింది. . . . . . . . . . . . . . . . . . . .

అది మొదలు ప్రణయంతో లంకె వేసి భిన్నకులాలకు చెందిన యువతులనూ, యువకులనూ మతంలో చేర్చాలని అతను నిశ్చయించుకున్నాడు. ఈనిశ్చయం అక్కడక్కడ కొంచెం ఫలోన్ముఖంగానే వుంది; కాని యిది అతనికి కేవలమూ కొత్త.

"నాకొడుక్కి దారి చూపించండి బాబయ్యా" అంటూ పోలమ్మ కాళ్లమీద పడింది. "నాకు గతేమిటి పంతులుగారూ ?" అంటూ పరిసీములు చేతులు పట్టుకున్నాడు. దీనితో దేవసహాయానికి రక్తం వుడుకెత్తి చర్రుమంది. వొక్క నిట్టూర్పు విడిచా డతను. నుక్క తిప్పుకోకుండా వొక్క అరగంట యేకబిగిని క్రీస్తుమతాన్ని గురించి వుపన్యాసం చేశాడు. దేవుని కరుణకి చాలా వుదాహరణాలు చూపించాడు. తన సంగతంతా పూసగుచ్చినట్టు యేకరువుపెట్టాడు. ఆవృద్ధదంపతులికి తెలిసిన హిందూమతాన్ని తుక్కుతుక్కు కింద యేకేసి విడిచిపెట్టాడు. సోమాలూ, కాటన్నా భార్యాభర్తలు కావడం దేవుని సంకల్పం అన్నాడు. దానికి భిన్నంగా నడిస్తే మీకు నరకం వస్తుం దన్నాడు.

ఈసందర్భంలో మధురం కూడా చిన్న వుపన్యాసం చేసింది. "దేవుని దయవల్లనే నేను మతంలో కలిశాను. కులమెా, కులమెా అంటే కులం కూడు పెడుతుందా గుడ్డ యిస్తుందా? దేవుని రాజ్యంలో కులాలు లేవు. అక్కడ అంతా సమానమే. మీ హిందూమతంలో మట్టుకే యీపుట్టిమునక వుంది. మా మతం కంటే మంచిమతం మరెక్కడా లేదు. మీ కాటన్న కూడా మతంలో కలిశాడంటే రెండు మూ డేళ్లలో పంతులుగా రయిపోతాడు. సోమాలు పంతులమ్మ అవుతుంది. వాళ్లిద్దర్నీ విడతీస్తే దేవునికి కోపం వస్తుంది. పైగా సోమాలిని పెళ్లిచేస్తేనే మీ కాటన్న మీకు దక్కుతాడు. బాగా ఆలోచించుకోం" డని యిలాగ మధురం కళ్లు తిప్పుకుంటూ చెప్పగా పోలమ్మ వుద్రేకం పొంది మొగు డుకేసి చూసింది. దానిమీద పరిసీములు, రక్తం వుడుకెత్తగా, "అలా అయితే మేమూ మతంలో నే కలుస్తా" మన్నాడు.

౬

"నాకు మహా గట్టిచిక్కు వచ్చిందండి రంగయ్యమ్మగారూ!"

"చిక్కా?"

"చిక్కన్న చిక్కు కాదండి. యిక బతికేదెలా గం లేనట్టుం దం డమ్మగారూ!"

"ఏమిటిరా అదీ?"

"కులంలోనుంచి నన్ను కేటాయించేస్తారటండి పెద్దలు."

"యేం వచ్చిందనీ?"

"సోమాలు కాని పనులు చేస్తోందిటండి."

"అంటే?"

"మాపిల్ల కాటంరాజుకి యిలాకా పడిందనీ—"

"ఛీ! ఎవళ్లురా అలా పేలుతున్న వాళ్లూ?"

"కులం అంతా యిదే మాటండి."

"పొగరెక్కి వున్నారే?"

"నా కేలినోరి ఆసరా వుంది గనక కానండి, లేక పోతే నిమిషాలమీద గెంటేస్తు రం డమ్మగారూ!"

సరిగ్గా యీ సమయంలో "యెవళ్లురా నిన్ను గెంటేసే వాళ్లూ? ఆడది యేలుతోందిటరా రాజ్యం?" అంటూ సింహనాదం చేస్తూ పేర్రెడ్డి వచ్చాడు. అది చూసి రంగమ్మ సంగతంతా చెప్పి, "మీరు కలగచేసుకోవాలి" అంది. దానిమీద రెడ్డి "లేకపోతే వాళ్ల ఆటలు సాగ నిస్తానా నేనూ? పోరే గంగడూ! అసలు సంగతేమిటో గ్రహించావా? సోమాలు చుట్టంలాగ మాయింటో వుండి సుఖపడుతోంది. దానికి కులంలో యెవరికీ లేని అదృష్టం పట్టింది. అందుకోసం యేడుస్తున్నారు మీవాళ్లలాగ. మళ్లీ యేమేనా అన్నారంటే నాతో చెప్పు, తవ్వి పాతేస్తాను" అని ధైర్యం చెప్పి, "ఇక్కడ కాదు. పుల్లిట్లోకి వెడదాం రా" అంటూ బయలుదేరాడు. "ఏలినోరు యెలా చెయ్యమన్నా యిష్టమేనండి నాకు. మీరే పభువులూ, మీరే దేవుసూ నాకు" అంటూ గంగన్న రెడ్డి కూడా వెళ్లాడు.

* * *

వీరిద్దరూ వెళ్లేటప్పటికి కాటన్న చేనిగట్టుమీద కూచుని చద్దన్నం తింటున్నాడు. ఎవరూ కూడా మాట్లాడలేదు; గాని కాటన్నని మాశాటప్పటికి గంగన్నకి మనస్సు సుబసుబలాడి పోయింది. ఇది కనిపెట్టి, యిక అక్కడ నుంచుంటే అనవసర ప్రసంగం రావచ్చు నని గంగన్నని తీసుకుని రెడ్డి ముందుకి వెళ్లిపోయాడు.

## ౧౦

రంగమ్మా, సోమాలూ గాది పావిట్లో కూచుని పసుపు దుంపలు బాగుచేస్తున్నారు. రంగమ్మ మెందట లోకాభిరామాయణం కొంత సాగనిచ్చి చివరికి పెళ్లిగొడవలోకి దించేసింది.

"..............."

"మాట్లాడవేం?"

"ఏం చెప్పమంటా రండమ్మగారూ?"

"సిగ్గెందుకే? నువ్వు ఇంకొకణ్ణీ, కాటడు మరొకత్తినీ పెళ్లాడితే మీకిద్దరికీ సుఖం వుండదు. తరవాత యిద్దరూ యేడుస్తారు. కనక ధైర్యం తెచ్చుకోవడం మంచిది."

"పెళ్లాడితే కులంలో వుండనిస్తారాండి?"

"లేచిపోతే వుండనిస్తారా?"

"..............."

"ఇక కులం యెలాగా వుండదు. అయినప్పుడు పెళ్లాడితేనే మంచిది కాదూ?"

"..............."

"మాదూ మారెమ్మ యెలా సుఖపడుతోందో నూ?"

"మధురమ్మగారు మతంలో కలిశారు."

"మీరు కూడా కలిస్తే సరీ."

"మా బాబు గతేమిటండి మరి?"

"నువ్వు లేచిపోతే గతేమిటి!"

"........................"

"........................"

"ఇలాగే వుండిపోతే నోండి?"

"పెళ్లాడకుండానా?"

"........................"

"లేచిపోతుందానా?"

"........................"

"కాటణ్ణి మరిచిపోయా?"

"........................"

"వుండగలవా నువ్వు?"

"........................"

"పెళ్లి లేకుండా వుండనిస్తారా నిన్ను కులం వాళ్లూ?"

"........................"

"మీ బాబుమాత్రం వొప్పుకుంటాడా?"

"........................"

"రెడ్డిగారిని పిలవనా?"

"వారిదగ్గిర నే నేమాటూ చెప్పలేనండి"

"కొడతారా తిడతారా? నువ్వూ, కాటనూ పెళ్లాడి సుఖంగా వుంటే చూడాలని వుంది రెడ్డిగారికి."

"మా సంగతంతా—"

"ముందు వారికే తెలిసింది."

"........................"

"పిలవనా?"

"వొద్దం డమ్మగారూ! మీ కాళ్లకి మొక్కుతా నండి. ఈగొడవ వారియెదట మాట్లాడలేనండి. పిలవకండి. మీ రెలా చెబితే అలా వింటానండి. ఏం చెయ్యమంటే అది చేస్తానండి. మీదగ్గిర దాచడం యెందుకండీ యిం కానూ? అమాస వెళ్లాక రంగం వెళ్లిపోవాలని నిశ్చయ చేసుకున్నామండి మేము."

"ఏమిటీ?"

"నమ్మం డమ్మగారూ?"

"ఇక్కడ వుండరూ?"

"ఇంకెందుకండీ? ఏలినోరు మమ్మల్ని కాపాడ తా మంటే యిక్కడే వుండిపోతామండి. కాటంరాజు కూడా మీమాటకి అడ్డు చెప్పడండి."

"అలా చెప్పు. మీ కేమీ భయం లేదు. ఏమీ లోటు జరగదు. మిమ్మల్ని బతికివున్నంతకాలమూ నేను పోషిస్తాను. మీ కేమీ చిక్కులు రాకుండా రెడ్డిగారు వెయ్యికళ్లతో కనిపెడుతూ వుంటారు."

"చిత్తమండి."

"యిక లేచిపోవడం మాట—"

"ఇంకెందుకండీ? ఇక్కడే వుండి పోతామండి."

"కాటడితో నువ్వు చెబుతావా, నేను చెప్పాలా?"

"నేను చెబుతాను లెండి."

"మరి వెళ్లి మాట్లాడిరా."

"ఆనక మాట్లాడకూడ దండీ?"

"ఆలస్యం యెందుకూ? వారంరోజుల్లో పెళ్లయి పోవాలి మీకు? ఇంకా యెన్నాళ్లూ గుటకలు మింగుతూ కూచోడం?"

"............"

"సిగ్గుపడకు. కాటడు అరిటిమొక్కలికి నీళ్లు తోడుతున్నాడు, వెళ్లి మాట్లాడి రా."

"............"

"నువ్వు వచ్చేదాకా నే నిక్కడే వుంటానుసుమా."

"చిత్తమండి."

"తొరగా—పోనీ పావకాశంగానే మాట్లాడు కోండి పాపం."

సిగ్గుచేత సోమాలు హంసపిట్టలాగ తకుక్కుతూ, తారుతూ వెళ్లడం చూసి, "మనస్సులు కలిసిపోయాయి పాపం. విడతీస్తే పాపం కాదూ? బలవంతాన్నైనా విడ తియ్యడం సాధ్యమౌతుందా? రంగం దూకేస్తే?...... పెళ్లి చేసి తీరాలి" అనుకుంటూ రంగమ్మ అక్కడే కూచుంది. సోమాలు సందుగుమ్మం దాటేదాకానే నింపా దిగా వెళ్లి తరవాత పురకలు వేసుకుంటూ నూతి దగ్గిరికి వెళ్లింది.

## ౧౧

"వాళ్ల పూచీ అంతా నాదీ" అని రెడ్డి దృఢంగా చెప్పగా, గంగన్న కాటన్నకి సోమాలి నివ్వడానికి వొప్పుకున్నాడు. "మేము వుండగా మీా కేం భయ మురా!" అని రంగమ్మ చెప్పగా కాటన్న జేళంలోనే —వూళ్లోనే వుండిపోడానికి వొప్పుకున్నాడు. "నీకు మురుగులూ పట్టెడా చెయ్యమని కంసాలిసన్నాసికి రెడ్డి గారు కాసు లిచ్చేరే" అని వంటలక్క చెప్పగా సోమాలు పొంగి పోయింది.

రెడ్డి అప్పుడే భోజనం చేసి వచ్చి, బల్లమీాద కూచుని చుట్ట అంటిస్తూ వుండగా దేవసహాయం వచ్చాడు.

"మీాకోసం వచ్చానండి."

"నీకోసం కబురు పంపా లనుకుంటున్నాను."

ఇలా అంటూ యిద్దరూ యీాసంగతే అందుకున్నారు.

* * * *

తరవాత వారం రోజులు వెళ్లాక యాకూబూ, దానీమూ మురుక్కాలువగట్టున కూచుని చాలా కష్టంగా మాట్లాడుకున్నారు.

"దొరగారు మంచిపని చేశారు కారు."

"ఇలా జరుగుతుందని నే నెప్పుడూ అనుకోలేదు."

"మాలాడికీ మాదిగదానికీ పెళ్లా? ఎక్కడేనా జరిగిందా యిలాగా?"

"మతంలో కలిశాక యింక కుల మేమి టంటున్నారు దేవసహాయంగారు. విన్నావా?"

"ఆయన మరీనీ. ఇసంతా ఆమెుగుడూ పెళ్లాలే చేశారు."

"పిల్ల దొరక్క ఆయన కులం చెడ్డాగు. అందర్నీ తనతో సమానం చేసుకోవాలని ఆయని యిలా చేశాడు. ఛీ! కిరస్తానీ మతం మంచిది కాదోస్."

"అవునోస్."

---

## మా చందాదారులకు

మా కార్యాలయమునకు వ్రాయు ఉత్తరములు మొదలయినవానియందు తమ 'చందాదారు' సంఖ్య వ్రాయవలెను. లేకున్న ప్రత్యుత్తరములు మొదలయిన పనులను జరుపజాలము. చందాదారుసంఖ్య భారతి కవరుకాగితముపై తమ విలాసమునకు ముందున్నది. చందాదారులకు భారతి ౧౦-వ తేది లోపల అందకపోయిన యెడల వెంటనే తపాలువారికిని, మా కార్యాలయమునకును తెలుప గోరెదము.

—మేనేజరు, 'భారతి.'

# పాత పాటలు

కే. రామేశ్వరరావుగారు, బి. ఏ.

(రెండవ భాగము.)

౧. జోలపాటలు

ఏట మూలింతమ్మ కోట బాలింత
మునియేట కొడుకుతల్లి అబ్బాయిలక్ష్మి.

నిద్రపో అబ్బాయి నిద్రపోవయ్యా
నిద్రక్కి వెయ్యేళ్లు నీకు వెయ్యేళ్లు
నిను గన్న తలిదండ్రులకు నిండ వెయ్యేళ్లు.

లాలిలాలిలాలి లాలెమ్మ లాలి
లాలిలో అమ్మాయి రాణిలా వుంది
లాలెమ్మ గుర్రాలు లంకల్ల మేసు
అమ్మాయిగుర్రాలు పల్లాల మేసు.

చిన్ననాఅమ్మాయి చీర కేడుస్తే
నెయ్యావోయి సాలీడ నేత్రాన పట్టు
మురుస్తు సాలీడు మూడునెలలు నేసె
అలుస్తు చాకలి ఆరునెలలు వుతికె
వేడుకతో అమ్మాయి వెయ్యేళ్లు కట్టె.

ఊరిముందరచింత వుగ్గంపుచింత
ఆచింత పూచితే మరిచింత లేదు
మారాజు అబ్బాయిని చేపట్టితేను
మాలక్ష్మిఅమ్మాయికి మరి చింత లేదు.

వడ్డివారిబిడ్డల్ని నే నెత్తుకుంటె
వొప్పదే నామనసు ఓవిధము లాయ
నాచిన్నఅమ్మాయిని నేనెత్తుకుంటె
తనివాయె నామనసు సంతోష మాయె.

వడ్డివారిబిడ్డలార! ఓబాలలార!
దొడ్డయే రొచ్చింది ఒడ్డెక్కరయ్యా.
నాఅబ్బిబిడ్డలార! ఓబాలలార!
పాలసముద్రం వచ్చె పాను పెక్కండి.

ఓసిఓసి పిల్లికి సిగ్గేల లేదు
చిన్ననాఅమ్మాయికి బుద్ధేల లేదు.

జోల పాడు కృష్ణ జోకొట్టు బ్రహ్మ
పాలియ్యి భద్రకాళి నిద్రపుచ్చు శివుడ.

పూసపాటివారి లోగిళ్లలోను
పురి విప్పి ఆడింది పున్నెంపునెమలి
భారద్వాజవారి లోగిళ్లలోను
పాలు తాగి ఆడేడు పట్టి అబ్బాయి

గుమ్మిడి పూచింది వంగ వాలింది
అతిరాచగారాల పండు పండింది
గుమ్మిడి మాయిల్లు వంగ మావంశం
అతిరాచగారాల పండు అబ్బాయి.

చిట్టిళ్లు పొట్టిళ్లు కావాల నంటె
శివుడు మా కిచ్చేడు చిన్నబాలలిని.

వారిక్కి పాలు నెయ్యి కావాల నంటె
పరమాత్మ డిచ్చేడు పాడాపులమంద.

వారికి అన్నమ్ము కావాల నంటె
వరలక్ష్మి యిచ్చింది వరుసగాదెల్లు.

---

* ఈపాతపాటలయొక్క మొదటిభాగం ౧౯౨౫-వ సం. నవంబరు, డిసెంబరు 'భారతి' సంచికలలో ప్రకటించబడింది. —కే. రా.

ఊళ్లోది బిచ్చమ్మ గుళ్లోది నిద్ర
ఎవ్వరిని పాడుతావు చంద్రశేఖరుడ!
అందరూ కలవాడు అబ్బాయిబిడ్డ
ఆయుష్మంతుడనినే పాడుతాను.

చిన్నారి పొన్నారి గాజుల్ల శెట్టి
త్రేవె మాఅబ్బాయికి తేనెగాజుల్లు
గుడి దిరిగి వచ్చేయి గుడ్లగాజుల్లు
గుత్తాన మాచిన్న అమ్మిచేతుల్ల
పట్నం తిరిగి వచ్చేయి పచ్చగాజుల్లు
పచ్చన్న మాచిన్న అమ్మిచేతుల్ల
ఊరు తిరిగి వచ్చేయి ఉత్తగాజుల్లు
గుత్తాన మాచిన్న అమ్మిచేతుల్ల.

చిన్నారి పొన్నారి గాజుల్ల శెట్టి
తేరె మా అమ్మాయికి తేనెగాజుల్లు
నవ్వుతూ తొడిగిస్త నల్లగాజుల్లు
పాడుతూ తొడిగిస్తు పచ్చగాజుల్లు
ఏరి యేరి తొడిగిస్తు యెర్రగాజుల్లు
నిలుచుని తొడిగిస్తు నీలిగాజుల్లు.

అందలాలు రెండు పొందు బడి రాగ
ఎవ్వరందల మన్ని నే తొంగి జూతు
మాపూరి అందలం మల్లెపూఛాయ
మారాజు అబ్బాయి అమ్మి కాబోలు
ఊరివారందలం వుల్లిపూఛాయ
ఉత్తముడు చినబాబు అమ్మి కాబోలు
కలవారి అందలం కలవపూఛాయ
కాముడు చినబాబు అమ్మి కాబోలు.

అందలాలు రెండు పొందు బడిరాగ
ఎవ్వరందల మన్ని నే తొంగిజూతు

చుక్కల్ల చంద్రుడే తాను అబ్బాయి
నను చూడ వచ్చెనే తాను అబ్బాయి.

వేసంగికాలాన విత్తనాలు పోసె
వెన్నడి కనుదృష్టి మేఘాలపైన.

మాయింటిబాబుల్లు మరి తిరిగి రాగ
బాబుల్ల కనుదృష్టి తమతల్లిపైన.

శ్రీలక్ష్మి వరలక్ష్మి లోకచోట గూడి
ఎవ్వరిని పొందమని నన్నడగ వచ్చె.

తూర్పుయింట్లో వున్న పెదబాబును పొందు
పడమటింట్లో వున్న చినబాబును పొందు.

దక్షిణామింట్లో వున్న బుచ్చిబాబును పొందు
ఉత్తరమింట్లో వున్న చిట్టిబాబును పొందు.

అన్నల్లచెల్లెలు అలిగితే ముద్దు
పొన్నల్ల గురివింద పూచితే ముద్దు.

అన్నల్లచెల్లెలే తాను అమ్మాయి
పొన్నల్ల గురివింద తాను అబ్బాయి.

ఓమరిది సిగలోను వెండి మెరిసింది
ఓమరిది సిగలోను పసిడి మెరిసింది.

మామరిది సూరన్న కుంచసిగలోను
బంగారుపువ్వుల్ల గుత్తి మెరిసింది.

గుత్తి వెయ్యి చేసు కుందనం వెయ్యిచేసు
మామరిద సూరన్నమాట వెయ్యి చేసు.

ఎవ్వరే మాతండ్రి నేమి అన్నారు
ఎల్లలేనివీథుల్లో యేను గన్నారు
మత్తేభ మన్నారు మావాడలోను
కూచున్నవారిలో గుమ్మిడిపండనిరి
ఆడేటివారిలో అరటిపం డనిరి
పాడేటివారిలో పనసపం డనిరి.

---

# మీ ఆలోచన నెగ్గేది కాదు

శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారు

## ౧

విద్యార్థికాలమునుండియు నారాయణరావునకు నాట్యకళయం దభిరుచి మెండు. అప్పటి కప్పుడే అతడు తమకళాశాల వార్షికోత్సవములలోను, తదితర-ఉత్సవముల సందర్భములలోను ఉత్తమపాత్రముల నభినయించి ప్రేక్షకలోకమును రంజింపచేయుచుండెడివాడు. క్రమముగా నాతడు యం. ఏ. పరీక్షయం దుత్తీర్ణుడై రాజమంద్రి కాలేజీలో ప్రొఫెసరుగా జేరినాడు. దాదాపు ఇరువదేండ్లనుండి యాత డీ లౌకికవృత్తియందు కాలము గడుపుచున్నను, తన యభిమానవిద్యయైన నాట్యకళను విడనాడలేదు. నాయకపాత్రధారణమునం దాత డిప్పటికిని అసదృశుడే. ఆయాసందర్భములయందు మానవునియందు సహజముగా నుత్పన్నము గావలసిన యావేశము లాతని చెప్పుచేతలలోనివి. వివిధభావము లొక్క నిముసములో నాతడు తన ముఖమునందు ప్రతిబింబింప జేయగలడు. దానికి తగినట్లుగా శరీరసౌష్ఠవమును, కంఠమాధుర్యమును నాతని కొప్పి యున్నవి. వడియు, వాడియు లేక సమానగతిలో గాంభీర్యమును, మార్దవమును వెదజల్లు నాతని వాచికము శ్రోతల కపూర్వానందమును గూర్చుచుండును. ఇక నతడు నటకలోకనాయకమణి యగుటలో నాశ్చర్య మేమున్నది? కావుననే యావదాంధ్రలోక మాతనికి 'కళాసార్వభౌమ' యను బిరుద మొసంగినది. అది అతనికి తగిన బిరుదే కదా.

## ౨

నట్టువ జీవితమునందు నారాయణరావునకు దాదాపు ఇరువదియేండ్లు గడచినవి. ఇంతకాలమునుండియు నాత డనేకనాటకములందు నాయకపాత్రను ధరించి ప్రేక్షకుల రంజింపజేసి యున్నాడు. ఈ పాతికేండ్లనుండియు ఆతని నాయిక పురుషుడుగానే యుండెను. అయినను ఆతని అభినయశ్రీ కెప్పుడును లోటు గలుగలేదు. స్త్రీపాత్రము నభినయించుటయందు నిపుణు లగు నొకరిద్దరిని తోడుచేసికొని వారు నాయికవేషమును వేసినచో ఆతడు నాయకవేషమును ధరించువాడు. కాన పురుషనాయికయం దాత డెప్పుడును అసంతృప్తుడు కూడ కాలేదు. అయితే కాల మెప్పు డొకేతీరున నుండదు. తలంపు లెల్లప్పు డచంచలములై యుండవు. ఇటీవల కొంతకాలమునుండియు స్త్రీచే స్త్రీపాత్రను ధరించిన బాగుగా నుండునను తలం పాతని చిత్తమునం దుదయించినది. కలిగినదే తడవుగ "ఇంతింతై వటుఁడింతయై మఱియుఁ దా నింతై నభోవీథిపై నంతై" అన్నట్టుగా విజృంభించినది. ఇది పాశ్చాత్యనాగరికతాసంసర్గఫలమో, ప్రాచీననాట్యశాస్త్రపరిశీలనఫలితమో, చిరకాలానుభవసారమో — ఏమి యైన నేమి? నారాయణరావు హృదయమునం దద్భుతపరివర్తనహేతువైనది. స్త్రీలను నాటకరంగమున కెక్కించి తీరవలయునని దృఢనిశ్చయము చేసికొనినాడు. కాని, "ఆ స్త్రీలు కులటావృత్తిచే కళంకితలైన వారవనితలుగా నుండరాదు. అట్టివారివలన పవిత్రమైన నాటకకళ కపయశము వాటిల్లును. కాన వారు కులాంగనలై యుండవలయు"నని యాత డనుకొనినాడు. ఈవిధముగా దృఢనిశ్చయమును చేసికొనినవెనుక తొలుత తన మిత్రులకడ నీ విషయము ప్రస్తావించినాడు. "ఛీ,ఛీ ఎబ్బెబ్బే! మనము పాడగుచున్నది గాక ఆడవాండ్లనుగూడనా? కూడదు. కూడదు" అని వా రాక్షేపించినారు. తరువాత భార్యయైన రాజేశ్వరితో ప్రస్తావించినాడు. "సరే లెండి, మీ ఆలోచన. రంగు పూసుకొని రంగాని కెక్కి పరాయి మగవాడితో ఆడటానికి ఏ ఆడది సాహసిస్తుంది? ఒకవేళ ఎవతైనా సాహసించినా దానిపరువు దక్కదు. కాబట్టి మీ ఆలోచన నెగ్గేది కాదు" అన్నది రాజేశ్వరి. నారాయణరావు మనస్సు కలక్కు మన్నది. కొంచెముసేపు నిస్తబ్ధుడై యుండి, "అయితే యెవరూ రారా? నా ప్రయ

త్నము వ్యర్థమేనా?" అనుకొనినాడు. కాని పూర్తిగా హతాశుడు కాలేదు. "నా భార్య అమాయికురాలు. నాగరిక స్త్రీప్రపంచములో జరుగుచున్న మార్పులామెకు తెలియవు. అందువలననే ప్రతికూలముగా నుడివినది. కళాభిమానినులును స్త్రీ స్వాతంత్ర్యవాదినులు నగు యువతీమణులచే నా యభీష్టమీడేరక పోదు" అను తలంపు ఆతని మనంబును మరల ఆశాపూరితము గావించినది. కాన వెంటనే స్త్రీల నాటకరంగప్రవేశమునుగూర్చి యొక దీర్ఘ వ్యాసమును పత్రికలలో ప్రకటించినాడు. ఆ మహావ్యాసమును చూచి పురుషులే చకితులైనారు. సామాన్యకుటుంబినులు అడలిపోయినారు. మతసాంఘిక రాజకీయములందు స్త్రీలకు స్వాతంత్ర్యము నాశించెడు యువతీమణులకుగూడ నోడలు జల్లుమన్నది. ఇక నా విషయమును బుద్ధిపూర్వకముగా నామోదించినవారొకరో, యిద్దరో! మొత్తముమీద నారాయణరావు తలంచినభంగి స్త్రీపురుషులలో నెవరినుండియు చేయూతరాలేదు. మఱియు నొకటిరెండు ప్రతికూలవ్యాసములు గూడ పత్రికలలో పడినవి. ఉద్యమమునకు ప్రతికూలత యెక్కువైన కొలది నారాయణరావునకు పట్టుదల యెక్కువైనది. ఎట్లైన నీయుద్యమమును సాగించితీరవలె ననుకున్నాడు. పరస్త్రీలతోడ్పాటు లేకున్నచో స్వకుటుంబస్త్రీలతోనైన నీసంస్కారము నారంభింపవలెనని కృతనిశ్చయుడైనాడు. కాని యెట్లు? రాజేశ్వరి యేడుగురుబిడ్డలతల్లి. ముప్పదైదేండ్లకు పైగా నున్నవి. వారి పెద్ద కొమార్తెయగు రుక్మిణి యిద్దరు బిడ్డలతల్లి యగుటచే రాజేశ్వరి అమ్మమ్మయు, నారాయణరావు తాతయు నై చాలకాలమైనది. ఆమె నిప్పుడు రంగమున కెక్కించుట హాస్యాస్పదము. మఱియు ఆమె పెనిమిటి రాత్రింబవళ్లు దేపనిగా నాటకభాగములను వల్లించుచు, పద్యముల బాడుచు, అభినయము సాధించుచు కళావ్యాసంగమున దగిలియున్నను, వానిలో నొక్క విషయమునైనను మనస్సున బట్టించుకొన్నపాపమున బోలేదు. అట్టియామెను బలవంతముగా రంగస్థలమున కీడ్చుకొనిపోయినను ప్రయోజన మేమి? ఈకారణములచే భార్యావిషయమై ఆశ వదులుకొనవలసివచ్చినది నారాయణరావునకు. ఇక కొమార్తెలు ముగ్గురున్నారు. కాని వారు ముగ్గురు పెండ్లయినవారే. తన కిష్టమని తీసికొని వెళ్లి కొమార్తెలచే నాటకా లాడించినచో వారి అత్తవా రేమందురో. అదియు అననుకూలముగానే యున్నది. ఈవిధముగా స్త్రీల నాటకరంగప్రవేశోద్యమమును తలపెట్టినది మొదలు నారాయణరావు అస్థిరచిత్తుడై యుపాయాస్తమయము తెలియంగక యోచనానిమగ్నుడై యుండెను. ఎంత యోచించినను నారాయణరావునకు తనకుటుంబస్త్రీలలో తనతో గలిసి నాటకము లాడగలవారు గాన్పింపలేదు. లేదని తనయుద్యమమును విరమించుకొనుటకుగూడ నాతనికి బుద్ధి పుట్టలేదు. కాన నీభార్యవలన గాకున్న పునర్భార్యాస్వీకారమువలననైనను నీయుద్యమమును వ్యాప్తిపఱచి తీరవలయు ననుకొనినాడు. ఈసంకల్పము గల్గినవెంటనే రాజేశ్వరిసద్దకు బోయి, "స్త్రీలచే స్త్రీపాత్రముల నభినయింపజేసి నాయభిమానకళయైన నాటకకళ నౌన్నత్యదశకు తీసికొనిరావలయునని నాయభిప్రాయముగా నున్నది. ఇందులకు నీకు సామర్థ్యము లేదు. నాయింటివారి నెవరిని ముందు నాటకరంగమునకు దోడ్కొనిపోక పరస్త్రీలను రమ్మనుటయు నాకుచితముగా నుండలేదు. కాన కళాప్రియయగు నొకస్త్రీని పెండ్లాడుటకు నిశ్చయించుకొంటిని. నీయభిప్రాయ మేమి?" అన్నాడు నారాయణరావు. పెనిమిటి మాటలను విని రాజేశ్వరి కొంచెము సేపు నివ్వెఱపోయినది. "రాగారాగా ఆయనకళాభిమాన మిట్టి వెఱ్ఱిదారులకు బోవుచున్నదేమి? దీనిపర్యవసానమేమో!" అని చకితురాలైనది. కాని ఆతని ఉద్దేశ్యమును మాత్రము కాదనలేదు. నారాయణరావు పట్టుదలస్వభావము గలవాడని రాజేశ్వరికి బాగుగా తెలియును. కాన ఆతనిఅభిప్రాయము కాదని వాదించుట నిష్ప్రయోజనమని భావించి, "మీయిష్టమున కెప్పుడూ నాఅభ్యంతరము లేదు గాదా?" అన్నది రాజేశ్వరి. నారాయణరావు మహానందము నొందినాడు. తత్క్షణమే కలము, కాగితము తెచ్చి యాక్రిందివిధముగా వ్రాసి ఆంధ్రపత్రికకు పంపినాడు.

"వధువు కావలయును

"విద్యాధికుడును, నాట్యకళాప్రియుడునగు నొక నటశిఖామణికి రూపవతియు, విద్యావతియు, నాటకములయం దాతనితో నభినయింపగల కళావతియు నగు వధువు కావలయును. వలయువారు వివరములకు వ్రాయుడు.

"కళాభిమాని
"c/o ఆంధ్రపత్రిక.
"మద్రాసు."

## 3

"మన దేశము వేఱు. మన భాష వేఱు. మన కట్టు బొట్టులతీరు వేఱు. మనసంప్రదాయమే వేఱు. అట్టిచో ఆంధ్రస్త్రీలు నాట్యకళయందు గూడ ప్రవేశించి తమ వ్యక్తిత్వమును నిలువబెట్టుకో నక్కఱ లేదా? ఆంధ్ర నాటకరంగములలో పురుషులు స్త్రీపాత్ర నభినయించుటకంటెను, ఆంధ్రసినీమా కంపెనీలలో కొద్ది పైట, నడిమిగోచీ, అర్ధచంద్రతిలకము గల మహారాష్ట్రస్త్రీ లభినయించిన బొంబాయిఫిలుములును, తలపై ముసుగు, ఒడలినిండ ముసుగు గల ఉత్తరహిందూస్థానపుస్త్రీ లభినయించిన కలకత్తాఫిలుములును ప్రదర్శింపబడుటకంటెను ఆంధ్రస్త్రీల కవమానము వేఱొకటి గలదా? ఏమైన సరియే, ఈవిషయమున ఆంధ్రస్త్రీలకు మార్గదర్శకురాలను కావలయును. ఈనాఅభిప్రాయము నామోదింపగల కళాకోవిదుడు దొరకిననే నేను పెండ్లాడుదును. లేకున్న లేదు" అని మాలతి దీక్షపట్టి కూర్చున్నది. బుద్ధితెలిసిన పిల్లకు ఆమె ఆశయముల కనుకూలుడగు భర్తను విచారించుటే న్యాయ్య మని వేంకటరత్నముపంతులుగారు పెండ్లివిషయమై కొమార్తెను ఒత్తిడి చేయలేదు. నేడు ఆంధ్రపత్రికలో ప్రకటింపబడిన 'కళాభిమాని' ప్రకటనను గని తండ్రిబిడ్డల మొగము సంతోషముతో వికసించినది. 'ఇతడు నా కనుకూలుడగు వరుడు కావచ్చును' అని మాలతి తండ్రితో రూఢిగా పలికినది. 'అవును; ఉత్తరము వ్రాసి వివరములు తెలిసికొందాము' అని వేంకటరత్నముగారు ఆలోచిస్తూ అన్నారు. ఈ విధముగా తండ్రి తనయుల కిరువురకు యోదవనాపూర్వక మగు సంభాషణ జరిగినవెనుక ఉత్తరము వ్రాయబడినది.

మాలతి వేంకటరత్నముగారి యేకైకపుత్రిక. ఆమెకు చిన్నతనముననే తల్లి పోయినది. కాన తండ్రివద్ద చనువు మెండు. వేఱె దగ్గరకు దీసి మంచిచెడ్డలు దెల్పె స్త్రీ లెవ్వరు లేకపోవుటచేత ఏసంగతినైనను తండ్రితోనే చెప్పుట, ఆయన అవును కా దనుట, మాలతికి అలవాటైపోయినది. సంఘసంస్కారియు స్త్రీవిద్యాభిమానియు నైన వేంకటరత్నముగారు మాలతికి బాల్యవివాహము చేయక ఉన్నతవిద్య చెప్పించిరి. మాలతి స్కూలుఫైనలు ప్యాసై ఒక్క సంవత్సరమైనది. ఆవల కొన్ని యిబ్బందులవల్ల ఎఫ్. ఏ. చదువుటకు వీలుకా లేదు. కాబట్టి చదువు మాని విశ్రాంతిగా నున్న మాలతి యిప్పుడు కళావిషయకములగు గ్రంథపత్రికాదులను చదువుట, మంచిఅభినయకోవిదులచే ప్రదర్శింపబడు నాటకములను, సినీమాలను చూచుట,—ఇదియే పనిగా బెట్టుకొన్నది. అనుభవ మెక్కువైనకొలది తాను అభినయింపవలయు నను కుతూహలముగూడ బలపడుచున్నది మాలతికి. అయితే యీసంస్కారముకొఱకు తాను స్వాతంత్ర్యము గల కన్యకగా నుండవలయునా? లేక గృహిణిగా నుండవలయునా? అను యోచన మాలతి చిత్తములో రేగినది. తనకళాభిరుచికి దోహద మీయగల వరుడు దొరకినచో పెండ్లి చేసికొనవలయుననియే మాలతి నిశ్చయించినది. కాన ఆంధ్రపత్రికలోని ప్రకటన మాలతికి సంతోషము గలిగించినది.

## ౪

నాల్గుదినములలో ఆంధ్రపత్రికాకార్యాలయము నుండి తగువివరములతో ప్రత్యుత్తరము వచ్చినది. వరుడు 'కళాసార్వభౌము'డని బిరుదందిన నారాయణరావని తెలిసినతరువాత ఆతని కళాప్రావీణ్యమును పెక్కుమారులు చూచి సంతోషించిన మాలతికి మిక్కిలి సంతోషమైనది. కాని అనుభవజ్ఞుడగు తండ్రికడ తనసంతృప్తికి దగిన యామోదము మాలతి కాంచజాలకపోయినది. 'నాన్నా! నాఅభిరుచికి దగినట్లుగా ఈవరుడు ప్రఖ్యాతిజెందిన

కగా పార్వతీశాముడగుట చాల సంతోషకరమగు విషయము' అన్నది మాలతి తండ్రితో.

మాలతియొక్క అమాయికానందము వకు వేంకటరత్నముగారికి జాలివేసినది. ఆయనను పీడించుచున్న పెక్కుసంశయము లొక్కుమ్మడిగా మనస్సును కలత పెట్టినవి. కాన శంకాకులితమైన స్వాంతముతో, 'అమ్మాయీ! ఆయనవయస్సు నలుబదినాలుగేండ్లట' అన్నారు.

'అవును' అన్నది మాలతి.

'ఇరువురిమధ్యను ఇరువదినాలుగేండ్లు లేదా.'

'నిజమే కాని, ఆయన అంత వయోవంతుడుగా కన్పడడు.'

'ఆయనకు భార్య ఉన్నది.'

'నాకు తెలుసు.'

'ఏడుగురు బిడ్డలతండ్రి.'

'విన్నాను.'

'పెద్దవాడు, మఱియు పెండ్లాముబిడ్డలు గల వాడు.'

'అవును గాని, తనవివాహమునకు భార్య అంగీకరించినదని ఆయన వ్రాసినారుగదా.'

మాలతి యవివేకమునకు వెంకటరత్నముగారు పెద్ద నిట్టూర్పు విడిచిరి. కళాభిరుచి మాలతిని బుద్ధిహీనినిగా చేయుచున్నదని చింతించిరి. కాని యుక్తవయస్కురాలగు మాలతికి తా నింతకంటె చెప్పవలసినపని లేదని ఆయనకు తోచినది. కాన వేంకటరత్నముగారు మఱి మాటాడలేదు.

కొలదిదినములలో నే మాలతీనారాయణరావు లొకరి నొకరు చూచుకొనుటయు, సమ్మతిపడుటయు నైనది. అనంతర మొకశుభదినమున సుప్రసిద్ధమైన విజయవాడకళామందిరమున కళోద్ధారకుల ఆదరణమున కళాప్రియులగు మాలతీనారాయణరావులు దంపతులుగా చేయబడినారు. మాలతికి అయిదాఱురకముల బంగారుగాజులు, చంద్రహారము మునుపే యున్నవి. రవ్వలకమ్మలు, కేసరి పెండ్లిబహుమతిగా మాలతి తండ్రికడ బడసినది. పెండ్లికొమారుడైన నారాయణరావు వధువు కిచ్చిన నగ నీలమణిఉంగర మొక్కటే. ఆ ఒక్కటి వేయి రూపాయలు.

---

అవి వేసవిసెలవులు. కనుక నవవధువును తోడ్కొని నారాయణరావు బెంగుళూరు వెళ్లినాడు. అచ్చట వారుండుటకుమాత్రమే యేబదిరూపాయలబాడుగగల చిన్న బంగళా. ఆహారపానీయము లన్నియు హోటలునుండియే రాక. ఇక వారి కేజంజాటము లేదు. నారాయణరావు సంగీతసారస్వతమున కూలంకషప్రజ్ఞానిధి. మాలతి వీణ పాటయందు నేర్పరి. నారాయణరావు కళోపాసకుడు. మాలతి దానికే జీవితము సమర్పింపదలచుకొనిన కళావతి. నారాయణరావు సారస్వతప్రియుడు. మాలతి దానిని సాధింపదలచిన విదుషి. నారాయణరావు రసాత్మ గలవాడు. అగుటచే కట్టులో, బొట్టులో, జుట్టులో శృంగారమునే లక్ష్యముగా గొనును. మాలతియు నావిషయమున నాతనికి తీసిపోదు. కాన ఒకరిభావము లొకరికి నచ్చినవి. ఒకరి అలంకారము లొకరికి ప్రియము గూర్చినవి. ఒకరినడవడి యొకరికి ఆమోదకరమైనది. ఆసమయమున రసికజనమనోభిరామములగు ఆరామములకును, ఆలోకరమణీయములగు ప్రదర్శనములకును, చక్కని సుఖశీతోష్ణతకును ఆకరమైన బెంగుళూరునగరమున వారు వసించుట మఱింత ఉల్లాసకరముగా నున్నది. వారానగరమున జరిగెడి నాటకములు, పాటకచ్చేరీలు, సినిమాలు చూచుటయే గాక, మైసూరురాష్ట్రమునగల సృష్టివిశేషములు, ప్రాచీనశిల్పములు మున్నగునవిగూడ చూచి వచ్చుచుండిరి. ఇన్ని మనోహరకాలక్షేపములతో ప్రొద్దులు పుచ్చుచున్నను మాలతి తనఅభిమానకళయైన అభినయమునుగూడ విడనాడలేదు. సీతపాత్ర నభినయించుటను నారాయణరావుకడ నభ్యసించుచున్నది.

---

మాలతీనారాయణరావుల వివాహవృత్తాంతము పత్రికలలో చూచి నాట్యకళాప్రియులు సంతోషముతో

పొంగిపోయినారు. 'మీవివాహము నాట్యకళకు కల్యాణలాభముగ చేకూర్చుగాక! మీవంటి కళాదంపతులచే నాంధ్రనాటకరంగము జగన్మోహకీర్తిని గాంచును గాక' అని పెక్కుమంది బంధుమిత్రులు నారాయణరావును అభినందించుచు జాబులు వ్రాసినారు. మిక్కిలి చనవుగల మిత్రులు కొందఱు వేసవి సెలవులు ముగియులోపల మీసతీపతులు నాయికానాయకులుగా గల ఒక మనోహరనాటకమును ప్రదర్శింప ఆంధ్రలోక మెదురు చూచుచున్నది' అని హెచ్చరికలేఖలు వ్రాసినారు. ఇట్టి ప్రోత్సాహకరమైన లేఖలు చూచుకొని, 'నాయత్న మాంధ్రమహాజనుల యాదరము బడయుచున్నది. ఇకను నేను సంకల్పసిద్ధుడ నైనట్లే' యని నారాయణరావు లోలోన పొంగిపోయినాడు.

మఱియు వారు కోరినట్టుగా వేసవి సెలవులు తీరులోపల మాలతిని నాయికగా జేసికొని యొక ప్రదర్శనమును జరుపుటయూడ నుత్తమకార్యమని భావించినాడు గాన మాలతితో నాలోచించి, "జూలై నెల మొదటివారములో బెజవాడకళామందిరములో 'సీతారామ' అను నాటకమును ప్రదర్శించెదము. అందు మాలతీదేవి సీత పాత్ర నభినయించును; నేను రామభూమికను ధరింతును. ప్రదర్శనమున కనుకూలముగ నేర్పాటులు చేయవలసిన" దని బెజవాడమిత్రులకు ఉత్తరము వ్రాసినాడు నారాయణరావు.

నారాయణరావు వ్రాసిన జాబు చూచుకొని మిత్రులు పొంగిపోయినారు. వెంటనే ఈవిషయమును పత్రికలలో ప్రకటించి అచట కావలసిన యేర్పాటులు చేయుచున్నారు.

ఈవృత్తాంతమును పత్రికలలో చదివిన ఆంధ్ర మహాజనులనేకులు జూలై మొదటివారములో బెజవాడకు ప్రయాణము పెట్టుకొనినారు. ప్రదర్శనము వారముదినము లున్నదనగానే టిక్కెట్లఅమ్మకము ప్రారంభమైనది. దినదినము వందలకొలది టిక్కెట్లు అమ్ముడు పోవుచున్నవి. నాటకశాలనదినము సమీపించినకొలది ఇతరనగరములవారు సీట్లు రిజర్వుచేయించుకొనుటకై టెలిగ్రామ్మనియార్డరులు సైతము పంపుడ మారంభించినారు. పొరుగూరివారి సంరంభమే యిట్లుండ స్థానికుల సంగతి చెప్పవలసిన దేమి? టిక్కెట్టు కొననివాడు లేడు. స్థలాభావముచే ప్రదర్శనము రెండుదినము లున్నదనగనే టిక్కెట్లు అమ్మకము ఆగిపోయినది.

## ౬

సరిగా నాటకము ప్రదర్శించెడుదినమునకు మాలతీనారాయణరావులు బెంగుళూరునుండి దిగినారు. మిత్రులు వారిని రైలుస్టేషనువద్ద నెదుర్కొని పూలదండలచే బహూకరించినారు. ప్రదర్శనకుతూహలురై వచ్చిన ప్రేక్షకజనులతో విజయపురి కలకలలాడిపోయినది. దుర్గావిలాసములో విడిసిన కళాదంపతులకు మిత్రులతోడి సల్లాపముతో పగలు గడచిపోయినది.

రాత్రి తొమ్మిదిన్నరగంటలకు నాటక మారంభమైనది. 'సీతారామ' అనునది రామాయణగాథ నంతయు సంగ్రహించి వ్రాయబడిన నాటకము. బాలరాముని పాత్ర నెవడో బాలు డభినయించి వెడలిపోయినాడు. శివధనుర్భంగమునకు కథ ఆబాలునితోనే నడచిపోయినది. తనపడుచుభార్యపజ్జ నితరులను పతిగా నిలువబెట్టుటకు ఇష్టము లేదో యేమో గాని, కల్యాణసమయమునుండి రామభూమికను కళాసార్వభౌముడే చేకొనినాడు. సుప్రసిద్ధుడగు నాతనిని ప్రేక్షకులు తనివోనిచూడ్కులతో జూచుచున్నారు. ఇంతలో విద్యుల్లతవలె మాలతి రంగస్థలమున పొడసూపినది. సుకుమారసుందరతనూవల్లికి నీలకౌశేయ మొక యపూర్వశోభను గూర్చుచున్నది. సహజలావణ్యమునకు మణిమయాభరణములు వన్నెబెట్టుచున్నవి. శిరోర్ధమును గప్పిన వలిపెంపు మేలుముసుంగు వింతయందమును గలిగించుచున్నది. సుప్రసన్నాననమున కన్యకాసహజమైన నునుసిగ్గులేనగవులు తాండవించుచున్నవి. శాంతశృంగారస్త్రీస్వభావప్రబోధకంబులగు ఈక్షణములు ప్రేక్షకలోకంబు నరిగట్టుచున్నవి.

వయసునకు దగిన సౌందర్యము. సౌందర్యమునకు దగిన అలంకారములు. అలంకారములకు దగిన వస్త్రవిన్యాసము—అహో! జగన్మోహినివలె నున్న మాలతికి

ప్రేక్షకులు కన్నులప్పగించినారు. 'ఆహా! ఏమి సౌందర్యము! ఏమిసౌందర్యము! ఛీఛీ, మగవాని ఆడువేషము చూచి చూచి కన్నులు కాయలుగాచినవి. ఎన్నాళ్లు మగవాడు సాధనచేసిన నేమి? ఈవాల్గంటి నయనవిక్షేపములో లవమాత్రమైన సాధింపగల్గెనా? కుట్టుతుద కొంగ్గు పైట సవరించుకొనుటైన, ఒక్కపక్క కొత్తిగిలుటైన నేర్చుకొనెనా? ఎబ్బె! ఏది అభినయించినను ఎరవుతెచ్చుకొనినట్లే కదా!' అని మగముకుపల ప్రవర్తనమును నిందించుచు అనిమిషనయనములతో అవలోకించుచున్నారు. మాలతి కెదురుగా నిలువబడియున్న నారాయణరావు జగన్మోహిని వలెనున్న మాలతిని చూచినాడు. అనిమిషనయనములతో నాలోకించుచున్న ప్రేక్షకులను చూచినాడు. అతని చిత్త మేలనో చేయిపెట్టి కలచినట్టులైనది. ఒడలున చిఱుచెమటలు క్రమ్మినవి. మోము వెలవెల్లనైనది. "ఆట మీద లక్ష్యం లేదు! వెధవలకు ఆడదానిమీదనే. ఆవిడను చూచే దేమిటి, నన్ను చూడరాదూ" అనుకొనినా డప్పుడు నారాయణరావు. స్త్రీ యొక్క సౌందర్యమును కన్నార గాంచెడి హక్కు ఒక్క పెనిమిటికే కలదు. తదితరుల కామె పరస్త్రీ. ఆమె తల్లియగుగాక, సోదరియగుగాక, బిడ్డయగుగాక, ఆమె పరస్త్రీయే. వయోవంతుడగు పురుషుడు భార్య గాని మఱే యేస్త్రీయందైన తన పరామర్శకమైన దృష్టిని బఱపరాదు. ఇది సనాతనార్యసంప్రదాయము. యోగ్యుడగు ప్రతిహైందవుడును సంప్రదాయసిద్ధమైన యీమర్యాదకు సహజముగానే అలవాటుపడిపోవును. తాను పరస్త్రీలయెడ నెట్టివ్రతతో వర్తించునో, తనస్త్రీయెడగూడ నట్టిభావ మితరులు చూపవలె ననుభావముగూడ హైందవహృదయములో జన్మతో పెరిగినదే. స్త్రీలను రంగస్థలముల కెక్కించవలదనని తలంచినవాడు, అందుకై తీవ్రకృషి చేయునాడు, అందుకొఱకే పునర్వివాహ మాడునాడు, దాని కొఱకే మాలతిని సిద్ధపఱచునాడు తనలో నిట్టిభావము నిలిచియున్నదనియు, నది తన్ను కలత పెట్టునని యీ నారాయణరా వెఱుంగడేమో! నాట్యకళోద్ధరణోన్మాదములో నాత డీవిషయవిచారణకు మనంబున తావీయ లేదు గాబోలు! ఆతనిహృదయమునపహారముసం దెచటనో నక్కియున్న యీభావ మిపు డాతనిపై విజృంభించినది. దాని కాతడు లొంగిపోయినాడు. ప్రేక్షకుల అవలోకనము లాతనికన్నులలో వాడిసూదులు గ్రుచ్చుకొన్నట్టులైనవి. తనపడుచుభార్య నన్నివేలమంది పురుషులు హర్షములో జూచుటాతనికి దుర్భర మనిపించినది. ఆమెను కన్నార చూచుటకు తనకుమాత్రమే గల న్యాయ్యమైనహక్కును ఇతరులు దురుద్దేశముతో ఆక్రమించుకొనుచున్నారు అనుకొనినాడు. కాని తా నీవిధముగా తనహక్కును ఇతరులకు పంచిపెట్టుటకే పెండ్లాడితి ననువిషయ మాతని కాసమయమున స్ఫురించ లేదు. ఇట్టిభావకల్లోలముచే బీభత్సహృదయుడై కళాసార్వభౌము డల్లాడుటచే జగన్మాన్యమైన యాతనియభినయసామర్థ్యముగూడ నాడు భగ్నమైనది.

పాపము! మాలతి యాబీభత్స మేమియు నెఱుగదు. తాను నేర్చినంతవట్టు, తనకు సామర్థ్యము కలయంతవట్టు నెమ్మదిగా, చక్కగా, సమయానుకూలముగా నభినయించుచున్నది. త్రేతాయుగపు సీతను నేడు కన్నార గాంచగల్గితిమని ప్రేక్షకు లానందించునంతటి యొప్పిదముగా నున్నది మాలతి యభినయము. కాని నారాయణరావున కామెయభినయకౌశల మేమాత్రము ఇంపును గూర్చుటలేదు. 'ప్రేక్షకులు ఎగబడి చూచిన కొలది మఱింత కులికిపోవుచున్న'దని ఆతని కామెపై, ఆమె ఆ అభినయముపైనను గూడ అసూయ జనించినది. ఇట్టియీసుతో కొట్టుకాడుచున్న ఆతనికి అకల్మషచిత్తయగు మాలతితో సమానముగా నభినయించుట కెట్లు సాధ్యమగును? కాన నా డతనినటనము ప్రేక్షకులకు మిక్కిలి అసంతృప్తిని గొల్పినది. ఒకప్పు డాంధ్రమహాజను లందఱ నానందవారాశి నోలలాడించిన యాతని కళాకౌశల మానాడు అసహ్యాహేతు వైపోయినది. ఒక్క అభినయలోపమే గాక మఱియొక గొప్పలోపము గూడ నాడు నాటకమునొక్క ఒరునకు కారణమైనది.

నారాయణరావు కాయపాటునాడు. తటాలున చూచిన నాతని కున్నవయస్సునకు పదేండ్లు తక్కువ

వాడుగానే కన్పడును. అయిన నేమి? ఆతనివయస్సు వారిలో నాతడు దృఢగాత్రుడుగా కాన్పించవచ్చును గాని యిరువదేండ్ల జవరాలికి తగిన పెనిమిటి యనిపించుకొనుటకు సాధ్యమగునా? ఇరువదినాలుగేండ్ల వ్యత్యాసమును కప్పిపుచ్చుట సామాన్యకార్యమా? చెక్కిళుల బిగువించుక సడలించియు, విశాలలోచనము లించుక కుంచించియు, వినీలశిరోజముల నించుక పలిత మొనర్చియు, తనకు వశుడు గాక యింకను యువకుడుగానే యుండుటకు పోరాడెడి నారాయణరావుముఖముపై కాలపురుషుడు వార్ధక్యచిహ్నములను ముద్రించక విడువలేదు. అంటియు నంటకుండ నున్న ఆముద్రల నెటులైన తుడిచివేయవలయునని నారాయణరావు విశ్వప్రయత్నము చేయుచున్నాడు. ఒక్కడే కాన్పించినప్పు డాతనియత్నము సఫలమైనటులే కాన్పించెడిది. కాని ప్రాయపుయువతియగు మాలతిపజ్జ నారాయణరావు మోముపై కాలపురుషుడు వేసిన వార్ధక్యపుముద్రలు స్పష్టముగా గోచరించినవి.

౭

ఎటులో ప్రథమాంకము గడచిపోయినది. రెండవ అంకము ఆరంభమున జడలు ధరియించి తపసులవందమున వనవాసము నేయ నేగెడు రామలక్ష్మణులు, సీత రంగస్థలమున గన్పట్టినారు. రాజోచితాలంకారములచే నించుక కప్పివేయబడియున్న నారాయణరావు పెద్దతన మిందు స్పష్టముగా కనుపించినది. 'ముసలిమగడు పడుచు పెండ్లాము' అనుభావము అందఱిమనసులో పడిపోయినది. నాటకమునకు వచ్చినవా రందఱు పెద్దమనుష్యులు కాదు గదా. అందఱికిని కల్గినతలంపు బయలుపెట్టకుండ నుండు నోర్పు ఉండదుగదా. నోరు కట్టిపెట్టినను ఆగని వదరుబోతుజాతి యొకటి మనుజాలలో నుండుట యెల్ల రెఱిగినసంగతియేగదా. అట్టివా డొకడు 'ముసలిమగడు, పడుచుపెండ్లాము' అని ఒక్కకేక పెట్టినాడు. దాని నింకొక డందుకొన్నాడు. వానివెనుక నింకొకడు. నాటకశాల యంతయు ఒక్కనిముసములో గల్లంతై పోయినది. చాపమీద పుట్టిన యీఅంటువ్యాధి గుంటలలోని కుర్చీలకు ప్రాకినది. మగచెత్తలో బుట్టి ఆడచెత్తకుగూడా అల్లుకొన్నది. అందఱినోళ్లు ఆడుచున్నట్లే కనపడుచున్నవి. అందులో పెద్దమనుష్యు లెవరో పిన్నమనుష్యు లెవరో, అనుచున్నవా రెవ్వరో, అననివా రెవ్వరో తెలియదు. ఈసమయమున మాలతీనారాయణులచిత్త మెటులున్నదో చెప్పవలసిన దేమి? వారు వికలులై, విహ్వలులై, ఒకరినిర్గమన మొక రెఱుగకుండ దుర్గావిలాసము చేరినారు.

౮

దుర్గావిలాసమునందు నారాయణరా వొకగదిలో, మాలతియొకగదిలో మేను వాల్చినారు. కాని యిద్దఱు నిద్ర నెఱుగరు. నారాయణరావు ఇరువదైదేండ్ల నుండి నాటకములలో పాల్గొనుచున్నాడు. ఎప్పుడును అభినందనములనే గాని అధిక్షేపణల నెఱుగడు. ఇంతకాలము నుండియు అజేయమై విరాజిల్లిన నైపుణ్యము నేడు పరిహాసపాత్రమై పోయినది. 'మీ ఆలోచన నెగ్గేది కాదు' అని రాజేశ్వరిపెట్టిన శాపము తగిలినది. "అయ్యో! ఎంత ప్రయత్నము చేసితిని! ఎన్నిమాటలు పడితిని! ఎంత సాహసమున కొడిగట్టితిని! వ్యతిరేకుల కెంతెంత గట్టి సమాధానము లిచ్చితిని! తుదకు నాకు శత్రువు నాలోనే యున్న దేమి? మాలతిచే రంగస్థలమున నభినయింపజేయ వలయుననియే గదా వివాహమాడినయుద్దేశము? ఆమె రంగస్థలమునకు రాగానే నాలో నా కంత కంపరము పుట్టుకొనివచ్చిన దేమి?........అయినను ఇందు నా లోటేమున్నది? ప్రేక్షకులు పెద్దమనుష్యులై, కథపై లక్ష్యముంచి పదిలముగా నున్నచో నా కంత బాధ లేకపోవునదేమో.........మాలతి పరపురాలు కాదు. ప్రజలదృష్టి తనపై తగిలినకొలది ఆమెకు గర్వము హెచ్చినది. ఆమె లోప మేమున్నది?........ఆమె అట్లు అభినయించుటకే పెండ్లాడినది. అందులకు నేను ఒప్పుకొనినాను. ఇప్పుడు సర్వసాధారణమగు స్త్రీల నడవడులు, పత్నీధర్మములు ఆమెపై చొప్పించి శంకించుట మేలా?... రంగస్థలమున స్త్రీలతోడి నటనమే ప్రమాదకరము. ఈ యుద్యమమునందే యున్న దీలోపము...... పాపము!

మృదులహృదయయగు మాలతిచిత్త మీ యవమానముచే నెంత నొచ్చియున్నదో? ఒక్కమాటు దగ్గరకు వెళ్లి పలుకరించి యోదార్చి వత్తునా? సిగ్గుసిగ్గు. ఆమె మొగ మెట్లు చూతును? స్త్రీలు రంగస్థలము నలంకరించి నాట్యకళను మహోన్నతదశకు తేవలయునని పలికి ప్రయత్నించి ఆమె నీడ్చుకొని వచ్చి యామెను నగుబాటుపాలు చేసి నేనై — సిగ్గు ... సిగ్గు ... ఆమె మొగ మెట్లు చూతును?" — నారాయణరావు హృదయవేదన యిది.

మాలతి బహుకోమలహృదయ. యువతి. అమాయిక. లోకానుభవము లేదు. తల్లి చాటున పెరిగినది కాదు. స్త్రీలకు స్త్రీలే నేర్పవలసిన మర్యాదలు, వర్తనములు, నీతులు ఎఱుగదు. స్వచ్ఛమైన హృదయములో దైవికముగా పడిన నాట్యకళ నభివృద్ధికి తేవలయు నవెడి యిచ్ఛకు తన్ను బలిపెట్టుకొనినది. కన్యాత్వము చెఱచుకొనినది. కామితార్థమైన కళాపోషకత్వముమాత్రము నెఱవేఱలేదు. పైగా అవమానముల పాలైనది. ఇప్పటి ఆకోమలచిత్త మెట్లు దందహ్యమాన మైపోవుచున్నదో? "......ఇటువంటికుంటి పలలవలన మానవతులకు మాట వచ్చుననియే కాబోలు, పెద్దలు స్త్రీలకు రంగస్థలము త్యాజ్యమనిరి. నాట్యకళను చేకొని యిడివఱకే యొక జాతి పతితమై పల్లటిల్లుచున్నది. అది వారి దుర్వర్తన ఫలితము గాని కళయొక్క లోపము గా దనుకొంటిని. కాని యీకళలోనే యిట్టి ప్రమాదము గర్భితమై యున్నది కాబోలు. అయ్యో! యోచించలేదు.........అవును, మానాన్న అప్పుడే అన్నారు: '24 సంవత్సరము లేడా' అని అది. యేదో ప్రస్తావవశమైన మాట అనుకొన్నాను. ఈవ్యత్యాసమువలని లోప మాయన కప్పుడే గోచరించి యుండును. కావుననే మానాన్న నావివాహమువిషయమై యెక్కువ ఉత్సాహము చూపలేదు. పైగా భార్య యున్నదనియు, పిల్ల లున్నారనియు ఎన్నియోవిధముల విరుగుడుమాటలు చెప్పినాడు. నేను తెలిసికోలేదు. నా మనస్సు నొచ్చుననియో, నేను తెలిసియే ఆమోదించుచున్నాననియో మానాన్న ఒత్తి చెప్పలేదు. అవును, ఆయన నాప్రియజనకుడు. నామనస్సు నొచ్చుట ఆయన చూడలేరు......అయ్యో! అపరమకిరాతుల కేమిజాలి? నెమలి కంట నీరు గారిన వేటగానికి కనికరమా? అబ్బో రెన్నిమార్లు అడిగినారు: ఎంతగోల! ఎంతబీభత్సము! .........అబ్బా! తలచిన ఒడలు జల్లుమనుచున్నది. అవమానము......అవమానము.......శరీరవ్రణమునకు మందున్నది. కాని హృదయవ్రణమునకు మందు లేదు. లేదు, లేదు. నావివాహముయొక్క యుద్దేశ మిట్లు తేలినది. నాకళాభిరుచి యీవిధముగా పరిణమించినది. నే నిప్పు డేమి చేయవలయును? ఈమందుసలిమగనితో సవతికడ నొదిగిళ్లుపడుచు రాజమండ్రిలో కాపురమా, నాన్నగారియింటికి ప్రయాణమా?............ఆకాశాపార్వతాముని అభినయ మంత అధ్వానముగ నున్న దేమి? ఎట్టి రసవంతమగు పట్టునందును రిచ్చపడినట్టు నిలువబడె నేమి? ఆతడు వాకచక్యముగా ప్రవర్తించి యుండిన నాటక మింతరసాభా సయ్యెడిది కాదేమో!......ఆతని చూపులలో నేదియో అసహ్యభావము కానుపించిన దేమి? సకలసద్గుణరత్నాకరుడగు రామునిభూమికను ధరించిన నర్తకు డటులేనా యుండునది? సీతను నగ్ని ప్రవేశము చేయించు సందర్భమున నట్టు లున్న బాగుండెడిదేమో. కాని అన్నిపట్టుల నదే రూపా?"

చెలమ యూరినట్టు లూరుచున్న యీ భావపరంపరలలో పడి మాలతి మలిగిపోవుచున్నది. కన్నీళ్లు కాల్వలుగట్టుచున్నవి.

౬

అప్పుడే తెలతెలవాఱుచున్నది. ప్రొద్దుటిరైళ్లకు ప్రయాణికులను గొనిపోవు మోటారుబండ్లు, జట్కాబండ్లు పెద్దపెద్ద ధ్వనులు నేయుచు దుర్గావిలాసము ప్రక్కనుండి పరుగులెత్తుచున్నవి. మాలతీనారాయణరావు లటులనే యొకరిమొగ మొకరు చూడ సిగ్గుపడి పడియున్నారు. ఎవరో మాలతి గదివద్దకు వచ్చి, 'అమ్మాయీ! మాలతీ!' అన్నారు. ఆకంఠస్వరము మాలతికి చిరపరిచితమైనదే. 'ఎప్పుడొచ్చారు నాన్నా!' అని శోకగద్గదితమైన స్వరముతో ప్రశ్నించుచు మాలతి చివాలున లేచి తండ్రివద్దకు వచ్చి తండ్రిని పట్టుకొని భోరు మన్నది. ప్రాణపదమైన మాలతి దుఃఖమును చూచి భరించలేక

తండ్రి కన్నులనుండి నీళ్లు దిమ్ముకొని తల నిమురుచు, "ఎందుకు తల్లీ, ఏడుపు! ఊరుకో ఊరుకో! అర్థము శుద్ధము తెలియగవు. అమాయికురాలవు. చెప్పినా తెలుసుకొన్నావు కావు. ఏమి చేయను? రాత్రినుండి నేనూ యీవిధంగానే దుఃఖపడుతున్నా. ఊరుకో, అమ్మా! ఊరుకో."

'నాన్నా! నేనుగూడ ఏలూరు వస్తా? తీసుకొని వెళ్లుతారా?'

'ఎందుకు తీసికొనివెళ్లను? నీభర్తను అడిగినావా?'

మాలతి నారాయణరావు పడక గదిలోనికి వెళ్లి, 'నేను మానాన్నగారితో ఏలూరు వెళ్లుచున్నాను' అనినది. నారాయణరావు అవు ననలేదు, కా దనలేదు. వినియును విననట్లు ఊరకుండెను. 'కళాభివృద్ధి కేర్పడిన దాంపత్యము కళావిచ్ఛిత్తికి కారణ మైనప్పుడు విడిపోవుటే మేలుగా' అనుచు మాలతి గది విడిచినది.

నారాయణరావు పెద్దనిట్టూర్పు విడిచి, "'మీ ఆలోచన నెగ్గేది కాదు' అనిన రాజేశ్వరిమాటే నెగ్గినది. నేను విఫలయత్నుడ నైనాను" అనుకొన్నాడు.

---

# రాజమందిరము

అవ్వారి సుబ్రహ్మణ్యశాస్త్రిగారు

## పురము - కోట

శ్రీఁ దెలుఁగు రాజులుఁ గవి - రాజులు గోపాలనానురక్తిఁ బొదలుటఁ
రాజమహేంద్రవరంబు పు - రాజనప్రాభవంబుఁ రమ్యతఁ దలఁతుఁ.

బురుజుల దిబ్బ లున్నవి ప్రభుస్థలచిహ్నము లౌచు గౌతమీ
పరిచయముఁ దొలంగుటకు భావము లొప్పక కోటగుమ్మముఁ
గుఱుతగు వాడుకఁ బ్రజలనోఁ జెడఁబాయఁగలేవు రాజమం
దిరపురపూర్వవైభవము లీ రొకనాఁటికి మాయునట్టిదే?

రాజరాజనరేంద్రు రాజ్యపాలనముల తీరులనెల్లఁ గన్నారఁ గాంచి
వీరభద్రారెడ్డి విశ్వంభర భరించు పోలికఁ బ్రత్యక్షముగఁ గనుఁగొని
గొప్పలక్షణి విన్నకోటపెద్దన చేతిగంటమ్ము ద్రిప్ప సాక్షాత్కరించి
అట్టి నారాయణభట్టు భారతపరిశీలనములను వీక్షించియుండి
కృతులు కృతికర్తలుం గృతిపతులు భూమి - పాలు రెండఱు మాఱెనఁ గాలగతుల
మాఱుపులు చెనకఁగలేని మహిమతోడ వఱలు గంగమ్మ రాజమందిరమ్ము మోల.

రహి భారతము రాజరాజనరేంద్రభూవిభుఁడు నన్నయనోట వినినచోటు
నన్నయభట్టీయమన్న వ్యాకరణంబు పలుచిత్తులన్ వ్రాయఁబడినచోటు
తేటతెల్గుగ విన్నకోటపెద్దన యలంకారశాస్త్రము వ్రాయఁ గన్నచోటు
శ్రీనాథసూక్తులు చెవి సోఁక వీరభద్రారెడ్డి రసమునఁ దనియుచోటు
కటకటా దిబ్బలుగనైనఁ గానఁబడక-యుండ రూపటిపోవుచు నుండె నేఁడు
ప్రాఁతరాజమహేంద్రవరంబుకోట-త్రవ్వివేయంబడుచునుండె ఆలకొఱకు.

ఏది తలంపుల కేతెంచి రిపులకు హృదయభేదం బొనరించి యుండె
ఎద్దానిఁ జూచుచునే శాత్రవతతి మెగిరిపోయినదయ్యె గగనమునకు
దేని యౌన్నత్యంబు మానధనులలోన కాక తూఁతెను బుధగణములోన
దేని యాశ్రయము పృథ్వీపతులకె కాక ముఖ్యమయ్యెను వేలుపులకుఁగూడ
రాజరాజనరేంద్ర ధరామహేంద్రు - కోటయను దేనివాఁడుక పీటవెట్టి
చెక్కు-చెదర దిప్పుడు కూడఁ జెక్కు-నోళ్ల - నట్టికోట కటా! నేలమట్టమయ్యె.

పెను తోంపిలోననే కనుదోయి రంజిల్లు మొలకపైరులు విలసిలినయట్లు
ప్రళయంబులోననే భావిసృష్టికి వలసిన బీజసంగ్రహం బొనరి నట్లు
సూర్యాస్తగతి దెసల్ శోకించునప్పుడే శీతభానుఁడు ప్రకాశించినట్లు
ఎండిపోయినదంటు నుండియే క్రిందుగా నాపయంకురము చెన్నారినట్లు
కోటరూపు మాయుచునుండ నీటుగా మ-నోహరములగు హర్మ్యసమూహములయు
సౌధములయు కట్టడములు జాను మీఱెఁ-బ్రాఁతరాజమహేంద్రవరమున గల్ల

## గోడలో వేపచెట్టు

గద్దఱివై యెడంబు గలుగన్ బలువేళ్లను జాఁచుకొంటకై
బద్దలు సేయుచుంటి బలవంతముగాఁ బెనుకోటగోడనున్
బెద్దఱికంబునన్ మిగులఁ బేరు వహించిన పూర్వవైభవం
బద్దిర! నీకుఁగూడ విషమయ్యెనె నింబమ దైవచోదనన్!

## ఆర్ద్రత

ఆస్వాద్యం బగుచున్ రసం బొలుకు పద్యశ్రేణి శ్రీనాథుకం
ఠస్వారస్యము మెచ్చుకొంచు వినె నానాఁ డేమహావృక్షముల్

ప్రస్విన్నాంగము లౌచు నేశిలలు తద్వాఙ్మాధురీసార స
ర్వస్వంబున్ జెవి వేసికోఁగలిగనో! వాసిం గనుంగొంచు దై
వస్వాతంత్ర్యమువంకఁ జూపుఁ బలిపున్ భావజ్ఞుఁ డింకెవ్విధిన్?

మఱ్ఱిమ్రాను

పోఁడిమి గల్గు సత్కవుల పోటుల మాటలు నేర్చి నీపయిన్
గూఁడులలోనఁ జిల్కగమి కూయుచు రౌద్రము ప్రోదిసేయఁగా
జేఁడులు నీడనీడలఁ జరించియె మించిన శౌర్యదీక్షతో
నూడనిఁబాడు శాత్రవుల నూపిరితో విడిపించి వచ్చు టో
యూడల మఱ్ఱిచెట్ట! కనియుందు వొకో! చిరకాల మయ్యెడిన్!

సామర్లకోటలో సాము నేర్చిన యోధజనుల శౌర్యము మానసమును గదియ
పెద్దాపురములోని పెద్దకోటల శిథిలీభావ మాత్మకుఁ గ్లేశ మొసఁగ
రాజమహేంద్రవరంబునఁ బ్రాఁతకోటల బునాదులు కంట జల మిడంగ
చూపఱ యెడఁదకుఁ జోద్యం బిడెడు కొండపల్లిఖిల్లాసొంపు బావ మడఁప
శోకమయ్యు నానందమాచుం గరుణారసంబు చొక్కింపఁ జొక్కెడు సహృదయునకు
రాజమందిరప్రాచీనరక్తి కిడు తిలాంజలికరంబు క్లేశావహంబు కాదె?

---

# మే రీ

చెలికాని వెంకట రామారావుగారు

మదరాసు సముద్రతీరమున జనము ఇంటి మొగము పట్టిరి. క్లాని యొక్క ప్రక్కను చేపలనావపై యువతీయువకు లిద్దఱు కూర్చొని యున్నారు.

ఆమె తన చేతిసంచిలో నున్న ఒకకవరు నుంచి కార్డుసైజు ఫోటో తీసి, "ఇదిగో నా ఫోటో చూడు" అని చూపించి, ఆయువకుడు దానిని సరిగా చూడకముందే కొంటెతనముగా తీసుకొని ఒక కవరులో పెట్టి దీనిని నీ హృదయసమీపమున నుంచుకొనుమని స్వతంత్రించి చొక్కా జేబులో తన చేతితోనే పెట్టెను. అట్లు చేయుటలో ఆ జేబులో దళసరియైన కవ రుండగా దానిని చూచుటకు లాగెను. "ఏమి టబ్బా యిది? ఏదో ఫోటోలాగుందే. నా కొఱకు నీఫోటో తెచ్చినట్లుంది చూస్తే". ఆకవరులోనుంచి ఫోటో తీయుచువ్యక్తురాలై రిచ్చర్డు యొక్క మొగమువైపునకు చూచినది. ఆ మోముపై చిరునవ్వు తాండవించుట చూచి,

"ఏమి, చూడవచ్చునా ?"

"తప్పక చూడవచ్చును. చూడుము. నీవు ప్రేమతో నీఫోటో యిచ్చినందుకు కృతజ్ఞుడను. నిన్నిప్పుడు ఆ ప్తమిత్రులలో నొకరినిగా నెంచుకొందును."

ఇంతలో ఆమె ఆఫోటో తీసినది. రూపవతియగు నొక యువతియొక్క ఛాయాపటమది. ఒక్కసారిగా ఆ 'మేరీథామస్' చిన్నపోయినది. మొగమున రక్తబిందువు లేదు. అప్రయత్నముగా పెదవి కొరుక్కొన్నది. ఒక్కనిమిష మైనతర్వాత చిరునవ్వు నభినయించి, "ఏమి టిది ? ఎవ రీ అమ్మాయి? ఆమె క్యాథరిన్ హాల్ !"



థామస్ మిస్సమ్మ మొగము మరింత రక్త విహీన మైనది. నోట మాట రాలేదు.

రిచ్చర్డు ఆసంగతి గ్రహించినాడు.

"మేరీ, ఏమి? ఇంత ఆశ్చర్య మెందుకు ?"

మేరీ— ఈమె యెవరో నాకు సరిగా చెప్పు."

రిచర్డు—(చిరునవ్వుతో) నీవంటి స్నేహితురాలితో చెప్పుటకు అభ్యంతరము లేదు. కాని నీవు మాత్రము దయయుంచి యీసంగతి యింకా చాటకు. ఆమె నాప్రియురాలు. నాఆనర్సు పూర్తి అయి ఏదైనా ఉద్యోగము దొరకగానే మేము పెండ్లి చేసుకొందుము. ఇదివర కెప్పుడును సందర్భము కలుగకపోవుట చేత నీతో చెప్ప లేదు. మాపెండ్లికి నీవు తప్పక రావలెను సుమా!

మేరీ "తప్పకుండా" అని అనాలోచనముగా పలికెను కాని యామె భావ సముద్రములో గొప్ప తుపాను పట్టిన సంగతి మాత్ర మామె మొగమునందు విస్పష్టముగా గోచరించెను.

రిచర్డు ఈసంగతి గ్రహించి లోతు తెలియక సందేహముతోను, ఆతురతతోను ఆమెను చూచుచుండెను. అట్లు నిశ్శబ్దముగా కొన్ని నిముషములు కూర్చొనియుండిరి. కాని అవి కొన్ని గంటలవలె కన్పించెను.

మేరీ కండ్లు మూసుకొన్నది. తెరవబోవునప్పటికి కన్నీళ్లు ముత్యాలవలె ఏకధారగా ప్రవహించుట ప్రారంభమైనది. మొగము ఎర్రబారినది. రిచ్చర్డు తెల్లబోయినాడు. చేయి పట్టుకొని,

"మేరీ, ఏమి టిది? చెప్పవా? చెప్పు. ఈకన్నీళ్లకు కారణ మేమి?"

మేరీకి పిచ్చి యెత్తినది. ఇక ఆపుకొనలేక పోయినది. ముందుకు వంగి చేతులలో మోముుంచి వెక్కి వెక్కి యేడ్వ మొదలు పెట్టినది.

మరింత ఆదరముతోను, విచారముతోను రిచ్చర్డు,

"అమ్మా, మేరీ, చెప్పవా? ఎందుకీ దుఃఖతరంగాలు?"

మేరీ సరిగా కూర్చొనెను. కన్నీళ్లు తుడుచుకొని అప్రయత్నంగా జేబురుమాలుతో పాటు ఫోటోకూడ తన చేసంచిలో పెట్టెను. రిచ్చర్డు ఆసంగతి చూచెను కాని మాటాడ సంకోచించెను. మేరీ మరల తల వంచి కుడిచేతితో నుదురు నొక్కి పట్టుకొనెను. ఏదో గంభీరాలోచనలో నిమగ్నురాలైనది ఒక్కనిముష మట్లున్నతరువాత తలయెత్తి ఒక పెద్ద నిట్టూర్పు విడిచి కంఠములో నొక వింత మార్దవము వెలుగొందుచుండ ఇట్లనెను:

"రిచ్చర్డు! నిన్ను నమ్మికొంటినే. ఇంత మోసగాడవా?"

"అయ్యో! నీ కేమి మోసము చేసితిని మేరీ"

"నేను వేరే చెప్పవలెనా? నన్నొక మహాకూపమున త్రోయుచున్నావే!"

మేరీ రిచ్చర్డుచేయి పట్టుకొని దుఃఖము, ప్రేమ, ప్రార్థన కంటతడిలో ఉట్టిపడేటట్లు తన విశాలనేత్రముల వానిప్రక్కకు త్రిప్పి—

"నా ప్రాణములు తీసెదవా రిచ్చర్డు? నీ వెరుగవా? ఎన్నిదినాలనుంచో నిన్నే ప్రతి నిమిషం ధ్యానించుచు త్వరలో నిన్ను పొంద గలనని యువ్విళ్లూరుచుంటినే? ఇట్లు మోసము చేసెదవా? నాస్నేహితురాం డ్రందరు నీపేరు చెప్పి నన్ను హేళనచేసినప్పుడు సిగ్గు, సంతోషము నాహృదయములో నుప్పొంగుచుండునే. నాగతి యేమి టింక?"

రిచ్చర్డు — మేరీ! మనం ఎప్పుడైనా ఆసంగతి మాట్లాడుకున్నామా? నీ వెప్పుడైనా నన్ను పెండ్లిచేసుకొను నుద్దేశముతో ప్రేమించుచున్నానని చెప్పితివా? ని న్నొక ఆప్త బంధువువలె, ఒకమిత్రురాలివలె ప్రేమించితినే కాని ఎప్పుడైనా నీకు వాగ్దానము చేసితినా? ఏమి మేరీ, ఎందుకు నాపై ఈ పిడుగు వేయుచున్నావు? నీ కిది న్యాయమా? నాక్యాథరీనసంగతి విని సంతసించెద వనుకొని, ఒక తోబుట్టువువలె నాసంతసములో నీవుకూడ పాల్గొని నాకు మరింత ఆనందము కలుగ జేసెద వనుకొంటిని కాని యిదేమిటి కొండ విరిగి మీద బడ్డది!

మేరీ — (ఒక్కనిమిష మాలోచించి) అవును కాని, నీవు న న్నింతకాలము ప్రేమించుట లేదా? నాతో నీవు గడపే సెలవులు, నాకు పంపే అనేకబహుమతులు, నాపుట్టిన దినమున నాకు పంపిన సిల్కు — దీని అర్థ మేమి? నాకొరకై నీవు ఎన్నిసార్లు రాలేదు? ఎన్నిసార్లు సినీమాకు తీసుకొని వెళ్లలేదు? ఎన్నిసార్లు రుచిమంతములైన ఫలహారములు పంపలేదు? ఎన్నిపుస్తకములు, ఎన్నిబహుమతులు పంపలేదు? నీవు పరీక్ష కృతార్థుడ వైతివనో, క్రిస్మసుపండుగనో, వత్సరాదిఅనో నీకు తెలియకపోయినా నాశక్తికి మించినవి ఎన్నివస్తువులు ప్రేమతో మక్కువతో నీకు ఈయలేదు? ఇవన్నియు అన్యోన్య ప్రేమసూచకములు కావా? మన ఉత్తర ప్రత్యుత్తరములున్ను ప్రేమవలన కావా? ఇప్పు డన్నీ మంట గలపవలసినవేనా? నన్ను సదా తలచుకొందువని, నాశ్రేయస్సు కోరితివని ఎన్నెన్నిసారులు జాబులు వ్రాయలేదు? నీవు చదువునపుడు ఏదైన మంచి పద్యముగాని, వాక్యము గాని నీకు నచ్చిన నాకు వ్రాసి పంపేవరకు తోచదని ఎన్నిసార్లు చెప్పలేదు? నీ వివన్ని చేయవచ్చును కాని వానివల్లన నా యందు నీకున్న ప్రేమను గ్రహించి తిరిగి నా నిష్కల్మష మైన ప్రేమపుష్పమును నీకు సమర్పించుట నాదోషమా? నీవల్ల ఆకర్షింపబడి పిచ్చిదాననై నాహృదయమును సంపూర్ణముగా నీ అధీనముచేసి అహర్నిశలును సర్వదా నిన్నే తలచుకొనుచు, ఏమి చదివినా, ఎవ్వరిని చూచినా నిన్నే ధ్యానించుచు ఉన్నందుకు ఇదా ఫలితము? ఇది నీకు న్యాయమా? నావంటి అమాయకురాలి గాఢమైన, సంపూర్ణమైన, నిష్కలంక మైన, హృదయపూర్వక మైన ప్రేమ నీకు ఆటవస్తువా? నాహృదయము వ్రక్కలగుట నీకు నిర్లక్ష్యమా? రిచ్చర్డు! నీ కిది న్యాయమా?

రిచ్చర్డు—మేరీ! (నిట్టూర్పు విడిచి) మేరీ! అయ్యో! నీ కీభావ మున్నదని నా కిసుమంత యైన దృష్టి లేదు. నిజము, నమ్ము. నీకు సోదరీసోదరులు, బంధువులు ఎవ్వరు లేకపోవుటవల్ల నీనిష్కల్మషజీవితము,- నీ సహజసంతోషము నీమంచితనము, నీప్రేమస్వభావము చూచి నిన్ను ప్రేమించిన సంగతి నిజము. కాని ఒక మిత్రురాలివలె, సోదరివలె, ప్రేమించితిని కాని వేరొక యుద్దేశ్య మెన్నడు లేదు. నీవు మారభిప్రాయములో నుండుట వింత గాదు, విచారముగా నున్నది. మేరీ, నీయెడ నేను చూపిన అభిమానము కాని, నీకు నే నొసంగిన స్వల్ప కానుకలు గాని సోదరీప్రేమతో గావించితిని. నాచెల్లెలే యిచ్చట ఉన్నయెడల ఆమెకై అందులో ఏమి చేయును? చెప్పు. నిన్ను సినీమాలకు తీసుకొనివెళ్లిన నిన్ను ఆనందింప జేయుటకు నాస్వల్పశక్తి ననుసరించి నీకు కానుకలు పంపిన సాధ్యమైనంతవరకు నీకు సోదరులు లేనిలోటు తీర్చుటకై ప్రేమపూర్వకముగా పంపియుంటిని. అందు దోష మే మున్నది?

మేరీ:—చాలులే...కాని, రిచ్చరు! నీవు నిజముగా ఆమెను ప్రేమించుచున్నావా?

రిచ్చర్డు—అవును.

మేరీ—ఆమె నిన్ను ప్రేమించుచున్నదా?

రిచ్చర్డు—అవును.

మేరీ—నాకంటె గాఢముగ ప్రేమించుచున్నదా?

రిచ్చర్డు—నే నాసంగతి చెప్పజాలను. నీప్రేమను నే నాదృష్టితో చూడలేదు. కనుక చెప్పజాలను.

మేరీ—అసంభవము, నావంటి వెర్రిది మరొకతె యుండదు. నాయంత గాఢముగా మరొకతె ప్రేమించగలదని నే ననుకొనను... ఛీ! నాయంతటి మూర్ఖురాలు వేరొకతె లేదు. సరి. రిచ్చర్డు! నాహృదయకలశము నిండార సమర్పించిన ప్రేమామృతమును తన్నుకొని గర్వముతో వెళ్లుచున్నావు. నా హృదయమును వ్రక్కలు చేసితివి....పురుషు లెంతటి స్వార్థపరులు!...చూడు, రిచ్చర్డు! నన్ను పెండ్లి చేసుకొనవా?

రిచ్చర్డు—అయ్యో, మేరీ! క్షమింపుము. అది అసంభవము.

మేరీ—సరి. నావంటి అమాయకురాలిని కూలద్రోసి దుఃఖసముద్రమున ముంచుచున్నావు. జ్ఞాపక ముంచుకొనుము. నాకు నీ ప్రేమతోను, నీతోను, బహుశా నాజీవితమందలి యుత్సాహముతోను నేటితో సరి.

అని లేచెను.

రిచ్చర్డు—మేరీ, ఇందు నాదోషము లేదు సుమా.

మేరీ—నీతోను, నీదోషముతోను నా కింక పనిలేదు.

అని రోడ్డువైపునకు నడువ ప్రారంభించెను. రిచ్చర్డు లేచి వెంట పోవుచుండెను. నాలుగడుగులు వేసినతర్వాత,

మేరీ—దయయుంచి నాతో రావద్దు.



'దయయుంచి నాతో రావద్దు'

రిచ్చర్డ్సు—రాత్రి అయినది. నిన్ను సెంట్రల్‌వరకు దిగబెట్టెదను.

మేరీ—అవసరము లేదు.

రిచ్చర్డ్సు—పోనీ, బస్సు దగ్గరకు దిగబెట్టెదను.

మేరీ—వద్దు, నీ కా శ్రమ అక్కర లేదు.

రిచ్చర్డ్సు నిర్ఘాంతపడిపోయెను. ఏమిచేయుటకు తోచలేదు. కాని వెంట నడచుచుండెను. కొంతసే పైన తర్వాత...

రిచ్చర్డ్సు—బుధవారం డగ్లసుఫిల్మున్నది, వస్తావా?

మేరీ—సిగ్గు లేకనా?

రిచ్చర్డ్సు—నేను నిన్ను మరల ఎప్పుడు చూడగలను?

మేరీ—నన్ను చూచుటకై నీ వెన్నడు రావద్దు.

రిచ్చర్డ్సు—కొద్దిరోజులు పోయినతర్వాత జాబు వ్రాసెదను.

మేరీ—వద్దు. వృథాశ్రమ పడకు. నీ ఉత్తరములతో నాకు పనిలేదు. వచ్చిన చదవకుండగనే చించివేసెదను.

రిచ్చర్డ్సు—అనుకోనకుండగనే నీమనస్సు నొప్పించితిని.

మేరీ—సరే కాని, దయయుంచి యిప్పుడైనా నన్నొక్కతెనే పోనిమ్ము.

రిచ్చర్డ్సు— అయితే సెలవిమ్ము. 'గుడ్ నైట్.'

మేరీ—నీవే శాశ్వతమైన సెలవు ఇచ్చియుంటివి. వేరే సెలవు అక్కరలేదు.

అని వెనుకకు చూడకుండ త్వరగా నడచి బస్ ఎక్కి సెంట్రల్ స్టేషను దగ్గర దిగి తనబసకు వెళ్లెను.

## ౨

మేరీ థామస్ ఒక అనాథబాలిక. మైలాపూరులో నున్న కాన్వెంటు అనాథశరణాలయములో పెరిగెను. కేంబ్రిడ్జి సీనియరు పరీక్షకు వెళ్లి అందులో తప్పి జనరల్ ఆస్పత్రిలో నర్సుగా ప్రవేశించి పని నేర్చుకొని నర్సు పరీక్షలో కృతార్థురాలైనది. కాన్వెంటులో పెరు

గుటచేత సహజముగా పూర్వాచారపరాయణురాలు. ఏసుక్రీస్తునందు, మతాధికారులయందు అచంచలభక్తి. సన్యాసినులైన 'నన్సు' అన్నను, వారి ప్రార్థనాద్యనుష్ఠానము లన్నను ఎంతో గౌరవము. వారి ప్రార్థనలు, ఉపన్యాసములు, కఠోరదీక్షలు, జీవితనిబంధనలు చూచి వారి నందరిని భగవంతుని యొక్క ఆత్మీయ పుత్రికలవలె భావించి భయభక్తులతో పూజించును.

రోజులు గడచినవి. కాని మేరీ క్రోధాగ్ని చల్లారుటకు బదులు కాంక్షతో తీవ్రమై హృదయమును దహించుచుండెను. రిచ్చర్డు రెండుసార్లు సానుతాపముగ ప్రేమరాగ ముట్టిపడునట్లు జాబులు వ్రాసెను. మేరీ అవి చదువుకొనెను. కాని జవాబులు వ్రాయలేదు. మేరీ పుట్టినదినము వచ్చెను. ఆ రోజున రిచ్చర్డు ఆమెకు కొన్ని పండ్లు, ఒక చక్కని చేసంచి పంపెను. ఆమె వానిని త్రిప్పివేసెను.

తరువాత వారచ్చటచ్చట కలసినప్పుడు రిచ్చర్డు ఒకటి రెండుసార్లు ఆమెకు వందనమొనర్చి కుశలప్రశ్న చేసెను. మాటాడుటకు ప్రయత్నించెను. కాని ఆమె మొగము చిట్లించుకొని మాట్లాడలేదు. తరువాత రిచ్చర్డు అట్టిప్రయత్నము మానుకొనెను.

ఆదివారమునాడు చర్చికి ప్రార్థనకు వెళ్లెను మేరీ. అప్పుడు ఉపాసకుడు శత్రుభావమనాగరికమనియు, ద్వేషము త్యజింపుమనియు బోధచేసి, యితరుల నీతో సమానముగా ప్రేమింపు మనెడి యేసుక్రీస్తు బోధించిన ధర్మసూత్రమునుగురించి వివరించి చెప్పెను.

3

మేరీకి క్రోధము హెచ్చిపోవుచుండెను. స్నేహితులు క్రమముగా సంగతి గ్రహించిరి. మేరీ ఆటలాడుట మానెను. పూర్వపు సహజసంతోషచిద్విలాసములు పోయి నిత్యము దీర్ఘాలోచనలోను, విచారములోను మునిగియుండెను. దుఃఖము, ద్వేషము అసున్నితమైన హృదయమును వర్ణనాతీతముగ దహింపజొచ్చెను.

కాలము మానవమనఃపరిస్థితుల ననుసరింపదు. కాలచక్రము తిరిగిపోయెను. అది ఆగస్టునెల. వర్షము హోరున కురియుచుండెను. మేరీ రాత్రి వార్డులో పనిచేయుటకై వచ్చి కోటు తీసివేసి, పగలు పనిచేసిన 'సోదరి క్లారెన్సు' వద్ద పని అప్పగించుకొనుచుండెను. కడు జాగరూకతతో చూడవలసిన రోగులగూర్చి చెప్పుచు, "క్యాథరిన్ హాల్ సన్నిపాతజ్వరము జాగ్రత్త. రాత్రి 8 గంటలవేళ మం దీయవలెను. కనిపట్టి చూచుచుండుము. తలకు మంచుగడ్డ అవసరమైనప్పుడెల్ల మరల వేయుచుండుము." అని అంతయు నప్పగించి క్లారెన్సు వెళ్లిపోయెను. రాత్రి 11 గంటలైనది. మేరీ కుర్చీలో కూర్చొనియుండెను. మనస్సు పరిపరివిధముల బోవుచుండెను. తాను ప్రేమించిన రిచ్చర్డుయొక్క ప్రియురాలే యీ క్యాథరిన్. ఈమెకు చేసిన వాగ్దానమువల్లనే రిచ్చర్డు

తనను నిరాకరించెను. తన మనోభీష్టమునకు ఈమెయే అడ్డువచ్చెను. ఈటైఫాయిడ్ జ్వరము వల్ల ఈమె చనిపోయిన రిచ్చర్డు తనను ప్రేమించునో యేమో. అదృష్టము బాగుండిన టైఫాయిడ్ జ్వరము క్యాథరిన్‌కు మృత్యు రూపిణియై తనకు తోడ్పడగూడదా?...

ఇట్లు చిత్తము వచ్చినట్లు మనస్సు చరించుచుండెను. క్యాథరిన్ హాలునకు మేరీ సంగతి యేమియు తెలియదు. మరునాటి రాత్రి తిరిగి మేరీ యిట్లే ఆలోచింపదొడగెను,— "ఈమె చనిపోతే ఎంతో బాగుండును. ....ఛీ! నావృత్తి యేమి! నా దుర్మార్గపు ఆలోచన ఏమి!... ... చనిపోతే, తీరెనా నా కోర్కెయు తీరును, లేదా, రిచ్చర్డునకు తగిన శాస్తి యగును." మరునాడు తనగదిలో కూడా ఇదే ఆలోచన, "క్యాథరిన్ యొక్క మృత్యువెట్లు నిశ్చయమగును? నమ్మకము లేని రోగముపై ఆధారపడుటకంటె నమ్మకమైన మార్గము వేరొకటి లేదా?.....ఎన్ని అమోఘమైన విషములు లేవు! కాని యుత్కృష్టమైన నర్సు పని చేయుచు మృత్యుముఖమునుండి తనసంరక్షణవలన కాపాడవలసిన తా నట్టి ఘోర పాపమున కొడిగట్టిన, రహస్యము నెల్ల చూచుచుండెడి ప్రభువునకు తా నేమి సమాధానము చెప్పగలదు? నరకకూపమున త్రోయడా? ..."

ఇట్లు రెండుమూడు రోజులు గడచినవి. తన హృదయము నట్లు రిచ్చర్డు వ్రక్కలు చేయవచ్చునా? ప్రతీకారము చేసి తీరవలెను; పాపము కాని, పుణ్యము కాని; పగ తీర్చుకొని తీరవలెను. హాల్ మిస్సమ్మకు జ్వరము 10 వ రోజు. చాలా తీవ్రమైన జ్వరము వచ్చుచుండెను. ఆరాత్రి మేరీ రోగుల కీయవలసిన మందు లిచ్చి హాల్ మిస్సమ్మకు ఇచ్చుటకు ఔన్సుగ్లాసు పట్టుకొని మందుల బీరువా వద్ద తటపటాయించుచు నిలుచుండెను. "ఇచ్చి తీరెదను" అని నిశ్చయించుకొని తాను తెచ్చిన నల్లమందు ద్రావకము 1 ఔన్సు పోసెను. చేతులు వణకుట ప్రారంభించెను. హృదంతరాళమునుండి "నీ వెన్నడు హత్య గావింపకు" మనెడి క్రీస్తుబోధ వినబడుచుండెను. "కసి తీర్చుకొనుము" అని రెండవప్రక్క నుంచి అసురభావము ఘోషించుచుండెను. "నీవు చేసినట్లు ఎవరికి తెలియుట శక్యము కాదు. ఇంత జబ్బుస్థితిలో చనిపోయిన అన్యథా యెవ్వరు తలంపరు. చివరకు రిచ్చర్డు నిన్ను పెండ్లిచేసుకొనునేమో" అని స్వార్థము ప్రోత్సహింప, తడబడుచున్న అడుగులతో క్యాథరిన్‌వద్దకు పోయెను. "థామస్ మిస్సమ్మా, వచ్చినావా తల్లీ" అని ప్రేమపూర్వకముగా ఆమె మేరీ చేయి పట్టుకొనెను. మేరీ కంపించుచుండెను. ఏమిటో సమాధానము చెప్పెను. ఆమె కేమియు తెలియలేదు. మందు త్రాగమని చెప్పెను. క్యాథరిన్ నోరు తెరచెను. వణుకుచున్న చేతితో మందుగ్లాసు వంచుచుండెను. ఆమహాసంఘర్షణసమయమున నొక మహావిచిత్రమైన మార్పు కలిగెను. మేరీ ఆమెమొగము వైపు వెర్రిచూపు చూచుచుండెను. నిర్మల

మైన, నిర్దోషమైన ఆమె మొగము ఏసుక్రీస్తు



మొగముగా మారిపోయెను. "మేరీ, మేరీ! నేను నీఉపచారములు కోరి బాధానివారణార్థము ఔషధామృతము కోరుచున్నాను గాని నీవు మృత్యురూపమైనవిషము నొసంగుచున్నావా? సరే పోయుము" అని ఏసుప్రభువు నోరు తెరచి నట్లు మేరీకి ప్రత్యక్షమాయెను. శరీరమంతయు కంపించెను. చేయి వెనుకకు మరలి పోయెను. ఏమి చేయుచున్నదో తెలియకనే తన బల్ల వద్దకు బోయి ఆమందు పారబోసి గ్లాసు కడిగి వేసి ఆమూలను మోకాళ్లపై వ్రాలి, "హే యేసుప్రభూ! ఈ పాపిని, ఈ నీచురాలిని మన్నింపుము. ప్రభూ! షరీక్షాకాలమున, ఈ ఆపత్కాలమున నన్నెట్లు కాపాడితివి? తండ్రి! ఈకంఠమున ప్రాణ మున్నంతవరకు కృతజ్ఞురాలనై యుండెదను. నా హృదయమందలి పాపపంకమును దగ్ధము చేయుము. ప్రభూ! మన్నింపుము. నీవు నాఘోరపాపముల మన్నించునట్లు ఇతరుల తప్పుల నేను సహించి ఓర్చుకొందునుగాక! ధన్యురాలను. నీసేవయందిక నాజీవితము ధన్య మొనరించుకొందును. ప్రతి వ్యక్తిలోను నీవు ప్రత్యక్ష మగుచున్నావు. ముమ్మాటికి ధన్యురాలను." అని ప్రార్థన గావించి లేచి యొకనూతన తేజస్సు, నిర్మలప్రేమామృతము మొగమున తాండవింప క్యాథరిన్ వద్దకు పోయి మందిచ్చి ముద్దుపెట్టుకొని ప్రక్కను కూర్చొని బైబిలు విప్పి ఏసుక్రీస్తు బోధల చదివి వినిపించి, క్యాథరిన్‌కు నిద్ర వచ్చుచుంటచే సంతోషచిత్తముతో తన బల్ల వద్దకు వచ్చి బైబిల్ చదువుకొనుచుండెను.

౪

మరునాడు సాయంకాలము రిచ్చర్డు కాలేజీనుంచి రాగానే తన యుత్తరములలో చిర పరిచితమైన మేరీదస్తూరీతో జాబు ఉండుట చూచి వెంటనే యాశ్చర్యముతో చింపి చదువుకొనెను.

" ప్రియమిత్రమా, నావద్దనుంచి జాబు వచ్చునని నీ వనుకొనియుండవు. కాని నాలో నూతనమగు మార్పు, నూతనవికాసము కలిగినది. నాజీవితములో నింక క్రోధద్వేషములకు తావు లేదు. నీయెడ నింతవరకు కఠినురాలనై ఘోరపాపమును గావించితిని. ఏకాకినై అనాథ

బాలికనైన నాయెడల నీవు దయతో జూపిన నీ నిర్మల-అవ్యాజానురాగమునకు అవమానము, కాఠిన్యము ప్రతిగా నొసంగితిని. అహంకారము, స్వార్థము, సంకుచితభావము, నీచత్వమే యిందుకు కారణములు మిత్రమా, ఒకసోదరునివలె నన్నెప్పుడు ఆదరించుచుంటివి. ఈఅల్పురాలిని, కఠినురాలిని, స్వార్థపరురాలిని క్షమింపుము. దయాస్వరూపుడవైన నీవు నన్ను తప్పక మన్నింతువని తెలియును. నే నట్టిక్షమకు అర్హురాలను కానని కూడ పూర్తిగా నెరిగియుండుటవలన సిగ్గుచే క్రుంగిపోవుచున్నాను. కాని యేసుప్రభువు దయవలన నాకొక నూతనజ్యోతి లభించినది. దాని దివ్యకాంతిలో ఈజీవితము సదా ప్రకాశప్రశాంతములతో గడవ గలదు. అందుచే నీవంటి ఉత్తముల ద్వారా యేసుప్రభువు ముందట సాష్టాంగపడి, గతించిన అజ్ఞానావృతము, కాంక్షానిబద్ధము, పాపభూయిష్ఠము నైన అంధకారజీవితప్రకరణమును మూసివేసి నే గాంచిన నూతన జ్యోతియొక్క- ప్రేమామృతశీతలకిరణజాలములను నేటినుంచి యథాశక్తిని సేవారూపమున ప్రతిఫలింప జేసెదను. ప్రియమిత్రమా, రిచ్చర్డు! కామద్వేషపూరితనై, అంధురాలనై, అధఃపతితురాలనై, సంకుచితపాపమార్గగామినినై, పోయిపోయి యీ నాటికి మేల్కొని కండ్లు తెరచి శ్రేయోదాయకమైన కాంక్షావిరహితప్రేమమార్గమును గాంచి, పరుగుపరుగున ఆ నూతనమార్గము కొఱకై పోవుచున్న యీదీనురాలిని మన్నింపుము. సర్వసాక్షియైన భగవంతుడు కూడ నన్ను మన్నించుగాక! ఈదీనురాలి అహర్నిశ ప్రార్థనల నాలించి ఆకరుణాస్వరూపుడు నిన్ను, నీప్రియురాలిని సర్వదా కాపాడుగాక!

"ఇట్లు: నీ శ్రేయోభిలాషిణి,
"మేరీ థామస్".

వెంటనే రిచ్చర్డు మేరీని చూచుటకు పరుగున బోయెను. వీరి అన్యోన్యస్వచ్ఛంద ప్రేమ సహస్రకళలతో వారి మొగముల ప్రకాశింప, నిద్దరి కండ్లనుండియు ఆనంద బాష్పములు దివ్యతేజస్సుతో రత్నదీప్తిని ప్రకాశించెను. తరువాత నతడు క్యాథరిన్ ను చూచుటకై ఆమె వద్ద సెలవు తీసికొని వెళ్లిపోయెను.

※

క్రమముగా ఐదుదినములు గడచిపోయెను. క్యాథరిన్ హాలునకు జబ్బు హెచ్చినది. మేరీ మెంతయు జాగ్రత్తగ నుపచారములు చేయుచుండెను. మేరీ నూతనవ్యక్తిగా మారిపోయెను. ఆకార్యదీక్ష, ఆయుత్సాహము, ఆనిరంతరమందహాసము పూర్ణచంద్రప్రకాశమువలె నానందము వెదజల్లుచుండెను. నలుప్రక్కలకును సదా ప్రేమామృతవృష్టి గావించుచుండెను. కాని ఆరవదినము రాత్రి క్యాథరిన్ యొక్క- స్థితి తీవ్రరూపముదాల్చి తెల్లవారు జామున జీవితము చాలించెను. ఆప్రేమమందాకినియొక్క- జీవితయాత్ర పూర్తియయ్యెను.

బయట అంతయు చీకటి. ఆకాశమున నక్షత్రములు ప్రకాశించుచుండెను. మేరీకి అది వజ్రాయుధఘాతమైనది. ఆప్రశాంతసమయ

మున నామె ఏకాంతముగ వసారాలో ఒకమూలను మోకాళ్లపై వ్రాలి, అశ్రుజలములు ధారలై ప్రవహింప, "అయ్యో! నా కుటిలత్వమే, నా దుర్మార్గపు తలంపులే ఆమెకు మృత్యురూపమైనవా తండ్రీ! మన్నింపుము. ప్రభూ! ఈపాపినిని, ఈకీనురాలిని మన్నింపుము. మనోవాక్కాయకర్మల నీసేవయందే నిమగ్నురాల నగుదును గాక! ఆశీర్వదింపుము, తండ్రీ ఆశీర్వదింపుము! ఆఅమాయకురాలి నిర్మలాత్మకు సదా శాంతి నొసగుము. తండ్రీ! స్వర్గమున ఆమెను నీదరి జేర్చుము" అని ప్రార్థించెను.

౬

మహాశక్తియగు కాలము మానవహృదయమున విపత్పరంపరలచే గల్గిన ఘోరములగు గాయములను మాన్పి తత్సంబంధమైన అగాధకూపములను క్రమక్రమముగా గమనింపబడకయే పూడ్చివేయును. ఐదువత్సరములు గడచినవి. రిచ్చర్డు క్రిస్టియనుకళాశాలలో లెక్చరరుగా నున్నాడు. క్యాథరిన్ యొక్క ఆకస్మికమరణమువలన కలిగిన హృదయచ్ఛేదకమైన లోటును పటుత్వమైన యేడున్నతాశయమును లేకపోవుటచే తీర్చలేకపోవుటయే గాక, నానాటికి జీవితము ఆనందరహితమై నిస్సార మగుచుండెను. కొంతకాల మానిర్మలప్రేమచే వివాహోద్దేశము తలపెట్టలేదు. కాని కాలవశమున క్రమముగా బ్రహ్మచర్యవ్రతము బాహ్యమున కేవలము వ్రతముగా నిలిచి అంతరంగమున నిస్సారమై అశాంతికి కారణమయ్యెను.

అనేకదినములు ఆలోచించి, ప్రారంభమున సందేహనిమగ్నమైన మనస్సున ధైర్యము నెలకొల్పి, యొకనాడు సముద్రతీరమున నేకాం



తమున మేరీతో తనజీవితము శాంతి కాని, సౌఖ్యము కాని లేక ఎడారివలె నున్నదని చెప్పి, సందేహించుచు క్రమముగా తన్ను జేపట్టి తన యంధకారబంధురమైన జీవితములో ప్రేమోత్సాహజ్యోతి నెలకొల్పి కాపాడవలెనని కోరెను. మేరీ తన ప్రశాంతముఖము, నందును, విశాలనేత్రములందును కనికరము ఆదరము తాండవింప, ఒక వింత మందహాసముతో రిచ్చర్డు చేయి పట్టుకొని, "మిత్రమా, నాభావప్రపంచమును నీవు పూర్తిగా తెలుసుకొనలేదు. నేను నిన్ను గాని, మరెవ్వరిని గాని వివాహమాడి సంసారసేవకు పూనుకొనిన, మానవసేవారూపమున భగవంతుని సేవించుట అసంభవము. ఏసుప్రభువు చెప్పినది జ్ఞాపకము

లేదా? ఇద్దరుప్రభువుల సేవింప శక్యమా? నా జీవితమును బంధదాయకమైన సాంసారిక సేవకు బదులు ముక్తిదాతయైన ప్రభుని సేవించుటకు గడుపుచున్నాను. నాకు మానవసేవయే భగవత్సేవ. మిత్రమా, జీవితమందలి నీదృక్పథము మార్చుకొనుము. అప్పుడు అన్యజనసాహాయ్య మక్కరలేకయే జీవితమందలి అంధకారము పటాపంచలై దుఃఖపూరితమైన బ్రతుకు ఉత్సాహపూరితమై తేజోవంత మగును. నా వద్దకు వచ్చు ప్రతివ్యక్తిలోను ఒక్కొక్క నూతనరూపమున యేసుప్రభువు ప్రత్యక్ష మగుచున్నాడు. ప్రతిదినము అనేకశరీరము లలో నామహామహుని మనసార సేవించుచున్నాను. ఇట్టి మహోత్కృష్టావకాశము కాళ్ల దన్నుకొని సంసార కూపమున బడి పోయిన నా కిట్టి యదృష్టము లభించునా? ప్రియ మిత్రమా, రిచ్చర్డు! మన్నింపుము. చక్కగా ఆలోచించిన నీకే ఈ యుత్కృష్టాదర్శజ్యోతి ప్రత్యక్షమై తీరును. నిరాశ, నిరుత్సాహము నీహృదయమునుంచి పారద్రోలు"మని అమృత తుల్యముగా పలికెను.

౭

మరునాడు సాయంకాలము మేరీ తన వార్డులో బల్లవద్ద కూర్చొని ఉదయమున రిచ్చర్డు వ్రాసిన జాబు చదువుకొనుచుండెను:

"ప్రాణప్రదమైన మేరీ, నాసంకుచితభావమువలన నీయొక్క మహోన్నతదివ్యాదర్శ జీవితదృక్పథము గ్రహింపజాలకపోతిని. ఇప్పుడే కండ్లు తెరచితిని. ఇప్పుడు దానిని ఒక ఛాయా రూపముగా మాత్రముచూడగలుగుచున్నాను. గ్రహించుచున్నాను. నీజీవితము ధన్యము. నన్నుగూడ ధన్యుని గావింపవా? ఈపవిత్ర జీవితయాత్రయందు అంధుడనైన నాకు చేయూత నొసగుము. ఒక్క నూలుపోగు ఆధారము దొరకిన దాని బట్టుకొని నీఅడుగులజాడబడి వచ్చెదను. తద్ద్వారా కొంతకాలమునకైనను వెలుతురును గాంచగలుగుదును. జీవితము ధన్యమగును. ఇకనుంచి నీవే నాకు దేవతవు. నామార్గదర్శినివి. మేరీ, నీ కనేకధన్యవాదములు, కృతజ్ఞతాపూర్వక సహస్ర సాష్టాంగప్రణామములు.

"ఇట్లు నీఅనుచరుడు,
"రిచ్చర్డు."

ఆనందజ్యోతి మొగమున ప్రకాశించుచుండ తిరిగి చదువుకొనునంతలో నొక ఒడలు కాలిన రోగి "అమ్మా, అమ్మా, మంట భరింప లేను. నో రెండుకొని పోవుచున్నది. కొద్దిగా మంచినీళ్లీయి తల్లీ!" అని యరవ, మేరీ మంచినీళ్లు పట్టుకొని యతనివద్దకు పరుగు పరుగున పోయెను.

---

# ఫాలనేత్రజ్వాల*

కవిసింహ, డి. రాజశేఖర కవిగారు

నా మాటొక్కఁడ దేల నేను సుతులున్ నాబంధులున్ నాసలుం
బ్రౌముఖ్యావని రాజ్యలక్ష్మియును సర్వస్వంబు నీచేతిదే;
యీమే నియ్యలలోన నుండువఱకిక్లే సాగినన్ జాలు; నా
స్వామిస్నేహము ద్రోలఁ దుచ్ఛములు సప్తద్వీపసామ్రాజ్యముల్.

విమలారణ్య మనోజ్ఞవస్తు వితతుల్ పెక్కుల్ రహింపన్, స్వతం
త్రమహారాజ్యరమాధురంధరుఁ డహార్యస్థైర్యుఁ డావిద్విష
త్ప్రముఖవ్యాఘ్రమహాకిరాతుఁడు కిరాతస్వామి, యాభీమచాం
దమలస్నేహ మెలర్ప వచ్చెను ప్రతాపాధీశ్వరుం జూడఁగన్.

వెనుక ధనంజయవిక్రమ-ఘనుఁడగు సూర్తుంకు ముందుగా ఫాలవిలో
చన సదృశుండు ప్రతాపుఁడు-చని మోఁదిరి సూకరము నిశాతాస్త్రములన్.

ఒకకాడన్ జనియించు రెండుపువుల ట్లొప్పారి మీ రెప్డుఁ గూ
ర్మికినిన్ జేర్మికిఁ దావులై మెలఁగినన్, మిన్నంది మాబోంట్ల మూ
రక హార్షింతుము కాని యుద్ధము లొనర్పన్ జూనినన్ మానసం
బకటా! వ్రయ్యలు వ్రయ్యలై చనదె, కట్టా! చూచి యెట్లోర్తునో.

పలుకష్టమ్ములఁ గూడు నీళ్లు గొన కీబ్రహ్మాండ మున్నంతకున్
దలక్రిం దాచుఁ దపం బొనర్చిన గురుధ్వంసాఘపుంజంబులున్
దలఁగన్ బొలునె? తన్మహానలశిఖల్ దర్పించి, నన్నున్ నినున్
గులమున్ దేశముఁ గాల్పవే? యెటుల నాకున్ దప్పు నిప్పాపముల్.

సమయున్ జేసి కృతాఘపుంజములఁ బశ్చాత్తాపదీప్తాగ్ని శు
ద్ధమతిన్ వచ్చినఁ జోటు లే దనదు వాత్సల్యంబు వారాశి కో
పము జన్మించని దొడ్డతల్లి మన మేవాణ్మాత దాక్షిణ్య హ
స్తముఁ బైఁ గప్పు, శతాపరాధికయినన్ సద్భక్తిఁ బ్రార్థించినన్.

---

* 'రాణాప్రతాప సింహచరిత్రము' నుండి యుద్ధృతము.

కోటిసూర్య ప్రభాంకుండు పృథ్వీసార్వభౌముఁ డీ యవనుల బారి మడిసె;
సర్వజ్ఞతుల్యుఁ డానమరసింహనృపుండు తురకలతోఁ బోరి దొఱఁగెఁ దనువు
సమవర్తిమూర్తి దుర్దమశౌర్యుఁ డా హమీరాయు వున్నంత కాహవ మొనర్చెఁ
గుంభుండు రాజదిక్కుంభి తదర్థమై తన జీవితము నెల్ల ధారవోసె
నింక సంగ్రామసింహభూమీశ్వరాదు-లప్రతీప ప్రతాపులు; యవన సేన
నాఁపి మెండొడ్డి దేహంబు ప్రాణములను-గోరువెట్ట స్వాతంత్ర్యము గొలిచి రపుడు.

ఒకనాఁడా, యొకమాసమా, మఱియుఁ దా నొక్కబ్దమా, వేయియేం
డ్లకుఁ బైనయ్యె, మహమ్మదీయసుభటుల్ లక్షోపలక్షల్ లయాం
తకులై పైఁబడ సాగి; యెంత జనబృందం బున్న మేవాడమా
తకునైనన్, దలమున్కలై, బ్రదుకసాధ్యంబాచుఁ దోఁచించదే?

నాడుముత్తాత చండనృపాలుసంతతివాఁడు దుర్గారావు ప్రళయభైర
వారావ్రుఁడై, వైరు లడలి పారఁగఁ బోరి, పడియెఁ జోండావదన్వయులఁగూడి
యాపైన వచ్చె, మాయవ్వ జవాహిరిభాయి, గాయంబులు వేయుఁ గాఁగ
మహిషాసురేశ్వరమర్దనివలె. రేఁగి,విమతుల నోర్చి, ప్రాణములు విడిచెఁ;
బదియుమూఁడువేలు పడఁతులు గొలువఁ గర్ణావతియును నాదు నాయనమ్మ
రోహితాశ్వశిఖల జోహారు గావించె; - నిట్టి వీరమూర్తు లెందుఁ గలరు?

వైరులు, మాసమాసమును భైరులఁ గోసెడునట్లు, వీరులన్
నాఱులువేలు గోయఁగ; మనోజ్ఞసువర్ణశలాకలట్టు లం
గారశిఖాచయంబులను గాలుచు, వేలకు వేలు స్త్రీలు జో
హారులు సేయ; దేశ మకటా! జనశూన్యము గాక నిల్చునే?

తినదుకండలును రక్తము గ్రుమ్మరించి మేవాణ్మాత వీరసౌభాగ్యలక్ష్మి
యొకవేయియేండ్లుగా నోర్చె నోర్చుచునుండె; శాత్రవతతిపోటు నడలదయ్యెఁ;
దఘాతములకు మాతల్లి శరీరమ్ము కుమ్మొలుపోవుచుఁ గుట్టువట్టె;
నుపచారశతముల నొల్లక పెట్టదు; చిక్కి ఛిద్రములై శల్యావశిష్టమయ్యె;
నామహామాతగతి తలఁపైనయప్పు-డొడలు పరవశమై రక్తముడుకులెత్తుఁ;
గడుపు చుమ్మలుచుట్టు; నేకరణి నామెఁ-దేర్తునని రేయుఁబవలు చింతించుచుందు.

---

# మీ శిరోజముల కొక టానిక్



వేసవి సమీపించుచున్నది. అప్పుడు మాడు మంటపుట్టి వేడిని గలిగించును. శిరోజ ములు క్షీణించును. అట్టి సమయములందు మీ వెంట్రుకల కొకటానిక్ అవసరము. మీ వెంట్రుకలను కాపాడుకొనుడు. వాటిని

## కా మి ని యా నూ నె (రిజిస్టర్డు)

నుపయోగించి పోషింపుడు.

బట్టతల, వెంట్రుకలు రాలిపోవుట, గరుకుదనము మెరుపు, వృద్ధాప్యము రాకముందే వెంట్రుకలు నెరయుట, మున్నగువాటి నాపుటయందు దీనిజయ మెరుగదు. చుండ్రును కుదుర్చును. నెత్తి చర్మమును శుభ్రపరచును. వెంట్రుకలు పట్టుకుచ్చువలె పెరుగుటకు తోడ్పడును. ఇవన్నియుగాక, ఘుమఘుమలాడు దాని సుపరిమళము మనస్సున కానందదాయకముగా నుండును. ఇటీవల వచ్చిన యీ దిగువ యోగ్యతాపత్రికల చదువుడు. మిస్టర్ ఆర్. కె. నాయర్, చన్‌కార, వండిపెరియార్ పోస్టు, (తిరువాన్కూరు) 1-2-1931 తేదీన వారు వ్రాసిన పోస్టుకార్డునం దిట్లు గలదు. రెండునెలలక్రితము మీరు కామినియానూనె పంపినందుకు వందనములు. నేను యీ నూనె నెవరికొఱకు తెప్పించితినో, అట్టి మిసెస్ ఈశ్వరపిళ్లయొక్క శిరోజములకు అద్భుతమైన గుణముల నిచ్చినదని చెప్పుటకు నేను మిగుల సంతసించుచున్నాను. కాబట్టి తిరిగి 12 సీసాల కామినియానూనెను వి. పి. గా పంపకోరుచున్నాను.

వెల సీసా 1-కి రు. 1-0-0 వి. పి. చార్జి 6 అణాలు ప్రత్యేకము.
3సీసాలవెల రు. 2-10-0 వి. పి. చార్జీలు 12 అణాలు ప్రత్యేకము.

## పుష్పోద్యానవనమును జేబునం దుంచుట



OTTO DILBAHAR.

మీ రెప్పుడైనను **ఓ ట్టో ది ల్ బ హా ర్** (రిజిస్టర్డు) బుడ్లను చూచితిరా. ఈ బుడ్డినుంచి ఒక్కబొట్టు క్రిందపడిన, పుష్పవనములోనుండి తాజాగా తెచ్చిన కొన్నివేల కుసుమముల యింపైన పరిమళము నది యొసంగును.

పూర్తినమ్మకము కలుగుటకై, ఉచితముగా నిచ్చెడి నమూనాబుడ్డికొఱకు, పోస్టేజి వగైరాల నిమిత్తం రెండణాల స్టాంపును పంపుడు. పుష్పోద్యానవనమును జేబునందుంచుకొని నూతనానందము ననుభవింపుడు. అంద కి వీలగునట్లు, వివిధసైజుల సీసాలయందు విక్రయించబడుచున్నది.

అర ఔన్సు సీసా రు. 2-0-0 పావుఔన్సు సిసా రు. 1-4-0 ఒకడ్రాం సీసా 0-12-0 అరడ్రాం సీసా 0-8-0.
వి. పి. చార్జీలు 6 అణాలు ప్రత్యేకము. (ఒక్కొక్కదానికి)
ఒట్టోదిల్ బహార్ నమూనాలు ఒక్కొక్కటి 0-2-0 అణాలు. పరిమళకార్డులు ఒక్కొక్కటి ఒక అణా.

# నొప్పులకు, బాధలకు, గొప్ప ఔషధము



## ఆడ్మన్స్ సిప్రెస్—సాల్వ్ (పెయిన్ బాం) (రిజిస్టర్డు)

ఎందుకు బాధపడెదరు? నిద్రపట్టక, అవస్థ యెందుకు? హాయిగా తిరుగుటకు వీలులేకుండ, మోకాళ్లవాపుపొందనేల? ఇవన్నియు

## ఓడ్మన్స్ సిప్రెస్ - సాల్వ్ (పెయిన్‌బాం) (రిజిస్టర్డు)

వలన అతిత్వరలో కుదుర్చబడునుగదా? దీనిని కొంచము తీసికొని, బాధగల శరీరభాగ మందు బాగుగా మర్దనచేయుడు. వెంటనే మీ బాధలు నివారణయయి, దాని మహిమాతిశయములను మీరు గాంచగలరు.

దీనిగుణములను నిరూపించుటకు నమూనాడబ్బీని ఉచితముగా నంపుదుము. పోస్టేజి ప్యాకింగ్ నిమిత్తము రెండణాల స్టాంపుమాత్ర మంపుడు. వెల డబ్బా 1-కి రు. 1-0-0, చిన్నసైజు 0-8-0 అణాలు.
వి. పి. చార్జీలు 0-6-0 అణాలు ప్రత్యేకము (ఒక్కొక్కదానికి) నమూనాడబ్బీలు ఒక్కొక్కటికి 0-2-0 అణాలు.

సోల్ ఏజంట్లు:—**ఆంగ్లోఇండియన్ డ్రగ్ అండు కెమికల్ కంపెనీ,**

నెం. 285 రు, మార్కెట్, తపాలపెట్టె నెం. 2052. బొంబాయి నెం. 2 రు.




మహాత్మా గాంధి—ఫోక్‌స్టోను—ఇంగ్లండు రేవు




మహాత్మా గాంధి—లండను ప్రథమస్వాగతానంతరమున



# ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగదీస్తే గోహత్య

శంకర సీతారత్నాంబగారు

పూర్వం ఒకపూరిలో ఒకరాజు వుండే వాడు. అతనిదగ్గర ఒక బ్రాహ్మణమంత్రి వుంటూ వుండేవాడు. మంత్రి చాల తెలివైన వాడు. రాజ్యాన్ని అనేకసార్లు శత్రువులనుండి కాపాడినాడు. ఒకసారి శత్రురాజొకడు పెద్ద సేనతో యీరాజ్యంపైకి దండెత్తి వచ్చాడు. రాజుకు యేమీ తోచింది కాదు. శత్రు రాజుసేన చాల పెద్దది. మంత్రిని పిలిపించాడు. మంత్రి వచ్చాడు. "ప్రభూ! ఏమిసెలవు" అన్నాడు. రాజు "మంత్రీ! ఇంతకాలంనుంచి నీవు నారాజ్యాన్ని కాపాడుతూవున్నావు. కాని యిక మరి లాభం వున్నట్టు కన్పించదు. మన శత్రురాజు గొప్పసేనతో వచ్చినాడు. ఏమి చేయుటకు తోచడంలేదు. నీవు యేమి చేయ మంటావో తక్షణం చెప్పు" అన్నాడు. మంత్రి వెంటనే "రాజా! మనకు సైన్యబలం తక్కు వున్నా, బుద్ధిబలం వారికంటె హెచ్చు వుంటే వారిని మనం గెలుస్తామన్న ధైర్యం నాకున్నది. కాబట్టి నాచేత నైనంతవరకు పోరాడుటకే నిశ్చయించవలెను. ఈపోరాటానికిమాత్రం మీరు మన రాజ్యంలో నున్న యావన్మంది బ్రాహ్మణులను, పవిత్రమయిన గోవులను తెప్పించి నాయెదుట పెట్టవలెను" అని చెప్పేడు. రాజు, తనమంత్రియొక్క బుద్ధిబలం యెరిగిన వాడుకాబట్టి,తనరాజ్యంలో వున్న యావన్మంది బ్రాహ్మణులను, గోవులను తక్షణం తీసుకు రమ్మని ఆజ్ఞాపించాడు. రాజుగారి సేనలుకూడా వున్నంతమట్టుకు సిద్ధపరిచారు. మర్నాటికి బ్రాహ్మణులు, గోవులుకూడా సిద్ధమయి నాయి. మంత్రి మిగిలినయేర్పాటులన్నీ చేసి, బ్రాహ్మణులదగ్గరకు వచ్చాడు. ఒకొక్క బ్రాహ్మడిని ఒకొక్క ఆవును యెక్కమన్నాడు. ఆలాగు తయారుచేసే సరికి ఆవులపయిన యెక్కిన ఒకవిధమయిన బ్రాహ్మణసేన సిద్ధ మైనది. ఈ బ్రాహ్మణసేనను ముందు నడి పిస్తూ వెనుక సిపాయిలు, రౌతులు మొదలగు వారిని వెళ్లమన్నాడు. శత్రుసేనలు యెదు ర్కొనుటకు వచ్చేయి. ముందు ఆవులపై నున్న బ్రాహ్మణులను చూసేయి. సేనలకు చెయ్యి ఆడింది కాదు. "ఎగదీస్తే బ్రహ్మహత్య, దిగ

దీస్తే గోహత్య". పై నున్న బ్రాహ్మణులకు గురి పెడితే బ్రహ్మహత్య; క్రిందనున్న ఆవులకు గురిపెడితే గోహత్య. ఏమి చేయడానికి తోచ లేదు. చాలసేపు ఆలోచించారు. లాభం లేకపోయింది. మారు మాట్లాడకుండా తిరిగి తమ రాజ్యానికి పలాయనమైనారు. యుద్ధం ముగిసింది. మంత్రిబుద్ధిబలమే తుదకు గెల్చింది. రాజు చాలా సంతోషించాడు. అది మొదలూ 'ఎగదీస్తే బ్రహ్మహత్య దిగదీస్తే గోహత్య' అనే సామెత ఏర్పడింది.

---

## ఛాయాదేవి

కనకదండి గోపాలకృష్ణశాస్త్రిగారు

పూర్వం విశ్వకర్మ అనేఅత నుండేవాడు. అతనిపని ఏమిటంటే తరిమెనపట్టడం. అతనికి కూతు రొకర్తె ఉంది. దానికి పెళ్లియీడు వచ్చింది. వరుల కోసం వెతికి వెతికి సూర్యుడికి ఇస్తే బాగుంటుందని నిశ్చయించి సూర్యుడికి ఇచ్చి పెళ్లిచేశాడు. ఆ పిల్లపేరు ఛాయాదేవి. అత్తారింటికి పంపించాడు సారీ అవీ పెట్టి. పంపిన మొనాన్నే ఓ మనిషిని కుదుర్చుకుని వెంటపెట్టుకుని ఎవరికీ చెప్పకుండా ఛాయాదేవి తండ్రియింటికి వచ్చింది. విశ్వకర్మ చూచి 'ఏమి? నిన్న వెళ్లావో లేదో అప్పుడే వచ్చావేం' అన్నాడు. ఛాయాదేవి 'నాన్నా, నాకొంప ముంచేశావు. నేను వాళ్ల ఇంట్లో నిలవనైనా లేకపోతూన్నాను. వారి కేమైనా ప్రతిక్రియ చేస్తేకాని నేను కాపురం చేయలేను. ఎందులోనైనాదిగి చచ్చిపోతా' నంది. 'అమ్మాయీ, యీ మాత్రానికేనా ఇంత హడావిడి. నాచేతులో నున్నపనేకా. నడు మీవాళ్లింటికి; నేనూ నాయంత్రం తీసుకొని వస్తాను. ఒక్క మారు బాగా నొక్కి తరిమెన పట్టానంటే ఏ వేడీ ఉండదు. అన్నీ ఎగిరిపోతాయి. నీ కేమీ ఫరవా లేదు తల్లీ!' అని ఇద్దరూ బయలుదేరి వెళ్లారు.

సరీగా ఆవేళకి సూర్యుడుకూడా ఇంటి దగ్గరే ఉన్నాడు. విశ్వకర్మ 'ఏమోయి సూర్యుడూ! మాఅమ్మాయి ఇంతవేడి భరించలేనని నిన్న చక్కావచ్చింది. అంచేత కోపగించకు. నాయందు కాస్త దయయుంచి నా యంత్రం మీద కూర్చో. కొంచెం తరిమెన పడతాను. అంతవేడి ఉండదు. కొంచెం తగ్గుతుంది' అన్నాడు. 'సరే'అని కూర్చున్నాడు సూర్యుడు. విశ్వకర్మ బాగా తరిమెన పట్టేశాడు. 'ఇంక దిగు నాయనా' అన్నాడు. తనదారిని తానుబయలుదేరాడు. వెంటనే ఛాయాదేవి పరుగెత్తి వచ్చి 'నాన్నా, నాసంసారం కూలిపోయింది. ఇదివరకే కొంత బాగుండేది. కొంతదూరంలోనైనా నిలవగలిగేదాన్ని ఇప్పుడసే పోయింది. ఎదురుగా నించోలేను. రెట్టింపు వేడి అయిపోయింది. మహాప్రకాశంగా వుంది' అని గోల్లుమంది. 'ఏమైనా సరే, నీభర్తఇంట్లో నీవుండాలి. నాఇంటికెందుకు? నీ కక్కడ చావేనా మంచిదే' అని వెనక్కు పంపేశాడు. తను వెళ్లిపోయాడు.

ఏం చేస్తుంది పాపం. ఎంతదూరాన్ని వుంటే డానికి వీలుగా వుంటుందో అంతదూరాన్నుంచి చూస్తూ కాలక్షేపం చేస్తోంది. అందుకనే అప్పటినుంచీ సూర్యుడు రెట్టింపుగా ప్రకాశిస్తున్నాడు. ఛాయాదేవికూడా సూర్యకిరణాలుఎక్కడ ఆఖరు అవుతాయో అక్కడే వుండి భర్తని ధ్యానిస్తుంది. కథ కంచి కెళ్లింది, మనం ఇంటికి వచ్చాము.

---

## చందమామలో బొమ్మయేమిటి?

ముద్దా విశ్వనాథముగారు (కవితాసమితి)

పూర్వకాలంలో జంతువులు మనవలెనే మాట్లాడుతుండేవి. బుద్ధికుశలత కల్గివుండేవి.

కుందేలు, నక్క, కోతి — ఈమూడు జంతువులూ కాశీనగరందగ్గఱ ఒక అరణ్యంలో ఒకేఆశ్రమంలో నివసిస్తూ, తప మాచరిస్తూ వచ్చాయి. అవి 'స్వార్థం' అంటే ఏమో ఎరగవు. ఐహికభోగములు ససేమిరా, స్మరింపవు. ఎంతసేపూ అతిథిపూజ చేస్తూవుండేవి.

ఒకసాయంత్రం, బ్రాహ్మణు డొకడు ఆ అరణ్యంలో ప్రయాణం చేస్తూ, గాఢతపస్సులో ఉన్న నక్కనుచూచి,

“ఓహో, నక్కగారూ! తాము చాలా ఉదారులని ప్రతీతి. నా కీపూట కడుపునింపుకు నేందుకు ఏదైనా కాస్త ఆధారం కనబరుస్తురూ,” అన్నాడు.

“అంతకంటేనా?” అన్నది, నక్క, ఒక్క మొగురు ఎగిరి,— “ఇవేళ నాకు ప్రశస్తమైన మాంసం దొరకడం, తమవంటి అతిథులు రావడం, ఏం అదృష్టం! నిజంగా పర్వదినం. ఉండండి, నాగుహకు వెళ్లి తీసుకొస్తాను.”

“అబ్బే, నేను మాంసం ముట్టను; అవసరం లేదు,” అంటూ బ్రాహ్మణుడు తిరిగి బయలుదేరినాడు.

వెళ్లి వెళ్లి, తిన్నగా కోతి వున్న ప్రదేశానికి చేరుకున్నాడు. ఒక చెట్టుకొమ్మమీద ఒంటికాలిపై జపం చేస్తూంది, మర్కటం. బ్రాహ్మణు డింకా పెదవి విప్పనేలేదు, అతనిమనస్సు కనుపట్టి, ఇన్ని మామిడిపండ్లిచ్చి సత్కరించింది.

“నేను పండ్లూ తినను” అని చెప్పేశి మళ్లా తనదారి పట్టినాడు బ్రాహ్మణుడు.

కుందేలు సమాధిలో వున్నసమయాన బ్రాహ్మణు డక్కడ సమీపించి,

“అయ్యా! కుందేలుగారూ! బ్రాహ్మడిని; మూడురోజులనుంచి పస్తు. కడుపు మండిపోతూంది, కాస్తధర్మం,” అన్నాడు.

అట్టే పర్యాలోచన చేసింది, కుందేలు. “నేను ఇయ్యగలవస్తువల్లా గడ్డికదా, బ్రాహ్మణుని కదేం పనికొస్తుంది? కనుక, నేనే అతని కాహారమైతే, కొంతలో కొంతయినా సదుపాయంగావుంటుంది”అనిఅనుకొన్న దిమనస్సులో.

"బ్రాహ్మడా! నీవు నిప్పు ప్రయత్నం చెయ్యి, నీకు భోజన సదుపాయం అమరుస్తా" అని చెప్పింది.

అంతట నాలుగు చితుకులు ప్రోగుచేసి కొని వచ్చి, బ్రాహ్మణుడు మెల్లిగా అగ్గి రాజేసినాడు. బాగా రగులుకుంది. ఆపళంగా కుందేలు ఆనిప్పులో వురికింది.

కాని వింతలో వింత! ఆ కుందేటి శరీరం తగులబడ్డానికి బదులు, చెంగల్వపూలు పఱచుకొని పడుకుంటే ఎలా గుంటుందో, అంతచల్లననిపించింది, దానికి. అతిథివైపు తిరిగి, "ఇదేమిటయ్యా! నిప్పు బాగా ఎగసంతోయ్యి, నా వళ్లు దహానం కాకుండా వుంది" అన్నది, కుందేలు.

తత్క్షణమే, చెట్లకంటె పొడుగ్గా ఎదిగిపోయి, దివ్యమైన తన విశ్వరూపం దాల్చినాడు, బ్రాహ్మణవేషధారి.

"ఔదార్యము గల నా చిన్ని కుందేలా నేను ధర్మదేవతను. నిన్ను పరీక్షించడానికే ఇల్లా వచ్చినాను. నీ వుదారత అపారము. నేను చాలా మెచ్చుకున్నాను. నీపేరు భూలోకంలో శాశ్వతంగా వుండిపోయేటట్టు చేస్తాను," అన్నాడు.

అంటూ—ఒకకొండ పిండినాడు, రసం వచ్చింది. ఈరసం సిరాగాను, ఒక కొండశిఖరం కలంగాను వుపయోగించి, ఎల్లప్పుడూ మనుష్యులందరకూ కనబడేలాగ, చందమామ మీదనే కుందేలుబొమ్మ లిఖించినాడు.

చందమామమీద కనబడే ఈబొమ్మ చెరిగిపొయ్యే పర్యంతమూ, ఔదార్యమును గుఱించిన ఆదర్శప్రాయమగు ఈ చిన్నిగాథ హిందూబిడ్డల హృదయాల్లో మెలగుతూనే వుంటుంది.

---

## బాలభాష

యం. వి. పాపన్నగుప్తగారు

"ఝుం గజగపత్తి
జున్నారిపత్తి
రాళ్ళపత్తి
రఘుపత్తి
బిడ్డల్లారా! బీగా లేసుకొండి
తల్లుల్లారా! తాళా లేసుకొండి."

పసిబిడ్డలు చుట్టూ కూర్చొని చేతుల రెండింటిని కడుపునకు దగ్గరగా నుంచుకొని తలను పైకెత్తుకొందురు. వారిలో నొకరిని దొంగనుగా చేతురు. ఆత డించుక దూరముగ గూర్చొని తలను పైకెత్తుకొని నాలుక నల్లాడించుచూ గూర్చుండ వలయును. ఇంతలో పై వాక్యముల నుడువుచు నొకరు తమ చేతిలోని పత్తివుండను యెవరిచేతనో వుంచెదరు. అందరు గూడ తలను క్రిందికి వాల్చి మిన్నకుందురు, ఇంతలో దొంగగా యేర్పరచబడ్డవాడు తటాలున పత్తివుండగల వాని బట్టుకొనవలయును. లేనంతట తిరిగి యాతడే దొంగగా బరిగణింప

బడును. ఈ మాట చాల వినోదముగ నుండును.

"అక్కమ్మతోటలో బిక్కి కూర
కోసిన కొడవలి ముక్కబోయ.
చిమిడేసి వండితే చిమిడిపోయ
పాలు బోసి వండితే పాశిపోయ
నేయి వేసి వండితే నేరమాయ
సారి! గిలగిల! అమ్మయ్య! గిలగిల!
అక్కయ్య! గిలగిల! చక్కిలి గిలగిల"

అని పసి బిడ్డలను నవ్వించుచుందురు.

"కొండక్రింద యిల్లు గట్టె మామామగారు
కోరి కొడుకుల గనె మాయత్తగారు
వండనూ ఒకమఱది వార్చ నొకమఱది
వండుకుండాలకాడ వుండాడు మఱది
యిల్లలికి ముగ్గు బెట్టి యింటిమగవారు
పెద్దినుము పేడెత్తె పెద్దమామగారు
చిన్నినుము పేడెత్తె చిన్నమామగారు.
అమ్మమ్మ! వీరింటికి
ఏమిం! జూచి యిస్తి వమ్మ"

అని హాస్యము జేయుదురు.

---

## రాటపుపాట

శ్రీ మతి

(రాటము త్రిప్పుసమయమున ఈపాట పాడుదురు.)

జిమ్మి జిమ్మి కదురు
జిమ్మేటి కదురు
పాలేటి కదురు
పడమటికొండ
కొండమీదగుండు
కొక్కెరసాన
సానమెరుపులు
సంకెతాళాలు
దేవుడిచ్చిన పెద్దఫిరంగి
ఫిరంగిముందల కర్రెద్దు
కర్రెద్దుమెడలో మున్నారుగంట
గంటలోపల భీముడు పుట్టంగ
అన్నా అన్నా మనావు లెన్ని
ముందలబోయే మున్నారు
వెనకాలవచ్చే ఏన్నూరు
నడానవచ్చే నన్నూరు
తల్లి చచ్చిన పుల్ల పెయ్య
తలనిండా తలంబ్రాలు పోసుకొని
దొడ్డి దొడ్డీ తిరిగి దోరావునేతికి
మందమందా తిరిగి మట్టావు వెతికి
అయ్యయిపోగయి గజ్జలగుంటకు
సీళ్లకుపోతే
గజ్జలుగలలాడే
పుట్టలోనినాగన్న బుస్సుబుస్సనె
దంణానికోకలు దడదడలాడే
పెట్టెలోని ఉరచాల్లు పెడ బొబ్బలేసి
కోటలోనున్నది కొమ్మయేనుగుపిల్ల
తగిలి తగిలెయ్యి తాబేటిబుట్ట.

---



కమ్మిపని ౨

కొ. నరసింహాచారిగారు

లోటాస్టాండులు

ఈవ్యాసమున రెండువిధములగు లోటా స్టాండులను చేయు విధము చెప్పబడును. ఒక స్టాండునందు మూడు లోటాలును, మఱియొక స్టాండునందు నాలుగు లోటాలును ఉండ వచ్చును.

మూడులోటాల స్టాండు

ఒక్కొక్కటి సుమారు 24 అంగుళముల నిడివిగల రెండుకమ్ములను దీసికొని, అందు ఒక దానియొక్క రెండుకొనలయందును 2 అంగుళముల వ్యాసముగల ఉంగరములను చిత్రము A యందు b, c, లలో జూపినవిధమున వంచవలెను. పిమ్మట ఉంగరములవద్ద నుండి అర యంగుళము వదలి తక్కిన కమ్మిని చిత్రము B యందు f వద్ద చూపినరీతిని వంచుకొనవలెను. పిమ్మట రెండవకమ్మిని దీసికొని, దానియొక్క ఒకకొనయందు మాత్రము 2 అంగుళముల వ్యాసముగల ఉంగరమును (b,c, లకు సమానమయిన దానిని) చిత్రము C యందలి విధముగ వంచవలెను. కమ్మియొక్క రెండవ కొనను t వద్దనుండునట్లు కొక్కిగా వంచవలెను. పిమ్మట B C కమ్ములనుచేర్చి, b c d ఉంగరములు ఒకేమట్టమున నుండునట్లు పట్టుకొని C అను కమ్మిని B యొక్క పై వంపు



చుట్టును చిత్రము D లో f వద్ద చూపినట్లు చుట్టవలెను. అప్పుడు మూడు ఉంగరములు చేరియుండును. ఉంగరములు కదలకుండుటకై Q యందు దుండునట్లు మూడు తునుకలను వంచుకొని b. c. d. అను వలయములను, చిత్రము d యందు y వద్ద చూపినవిధముగ బిగించవలెను.

నాలుగు లోటాలస్టాండు

24 అంగుళముల నిడివిగల ఒకకమ్మిని దీసికొని దానిని పూర్వము a వద్ద చూపిన విధమున వంచుకొనవలెను. పిమ్మట రెండు ఉంగరములు మధ్యభాగమును 1 వ చిత్రము వలె వంచుకొనవలెను. సుమారు 20 అంగుళముల నిడివిగల మఱియొక కమ్మిని దీసికొని దానినిగూడ A వలె వంచుకొని పిమ్మట చిత్రము 2 వలె వంచుకొనవలెను. 1 వ చిత్రమున ఉంగరములమధ్య పైకి వంచబడిన k అను భాగము, 2 వ చిత్రమున ఉంగరముల మధ్య పైకి వంచబడిన l అను భాగము నకన్న ఎత్తుగ నుండును. ఈ రెండుకమ్ములను, వాటి ఉంగరములు నాలుగును ఒకేమట్టమున నుండునట్లు 5 వ చిత్రమునందువలె చేర్చిపెట్టవలెను. 3 వ చిత్రమువంటి కమ్మిని వంచుకొని దానిని h, h అను ఉంగరములు గల కురుచ కమ్మియొక్క పైభాగమునకు సరిగా పెద్దకమ్మియొక్క ప్రక్కలకు W W వద్ద బిగించవలెను. (చూడుడు: చిత్రము 5.) పిమ్మట 4 ఉంగరములును కదలకుండుటకై ౧౧౧౧ వద్ద సన్నని కమ్మితో కట్టవలెను.

తర్వాత స్టాండును వ్రేలాడగట్టుటకు చుట్టును తిరుగునట్టి revolving hanger ను చేయవలెను. 4 అంగుళముల నిడివిగల కమ్మిని దీసికొని 4 వ చిత్రమునందలి రీతిగ దానికొనలను వంచుకొనవలెను. పిమ్మట దానిని 6 వ చిత్రమునందలి విధముగ వంచవలెను. అటు పిమ్మట 3 వ చిత్రమువంటి కమ్మిని మఱియొక దానిని వంచుకొని దానిని 6 వ చిత్రము యొక్క కొనలయందలి ఉంగరములలో దూర్చి 7 వ చిత్రమునందువలె బిగించవలెను. పిమ్మట దానిని 5 వ చిత్రమునందలి S యందు వలె స్టాండుకు బిగించవలెను.



---

# "ఏనాఁడు?"

మల్లవరపు విశ్వేశ్వరరావుగారు

ఏనాడు నీమోవి
లేనవ్వు పొల్చునో
ఏ రేయి చీకట్ల
నీచేయి తుడుచునో
ఏప్రొద్దు పొడుపులో
నీప్రేమ మొలుచునో
    ఆనాడు ఆ రేయి
    ఆప్రొద్దె రేకెత్తు
    నావాడినట్టి గుం
    డెలలోని పూగుత్తి!

మరిగి కష్టపుటలల్
విరిగి తుంపర లౌను
వేగి నిశ్వాసముల్
నీగు తుత్తునియలై
మొయిలుచాటున దాగు
మయిలకన్నీ రవును,

    అప్పుడో చిరునవ్వ!
    అప్పుడో చిగురాకు!
    రెప్పపాటున ముద్దు
    లప్పగింతును నీకు!

గాలిలో రెపరెపల్
తేలి వచ్చు న దెప్పు
డే తమస్సులకొసల?
నే యుషస్సులదెసల?
నింగిలో చుక్కలో
త్రొంగి చూచు సువార్త
చెంగుచెంగున వచ్చి
మ్రింగు నాదునిరాశ
    ఎప్పుడో చిరుకన్నె?
    చెప్పవా చిరుకన్నె?
    చెప్పవా, చెప్పవా
    చెప్పవా చిరుకన్నె?




---

# ఊర్మిళ

(శివప్రసాద దళపతిరామపండిత కృతము)

అనువాదకుడు: తటవర్తి సూర్యనారాయణగారు

ఊర్మిళ భారతదేశమం దొక యద్భుతలలనారత్నము. మన ప్రాచీనకవీశ్వరు లీమెయెడ చాల అన్యాయ మొనర్చిరి. ప్రాచీనకవులు సంస్కృతప్రాకృత భాషలందు తమరసపూర్ణకవిత్వములచే భారతదేశవాసినుల అనేకుల చారిత్రములు వర్ణించియుండిరి. కాని యూర్మిళచరిత్రము కొంచెమైనను వర్ణనము చేసియుండలేదు. స్వభావతః కవీశ్వరు లుచ్ఛృంఖలులుగను, నిరంకుశులుగను నుందురు. వార లెటు లొనర్పదలచిన నటు లొనర్తురు. తలచినచో దూదినైనను పర్వతముగ నొనర్తురు. లేనిచో హిమాలయమునంటి పర్వతమునైనను కన్నెత్తియైన చూడరు. ఉదాసీనోచ్ఛృంఖలత్వములు సాధారణతరగతికవులయందును కలుగుచున్నవి. కాని యాదికవియగు వాల్మీకి మహాశయుడును ఇందువిషయములో దప్పించుకొనజాలకపోయెను. పక్షియుగ్మమందు ఒకశకుంతమును వ్యాధు డొకడు వధించుచుండ నీకవిశిరోమణి హృదయము దుఃఖవిదీర్ణమై హఠాత్తుగ "మా నిషాద ప్రతిష్ఠాం త్వం" మొదలగు వాక్యములు వెలువరించియుకూడ రామాయణరచనాకాలమం దొక నవవివాహితవధువును పూర్తిగ మరచిపోయెను. ఈవిపద్గ్రస్తనవవధూవిషయమై లేశమాత్ర వేదనను ప్రకటించియుండలేదు.

ఊర్మిళ జగత్ప్రసిద్ధ మేదినీశ్వరుడును, మిథిలాపురీశ్వరుడును నగు జనకుని కుమార్తె. సీతాదేవి కనుజ. అనన్యభక్తుడును, శ్రీరామచంద్రుని సోదరుడు నగు లక్ష్మణుని భార్య. వాల్మీకి రామాయణపాఠకులకు ముందుగా జనకపురమందు సీతామాండవీశ్రుతకీర్తులతోపాటు ఊర్మిళదర్శనము గలిగించెను. సీతచరిత్ర మందరు నెరింగినదియే. సీతారాముల చరిత్రము వర్ణించుటకే రామాయణము లిఖింపబడెను. మాండవీశ్రుతకీర్తులకు సహస్రపాదకాధికపతివియోగ మనుభవింప నక్కఱలేకపోయెను. కాన వారల చరిత్రమం దేవిశేషమును లేదు. ఇక బాలవియోగినియగు నూర్మిళగూర్చి వక్కాణింతము.

ఈమె చరిత్ర మన్నివిధములను ప్రశంసాయోగ్యమయినను కవీశ్వరు లట్లొనర్పక అన్యాయ మొనర్చిరి. వాల్మీకీ, ఎందుకు నీ కీ దేవిపై యింతటి యుపేక్ష? సమస్తసుఖవిరహితయగు నూర్మిళవిషయమై కొంచెమైనను పక్షపాతము జూపలే దేమి? తాపసుల శరీరము లహోరాత్రములు తపశ్చరణమువలన కఠోరములైయుండునా?—ఈకవితల్లజుండు కటుత్వకఠోరత్వప్రియుండు కాడని యితని గ్రంథమును జదివిన తెలియుచున్నది. కనుక నే మిది యూర్మిళ భాగ్యదోషమని తలంతుము.

వాల్మీకి యొకసారి వివాహావేషమున జనకపురమం దూర్మిళాదర్శన మొనర్చి యున్నాడు. అయోధ్య కరిగినతరువాత శ్వశురగృహమున నెటు లున్నదో యొకసారియైనను తెలియజేయలేదు. ఇదియేకాదు, లక్ష్మణవనగమనావసరమున 'లక్ష్మణాశ్రువులు తుడుచుట' మొదలగు సమయవర్ణనములుగూడ నీతనికి సరియని తోచలేదు.

రామచంద్రాభిషేకమునకై నందనోద్యానమట్లు అంతఃపురమంతయు జక్కగ నలంకరించిరి. ఊర్మిళయు సంతోషతరంగముల నీదులాడుచుండెను. నిజపత్యారాధ్యుడైన రామచంద్రుడు రాజసింహాసనాసీను డగుట యూర్మిళ కెంతయు సంతోషజనక మగుచుండెను. కాని భాగ్యహీనతచే పైయుత్సాహ మంతరించెను. రాముడు సింహాసనాసీను డగుటకు మారుగ వనవాస మొనర్పవలసివచ్చెను. భ్రాతృభక్తుడగు సౌమిత్రి యన్నతో వనగమనోద్యుక్తు డయ్యెను. అంతట నూర్మిళ కా సంగతి యొక ముహూర్తమునకు తెలియవచ్చెను. వెంటనే ఖండితకదళీతరువువలె మూర్ఛితయై నేలగూలెను.

లక్ష్మణుడు స్వాభావిక ప్రేమచే, రాజ్యకార్యముల నన్నిటిని వదలి, నిజశరీరము సోదర సేవావశ మొనర్చి రామచంద్రునితో నడవి కేగెను. ఈవిషయము చాల మహత్త్వపూర్ణ మైనది. కాని యూర్మిళ యొనర్చిన యాత్మోత్సర్గ మింతకంటె నధిక మైనదని చెప్పవచ్చును. ఆర్యలలనలకు ప్రాణాధికవస్తు వొకటి యుండును. అది ప్రాణాధారపతియే. కాని యుదారచిత్త యగు నూర్మిళ సీతారాములసేవకై ప్రాణాధికుడైన పతిని త్యజించెను. నిజసుఖము, భోగము త్యాగ మొనర్చెను. అదియు నేవయసున? ఏసమయమున? వివాహ మైన కొలది కాలమునకే యీమహాకార్య మొనర్చెను. నిజ సాంసారిక సుఖాశను త్యక్త మొనర్చెను. అదియు నొకటి రెండుమాసములవరకు గాదు; పదునాల్గుసంవత్సరములవరకు. పాఠకసోదర సోదరీమణులారా! కొంచె మాలోచింపుడు. ఊర్మిళ వివాహ మైనవెంటనే పతితో ననుభవించిన యౌవనసుఖములో పదునాలుగేడులు పతివియోగము సహించిన పిదప ననుభవించిన సుఖము సమానమగునా? వివాహిత యగుటతోడనే సీతారాములకై తన సుఖసామ్రాజ్యమును నిరాకరించినది.

ఇద్దరు నొకేయింటి బాలిక లగుటచే సీతకును, ఊర్మిళకును సమానముగ పతిసేవ, పతిభక్తి, పతిప్రేమ మొదలగు శిక్ష లొసంగబడెను. సీతకువలెనే మన యూర్మిళకును పతిసంబంధభావనలు దృఢముగను, సున్నితముగను నుండెను. పాతివ్రత్యధర్మముల నీమె బాగుగా గ్రహించియుండెను. సీతవలె నీమెయు పతివెంట నంత సంతోషముగనే వనమునకు జనియుండును. కాని యామె తెలిసియే యట్లొనర్ప లేదు. ఆమె తలచిన దేమనగా, తానుగూడ నడవికి జనినచో లక్ష్మణునకు—తనకు సంతోషము గూర్చుటయందు, సుఖ మొనగూర్చుటయందు నెక్కువకాలము వెళ్లబుచ్చవలసియుండును. అందువలన సీతారాముల సేవాశుశ్రూషలయందు కొంచెమైనను లక్ష్మణునకు విఘ్నము కలుగకపోదు. ఈస్థితిలో పరమారాధ్యులగు సీతారాముల లక్ష్మణుడు తగినట్లు సేవింపజాలడు. తన సుఖమునకై పతియొక్క ధర్మపాలనమందు లేశమాత్ర మైనను లోప ముండరాదని యామెతలంపు. మరియు నందరు నడవికి జనినచో పూజ్యులగు నత్తలు—కౌసల్యా సుమిత్రలకు మనఃపూర్తిగ సేవయొనర్చువారలు ఎవ్వరును లేరనికూడ యామె తలంచెను. ఇవన్నియుకూడ నాలోచించియే సీతవలె నడవికి తాను జనియుండ లేదు. ఈవిషయమై గంభీరముగ మన మాలోచించినచో నూర్మిళచరిత్రమం దీవిషయ మత్యంతమహత్త్వపూర్ణ మైనదని గోచరింపకపోదు.

కాని యూర్మిళవిషయమైన హిందీకవిశ్రేష్ఠుడగు ‘తులసీదాసు’ కూడ ఆదికవియగు వాల్మీకినే యనుసరించెను. అతడును వనవాసగమనసమయమున నూర్మిళా లక్ష్మణుల ప్రసంగము నొనర్చియుండ లేదు.

సరేకాని, భవభూతిమాత్రము కొంచె మీవిషయమై దయను కనబరచినాడు. సీతారాము లడవినుండి తిరిగి వచ్చినతరువాత భవభూతి కొకసారి యూర్మిళ జ్ఞాపకమువచ్చెను.

ఎట్లు? చిత్రపటప్రదర్శనమం దూర్మిళను గాంచి లక్ష్మణుని సీత “ఇయమ ప్యపరా కా?” (లక్ష్మణా, ఈరెండవయామె యెవరు) అని అడిగెను.

ఈవిధముగ వదినె మరది నడుమగుటయం దొక కుతూహలమే కాక స్వారస్యముకూడ నున్నది. కాని సౌమిత్రి యాభావము నెరుంగకపోలేదు. ఊర్మిళవిషయమై యడుగుచున్నదని తలంచి తనమనస్సులోనే లజ్జపడి జవాబేమియు చెప్పక ఆవిగ్రహమును చేతితో గప్పివైచెను. చేయి వైచుటయే తడవుగ మూయబడిన యాచిత్రము నేటిదనుక తెరువబడియుండ లేదు. ఆ రోజునుండియే యూర్మిళ యుజ్జ్వలచరిత్రచిత్రము కవీశ్వరులచే చిత్రింపబడక మరుగుపరుపబడుచున్నది. ఏమైనను సరియే కాని విద్వాంసులకు ఊర్మిళచరిత్రమామె నాటి చరిత్రమందలి విదుషీమణుల చరిత్రములవలెనే యత్యంతోత్కృష్టత నొంది లోకోపదేశప్రదమై చెలంగినదని చెప్పకతీరదు.

అన్యాపదేశశతకమునుండి

కొమాండూరు కృష్ణమాచార్యులుగారు

వనములఁ బూరిమేసి గిరివాహినులన్ దెలినీరుఁ గ్రోలి కా
ననముల సంచరించు హరిణంబులు సేసిన దోస మేమొకో
వనచరులున్ వనాగ్నులును వ్యాఘ్రములున్ బసిపట్టి చంపునం
చను టదియేల మౌనులకు నాస్తరణంబులు వాని చర్మముల్.

తలపై పట్టెడ మొండు చుట్టితిరుగన్ దప్పేమి మత్తేభ య
య్యళినాథుల్ వెలయిచ్చి కొంటివొకొ నీ వక్కైన విక్రీతదా
సులకున్ లేవొకొ భుక్తిపాన లకటా శూర్పోరుకర్ణద్వయీ
దళితుల్ జేతు నిరంకుశుండవును దుర్ధర్షుండవౌటన్ గదా.

అంటనిరానిదాను వికృతాకృతియైను మలీమసాంగమై
తుంటరిదా నికృష్టమగుఁ దుచ్ఛమగున్ గరటంబు; కాని యాఁ
కంటఁ గృశించియుండియును "కా" యని చుట్టలఁ బిల్వకుండ దా
నొంటరియై భుజింపదఁట యుర్వర ధన్యతముం డెవం డిఁకన్

సర్వజ్ఞుండగు, శంకరుండగు, మహేశానుండగున్, భర్గుఁడౌ
సర్వాభీష్టఫలప్రదాతయు నగున్ సత్యంబు; కానిమ్ము హో
దుర్వారాహికపాలకాంచన మహాదుర్గంధ చర్మాంబరా
ఖర్వోద్విగ్నపదార్థసంగతులు నీకా, పొమ్ము రాజోత్తమా!

పచ్చను మూర్కొనున్ దిరుగు పైమునరున్ రొదసేయు పాయుచున్
విచ్చుచు నుండుఁగాని యొకవీసము తేనెను ద్రావ వీగ ల
త్యుచ్చమహీధరాగ్రమున నున్నను వానిని బల్మిఁదోలి నే
ర్పచ్చుపడంగఁ గ్రోలును గృతార్థతముం డొకఁ డిచ్చ మెచ్చుచున్.

భూరివిషాగ్నులన్ ద్రిజగముల్ దహియించు మహాహివర్గమున్
గ్రూరతరేక్షణద్యుతుల రూపడఁగించు ఖగేశ్వరుండు మా

ర్వారభుజంగభుగ్నకులజాతసహాయ మపేత సేయునే
వారకశత్రు లోకబలవర్ధనుఁడంచు సమీరు దూరునే.

శిరమునఁ బక్షిసంఘము విశృంఖలతన్ వసియించు వానరో
త్కరములు గొమ్మలన్, భుజంగతండము మూలములన్ గభీరకో
టరములఁ గాకభీరుసరటాకులముల్ సుఖముండఁ గాదె యో
తరువర,నీడ సధ్వగుఁడు దార్కొనకున్నను లోపమున్నదే.

రవి తపియింపనీ, జలధరంబు జలంబులఁ గ్రుమ్మరింపనీ
ప్లవగులు గట్టనీ, దివిజవర్గములున్ దనుజుల్ మథించనీ
అవిరళవాహినుల్ శశియు సంగము వొంగఁ జెలంగనీ జలో
ద్భవశిఖ గాల్చనీ వనధి తాపము నొందదు పొంగ దెప్పుడున్.

ఏ యవనీజమూలము సతీశ నివాసవిలాస భాసురం
బే యవనీజపత్రము రమేశుని సెజ్జ యుగాంతవేళలం
దా యవనీజమా వటము నాత్మఁ దలంపరు మ్రొక్కుచుందు ర
త్యాయతభూతరాక్షస మహాహిభయంకర మైన రావికిన్.

జలచరనాదముల్ నదుల చండతరార్భటు లౌర్వనామక
జ్వలనచటచ్ఛటారవము పైఁజను నౌకల చక్రఘుంకృతుల్
అలఘు జలాంతరాద్రికుహరాంతర నిస్సరదూర్మికాండ సం
కులవిచలన్మహాజలధి ఘోషమునంద యడంగిపోవనే.

— — —

# ఋగ్వేదకాలము-స్త్రీలు

గర్భాం అప్పారావుగారు, బి. ఏ.

ఋగ్వేదకాలమ్మున గృహము సర్వాంగశోభితమై యొప్పుచుండెను. జనకుడు గృహయజమాని. వైవాహికపద్ధతు లన్నియు క్రమముగా జరుపబడుచుండెను. వైవాహికాచారమే గృహనిర్మాణమునకు పునాది. తాత్కాలికమగు క్షుద్రజంతు స్త్రీపురుషసంబంధము గృహనిర్మాణమునకు హేతువయి యుండదు. అబలయగు స్త్రీ తనకు కష్టదశ వచ్చినపు డాత్మసంరక్షణార్థమును, శిశుసంరక్షణార్థమును తగినవరుని జూచుకొనవలసివచ్చెను. ఇట్లు తన సర్వస్వ మావరుని కొప్పజెప్పకమున్నె పరస్పరసాహాయ్యనిబంధన నేర్పరచుకొనెను. స్వాభావికముగా స్త్రీ వరు నెన్నుకొనుటలో వానిసౌందర్యము, యౌవనము, బుద్ధి, బలము, సమయానుకూలవర్తన గమనించును. ఇట్టివిషయము లన్నియు గమనించి యెన్నుకొనిన వరునియం దెక్కుడు ప్రేమ గలిగియుండక తీరదు. పురుషుడు తన కన్నివిధముల తోడ్పడి సౌఖ్య మొనగూర్చుట కత్యుత్సాహము గలిగించుటకై యాతని నెంతయో ప్రేమించును. ఇట్లు ప్రేమించిన స్త్రీయం దతడును అనురాగము గలవాడగును. పరస్పరానురాగమే గృహ మేర్పడుటకు మూలము. ఆగృహ మొక కొండగుహ గాని, పర్ణశాల గాని, కుటీరము గాని కావచ్చును. దంపతులు పైకి వెడలునప్పుడు సంగ్రహించిన ఫలకందమూలములందు పాల్గొని రుజాపీడితులై యున్నపుడు పరస్పరసాహాయ్య మొనర్చుకొనెడివారు. ఎడతెగని యిట్టి సాంగత్యముచే వారి ప్రేమాంకురము వృద్ధి పొందుచు నాత్మత్యాగము, పరోపకారబుద్ధి వారికి కలుగుటకు మూలమయ్యెను. యువకుడగు నితరపురుషు డెవడేని కంట బడునపుడు గుహలో ప్రవేశించుచుండిరి. అచ్చట శీతోష్ణవర్షబాధలనుండి రక్షింపబడుచు శిశువుతోగూడ సురక్షితముగా నుండిరి. కావున స్త్రీవ్యక్తియే ఆధిభౌతికాధ్యాత్మికాధిదైవికశక్తిస్వరూపమై యిప్పటి నాగరికతాప్రభావమునకు జననియై యున్నది. వేలకొలది సంవత్సరముల క్రిందట విశ్వామిత్రమహర్షి స్త్రీశక్తి ప్రభావమును హృష్టాత్ముడై ప్రశంసించుచు 'గృహిణియే గృహ' మని వచించెను. మానవజాతి నహాగరికస్థితినుండి యౌన్నత్యమునకు లేవనెత్తినది స్త్రీవ్యక్తియే. ఆర్యు లెన్నడు స్త్రీని మానవజాతిపతనమునకు హేతువని నుడువలేదు. భూలోకమును స్వర్గసమానము చేసి మానవజాత్యభివృద్ధికిని, సౌఖ్యమునకును స్త్రీవ్యక్తియే యాధారభూత మని యార్యులు నమ్మెడివారు. సర్వప్రపంచము ప్రకృతిపురుషసంయోగజనితమని యార్యాశయము. ప్రకృతి స్త్రీయును, పురుషుడు మానవుడును. వీరే గృహజననమునకు కారకులు.

గృహిణి భర్తకు ప్రేమాస్పదురాలు. భక్తివిశ్వాససమన్విత. వినయగుణవిశోభిత. భర్త కోరిక ప్రకారము ప్రవర్తించెడిది. భర్తను సంతసింపజేయ నతని యెదుట హసితవదనయై యుండెడిది. అత డింటికి వచ్చుసరికి విశ్రాంతికొఱకై శయ్యాసనములు సిద్ధపఱచు చుండెను. భర్త నిట్లు ప్రేమతో బూజించి బిడ్డలయెడ గారాబము జూపి వారిని సంరక్షించుచుండెడిది. గృహమును సంతోషపూరితము చేయువారు బిడ్డలు. శిశు వాకలి గొనునపుడు జనని శిశువును గృహాంతరమునకు గొనిపోయి స్తన్య మిచ్చుచుండెను. స్తన్యపాన మొనరించు శిశువుతోగూడిన జనని దర్శనీయయై కన్నులపండు వొనరించుచుండెను.

ఋగ్వేదమున గృహిణి గృహదీపికయని వర్ణింపబడెను. సూర్యోదయమునకు మున్నె లేచి తక్కినవారిని మేల్కొలిపి గృహసమ్మార్జనము, భాజనపారిశుద్ధ్యము మున్నగు గృహకృత్యములందు ప్రవేశించు చుండెను. స్నానమొనర్చి సభర్తృకయై గార్హపత్యాగ్నిని బూజిం

చుచుండెను. ఇట్లు మాధ్యాహ్నిక సాయంకాలముల యందుగూడ నగ్నిదేవుని బూజించుచుండెను. ఈ పవిత్రాగ్ని నిత్యము వెలుగునట్లు చూచుట యామెకు ప్రథమ కృత్యము. పాలు పితుకుట, మజ్జిగ తరుచుట మున్నగు పనులు తీరిన తరువాత వంట ప్రారంభించును. ఈతరుణమున తనకుమార్తెలు శిశువులను జాగ్రత్తతో జూచుచుండిరి. మధ్యాహ్నభోజన మయిన పిదప శిరోలంకారము, ధౌతవస్త్రధారణ మొనరించి పిల్లల నందఱ నట్లే యలంకరించి సాయంకాలము వంట జేసి పిల్లలకు భోజన మిడి వారిని నిద్రపుచ్చును. ఆమె సేవకులచే గృహకృత్యములు కొన్ని నెరవేర్పించి గోవులను, తదితరవస్తువులను సరియైనస్థితిలో నున్నదియు లేనిదియు బరికించుచుండెను. అప్పుడప్పు డామె గృహప్రాంతమం దున్న చిన్నతోటలకు బోయి పుష్పములను గోసి పూజకై కొనివచ్చుచుండెను. ఆమె యత్తమామల యెడను, భర్తృసోదరులయెడను ఉచితభక్తివిశ్వాసములతో మెలగుచుండెను.

ఋగ్వేదకాలమునుండి నేటివఱకు సుతులు లేని గృహము సౌఖ్యవిహీనముగా పరిగణింపబడుచున్నది. ఆకాలమున సుతులు కలుగుటకై క్షీరమిశ్రితమగు సోమరసముతో దేవతల నారాధించుచుండిరి. బుద్ధిబలముచేతను, దేహబలముచేతను, ప్రవర్తనచేతను మిన్నయగు సుతు ననుగ్రహింప దేవతల ప్రార్థించెడివారు. జ్యేష్ఠపుత్రుని వివాహానంతర మాతని భార్యయే గృహాధికారమును స్వీకరించి సర్వకృత్యములు నెరవేర్చుచుండెను. సుతులు లేనపుడు పుత్రుల బెంచుకొనెడువారు. కాని యీపుత్రుడు పెద్దవాడైనతరువాత కన్న తలిదండ్రుల చిత్తవృత్తి ననుసరించుచు దత్తజనకుల దుఃఖమునకు హేతువగుచుండెను.

పుత్రికాజనన మంతగా హర్షింపబడుట లేదు. పుత్రిక దుహితృనామమున నొప్పుచుండెను. ఈపదము దుహ్ = పాలు పితుకుట (to milk) అనుధాతువునుండి కలిగినది. ఆకాలమున వివాహము కాని పెద్దకుమార్తెలు పాలు తీయు కృత్యమునందు నియోగింపబడు చుండిరి. పుత్రికాజననము తలిదండ్రులకు సంతాపజనకమై యుండెను. ఏలన, నామె యింకొకయింటి కేగవలెను. ఆమె సౌఖ్య మన్యకుటుంబమునకు జెందిన పురుషునిపై నాధారపడి యుండును. అభర్త యామెను సరిగా పోషింపగలిగినవాడు కాకపోవచ్చును. కన్యకూడ భర్త నెన్నుకొను నాచారము కలదు. కాన ననుభవహీనురాలగు కన్య సరియగు వరుని నెన్నుకొనలేకపోవచ్చును. ఆమెకు సరియగువరుడు దొరకనపు డామెజీవితము తలిదండ్రుల యింట గడపవలెను. తలిదండ్రులు, సోదరులు, సోదరభార్యలు చెప్పినప్రకార మామె నడచుకొనవలెను. ఒక్కొకప్పు డామె స్వతంత్రజీవనమునకు సోదరులతోపాటు తలిదండ్రులయాస్తిలో భాగ మొందుచుండెను. ఈవిషయము సోదరులకు, సోదరభార్యలకు నీర్ష్య కలిగించుచుండెను. తలిదండ్రులు పోవునప్పుడు సరియగు కట్టుబాటు లేకపోవుటచే నామె దుష్ప్రవర్తనకు లోనగుచుండెను. ఇది యాకుటుంబమునకు కళంకము. అవివాహితయు, విభర్తృకయు నగు స్త్రీ యిట్టికష్టములు పుట్టినింటికి కలుగజేయుచుండుట తెలుచు. కావున పుత్రికాజనన మంత సంతోషదాయకము కాదు. మఱియు వివాహ మొనర్చిన తరువాతకూడ నామెకు నాభరణములు మున్నగునవొసంగి భర్తృగృహమునకు బంపవలసిన చిక్కుకూడ కలదు. పుత్రు డట్లు కాక తలిదండ్రులకు వార్ధకమున పోషించువాడై దేవారాధనకు సమర్థుడై తమ యంత్యక్రియల కర్తయై సౌఖ్య మొనగూర్చువా డగుటచే పుత్రజననము కొఱకే దేవతల ప్రార్థించుచుండిరి. పుత్రికాజనన ముత్సాహదాయకము కాకపోయిన నామె పుత్రులతోగూడ సమానముగా ప్రేమింపబడుచుండెను. ఆమె తన సౌందర్యముచేతను, చిఱునగవులచేతను కుటుంబమునం దందఱ కానందము కలిగించుచుండెను. పుత్రిక తన కన్నివిషయముల బాసటయై యుండుటచేతను, తనగృహము వీడి యన్యగృహమం దుండ బోవుననియు తల్లి యామె నెక్కువగా ప్రేమించుచుండెను. కుమారుడు పెద్దవా డగుచున్నకొలది తండ్రి ననుసరించియుండుటచే తల్లికుమార్తెల కెక్కుడు సంబంధము కలిగియుండెను.

ఆకాలమందు బాలికల విద్యవిషయమై శ్రద్ధ వహించుచుండెడివారు. అందుచే నామెకు సంఘమందొక యుచితస్థాన ముండెడిది. విద్యాధికురాండ్రగు తపస్వినులు యజ్ఞములు చేయుచు వారు రచించిన శ్లోకములచే దైవప్రార్థన చేయుచుండిరి. ఋగ్వేదమునందు విద్యాధికురాండ్రగు ననేక స్త్రీలు పేర్కొనబడిరి. ఘోషాదేవి ప్రసిద్ధికెక్కిన తపస్విని. అట్లే లోపాముద్ర, మమత, అపాల, సూర్య, ఇంద్రాణీ, శచి, సర్పరాజ్ఞి, విశ్వవర, మున్నగువారు ప్రఖ్యాతి కెక్కిరి. అందు విశ్వవర అగ్నిదేవుని శ్లోకరూపమున నారాధించుచుండెను. ఒకయజ్ఞమున నామె ఋత్విక్స్థాన మలంకరించుచుండెను. ఈర్ష్యాళువులగు మతగురువులు ఈస్థానమునకు స్త్రీ లనర్హులని తరువాత శాసించిరి. అపాల యింద్రునిగూర్చి సోమయజ్ఞము చేసి తన తలిదండ్రుల కష్టములను బోగొట్టెను. ఇంతియ కాక స్త్రీ లొక్కొకపుడు తమభర్తల ననుగమించి యుద్ధముల కేగుచుండిరి. విశ్వపాలాదేవి యుద్ధమందు కాలొకటి గోల్పోయి యశ్వినీదేవతల ప్రసాదమున నాయసచరణము కల్పించుకొనెను. ముద్గలఋషిభార్య యింద్రసేన తమగోవుల నపహరించినచోరులను వెంబడించునపుడు భర్తరథ చోదకురాలై, భర్త యలసియున్నపుడు ధనుర్బాణములు గొని యుద్ధముచే దొంగలను బాఱదోలి గోవుల మరలించెను. విశ్వవర యగ్ని నారాధించి గర్భాధానవయోనిర్ణయము గావించెను. దీనినిబట్టి ఋగ్వేదకాలమున స్త్రీలు గృహసాంఘికవ్యాపారములందు గౌరవోన్నతస్థానము లలంకరించెడివారని స్పష్టపడుచున్నది.

పుత్రవిహీనయగు వితంతువు తన భర్తచరస్థిరాస్తులకు హక్కుదారురాలు. అవివాహితయగు స్త్రీ తన పిత్రార్జితమున కొంతభాగము పొందుచుండెను. ఆమె యవివాహితగా నుండకుండునట్లు తలిదండ్రులు, సోదరులు ప్రయత్నము చేయుచుండినను వరించుట యామె హక్కైయుండుటచే నామె కిష్టపడిన వరు డొకప్పుడు లభింపక యామె యవివాహితయై యుండవలసి వచ్చుచుండెను. ఇట్టిచో నామెను భరించుబాధ్యతయే కాక యామె క్రమక్రమముగా దుష్ప్రవర్తనకు లోనయి కళంకముకూడ పుట్టినింటికి గలిగించునని తలిదండ్రు లీకేవల భర్తను వరించు నధికార మామెకు తీసివేసి యుక్తవయసు రాకమున్నె యామెకు వివాహ మొనరించుచుండిరి. బాల్యవివాహముల కిది యొక కారణమై యుండనోపు. ఋగ్వేదకాలమున సంపూర్ణయౌవనవతియైనతరువాతనే స్త్రీకి వివాహము జరుగుచుండెను. యౌవనము నిండినతరువాత * సూర్యుని కూతురు సూర్య సోముని కిచ్చి వివాహము చేయబడెను. ఘోషావివాహమట్లే చేయబడెను. గర్భాధానమహోత్సవము వివాహమైన తరువాత నాల్గవరాత్రియే జరుపబడుటచే రజస్వలానంతరమే వివాహము జరుపబడుచుండెనని స్పష్టమగుచున్నది.

ఆకాలమున వివాహము నాల్గువిధములుగా నుండెను. స్త్రీపురుషులకు పరస్పరాంగీకార ముండి వివాహమొనర్చుకొనుట. బలవంతముగ నెత్తికొనిపోయి వివాహమాడుట. ఇందు తండ్రి కంగీకారము లేక కన్య కంగీకార ముండును. ఇది రాక్షసము. విమదు డనువాడు పురుమిత్రదుహిత నిట్లు వివాహమాడెను. కుమార్తెను ఋషి కిచ్చి వివాహము చేయుట. ఇది ఆర్షము. తలిదండ్రు లిష్టపడి సరియైన వరుని జూచి కూతు నిచ్చి వివాహము చేయుట సామాన్యమైన బ్రాహ్మము. ఇదియే వేదోక్తమగు వివాహము.

ఋగ్వేదకాలమున యౌవనవతియగు కన్య భర్తను వరించు నధికారము కలిగియుండెను. వధూవరులు సమాన గోత్రమువారు కాకూడదు. ఈయాచార మిప్పుడు నాస్ట్రేలియాలోని కొన్ని వంశములలో కలదు. అక్కడ కొన్నికొన్ని వంశములు జంతుచిహ్నములచే నొప్ప

* ఋగ్వేదము దశమమండలము ౮౫-వ సూక్తమున నీ వివాహము వర్ణింపబడియున్నది. సూర్యకాంతి చంద్రునియందు ప్రతిబింబించు విషయమే కవిభావముచే సూర్యునికూతురు చంద్రుని కిచ్చి వివాహము చేయబడుటగా వర్ణింపబడియుండును, ఆర్యు లీజ్యోతిశ్శాస్త్రవిషయ మెఱిగియుండిరి.

చున్నవి. ఈచిహ్నభేదములు వంశభేదముల తెలియజేయును. వేరువేరు వంశములవారు వారిలో వారు కలహించుచు యుద్ధము లొనరించుచు జయమొందిన వంశమువారు అపజయమొందిన వంశములోని యవివాహితలగు యువతులను గొంపోవుచుండిరి. ఇట్లు యుద్ధమందు లభించిన యన్యవంశపు కన్యలను స్వవంశపు యువతులకన్న నెక్కువ కామించి వారిని గూడుట వారి కెక్కుడానందదాయక మగుచుండెను. భుజబలముచే నొక వంశము నోడించి యందలి కన్యలను వారి తలిదండ్రుల కిష్టము లేకపోయినను బలవంతమున వివాహమాడి కాము మీడేర్చుకొనుట కనువుపడి యుండుటచేతను, స్వసంఘమం దిట్టి బలవంతపు కృత్యములకు తావు లేనందున స్వవంశపుకన్యల బొందుట సులభసాధ్యము కాకపోవుటచేతను, సమానగోత్రములందు వివాహము పొసగకుండెను. ఈకారణముచేతనే యార్యులందు సగోత్రోద్భవు లగు వధూవరుల వివాహ మాచరణయోగ్యము కాకుండెను. అన్యఖండములోని కొన్ని వంశములందు వలె నార్యులయందుగూడ జంతుచిహ్నములచే కొన్ని వంశము లొప్పుచుండెను. నాగులు, గరుడులు మున్నగువారు పరస్పరము కలహించెడివారు. ఈభేదస్థితి జాతకభాగమందలి యోనికూటములవలనగూడ స్పష్టపడుచున్నది.

వివాహమంతయు నాల్గుదినములు వేదమంత్రములతో జేయబడుచుండెను. కంకణబంధనసమయమున వరుడు వధువుతో బలికినమంత్రము లిచట నిడదగినవి కావు. "నాతో మద్గృహమునకు రమ్ము. గృహాధికారము వహించుము. మొదట సోముడు నిన్ను జేపట్టెను. తరువాత గంధర్వుడును, పిదప నగ్నియు జేపట్టిరి. మానవుడనగు నేను నాలవవాడను. సోముడు గంధర్వునకు, గంధర్వు డగ్నికి, నగ్ని నాకును గ్రమముగా నొసగుట కలిగెను." అనగ సోముడు వనస్పత్యధిపతి; బాలికల శరీరబుద్ధుల వృద్ధికి కారకుడు. బాల్యమున కన్యల యభివృద్ధి సోమదేవు ననుగ్రహమున కలుగునట్లు నమ్మకము. గంధర్వుడు సర్వాంగసౌష్ఠవమునకు కారకుడు. తేజోవంతుడగు నగ్నిదేవుడు కన్యల రజోదర్శనమునకు కారకుడు. ఇట్టియువతి యీమూడవస్థలు దాటినతరువాత బురుషుని జేపట్టు నాచార ముండెను. వివాహమైన ప్రథమదినానంతరము రథారూఢులై వధూవరులు వారి గృహమునకు బోయి కన్యపుట్టినింటినుండి తెచ్చిన యగ్నిహోత్రమున ప్రధానహోమము చేసి మరల వివాహకర్మ నడపించుచుండిరి. అప్పుడు వరుడు సోమగంధర్వాగ్నుల బూజించుచు, "ఈయువతిని నా కొసంగిన యగ్నిదేవునికియ్యది" యనుచు హోమము చేయుచుండెను. యువతి యని చెప్పుటచే వధువు యుక్తవయసు కలది యని స్పష్టము. తరువాత మూడుదినములు వరుడు బ్రహ్మచర్యవ్రత మవలంబించి నాలవదినము శేషహోమము చేయుచుండెను. నాటిరాత్రి గర్భాధాన మహోత్సవముతో వివాహకర్మ పూర్తియయ్యెను. వివాహమంత్రార్థమును గ్రహించుటకు సమర్థురాలగు వధువు బాలికయై యుండ నేరదు. గర్భాధాన మొనరించుటచే కన్య రజస్వలావస్థను బొందినదే యని చెప్పవచ్చును.

ఆకాలమున నేకపత్నీత్వమే యధికప్రచారములో నుండిన ననేకపత్నీత్వముగూడ నచ్చటచ్చట జూపట్టుచుండెను. పురుషులు యుద్ధములో దొరకిన కన్యలను స్వీకరించి తమ సౌఖ్యముకొఱకై చూచినను గృహకలహము లెక్కువగుచుండెను. ఈ యనేకపత్నీత్వము దేవతలకుగూడ ననుసంధింపబడుచుండెను. కాని దేవుడు మానవుని సృజించునపుడు మానవుడుగూడ దేవుని సృజించును. తమ యాచారములే దేవతలకుగూడ గలవనుట యసాధారణము కాదు.

అనేకభర్తృత్వ మాకాలమం దార్యజాతులలో లేదు. కొన్ని యనాగరికజాతులం దున్నట్లు రూపించుచున్నది. దితికుమారులు దైత్యులు. వైనతేయ, కాద్రవేయ, ఆంజనేయ, జరత్కార మున్నగు నామములు తల్లి వలన గలుగుటబట్టి పరియును జనకత్వము లేనట్లు కనిపించుచున్నది. కాని యార్యజాతులలో నిట్టి యాచారము ప్రబలియుండలేదు. ఋగ్వేదకాలమున వితంతూద్వాహము లేదని చెప్పవచ్చును. కాని వితంతువు తన భర్తృవంశము నిలుపుటకు భర్తృకనిష్ఠసోదరునింట వసించి యతనివలన కుమారుని కను నాచారము కలదు. కాని యిట్టి వివాహము విధ్యుక్తము కాదు.

వితంతువివాహమని వేఱుగా సెప్పుటను జరుపబడలేదు. వేనుడను రాజు బాలవితంతూద్వాహముల ప్రోత్సహించెను. కాని యవియు సగ్రపర్ణములంపు జరుగలేదు.

స్త్రీలు తమ మానసంరక్షణయం దతిజాగ్రత్తతో నుండెడివారు. యుద్ధమందు గెలిచిన స్త్రీలతో బురుషులు కాలయాపనో చేయుచుండుటచే స్త్రీలలో దుష్ప్రవర్తన ప్రవేశమునకు సందు దొరకుచుండెను. స్త్రీలు రజస్వలానంతరముకూడ చాలకాలమువరకు నవివాహితలై యుండుటయు స్వేచ్ఛాప్రభావము కలిగి యుండుటచేతను వివాహానంతరముకూడ పరపురుష సాంగత్యమునకు మూలమగుచుండెను. కాని యూర్యలలో నుత్తమవంశములం దుత్తమకన్యలనేక లుండిరి. ముత్తముపై నిక్షేపల దుష్ప్రవర్తనకు మూలమని తలచి స్వేచ్ఛ కొంత తగ్గింపబడెను. స్వయంవరము తీసివేయబడెను. పరుల నెన్నుకొను జ్ఞానము రాకమున్నె వివాహములు చేయబడెను. ఈ కారణములచే స్త్రీకి ప్రాపంచిక జ్ఞానము తగ్గి స్వాతంత్రవ్యక్తిత్వము లేక బాలమాతయై తన శరీరదార్ఢ్యము గోల్పోయి బలహీనులగు పుత్రుల గాంచుట తటస్థించెను. ఈకారణముచే నిప్పటి హిందూదేశ స్త్రీ యిహసౌఖ్యము తాను పొందలేక, పురుషునికి కలుగజేయలేక దేశమునకు సాహాయ్యము చేయ నసమర్థురా లగుచున్నది.

---

## మశకగానము

డా. నిడమర్తి ఈశ్వరప్పగారు

ఏనును మానినీమణిని, హేలఁ జరింతును రాణివాసమం;
దేననభోణి నాకెన? మృగేంద్రవలగ్నను, మెచ్చి నన్ను నా
ఖ్యానముఁ జేసి "హ స్తిమశకాంతర"మంచు జను ల్నుతింప నా
కానకదుందుభుల్ మొఱయవా చనుదేర మదేభయాననై?

"అనఁగనఁగ" నంచు ముసలమ్మలు మీఁచిఱుపాయుమందె మి
మ్మును దమ చెంతఁ జేర్చికొని ముచ్చటలాడి కథ ల్వచించి "'యు'
వ్వాన నది పైకివచ్చునదె? 'యు'వ్వాన వచ్చునె?" యన్నమీఁర లూ
కొనునది నన్నుఁ గూరిచియె కొంచెము మీరదిఁ జింతసేయుఁడీ!

అహహా! పక్కలు చెక్కలౌనటులు మీరు-నవ్వి నాకథ నాలించినారుకారె?
నాఁటి ప్రేముడిం దిగనాడ నాయమగునె?-గాన మొసరించు మీఁదోమసానిఁగానె?

నన్నునే "యసూర్యంపశ్య" నాఁగఁ జెల్లుఁ-బగళులం దేరికంట నేఁ బడకయుండి
చీఁకటులు క్రమ్మ నెమ్మి నీచెంతఁ జేర-ముసుఁగుఁదన్నె దే పురుషుఁ డా ముద్దులిడక?

సానిని, మేల్కడానిని, బసందగుదానిని, సాధనంబునఁ
దానము గానముం జలుపుదానను "నీసరిసాని"నం చిఁకఁ
గాన వ దేజగాన ననుఁ గాదనునంతటిదాన, సామి! నీ
చానకు మోముఁజూప కిటు జాలరులం బడి మున్గ దేలొకో?

రక్తసంబంధమున్న కారణమువలనఁ-బ్రేమకున్నిధానమవని పీఁకులాడి
"దొంగ లున్నారు,జాగ్రత్తతో మెలంగు"-మంచు మేల్కొల్పుఁబాడి సేవించుదాన.

బ్రమసి ముద్దాడ నినుఁ జేరవచ్చు నాడు-సంగతిని గాంచ విది యేటి సంగతంబొ?
మధ్య నీతెరచాటేల మనకుమనకు? ఎవరి మందులు నీతల కెక్కెనోగద?

బూరకాళ్లు బృహద్దోషములును గాక-మన్నెపుంజ్వరములు వచ్చి మాపునంచు
'[1]అల్లోపాథిస్టు' లనుమాట కల్లయెచుమి-మన్యముల జనుల్సుఖమునమనఁగఁగనవె?

అడుగు నేలనుబెట్టి నడయాడ నిట్టట్టు '[2]టెటన'స్పురువులు మంటిని వసించు
శీతోదకంబుల సేవింప నెంచినం '[3]కలరా' పురుగులు నీళులఁ బెలుంగు
స్వగృహంబున న్హాయిఁ బవళింపఁ గాంతి '[4]స్మలేరియా' పురుగులు చేరియుండు
వాహ్యాళిపేరెత్త వశమానె? '[5]స్మాల్పాక్సు' పురుగులు గాలి నెగురుచునుండు

నీఁగలు మలమ్ముఁదెచ్చి యెల్లెడల విడుచు-నీదు స్వాస్థ్యము నెట్టులో నిలిపికొమ్మ
దాడి వెడలెదే స్పంచభూతములపైని-బ్రదుకవలె నింక నీవొక '[6]వాక్యూయమున!'

ముసుఁగు నిడికొన్నఁ దురకబూబునకుఁబోలె- తెరల మధ్యను నీవు నిద్రించియున్న
రాక యెదిమాను నీదుప్రారబ్ధవశత?-హతవిధిపరిపాక మ్మలంఘ్యమ్మసుమ్ము.

క్షణములో మమ్ము దుంపనాశనముఁ జేయుఁ- '[7]బంపుగొట్టి' '[8]యెమల్షను'ంబంపె నీవు
అకట! పిచ్చుకపైని బ్రహ్మాస్త్ర మేయు-సృష్టిఁ జేసితె కష్టించి యీవిషంబు?
శలభము దీపమునఁ బడి చచ్చునంచు-జైనులు భుజింతు రొకదీపమైన లేక
జీవహింసనుఁ గలనైన సేయ రహహా!-మతము లన్నిటిలో జైనమతమె మతము!

---

1. పాశ్చాత్యవైద్యులు. 2. ధనుర్వాతము. 3. విషూచి. 4. చలిజ్వరము. 5. మశూచి. 6. శూన్యము. 7. ద్రవమునుతోడి పైకిఁబంపుయంత్రము. 8. రసాయనము.

సౌరా

# జన్మనిగ్రహము

యలమంచిలి శ్రీరాములుగారు

ప్రస్తుతము ప్రపంచములోని దూరదృష్టిపరుల నాందోళనపఱచుచున్న జన్మనిగ్రహసమస్యను గూర్చి యొకింత నిట చర్చింపఁబూనితిని.

ఈయుద్యమము పదునెనిమిదవ శతాబ్దమధ్యభాగమునఁ బాశ్చాత్యదేశమున బయలుదేఱెను. భారతదేశమున నిప్పుడిప్పుడే యీయుద్యమము వ్యాప్తి నొందుచున్నది. మన ప్రాచీన-ఆయుర్వేదశాస్త్రములలో చిరకాలముక్రిందటనే గర్భనిరోధప్రక్రియలు వ్రాయఁబడియున్నవి. సంతాననిరోధోద్యమము ఈనాఁడు అధిక వ్యాప్తి నొందుటకుఁ గారణము నిరుద్యోగదారిద్ర్యసమస్యలు ప్రజలను బీడించుచుండుటయే యనక తప్పదు. నిరుద్యోగసమస్యయు, దారిద్ర్యసమస్యయు నంతగా భారతప్రజను బీడించలేదని చరిత్రజ్ఞులు చెప్పునట్టి ప్రాక్తనకాలమున సంతాననిరోధప్రక్రియల నేల మనవారు కనిపెట్టవలసివచ్చెనో యని యాలోచించినచో కుష్ఠమున్నగు సాంక్రామికవ్యాధులచేఁ బీడితులు సంతానమును గన ననర్హులనియు, నట్టివారు నైష్ఠికబ్రహ్మచర్యము నవలంబింపనేరనిచో నీ గర్భనిరోధప్రక్రియల నవలంబించియైనను సంతానమును గనకుండ నుండుటకే యని తోఁచుచున్నది. ఇవ్విషయమున వారి దూరదృష్టిని మిక్కిలి కొనియాడవచ్చును.

ఈసంతాననిరోధోద్యమము మన భారతదేశమున మిక్కిలి వ్యాప్తి నొందుట యత్యంతావసరము. ఏలయన, భారతదేశమును దారిద్ర్యదేవత పీల్చి పిప్పిచేయుచున్నది. దానితోపాటు నిరుద్యోగసమస్య నానాటికి వృద్ధి నొందుచున్నది. ప్రాక్తనకాలమున మిక్కుటముగ ధనధాన్యసంపదలతో నోలలాడుచుండిన భారతదేశమున, నేడు ముప్పూట తినఁ దిండి లేనట్టియు, మానమర్యాదలను గాపాడుకొనుటకుఁ దగు వస్త్రాదులు లేనట్టియు నిర్భాగ్యులు లక్షలకొలఁది గలరు. ఆసంగతి యెవరును కాదననేరరు. ఇందులకుఁ గొంతవఱకు విదేశీయప్రభుత్వము కారణమైనను ముఖ్యకారణము మితిమించిన జనసంఖ్యయే యని పక్షపాతము, మొండిపట్టుదల లేనివా రందఱు నొప్పుకొందురు. పరిశ్రమలకు రక్షణ మొసంగుటయు, సాంద్రారణ్యములను విచ్ఛేదనము చేసి సేద్యానుకూలముగఁ జేయుటయు, పాఠశాలలలోఁ గఱపఁబడు విద్యను స్వయంశక్తిపై నాధారపడుట కనువగునట్లు చేయుటయును గొంతవఱకు భారతదేశదారిద్ర్యనిరుద్యోగసమస్యలను తాత్కాలికముగఁ దీర్పవచ్చును. ఇందు సాంద్రారణ్యములను ఛేదించుటచే వర్షములు తగ్గిపోవు నను వైజ్ఞానికసిద్ధాంతమును త్రోసిపుచ్చఁజాలము. అయినను అట్టి మహోన్నతస్థితి ప్రస్తుతభారతదేశపరిస్థితులను గమనించినచో సులభముగ నింతలోఁ గలుగునను నమ్మకము లేదు. అట్టిస్థితికి భారతదేశము గొంపోయినను ఇప్పుడున్న ప్రజలకు సుఖజీవనము జరుగునే కాని యింతకెక్కుడు ప్రజాసంఖ్య పెరిగినచో తిరిగి దారిద్ర్యనిరుద్యోగసమస్యల నెదుర్కొనక తప్పదు. ఈ విషయమును బలపఱచుచు మొన్నమొన్ననే వెలువడిన వ్యవసాయవిచారణసంఘనివేదికలో 'నిప్పటికంటె జనసంఖ్య వృద్ధి నొందినచో నెన్ని నూతనయంత్రములు చేపట్టి యేవిధముగ వ్యవసాయాభివృద్ధి చేసినను ప్రజల సుఖజీవనమునకుఁ దగిన ఆహారాదులు దొరకఁజాలవు' అని వ్రాయఁబడియున్నది. ఇప్పటి మన కర్షకులలోఁ బెక్కురున్నతావున విడిచి వేఱొకమండలమునకు వలసపోవుటకుఁగూడ స్థైర్యోత్సాహప్రోత్సాహములు లేనిస్థితిలో నున్నారు. నేఁటిరైతులలోఁ బెక్కురు పూర్వము పెద్దలు సంపాదించియిచ్చిన భూములను విభజించుకొనుట తక్క విస్తరింపఁజేసికొనుట గనఁబడుచుండుట లేదు. ఇందులకు ప్రభుత్వమువారి శిస్తు కొంత బాధించుచున్నను ప్రధానకారణము మితిమించిన జననసంఖ్యయు, నితరప్రాంతములకు వలసపోకుండుటయు నైయున్నది.

రైతుల భూసంపద పెరుఁగకుండుటవలన వారి భూములు ఖండఖండములుగా విభజింపఁబడుచున్నవి. ఈవిషయము రైతుల దారిద్ర్యమును జెప్పక చెప్పుచున్నది. స్వరాజ్యప్రభుత్వమున శిస్తుల భారము కొంత తగ్గినను మనరైతులలోఁ బెక్కుర జీవితవ్యయము భోజనాదులలో నింకను గొంత హెచ్చవలసియే యున్నది. దూరదృష్టి లేమిచేనైనను, మఱి యేయితరకారణములచేనైనను బ్రహ్మచర్యము లేక కృత్రిమపద్ధతులచే మితిమించిన సంతానమును నిరోధింప నిచ్ఛగింపనివారు స్థైర్యమూని యేపాలేరుప్రాంతమునకో, యేభద్రాచలప్రాంతమునకో, యేజయపురప్రాంతమునకో వలసపోయి దారిద్ర్యబాధనుండి కొంతకాలమువఱకు విముక్తి నొందుదురుగాక. అయినను వలసపోవు ప్రదేశము లారోగ్యప్రదములో కావో గమనింపవలెను.

జనసంఖ్య నానాఁటికి మిక్కుటముగ వృద్ధినందుచున్న సంగతి కాదననేరము. ఇందుకిచట సంఖ్యలు వేసి పాఠకులకు విసువుగొల్ప నిచ్ఛగింపము. పూర్వము ఏఁబదియేండ్లకో, అఱువదియేండ్లకో యేమహామారివ్యాధియో వచ్చి ప్రజలను విపరీతముగ నశింపఁజేసెడిది. ఆధునిక వైజ్ఞానికబలముచే నట్లు ప్రజానాశనము కాకుండు రక్షణము నేఁటికాలమునఁ బడయుచున్నాము. ఇంతవిరివిగ సేవాసదనములు, వైద్యశాలలు పూర్వ ముండెడివి కావు. అందువలన, మేము వైద్యశాలలు సేవాసదనము లుండ నవసరము లేదని చెప్పుట లేదు. ఇంకను విరివిగా నుండవలయుననియే మాయభిప్రాయము; కాని, యివి యెట్లు ప్రజాసంఖ్య వృద్ధియగుటకుఁ దోడ్పడుచున్నవో చూపుటకే యీవిషయము వ్రాయఁబడెను. మన యాంధ్రదేశమునను మితిమించిన సంతానమును గనుటచేఁ గల్గుచున్న అనర్థములను పెక్కురు గుర్తించిరి. అందు కొందఱు ఆబాధనుండి తప్పించుకొనుటకై యవలంబించుచున్న సాధనము లనాగరికములును, ఆపదలతోఁ గూడినవియునై యున్నవి. అందులకు ప్రధానకారణము గర్భనిరోధమునకు సరియగు ప్రక్రియలకు వారెఱుంగకుండుటయే. అందుచే వారు తమ స్త్రీలను గర్భపాతములకై మందులను సేవించుటకుఁగూడఁ బ్రోత్సహించుచున్నారు. మిక్కిలి గర్హ్యమగు నీపద్ధతిచే ననేకులు మృతి నొందుట, లేక ఆజన్మము వ్యాధిగ్రస్తు లగుట జరుగుచున్నది. రష్యాదేశములో ప్రభుత్వమువారు తమ వైద్యశాలలలో కోరినవారికి మూఁడుమాసములలోపు గర్భము పోఁగొట్టుట చేసియున్నారు. మనదేశమున గర్భపాతము చేసికొనుటకు ప్రభుత్వశాసనముకూడ నంగీకరింపదు. అయినను అపాయకరముగునట్టి గర్భవిచ్ఛేదనపద్ధతులను విడనాడి సక్రమపద్ధతులను గైకొని గర్భనిరోధము చేయవలెను.

ఆరోగ్యలోపమున్నఁ దక్క, ధనవంతులు సంతాననిరోధము నవలంబింప నవసరము లేదు. ఈనాఁడు దారిద్ర్యకారణమున సంతానమును నిరోధించినను, తరువాత నేవిధముగనైన ధనము లభించినచో వెనుకటివలెనే సంతానమును నిరోధింపవలయు ననుమాత్రము వర్తింపదు. ముం దెప్పుడైన భారతదేశము ధనధాన్యసంపదలతో నిండి దారిద్ర్యనిరుద్యోగసమస్యలు తొలఁగిపోయిన రోజుల నప్పుడు సంతాననిరోధోద్యమము నెదిరింప వచ్చును. అట్టిస్థితి భారతదేశమునకుఁ గలిగినచో నీయుద్యమము నెదిరించుటకు మేమును సంసిద్ధులమే. అయినను ఆరోగ్యలోపముచే నెప్పుడును కొంతమంది సంతాననిరోధమును తాత్కాలికముగ లేక యెల్లప్పుడు నవలంబింపవలసినదే యుండును.

కొందఱు చెప్పునట్లు సంతాననిరోధోద్యమముచే, ప్రజాసంఖ్య నశింపదు; పరిమితిని గలిగియుండును. హాలండుదేశమే యిందుకు తార్కాణము. ప్రభుత్వకోశమునుండి ధనమును విరివిగా వెచ్చించి హాలండుదేశమును మిక్కిలి యున్నతస్థితికిఁ దీసికొనిరాఁగల్గిరి. హాలండుప్రభుత్వమువారియొక్కయు, ప్రజానాయకులయొక్కయు లెక్కలవలన హాలండుదేశమున ప్రజాసంఖ్య తగ్గక పరిమితిని గల్గియున్నటుల తెలియుచున్నది. మఱియు సంతాననిరోధోద్యమవ్యాప్తిచే నచ్చట బలిష్ఠులును, స్థైర్యవంతులును, ఆరోగ్యవంతులును, చిరజీవులును నగు మానవు లుద్భవించుచున్నారని ఆదేశము నాయకులు సగర్వముగఁ జెప్పుకొనుచున్నారు. దేశములోని సౌభాగ్యము సంఖ్యచేఁ గాక గుణములచేతనే కలుగునని మన పురాణములనుండియు, ప్రపంచచరిత్రము

నుండియు ననేకములగు నుదాహరణముల నీయవచ్చును. గుణముచే సంఖ్య తప్పక పరాజయము నొందుననియు, రాఁబోవు యుద్ధమున జయము సంఖ్యకుఁ గాక గుణము నకే యనియు బక్‌మాష్టరు ప్రభువరుఁడు మున్నగు పెద్దలు పెక్కురు వచించుచున్నారు.

మెక్సికోగవర్నమెంటువారు తమ దేశములో నీయుద్యమము వ్యాపింపఁగలందులకు ప్రతి నూతన వివాహితదంపతులకు సంతానవిరోధగ్రంథము నొక ప్రతి నిచ్చుచున్నారు. జపానుగవర్నమెంటుకూడ సంతాననిరోధోద్యమునకు ప్రోత్సాహ మిచ్చుచున్నదని వార్తలు తెల్పుచున్నవి. మనదేశమున వైద్యశాలలు ప్రభుత్వకోశమునుండి యెట్లు నిర్మింపఁబడియున్నవో అట్లు ప్రభుత్వవ్యయముతో హాలండుదేశమున సంతాన నిరోధసమితులు స్థాపింపఁబడియున్నవి. హాలండు గవర్నమెంటు ప్రత్యేకముగ నీశాస్త్రమున గొందఱకు శిక్షణ గఱపి వారిచే నూరూర నుపన్యాసముల నిప్పించి యీయుద్యమమునకుఁ దోడ్పడుచున్నది.

మితిమించిన జనసంఖ్య యుద్ధమునకుఁ గారణ మగును. దారిద్ర్యము బారినుండి తప్పించుకొనుటకు ఆహారము లేక అల్లాడు జనులను సైనికులఁగాఁ జేసికొని పర రాజ్యములమీఁదికి దండెత్తవలసివచ్చును. పూర్వము నుండియు నిట్లు జరుగుచునేయున్నది. సంతాననిరోధోద్యమము నెదురించుచున్న ఫ్రాన్సుదొరతనముయొక్కయు, ఇటలీదేశమును నిరంకుశముగ శాసించుచున్న ముసులోని యొక్కయు తలంపు రాఁబోవు యుద్ధమునకు సైనిక సంఖ్యను వృద్ధిచేసికొనుటకే యని రాజకీయధురంధరులు చెప్పుచున్నారు. మఱియు ఫ్రాన్సుదేశజులు సంతాన నిరోధోద్యమమునందలి మహత్తరమగు నుద్దేశ్యమును మఱచి భోగలోలత్వమునఁ బడి కొట్టుకొని పోవుటకూడ ఫ్రాన్సు గవర్నమెంటు చర్యకు మఱియొక కారణమై యున్నది. అయినను నేఁడు ఫ్రాన్సులోఁ గూడ నీయుద్యమము విరివిగా వ్యాపించియేయున్నది. ఆనాఁ డార్యులు మధ్యఆశియాను విడిచి భారతదేశమును జొచ్చుటకు ముఖ్యకారణము జనసంఖ్య మితిమించుటయే. అనార్యులతో యుద్ధము చేసి ఆర్యులు భారత దేశమును స్వాధీనము చేసికొని తమ దారిద్ర్యమును బాపుకొనఁగలిగిరి. మితిమించిన జనసంఖ్యగల మనము నేఁడే దేశమునకు వలసపోవుట కవకాశము గలదో, వాద సౌకర్యమున నున్నదని యంగీకరించినను బోవుట కంగీకరింతుమో లేదో యొకింత ఆలోచింపనగును. అరిస్టాటిలు, ప్లేటో మున్నగువారుకూడ జనసంఖ్యకుఁ బరిమితి యుండ వలయుననియే చెప్పిరి. ఇప్పుడు ప్రపంచమందలి జన సంఖ్య ౧౯౨ కోట్లుగా నున్నది. ౬౦ సంవత్సరములలో ప్రపంచమందలి జనసంఖ్య యినుమడించునని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఇప్పుడే ప్రపంచములోని జన సంఖ్యకు సుఖజీవనము చేయుటకు వలయు నాహారాది సౌకర్యములు తక్కువగా నున్నవని చెప్పుచున్నపుడు ౩౮౦ కోట్ల జనసంఖ్య అయినచో ప్రజలగతి యేమి కావలయునోగదా! సంతాననిరోధోద్యమమునకు వ్యతిరేకులగు కొందఱి మతము ప్రకారము ౮ వందలకోట్ల జనసంఖ్యను ప్రపంచము భరింపఁగలదని యొప్పుకొనినను సంతాననిరోధోద్యమము వ్యాపింపకున్నచో నాసంఖ్య పూర్తియగుట కెంతయో కాల మవసరములేదు. దక్షిణ ఆఫ్రికా మున్నగు దేశములనుండి భారతీయులను నిర్దయ హృదయులై తరిమివేయుటకుఁగూడఁ గారణము అచ్చటి బలవంతుల జనసంఖ్య వృద్ధినొందుటయే. శక్తి ననుసరించి సంతానమును గనుచుండుచోఁ బరరాజ్యాక్రమణమునం దుఁ గోరిక కలుగదు; కలుగ నవసరము లేదు. అందు వలన యుద్ధములు సాధారణముగ జరుగక ప్రపంచమున శాంతి యేర్పడును. సంతాననిరోధముచేతనే సాంఘిక సమానత్వ మేర్పడును. సంతాననిరోధముచేఁ దక్క మఱి యేయితర తాత్కాలికమగు నేర్పాటుచేతను నిరు ద్యోగ సమస్య శాశ్వతముగ పరిష్కరింపఁబడ నేరదు.

ప్రతివాలుగుసంవత్సరముల కొకబిడ్డ పుట్టిన బిడ్డ యొక్కయు తల్లియొక్కయు నారోగ్యము చెడక చిరకాలము జీవింతు రని సుప్రసిద్ధవైద్యశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. ఆహా! వారి వాక్యములను విశ్వసించి, తదనుసరణముగఁ బ్రవర్తించినచో నిన్ని ప్రసవవైద్యశాల లుండ నవసరము లేదుగదా! ఇన్ని ప్రసూతిమరణములు, ఇన్ని శిశుమరణములు నుండ నేరవుగదా! అధికశిశు

జననము అధికశిశుమరణములకుఁ గారణ మనువిషయ మెల్ల రంగీకరించినది గనుక నావిషయము నిట లెక్కలతో ధ్రువపఱుప నవసరము లేదు. దారిద్ర్యముచేఁ బీడింపఁబడుచున్న భారతదేశమున నేఁడు పెక్కుమంది బిడ్డలకు మాతృస్తన్యము దొరకుట దుర్లభమగుట కాశ్చర్యపడ నవసరము లేదు. నేఁడు మనదేశమున కొందఱు స్త్రీలు ప్రసవమై స్త్రీజననావయవములు యథాస్థితికి రాకపూర్వమే తిరిగి గర్భమును ధరించుచున్నారు. అట్టిదుర్భరస్థితిలో గర్భము ధరించుట మాతకును, చంటిబిడ్డకును, భ్రూణమునకును నష్టమని గుర్తింపనేరని స్థితియం దుండు టెంతయు శోచనీయము. తల్లిదండ్రులు గోరకయే కల్గు సంతానము పిఱికిపంద లగుదురని శాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. అందువలననే కాఁబోలు నానాఁటికి పిఱికిపందల సంఖ్య దేశములో వృద్ధియగుచున్నది.

పెక్కురు సంతానమును గన నసమర్థులై యుండియు సంతానమును గని దేశీయకళ్యాణమును మంటఁగల్పుచున్నారు. అందువలననే యాచకులయొక్కయు, చోరులయొక్కయు, మోసగాండ్రయొక్కయు, సాంక్రామికవ్యాధిపీడితులయొక్కయు సంఖ్య నానాఁటికి వృద్ధినొందుచున్నది. నేఁడు భారతదేశమున సంతాననిరోధోద్యమము నెదిరించు పెద్ద లెవ్వరును లేరు గాని యందుల కవలంబించుపద్ధతులలో భేదాభిప్రాయములు గలవు. మహాత్మ గాంధిగారు కఠోరబ్రహ్మచర్యము నవలంబించుటయే సంతాననిరోధమున కుత్తమపద్ధతి యనియు, నితరకృత్రిమపద్ధతుల నవలంబించు టెంతమాత్రము మంచిది కాదనియుఁ జెప్పుచున్నారు. మేము మహాత్మగాంధిగారు చెప్పినటుల కఠోరబ్రహ్మచర్యము నవలంబింపఁగలవారికి నన్యసాధనోపాయముల నవలంబింపవలయుననియు, బ్రహ్మచర్యము మంచిది కాదనియుఁ జెప్పుటలేదు గాని కఠోరబ్రహ్మచర్య మెంతయో కష్టసాధ్యమనియు, వేలకు కొక్కరో గాంధిమహాత్ముఁడు చెప్పినటుల కఠోరబ్రహ్మచర్యము నవలంబింపఁగలరేమో గాని యందఱకు సాధ్యము కాదనియు నమ్ముచున్నాము. ఇట్టితలంపుతోనే మహాకవియగు రవీంద్రనాథఠాకూరు ఇతరమగు కృత్రిమపద్ధతులతోఁగూడ సంతానమును నిరోధించుట కంగీకరించియున్నాఁడు. వేలకు కొక్కరో సంతానమును నిరోధింపఁగలిగినను దేశమున కంతగా లాభ ముండనేరదు. ఇంతకాలమునుండి ప్రయత్నించుచున్నను జనసామాన్యములో విద్య విరివిగా వ్యాపింపలేదు. అట్టియెడ మిక్కిలి కష్టసాధ్యమగు బ్రహ్మచర్యమును దేశజులలో నెక్కువమంది నవలంబింపఁజేయ సాధ్యమగునా? "మానవుల నట్టి యున్నతస్థితికిఁ గొంపోవుటకును వారు చేయని తప్పిదమునకై శిశువుల నకాలమరణములవాత వేయుటయును, వియోగముల పాల్చేయుటయును సంఘమునకుఁ జాల నక్రమము చేయుటయే"యని రవీంద్రుఁ డనిన దెంతయు గమనార్హము. భారతీయులలోఁ బెక్కురు గాంధిమహాత్మునితో సమానులైనయెడల మనకు స్వరాజ్య మెప్పుడో వచ్చియుండెడిది. అందఱును గాంధిమహాత్మునివంటివారును, శుకులు ఆంజనేయులు వంటివారలును నగుట సాధ్యము కాదు.

ఒక చ. మైలునకు ౩౨ జనులుగల అమెరికాదేశజులు సంతాననిరోధమునకై యాందోళనము చేయుచుండ నంతకు నెన్నియోరెట్లెక్కువజనసంఖ్యగల భారతదేశము వెంటనే సంతాననిరోధోద్యమమునకై శ్రద్ధ వహింపవలదా? పరతంత్రజనులు మితిమించి సంతానమును వృద్ధిచేయుట పతనమునకే కారణ మగును. సంతాననిరోధోద్యమము మితిమించిన జనసంఖ్యచే దరిద్రులై జీవనము గడపక చౌర్యము మున్నగు దుష్టకార్యము లొనర్చువారిని లేకుండఁజేయును; దేశములో నచ్చటచ్చట జరుగు శిశుహత్యల నివారించును. ప్రతిసంవత్సరము దాదాపు మదరాసురాష్ట్రమున ౧౫ వేలమంది విద్యార్థులు కళాశాలవిద్యను ముగించి యుద్యోగములకై వచ్చుచున్నారు. ఇందు ౬ వేలమందికి మాత్ర ముద్యోగములు దొరకుచున్నవి. మిగిలినవారు దాదాపు నిరుద్యోగులే. నిరుద్యోగబాధచే నాత్మహత్యలకుఁ బాల్పడువారి సంఖ్యకూడ నానాఁటికి వృద్ధి యగుచున్నది. ధనవంతులును, బీదలును ఉన్నతవిద్యావంతులైనఁ గాని మానవులు ప్రవీణులు కాఁజాలరు. పోషింపనేరని బీదలు బిడ్డల నున్నతవిద్యావంతుల నెట్లు చేయఁగలరు?

కొందఱు, జనసంఖ్యను పెరుఁగకుండఁజేయుటకు మానవప్రయత్న మేల? ప్రకృతియే జనసంఖ్య మితిమించిపోయినప్పుడు ప్రజను నశింపఁజేయు—నందురు. అట్లు ప్రకృతికిఁ బని కల్పించుట మహానర్థదాయకమని మహాత్ముని 'యంగుఇండియా'లో ప్రొఫెసరు సి. యస్. వకీలుగా రీక్రిందివిధమున వ్రాసిరి: "ప్రకృతి యెట్టిపద్ధతుల నందుల కవలంబించినను గూడ నది కోరఁదగినది కాదు; అనర్థదాయకమే యగును. ఏలయన క్షామములు, సాంక్రామికవ్యాధులు గల్గించుటవలననే ప్రకృతి జనక్షయమును గలిగించును గాన మూలకారణము తొలఁగ నేరదు. తాత్కాలికముగా జనసంఖ్య క్షీణించినను మరల త్వరలో పెరిఁగిపోవుచు నేయుండును. అందువలన తఱచుగా నిట్టిదారుణమారణసాధనములను ప్రకృతి వినియోగింపవలసియుండును. ఈరీతిగా నంటువ్యాధులు మున్నగునవి యేదేశమందైన తఱచుగాఁ గల్గుచున్నచో నాదేశమున వస్తుసంపద చాల తక్కువగా నున్నదనియు, జనసంఖ్య మిక్కిలి హెచ్చుగా నున్నదనియు స్థిరపఱుప వలసియుండును."

'పుట్టించిన దేవుఁడు పూరి మేపునా' యని కొందఱు తలంతురు. అట్లు తలంచుట సరికాదు. పుట్టించిన మానవుఁడు జీవనమునకు తగినమార్గములఁ జూపుట విధియని నేటికాలమున తలంచుట ఉత్తమము. అంతయు నీశ్వర మహిమయని మానవప్రయత్నమును మానుట మంచిదా? అట్లు అన్ని విషయములలోను మానుచుంటిమా! గాలిలో దీపము పెట్టి దేవునిదే భారమనిన అది యారిపోకుండునా! భగవంతుఁడు మార్గముఁ జూపును. మన మామార్గము ననుసరించి కార్యసిద్ధిని బడయవలెను. 'నారు పోసిన దేవుఁడు నీరు పోయఁడా' అను మఱియొక్క ప్రవచనము మనదేశమున వాడుకలో నున్నది. అది యీకాలమునకు వర్తించునా? మానవుఁడు స్వాభావికమగు నాహారముతో సంతుష్టి నొంది కందమూలములతోను, కాయలాకులతోను కడుపు నింపుకొనుకాలమున నీప్రవచనము యథార్థమై యుండవచ్చును. ఇప్పుడు మానవుఁడు ప్రకృతిని స్వాధీనముచేసికొని సుఖించుచున్నాఁడు. ఇట్టిస్థితిలో ప్రకృతి తన సైర్వరక్షణశక్తిని గోల్పోయినది. ప్రకృతి సహజమగు నాహారములు తినుట మాని అడవులను ఛేదించి నివాసానుకూలముగఁ జేసికొంటిమి. ఇట్టి సందర్భమున నాప్రవచన మీకాలమున కెంతమాత్రమును వర్తింపదు. కొందఱు సంతాననిరోధోద్యమము ప్రకృతి విరుద్ధాచరణ మందురు. వర్తమానయుగమున మానవుఁ డొనరించుకార్యములలో ప్రకృతివిరుద్ధము కాని దేది? కృత్రిమమేఘములనుండి వర్షముల కురిపించుట; రైళ్లు, మోటారులు, విమానములు మున్నగువానిని సృష్టించుట ప్రకృతి విరుద్ధము కాదు కాఁబోలు. వర్తమానయుగమున ప్రకృతిని స్వాధీనముచేసికొని మానవుఁడు సుఖించుటే నాగరికలక్షణము. పాశ్చాత్యదేశములలోను ౧౯౨౨-వ సంవత్సరమునకుఁ బూర్వ మీయుద్యమమును పెక్కురెదిరించిరి; వ్యతిరేకముగ నాందోళనము చేసిరి; గ్రంథముల ప్రకటించిరి; గాని అమెరికాలోను ఇంగ్లండులోను వైద్యసంఘములవారు ౧౯౨౨ లో నొక సమయమున సభలు చేసి యీ యుద్యమము నంగీకరించిరి. అంతట ప్రతికూలుర యాందోళనము చల్లారెను. అట్లే భారతదేశమునను కొంతకాల మీయుద్యమమును గొంద ఱెదిరింపవచ్చును. సృష్ట్యాదినుండియు ప్రతిసంస్కారోద్యమమున కిట్టి ప్రతిబంధకములు కలుగుచునే వచ్చినవి. కాలక్రమమున నానియంతట నవియే తొలఁగిపోవును. కొందఱు సంతాననిరోధపద్ధతు లారోగ్యభంగము లందురు. సంతాననిరోధపద్ధతులలోఁ గొన్ని కొంతవఱ కారోగ్యభంగము లైనవి గలవు. అందుచే నన్ని పద్ధతులును ననారోగ్యములని నిందించుట అవిచారమూలకము. ౧౯౨౨-వ సంవత్సరము ఇంగ్లండులో సమావేశమైన పంచమాంతర్జాతీయసంతాననిరోధసభకు హాజరయిన సుప్రసిద్ధులగు ౧౬౮ గురు వైద్యులలో ముగ్గురు తక్క నందఱు సంతాననిరోధకృత్రిమపద్ధతులలో నుత్తమపద్ధతులు శరీరమున కెట్టికీడు లేక, నష్టము నొసరింపవని సిద్ధాంతీకరించిరి. చావుపుట్టుకలు మానవహస్తమునఁ గలవని చెప్పు జన్మనిగ్రహవాదులు ఒకవంధ్యను ప్రజలకు నమ్మకము కల్గించుటకై యేల సంతానవంతురాలుగాఁ జేయఁగూడదని కొంద ఱందురు. ఈయాక్షేపణము చచ్చినవానిని బ్రతికింపలేని వైద్యు

వేల యనినట్టు లున్నది? సంతానము కలుగకపోవుటకుఁ బెక్కుకారణము లుండవచ్చును. సంతాననిరోధగ్రంథములలో సందర్భానుసారముగ సంతానము కలుగకపోవుటకుఁ గారణములు చెప్పుదురు. ఆకారణముల నెఱింగినచో నట్టివారిలోఁ గొందఱు సంతానమును గనవచ్చును. కొందఱు 'సంతాననిరోధమ్ము నవలంబించిన, మహానుభావులు కొందఱు పుట్టకపోవచ్చు'నని యందురు. ఈ యాక్షేపణము గాంధిమహాత్ముఁడు బోధించు బ్రహ్మచర్యమునకును వర్తించును. యువతీవివాహములు చేయుటవలనఁ గొంతకాలము సంతానము కలుగకుండ నాఁపుటయేగదా! అయినను పుట్టుశిశువులును మాతయు నారోగ్యముగ నుండవలయునను తలంపుతో యువతీవివాహముల నెల్ల రామోదించుచుండుటలేదా! మనము ఎట్టి సంతాననిరోధపద్ధతుల నవలంబించినను నవతారపురుషులు జనింపవలసియున్నచో నయ్యెడ నవి తప్పక విఫలమగును.

బ్రాహ్మణాబ్రాహ్మణవిభేదములు విజృంభించుటకుఁ గూడఁ బ్రధానకారణము హెచ్చుజనసంఖ్యయే. హెచ్చుజనసంఖ్య లేకయున్న ఇక్కాలమున బ్రాహ్మణబ్రాహ్మణేతరులలోఁ బెక్కురు ఉన్నతవిద్య నొందినను తమ కనుకూలముగ వచ్చుచున్న వృత్తులలోనే ప్రవేశించెడివారు. ఆవృత్తులలో సంఖ్య పెరిగిపోయి సుఖజీవనము జరుగక యుద్యోగములకై పెనఁగులాడుచున్నారు. హిందూమహమ్మదీయవైషమ్యములు నానాఁటికి వృద్ధి నొందుటకుఁ గారణముకూడ హెచ్చుజనసంఖ్యయే. ఎట్లన సంఖ్య పెరిఁగినందున ననుకూలమగు వృత్తులలో సుఖజీవనము జరుగక యిరుతెగలవారు నుద్యోగములకై పోటీపడి కక్షలను పెంచుకొనుచున్నారు. హెచ్చుజనసంఖ్యచే నుద్యోగములకై తీవ్రసంఘర్షణ మేర్పడినది. ప్రబలమగు నిట్టి కారణమువలనఁ గాక యన్య స్వల్పకారణములచే హిందూమహమ్మదీయకక్షలు విజృంభింపవు. ఇరుమతములలోని ఛాందసు లెవరైనఁ గలహములు కల్పించుకొనినను ఆదరించు నాయకులు లేక నశించెడివి. కక్షలు పెరిగినపిమ్మట నిరుమతములవారును తమ శత్రుపక్షము బారినుండి రక్షణ నొందుటకు లేక పశుబలముతో శత్రుపక్షమును జయించుటకు తమతమ మతస్థుల సంఖ్యను వృద్ధిచేసికొనఁజూతురు. అయినను హిందూమహమ్మదీయకక్షలకు మాతృస్థానమగు పాంచాలరాష్ట్రప్రధాననగరమగు లాహోరులో సంతాననిరోధసమితి స్థాపింపఁబడి మిగుల తృప్తికరముగఁ బనిచేయుచునే యున్నది. "ధనవంతులుమాత్రమే మేల బిడ్డలఁ గనవలెను? అట్లు వారును బిడ్డలను గనుచుండుచో నాలుగయిదుతరములలో వారును బీద లగుదురు"అని కొందఱధిక్షేపించెదరు. ధనవంతు లారోగ్యస్థితిని గమనించి బిడ్డలను గనుచుండుటయే మంచిది. అట్లు ధనవంతులు బిడ్డలను గనుచుండి, ధనహీనుఁడు ఆర్థికస్థితి ననుసరించి బిడ్డలను గనుచుండుచోఁ గొన్ని వందలయేండ్లలో ఆస్థితిలో హెచ్చులొచ్చులు లేని స్థితి యేర్పడవచ్చును. అట్టిస్థితి ప్రపంచశాంతికి, తద్ద్వారమున ప్రపంచకల్యాణమునకుఁ దోడ్పడును. "ఒకబిడ్డను గనుటకుమాత్రము సరిపోవు నాస్తిమాత్రమే యుండును. అట్టివా రొకబిడ్డనుమాత్రమే గని సంతాననిరోధపద్ధతుల నవలంబింపవచ్చును. పిమ్మట నేదేని వ్యాధివలన నాబిడ్డ మృతి నొందవచ్చును. అప్పుడెట్లు?"అని కొందఱందురు. సాధారణముగ నొకబిడ్డతో తృప్తినొందు టంత మంచిపద్ధతి కాదు. ఇరువురుబిడ్డల నట్టివారు కలిగియుండవచ్చును. ఒకానొకచో నాయిరువురుకూడ మృతి నొందుట తటస్థింపవచ్చును, అయిన నట్టిస్థితి యరుదుగా జరుగును. ఎక్కడనో యొకరియెడ నపకారముగ పరిణమించినదని బహుజనులకు మేలొనఁగూర్చు సంతాననిరోధోద్యమము గర్హ్యమా! స్త్రీపురుషుల సౌఖ్యముకొఱకు వివాహ మేర్పడినది. అట్టి పావనమగు వివాహముఁగూడఁ గొందఱు దంపతులకు సుఖము నీయక మనోవ్యథ కలిగింపవచ్చును. అంతమాత్రముచే వివాహపద్ధతి త్రోసివేయఁదగునా? ఈవిషయమున నింకను వివరములు, నిరోధపద్ధతులను ఎఱుంగఁగోరు తెలుఁగుపాఠకులు వంగభాషనుండి నాచే ననువదింపఁబడిన 'జన్మశాసనము' అనుగ్రంథమును జూడఁదగును.

గా. న్యాయమూర్తి శ్రీ రామేశం పంతులుగారి నిరంతరకృషిచే సర్ శివస్వామయ్యరుగారి యధ్యక్ష

తను, సర్ సి. పి. రామస్వామయ్యరుగారి యుపాధ్యక్షతను మదరాసులో నొక సంతాననిరోధసమితి యేర్పడెను. ఆసమితివారి యుద్యమవ్యాప్తికి విశేషముగఁ దోడ్పడ నున్నారని వినుటకు సంతసిలుచున్నాను. సంతాననిరోధమునకు వలయు పరికరముల నమ్ముటకు సమితి వారొకదుకాణము నేర్పాటుచేయవలెను. దేశభాషలలో కరపత్రముల నచ్చొత్తింపించి విరివిగాఁ బంచిపెట్టవలెను. ఇతరపట్టణములలోను, తగిన గ్రామములలోను అనుబంధసమితులు స్థాపించి నాయకులు తీరుబడి అయినప్పు డెల్ల శ్రీరామేశంపంతులుగారివలె నుపన్యసించుచుండవలెను. సాహితీసమితి యధ్యక్షులగు శ్రీ శివశంకరశాస్త్రులుగారును, శ్రీ నరహరి, బి. ఏ., బి. యల్. గారును గుంటూరులో నొకసమితిని స్థాపించినటులు తెలియుచున్నది. ఆసమితి యిప్పు డేస్థితిలో నున్నది తెలియరాదు.

---

## *కురంగము

శ్రీ శేషాద్రిరమణకవులు

హారిణీసంచయమధ్యభాగమున గర్వాతీతవృత్తిన్ నిరం
తరముం గన్గవమూసి త్రిమ్మరఁగనౌనే కృష్ణసారంబ? ని
ర్భరదంతావళ కుంభనిర్గళదసృక్ప్రచ్ఛన్నముక్తావిభా
స్వర మీకాననమధ్యభాగమునఁ బంచాస్యంబు వర్తించెడిన్.

ఎరగలి లేదు, బోయ విలు నెక్కిడి చంపఁగ రాఁడు, ఘోరదు
ర్భరరవ మేమి విన్పడదు, వాగురికానిచయంబు నాస్తి, నా
కరయఁగఁ జంద్రమండలమె యాశ్రయమంచు వసించె లేఁడి, యె
వ్వరు విధి దాఁటనేర్తు, రట వాటిలె రాహువిషాగ్నిఘూత్కృతుల్.

కల్లలు పల్క వెందు, ఘనగర్వమదాంధుల మోముఁ జూడఁగా
నొల్లవు దుష్టవాక్కు విన నోపవు, దాతల వేఁడఁబూన వీ
వల్లన లేఁతలేఁతచిగురాకులతో సుఖనిద్రతో దినం
బెల్లఁ జరింతు వీసుకృత మేతపపుంఫల మోకురంగమా!

అకట, కురంగరాజమ, మహర్షి వరాశ్రమమంచు నీ కిరా
తకపురి కేఁగుదెంచితివి దైవవశంబునఁ, జెల్లనున్న చి
ల్కకడుపుగూడఁ జీల్పుమని, కండలఁ దిన్మని, కత్తిఁ బట్టి కు
త్తుకఁ దెగఁగోసివేయుమని దోసపుఁబల్కులఁ బల్క నెప్పుడున్.

---

* జగన్నాథ పండితరాయల కురంగాన్యోక్తికిఁ దెలిగింపు.

వలలం బన్నిరి నల్ కెలంకుల వనీ భాగంబునందున్న ప
ల్వలనీరంబులలో విసం బిడిరి; నేలం ద్రవ్వి రారణ్యక
స్థలముల్ గాల్చిరి యంతఁ బోవక యధిజ్యంబైన విల్దాల్చి బో
యలు వెన్నాడిరి; కూనతో హరిణి డాయన్ వచ్చె నచ్చోటికిన్.

అడవినల్గడల నిష్పంటించి విలుకాఁడు పదనుముల్కులతోడ నెదురుపడియె
వాగురికలకు నావల వలుగొలఁకులఁ గానవస్థల మెల్లఁ గాలుచుండె
సారమేయంబులు పేరెముల్ వారుచు మించి రోఁజుచు వెంబడించుచుండె
అనుపదంబునఁ గాళ్లకడ్డమై కూనలు వెనువెంట మునుముందు వెంబడించె

అతుల గర్భాలసాంగియై హరిణయువతి - యేమి సేయుదు నెచ్చటి కేఁగుదు నిఁక
శరణ మీవె రమామనోహర, యటంచు - నగతికంబుగ నుండె నెట్లగునో యింక.

కరుణ దలంచి మాంసమును గైకొని మేన స్తనంబు లుంచి వా
గురికలనుండి నన్ విడువఁగోరెద, మేఁతల మేయలేని నా
చిఱుతకురంగపోతములు చిత్తము లుత్తల మొంద నాకునై
తెరువులఁ జూచుచుండు నతిదీనత భిల్లకులావతంసమా!

వింట నెక్కిడి ముల్కు విడువ నుంకించుచోఁ గ్రూరధ్వనిని బోయ నారి తెగియె.
అటవి నెల్లదహించు హవ్యవహంబు నల్గడల వాగురికలఁ గాల్చివైచె
వెనువెంటఁ బడుచున్న శునకసందోహంబు వెఱచి యిచ్చకొలందిఁ బరుగులెత్తె
క్షణములోఁ బాడము నకాలమేఘములచేఁ గారుచిచ్చు తనంత నారిపోయె

కూనలను గూడి లేడి దిగుల్దొలంగి - బ్రదికితి నటంచు సుఖముగాఁ బయనమయ్యె
సర్వలోకనియంతయా చక్రపాణి - కరుణచే నెట్టివెతలైన గడుపకున్నె.

---

## కార్మికసంఘ నివేదిక

చా. వెం. హనుమంతరావుగారు, యం. ఏ.

ఈమధ్యను ప్రభుత్వమువారిచే ఏర్పాటు చేయబడిన విచారణసంఘము లన్నిటిలోను కార్మికులవిషయమై ఆలోచించుట కేర్పరుపబడిన సంఘము చాల ముఖ్యమైనది. ఆకమీషనువారు చేసిన సూచనలనుబట్టి దాని ప్రాముఖ్యము ఇంకను ఎక్కువమైనదని చెప్పవచ్చును. ఇంతవరకును మన దేశమునందు కార్మికసమస్య ఎక్కువ ప్రాధాన్యము పొందియుండలేదు. కాని పరిశ్రమాభివృద్ధి ఎక్కువయగుటతో అదికూడ రోజురోజునకును ఎక్కువగ ప్రజలదృష్టిని, ప్రభుత్వదృష్టిని ఆకర్షించుచున్నది. పనిచేయువారి బాగోగులను విచారించుటయు, వారికి వీలైనన్ని సౌకర్యములు చేకూర్చుటయు వారికే కాక దేశక్షేమమునకు కూడ చాల అవసరమను అభిప్రాయము ప్రబలుచున్నది. ఈ అభిప్రాయము ననుసరించియే ప్రభుత్వమువారు కొన్ని చట్టములను (పనిచేయువారికి నష్టపరిహారపుచట్టము, ఫ్యాక్టొరిచట్టములు, కార్మికవివాదముల చట్టము మొదలగునవి) ఇదివరలో చేసియున్నారు. కార్మికులతో సంబంధమున్న ఇతరులుకూడ వారి సౌకర్యములను చూచుటలో కొంత పని చేసియున్నారు. కాని వాటి యన్నిటివలనను తగినంతమేలు చేకూరలేదనియు, ఇంకను ఈ సందర్భములలో చేయవలసిన కార్యములుచాల కలవనియు ఇప్పుడు లేబరు కమిషనువారి రిపోర్టును చదివిన స్పష్టమగును. లేబరుకమీషను వారి సూచనలవలన ప్రస్తుతము మన దేశమందు ప్రబలియున్న కార్మికుల పరిస్థితులకంటె ఎక్కువఅనుకూలమగు పరిస్థితు లేర్పడు నని నిర్ధారణగ చెప్పవచ్చును. కాని అవి పూర్తిగ మన దేశపు కార్మికులఆశలను సఫలపర్చు ననుటకు వీలు లేదు. వారి సూచనల నన్నిటినైనను ప్రభుత్వమువారు అమలులో పెట్టుటకు ప్రయత్నించిన దేశమునకు చాల లాభము కలుగు ననుటకును, కార్మికుల స్థితిగతులు చాలవరకు అభివృద్ధి చెందుననుటకును సందేహము లేదు.

*　　*　　*

కార్మికుల అభివృద్ధికి సంబంధ మున్న ప్రతిముఖ్యవిషయమును గురించియు సంఘము వారు సూచనలను చేసియున్నారు. కూలి ఎంత యుండవలెననువిషయము, పనిచేయవలసిన గంటలవిషయము, కార్మికుల గృహావసతి మొదలగువిషయములు, పనిచేయువారికి పని పుచ్చుకొనువారికి ఉండవలసిన సంబంధము-ఇట్లు అనేకమైనవాటినిగూర్చి వారు సూచనలను చేసియుండిరి. చాలపాడుగ నున్న వని ఎల్లరును ఒప్పుకొను కార్మికుల పరిస్థితులను బాగుచేయుటకు ఎవరెవరు ఏయేవిధముగ బాధ్యులై యున్నారో మొగమోటము లేక సంఘమువారు చూపిరి. వారిరిపోర్టువలన ఏఇతర

లాభము లేకపోయినప్పటికిని ఈవిధముగ నిజ పరిస్థితులను బయల్పరిచి ప్రపంచదృష్టిని వాటి పైకి కేంద్రీకరింపచేయుటవలననే వారు మహోపకార మొనర్చిరని ఒప్పుకొనక తప్పదు.

పనిచేయువారికి కూలి నిచ్చు విషయములో ఇదివరకున్న పద్ధతిప్రకారము కాక ఇకముందు వారమున కొకసారి ఇచ్చివేయుటనుగూర్చి యజమానులు తగు ప్రయత్నములు చేయవలెనని వారు వ్రాసియున్నారు. కార్మికుల దృక్పథమునుండి ఇది చాల లాభకరమగు సూచన.

కార్మికులు పనిచేయవలసిన కాలము వారమునకు మొత్తము 56 గంటలును, ఏరోజున గాని 10 గంటల కెక్కువ కాకుండునట్లును ఏర్పాటు చేయబడవలెనని సూచించియుండిరి. 18 ఏండ్లలోపుపిల్లలు పనిచేయుకాలము ఇంతకన్న తక్కువగనే యుండవలెననియు, ఆడపనివాండ్రు బొగ్గుగనులు మొదలగు అపాయకరములగు ప్రదేశములలో పనిచేయుట నిషేధింపబడవలెననియు, ఏపరిశ్రమయందైనను ఎక్కువమంది ఆడపనివాండ్రుండిన అట్టివారివిషయమై తగుశ్రద్ధ తీసుకొనుటకు ఆడమేస్త్రీలను, ఆడ ఇన్స్పెక్టరులను నియమింపవలసి యుండుననియుకూడ కమీషనువారు సూచించిరి. ఇదివరలో ఆడపనివారల కిట్టి సౌకర్యములు లేకపోవుటవలన వారనేకబాధలను, చిక్కులను అనుభవించుచున్నారు. ఈపైన అట్టికష్టములు తొలగిపోయి వారి కెక్కుడు సౌకర్యములు చేకూరుననిి తలంపవచ్చును.

కార్మికులు మనదేశములో పనిచేయు పట్టణములలో స్థిరనివాసముల నేర్పాటుచేసుకొని జీవించుట చాల అరుదుగా నున్నసంగతి మన మెరుగుదుము. ఎక్కువమంది సాధారణముగ వారిపనికిమాత్రము పట్టణములకు వచ్చి అవసరమైనప్పుడును, వీలైనప్పుడును తమతమ గ్రామములకు పోవుట మామూలుగ ఆచారమైనది. ఈపద్ధతివలన లాభములును నష్టములునుకూడ కలవు. కాని ఇట్లు గ్రామములలో తమ కుటుంబముల నుంచి పట్టణములలోనుండి గ్రామములలోనికి పోవు ఆచారమువలన కార్మికులయొక్కయు, వారికుటుంబములయొక్కయు ఆరోగ్యము, ఆర్థికస్థితి, నైతికాభివృద్ధి పెంపొందుటకు చాలఅవకాశము లున్నవనిమాత్రము అంగీకరింపక తప్పదు.

కార్మికుల కొరకై ప్రభుత్వమువారును, ఇతరులును గృహనిర్మాణమును చేయవలసిన ఆవశ్యకతనుగూర్చి కమీషనువారు చేసిన సూచనలు చాల సమంజసముగ నున్నవి. ప్రస్తుతము పనిచేయువారు బొంబాయి, కాన్పూరు మొదలగు పారిశ్రామికప్రదేశములలో నివసించు గృహములు నివాసయోగ్యములు కావనియు, ఇరుకుగను, గాలి చొరకుండగను, మరుగు ఏమాత్రమును లేకుండగను ఉన్నవనియు వాటిని చూచినవారికి తెలియును కార్మికులు నివసించుగృహపరిస్థితులపై వారి ఆరోగ్యము, పనియందు చురుకు గలిగియుండుట మొదలగు విషయము లన్నియు ఆధారపడియుండును. నివాసముచేయు స్థలము

లందు వాతావరణము సరియైనదియు, ఆరోగ్యమైనట్టిదియు అగునెడల పనియందు వారు ఎక్కువ నేర్పరులై యుందురు. ఈ ముఖ్యాంశమును పరిశ్రమాధికారులు గ్రహించి దానికి తగు నేర్పాట్లు చేయుట వారి విధి. పరిశ్రమాధికారులు మాత్రమే కాక, ప్రభుత్వమువారును, మునిసిపాలిటీలవారును, ఇతరసంస్థలును ఈ విషయమై చాల శ్రద్ధ తీసుకొనవలసియుండును. ముఖ్యముగా మునిసిపాలిటీలు ఈ విషయములో ప్రధానముగ కలుగచేసికొని తగినవసతులను పనిచేయువారి అవసరముల ననుసరించి కట్టించుటయు, వారి ఆరోగ్యశాఖాధికారులను తరుచు వారి గృహములకు పంపి వారి ఆరోగ్యావసరములను పరిశీలించుటయు చేయవలసియున్నది. ప్రభుత్వమువారు మన దేశములో అందరికంటెనుకూడ ఎక్కువసంఖ్యగల కార్మికుల యాజమాన్యము కలిగి యున్నారు. రైల్వేపనివాండ్రు ముఖ్యముగ ప్రభుత్వమువారిచేతులక్రింద నున్నారు. వారి సౌకర్యములను చూచుట ప్రభుత్వమువారి విధియై యున్నది.

కార్మికులకు సంబంధించిన విషయములను ఆలోచించుటకును, వారికిని పరిశ్రమాధికాగులకును మధ్య సఖ్యమును పెంపొందించుటకును రెండుపక్షములవారికిని కూడ సమాన ప్రాతినిధ్యముకల సంఘములు ప్రతి పరిశ్రమయందుకూడ ఏర్పాటుచేయబడవలెనని కమీషనువారు సూచించియుండిరి. ప్రస్తుతకాలములో యజమానులకును పనిచేయువారికిని భేదాభిప్రాయము కలిగినపుడు కార్మికులు కట్టుకట్టి సమ్మెచేయుటయే వారి కాధారముగా నున్నది. కాని పైని చెప్పబడిన సంఘములు ఏర్పాటుకాబడిన సమ్మెచేయుటకు ముందు కార్మికులకష్టములను యజమానులకు తెలియచెప్పుటకును, వారిఉద్దేశములను కనుగొనుటకును అవకాశము లేర్పడి అనవసరమగు కష్టములకు ఏపక్షమువారునుకూడ లోబడనక్కరలేకుండ నుండును.

లేబరుకమిషనువారు చేసిన ఇతరసూచనలలో ముఖ్యమైనవానిని ఈ క్రింద పొందుపర్చుచున్నాము:—

(1) కార్మికుల జీవితవిధానమును గూర్చి (అనగా వారి రాబడి, ఖర్చు, పుట్టుచావుల లెక్కలు, ఇతరపరిస్థితులు) విపులముగ తెలిసికొనుటకు వీలుగా నుండునట్లుగా దానిని గూర్చిన లెక్కల నన్నిటిని సమకూర్చుటకు ప్రతి ముఖ్య పారిశ్రామికపట్టణమునందును లేబరు స్టాటిస్టికల్ బూరో (Labour Statistical Bureaux) లను స్థాపించవలెను. కార్మికులవిషయములో అభివృద్ధిమార్గములను త్రొక్కుటకును ఏయేవిధముగ వారిజీవితములను సంతోషదాయకముగ నుండునట్లు చేయవలెను అను సంగతులు చర్చకు వచ్చినపుడు ఈలెక్కలు చాల ఉపయోగకరములుగ నుండును.

(2) కార్మికులు ఫ్యాక్టొరీలలో పనిచేయునపుడు వారికి కల్గుఉపద్రవములను, ఆపదలను తొలగించుటకును, ఏదైన ఆపద కలిగినప్పుడు

దానికి తగురీతి ఉచితమగు నష్టపరిహారము నిచ్చుటకును ఇప్పటికన్న కట్టుదిట్టము లగు ఏర్పాట్లు చేయబడవలెను. ఈనష్టపరిహారములను నిర్ణయించుటకును, వాటిని తగు రీతిని ఇచ్చునట్లు చూచుటకును ప్రతిరాష్ట్రమునందును కమీషనర్లు ఏర్పాటుచేయబడవలెను.

(3) కార్మికులకు ప్రస్తుత మున్న అప్పులనుగూర్చి లెక్క తేల్చి వాటిని వీలైనంతవరకు తీర్చివేయుటకు ప్రభుత్వమువారును, యజమానులును ప్రయత్నించవలెను. ఇక ముందు వారికి సులభమగు పద్ధతులపై, తక్కువ రేట్లపై అప్పుల నిచ్చుటకు పరపతి సంఘములు మొదలగు సంస్థలు ప్రారంభింపబడవలెను.

(4) కార్మిక-తగాదాలను పరిష్కరించుటకు ప్రతిరాష్ట్రమునందును 'పారిశ్రామిక సంఘములు' (Industrial Councils) ఏర్పాటు కాబడవలెను. ఇట్టిసంఘములవలన కార్మికులయొక్కయు, యజమానులయొక్కయు ప్రతినిధులు వారివారి అభిప్రాయములను ఒకరికొకరు తెల్పుకొనుటకును, విభేదములను తగ్గించుకొనుటకును అవకాశము లుండును.

(5) కార్మికులకు సంబంధించిన విషయము లికముందుకూడ ఇప్పటివలెనే కేంద్రప్రభుత్వమువారి యాజమాన్యముక్రింద నుండవలెను. ముఖ్యముగ కార్మికులవిషయములలో చట్టముల నిర్మించుఅధికారము కేంద్ర లేక ఫెడరల్‌పార్లమెంటువారి చేతులలో నుండవలెను. ఈసూచన చాల లాభదాయకము. ఏరాష్ట్రమున కారాష్ట్రము కార్మికుల విషయములో చట్టనిర్మాణాధికారము కల్గియుండిన వివిధములగు సూత్రములపై చట్టనిర్మాణము జరుగుటయు, అన్నిప్రాంతములందును సమానమగు పద్ధతులపై కార్మికచట్ట - నిర్మాణోద్యమము (Labour Legislation) జరుగకుండుటయు తటస్థించును. ఇట్టి విభేదములవలన కార్మికులకు నష్టము చాల వాటిల్లును. కమీషన్‌వారి సూచనను రౌండుటేబిల్‌సమావేశమువారు ఆమోదించుట అవసరము. దానివలన స్వదేశ సంస్థానమునందలి కార్మికుల స్థితిగతులు కూడ బాగుపడుట కవకాశములు కల్గును.

(6) కార్మికులకు కేంద్రశాసనసభయందు ప్రత్యేకప్రాతినిధ్య ముండవలెను. లేబరుసభ్యుల నెన్నుకొనుటకు ట్రేడ్‌యూనియన్‌కాంగ్రెసు మొదలగు కార్మికసంస్థల కధికార ముండవలెను. ప్రత్యేకనియోజకవర్గములు మన దేశపు రాజ్యాంగవిధానమునందు చేర్చబడిన ఈసూచన నంగీకరించి కార్మికులకు ప్రత్యేకమగునట్టియు, సరిపోవునట్టియు ప్రాతినిధ్యము వాటిద్వారా చేకూర్చుట చాల ముఖ్యము.

ఈవిధముగ అనేకములగు లాభకరములగు సూచనలను లేబరుకమిషన్‌వారు చేసియున్నారు. వారి రిపోర్టును చదువువారెవరును ఇండియా దేశములో బ్రిటిషుప్రభుత్వపు అధికారముక్రింద ఇంతకష్టతరము లగునట్టియు,

లోటులతో నిండియున్నట్టియు కార్మిక పరిస్థితులు కలవా యని ఆశ్చర్యపడకపోరు. ఇంగ్లండులో కార్మికపక్షపత్రిక యగు 'డెయిలీ హెరాల్డు' పత్రిక కమీషనువారి నివేదికను గురించి వ్రాయుచు "ఇట్టి దుర్భరస్థితిగతులు ఇండియాదేశమందు బ్రిటిషు ప్రభుత్వమువారి క్రింద నున్నవని వినినప్పుడు ప్రతిఇంగ్లీషువాడును తల వంచుకొనకుండ నుండలేడు' అని వ్రాసెను. కమీషనువారు కొన్ని ముఖ్యవిషయములలో (అనగా కార్మికులకు కొంతకు తక్కువ కాకుండ నుండు కూలి నిర్ణయించుటకు మార్గముల నేర్పాటుచేయుట, కార్మికులకు పనిలేనిసమయములలో ప్రభుత్వమువారు పరిహారము నిచ్చుటకు తగు విధానము నేర్పాటుచేయుట, జబ్బుచేసినప్పుడు వారికి భుక్తికై కొంతధనము నిచ్చునట్లు నియమించుట, పనిలేనికార్మికులకు పని కల్పించుటకు తగినపని చూపుటకు కొన్ని లేబరుఎక్స్చేంజిల నేర్పాటు చేయుట మొదలగువాటియందు) కార్మికులకు లాభముగా నుండు సూచనలను చేయనిమాట నిజమే. కాని తక్కిన సూచనల నన్నిటినికూడ ప్రస్తుతప్రభుత్వమువారు అమలులో నుంచిన పైన చెప్పిన లోట్లను తీర్చుటకు త్వరలో ఏర్పాటు కాబడనున్న స్వరాజ్యప్రభుత్వమువారు తగుసావకాశములను కల్పించినవా రగుదురు. పనిచేయువారికి ఇంతవరకును ఎక్కువసహాయకారులగు చట్టములు మాంటేగ్యు సంస్కరణ శాసనసభలు చేయలేకపోయినచో దానికి ముఖ్యకారణము ఆసభలలో లేబరు ప్రతినిధులకు తగుప్రాతినిధ్యము లేకపోవుటయే. ఇక ముందట్టిలోటు తీరు ననుసూచనలు కాన్పించుచున్నవి. కాని అంతవర కూరకొనకుండ ప్రస్తుతప్రభుత్వమువారుకమీషనువారు చేసిన సూచనలలో వీలయినన్నిటిని అమలునందుంచుటకు వెంటనే ప్రయత్నములు చేయవలసియున్నది. కమీషనువారి సూచనలలో చాలవరకు క్రొత్తగ డబ్బుఖర్చుపెట్టనక్కర లేకుండగనే అమలునందుంచుట కనుకూలమైనవి చాల కలవు. అట్టివాటిని నూర్చిమైనను వెంటనే తగుచర్య ప్రభుత్వమువారు తీసికొనుట న్యాయ్యము.

---

అష్టావధాని, గోరుగంతు అచ్యుతసూర్యనారాయణశర్మగారు

ఘనులని నమ్మి మోమునవికాసము జూపకుమమ్మ! వారి తి
య్యనినగు మాటలెంచి హృదయంబున మెచ్చకుమమ్మ! యూరకే
జనవునఁ జేరనీకుమ! లసద్రససౌరభ సారమేదురం
బును భవదంతరంగమును బ్రుచ్చిలవచ్చిరి వారు మల్లియా!

తెల్లని కీర్తిఁ గాంచితి, సుదృఙ్మణిమండల మాదరింపఁగా
నెల్లపుడుం జెలంగితి, వదేటికి రాజస మింత పీడఁగా
నొల్లవు రూప ముండిన, నదో సుగుణం బొకయింత లేనిచో
నెల్లసతుల్ గణింపరు, సుమీ! సుగుణాంచితమైన మెచ్చరే!

రాజస మింత గల్గ, నవురా! మలినాత్ములు త్రాఁగుబోతులే
వ్యాజమొ పూని, జేరి, తియనల్కులఁ బల్కుచు లోరసంబుఁ బ
ల్మోజుగఁ ద్రావి త్రావి తుదఁ బోచకుఁ జూడరు నిన్ను మల్లియా!
సాజముసుమ్మ! వారి కది చక్కనిరీతి నెసంగ లగ్గగున్.

తావకరమ్యకాంతి జనతావినుతాదర సౌమ్య భారతీ
దేవిశరీరకాంతి యొకతీరున భాసిలు నీవ యా వధూ
టీవిలసచ్ఛరీరమున తీవిఁ జెలంగుదు విట్లు చేసెనే
రా! విధి కింత ప్రేమ నవలా తలమానికమైన నీయెడన్.

మారుఁడు నారిఁ జేర్పని యమాన్యత లే దదియెట్లటన్న నా
మారుని యగ్రజుండు పరమంబగు ప్రేమ చెలంగ నీకు బ
ల్నారుల మౌళులందునఁ జెలంగుట మున్నె రచించినాఁడు మా
లారచనాకలా సుగుణలాలిత! సౌరభసారకీలితా!

---

కటికకసాయికోత పసికందుల వెచ్చని నెత్తుటేళ్ళలో
నటమటలాడు ముద్దియల హాస్తము లంటిన దాహాపావకో
ద్భట నినదార్భటిం బడిన భస్మపురాసులు మల్లమాంబ సం
ఘటితము లోయి! నేటికి నఖండిత మోయి పతివ్రతాత్త్వమున్.

బావకు వేలుగా తెగిన బంధులపేరుగ దగ్ధయావతో
జీవముగా చిరాభిమత శేముషి గూర్చిన కోటలక్ష్మికిన్
సేవయుగా పరాసుల కజేయముగా నొనరించు కర్మసం
భావన పో భవద్భగినిపై నభిమానము కల్గియున్నచో!

ధర్మ మధర్మముం దెలియదా యని యన్యుల పృచ్ఛ లేని స
త్కర్మము వీరవర్యులు ముదంపడు కర్మము భావిమానవాం
తర్మయ దేశభక్తికి విధాయకమా సహజప్రతాపదోః
కర్మము నల్పమా భగినికై భవదాంధ్రమహత్త్వసిద్ధికై!

కోట పాడైనదానికి కుంద, బాల-వృద్ధనారీతతిని నిప్పు వ్రేల్చ కుంద
విజయరాముడు పలికిన వెలితిమాట-నరనరంబున ముల్లయి నాటె నోయి!

ఆవిజయావనీపతి దయాన్వితుడై మనువృత్తి నిచ్చి నా
జీవిత శేషముల్ గడువ జేసెదనం చభయంబు నిచ్చి నా,
డావిధి తత్కళత్రముల కౌగతి చేయగలాడ వేని నీ
బావయు నేను స్వర్పతికి పై నొకస్వర్గము కట్టలేమొకో!

—

# భౌతికశాస్త్రమందలి నూతనవిషయములు

విస్సా అప్పారావుపంతులుగారు, యం. ఏ.

(New Physics)

భౌతికశాస్త్రము చిరకాలమునుండి పాశ్చాత్యులవలన ప్రయోగమూలకముగా అభివృద్ధిపొందుచు వచ్చుచున్నది. పందొమ్మిదవ శతాబ్దమందుగల యభిప్రాయములు ముఖ్యమగు మూలాధారవిషయములందు చాలా మార్పుచెందినవి. ఆమార్పులు అత్యద్భుతమగు సారాంశములకు కారణము లగుచున్నవి. భౌతికశాస్త్రవేత్తలు కేవలాధ్యాత్మికతత్వవేత్తలవలె తలపంకించుచున్నారు. భౌతికశాస్త్రముకూడ వింతవిధములచేత వేదాంతవిషయములగు కొన్నిటిని సూచించుచున్నది. ఇదేమియని యాశ్చర్యమున మునిగి లాడ్జి, జీన్సు, ఎడ్డింగ్టన్ ప్రభృతులు అనేకవిధములగా విమర్శనలను వ్రాయుచున్నారు. మనస్సు, ప్రాణము ఈ సర్వజగత్తునకు ఆధారములని భౌతికశాస్త్రసాహాయ్యమున లాడ్జిగారు నిశ్చయించుటకు ప్రయత్నించుచున్నారు. ఈవిషయమును చర్చించుచు ఈమధ్యనే యొకపుస్తకమును వ్రాసియున్నారు. వీరియూహాలు, చర్చలు, తర్కములు భౌతికశాస్త్రమునకు దూరముగా నుండుటచేత వీరిమార్గమును ప్రముఖులగు శాస్త్రజ్ఞు లెవరును అంగీకరించుటలేదు. కాని జీన్సు ఎడ్డింగ్టనుగారలు లాడ్జిగారివలె భౌతికశాస్త్రవిరుద్ధముగా తర్కించక, యాశాస్త్రమును చాలవరకు అనుసరించియే పోవుచున్నారు. 'The Nature of the Physical world' (Eddington) 'The Mysterious Universe' (Jeans) అను నీరెండును వీరిరువురును వ్రాసినపుస్తకములు. అవి యెల్లరును పఠించవలసినగ్రంథములు. వాటియందు నూతనములు, అద్భుతములు నగు క్రొత్తయభిప్రాయములు, పోకడలు శాస్త్రవిరుద్ధముగాకుండ జనరంజకముగ లలితముగా వ్రాయబడినవి. మఱియు వేదాంతవిషయకమైన సందర్భములు' గలవు. భౌతికశాస్త్రమందలి మూలవిషయములలో అభిప్రాయములు ఎట్లు మారినవో, ఆమారుటచేత వేవిధముల బుద్ధియెటులు వేదాంతమార్గము ననుసరింప బూనుచున్నదో ఒకటిరెండువిషయములను విమర్శించిచూప ప్రయత్నించెదను.

### ద్రవ్యము—శక్తి (Matter-Energy)

ద్రవ్యము, శక్తి యను నీరెండును భౌతికశాస్త్రమునకు మూలములు. ఈరెండే ప్రపంచమునం దంతటను నిండియున్నవి. ఈరెంటియొక్కవికారములే మనముచూచెడి ప్రపంచమంతయును. ఈరెంటియొక్క శాఖాభేదములగురించియే భౌతికశాస్త్రము చర్చించును. ఈరెంటిలో ద్రవ్యమును గురించి మొదట విమ

ర్శించి తరువాత ద్రవ్యము-శక్తి యీ రెండింటిని కలిపి చర్చించెదను.

ద్రవ్యము

ఉప్పు, నీరు, గాలి, కఱ్ఱ, బంగారు ఈ మొదలైన వన్నియును ద్రవ్యవికారములు. ఉప్పు అనుదానికి కొన్ని గుణములు గలవు. ఒకతులము ఉప్పుతీసికొనినను, దానిలో పది నూరు వేయి లక్ష భాగమును తీసికొనినను గుణములలో భేద ముండదు. గుణభేదము లేనంత వరకు ఎంతచిన్న భాగము తీసినను సరే, భేదము ద్రవ్యమందు సంక్రమించదు. అట్టి గుణభేద మేమియు నుండకుండునట్లుగా భావనయందు ఎంతవరకు ద్రవ్యమును విభజించుకొనవచ్చునో అంతవరకు విభజింపగా ఏర్పడిన ద్రవ్య లేశమునకు మోలిక్యూ (Molecule) లని పేరు. రసాయనశాస్త్రజ్ఞ లీ మోలిక్యూలును ఇంకను విభజించియున్నారు కాని అట్టి విభజనమున తేలిన పర్యవసానము లేమనగా: ఒక గుణము గల మోలిక్యూలునుండి వేరుగుణములు గల రెండు, మూడు అణుప్రమాణము లగు ఇతర ద్రవ్యము లేర్పడుచుండును. వీటిపేరు 'ఏటమ్సు' (Atoms) అణువులు. ఏపదార్థమును రసాయన శాస్త్రరీత్యా విభజించి చూచినను తుదకు తేలెడివి ఏటమ్సుమాత్రమే. అందుచేత రసాయనశాస్త్రజ్ఞులు సర్వసాధారణముగా దొరకెడి పదార్థములను విభజించి తుదకు తేలెడి యణువులను బేరీజువేసి చూచిరి. అట్లు చూడగా 92 విధములగు ఏటమ్సు మాత్రమే యుండగలవని నిర్ధారణగా తేలినది. అనగా విశ్వమంతయు ఈ 92 ఏటమ్సువలననే నిర్మాణ మగుచున్నదని తేలినది. అందు మిక్కిలి తేలిక యైనవి కొన్ని; మిక్కిలి బరువైనవి కొన్ని. అనేక తారతమ్యభేదములు చూపట్టినవి. ఎన్ని విధముల సాధించినను ఇంతకంటె విభజనకు వీలులేకుండుటచేత ఈ 92 ను విభజించుటకు వీలులేని మూలద్రవ్యములుగా ఏర్పరుపబడినవి. వీటిని 'ఎలిమెన్ట్సు' అని పిలుతురు. ఏటమ్సు అన విభజనచేయ వీలులేనివి యని యర్థము. ఉదజని (Hydrogen) యనునది వాయురూపకము. అది యన్నిటికంటెను తేలికయైనది. ఇతర-ఎలిమెంటులకు దీనికి ఎత్తుకెత్తు తూనికలలో గల తారతమ్యము శాస్త్రమువలన సాధింపబడినది. ఆతూనికలలో ఉదజనియొక్క తూనిక ఒకటి యని యనుకొని తక్కినవాని తూనిక లింతింత లని అంకెల రూపముగా ఏర్పాటుఅయియున్నది (అ). ఈతూనికల నాధారము చేసికొని వరుసగా ఎలిమెంటులను వ్రాయవచ్చునుగదా! అట్లు వ్రాయగా మొదటిది ఉదజని, ౨ వది హీలియము, ౬ వది బొగ్గు, ౮ వది ప్రాణవాయువు, ౧౬ వది గంధకము, ౨౬ వది ఇనుము, ౨౯ వది రాగి, ౪౭ వది వెండి, ౫౦ వది తగరము, ౭౯ వది బంగారము, ౮౦ వది రసము, ౮౨ వదిసీసము, ౯౨ వది యురేనియము(Uranium)అని ఏర్పడుచున్నవి. ఈ యెలిమెంట్లు అనేకవిధముల పరిశోధింపబడినవి. వాటి వివిధగుణములు రసాయనశాస్త్రజ్ఞులు కనిపెట్టియున్నారు. వారికి

# రష్యాదేశపు శాస్త్రజ్ఞుడగు మెండలీఫువలన నిర్మింపబడిన ఎలిమెంట్లయొక్క పట్టిక

నిడుపువరుసలు ముఖ్యమైనవి ఎనిమిదిగలవు. ఒక్కొక వరుసలోని పదార్థములు సమానగుణములు గలవి.

ఎడమప్రక్క అంకె వరుసను తెలుపును. క్రిందఅంకె బలువును తెలుపును.

57-71 వరకు, 15 వస్తువులు సక్రమముగా దొరకు మన్నసంబంధము. భేదము, గుణములలో బహుతక్కువ

* Hydrogen (ఉదజని)

1,008

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మొదటి ఎనిమిది | 2. హీలి యము 4.00 | 3. లితియమ్ 6.9 | 4. బెరిలి యమ్ 9.0 | 5. బోరాను 10.8 | 6. బొగ్గు 12.00 | 7. నైట్రొజన్ 14.0 | 8. ప్రాణవా యువు 16.00 | 9. ఫ్లోరీను 19.00 | — | — | — |
| రెండవ ఎనిమిది | 10. నియాను 20.2 | 11. సోడి యమ్ 23.0 | 12. మెగ్నీ షియమ్ 24.3 | 13. అల్యూ మినియమ్ 27.0 | 14. సిలికాన్ (ఇసుక సం బంధము) 28.3 | 15. ఫాస్ఫరస్ 31.0 | 16. గంధకము 32.0 | 17. క్లోరీను 35.5 | — | — | — |
| మొదటి 18 | 18. ఆర్గాను 39.9 | 19. పొటేసి యమ్ 39.1 | 20. కాల్సి యమ్ 40.1 (సున్నపు సంబంధము) | 21. స్కాన్డి యమ్ 45.1 | 22. టైటేని యమ్ 48.1 | 23. వనాడి యమ్ 51.0 | 24. క్రోమి యమ్ 52.0 | 25. మాంగనీజు 54.9 | 26. ఇనుము 55.8 | 27. కోబాల్టు 59.0 | 28. నికెలు 58.7 |
| | | 29. రాగి 63.6 | 30. తుత్తునాగము 65.4 | 31. గాలి యమ్ 70.1 | 32. జర్మని యమ్ 72,5 | 33. ఉల్లిపాషాణము 75.0 | 34. సెలీని యమ్ 79.2 | 35. బ్రోమీను 79.9 | | | |

| | | | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| రెండవ<br>18 | 36. క్రిప్టాను<br>82.9 | 37. రుబీడి<br>యమ్<br>85.4<br>47. వెండి<br>107.9 | 38. స్ట్రాన్షి<br>యమ్<br>87.6<br>48 కేడ్మి<br>యమ్<br>112.4 | 39. యిట్రి<br>యమ్<br>89.3<br>49. ఇండి<br>యమ్<br>114.8 | 40 జర్కోని<br>యమ్<br>90.6<br>50. తగ<br>రము<br>118.7 | 41. నియోబి<br>యమ్<br>93.1<br>51. అంటిమని<br>121.8 | 42. మాలిబ్డినమ్<br>96.0<br>52. టెల్లూరి<br>యమ్<br>127.5 | 43. మసూరి<br>యమ్<br>—<br>53. అయొడీను<br>126.9 | 44. రుతీనియమ్<br>101.7 | 45. రోడియమ్<br>102.9 | 46. పల్లాడియమ్<br>106.7 |
| మొదటి<br>32 | 54. గ్జెనాను<br>130.2 | 55. సీజి<br>యమ్<br>132.8<br>79. బంగా<br>రము<br>197.2 | 56. బేరి<br>యమ్<br>137.4<br>80. పాద<br>రసము<br>200.6 | సక్ర్మతైన<br>మట్టి పదార్థ<br>ములు †<br>Rare<br>Earths<br>81. థేలి<br>యమ్204.0 | 72. హాఫ్ని<br>యమ్<br>178.6<br>82. సీసము<br>207.2 | 73. టంటాలమ్<br>181.5<br>83. బిస్మతు<br>209.0 | 74. టంగ్స్టన్<br>184.0<br>84. పొలోని<br>యమ్<br>210.0 | 75. రినియమ్<br>—<br>85 — | 76. ఆస్మియమ్<br>190.9 | 77. ఇరిడియమ్<br>193.1 | 78. ప్లాటినమ్<br>195.2 |
| ఆకరు<br>వరుస<br>అసం<br>పూర్తి | 86. రేడాను<br>222.0 | 87 — | 88 రేడి<br>యమ్<br>226.0 | 89. ఏక్టిని<br>యమ్ | 90. థోరి<br>యమ్<br>232.1 | 91. యురేనియ<br>ము, x. 2.<br>— | 92. యురేని<br>యమ్<br>238.2 | — | — | — | — |

* ఈద జనిరెయొక్క టిరయు వేరుగా తానొక్క వరుసలో ఉన్నది. సమానగుణముగలవి మరిలేవు. దాని కదే సరి.

† 57. లన్తానము, 58. సీరియము, 59. ప్రసోడిమియము, 60. నియోడిమియము, 61. ఇల్లినియము, 62. సమేరియము, 63. యురోపియము, 64. గడోలినియము, 65. టర్బియము, 66. డిస్ప్రోసియము, 67. హోల్మియము, 68. ఎర్బియము, 69. థూలియము, 70. యిటర్బియము, 71. లుటీషియము — సర్వసాధారణముగా ఇవి కలసి దొరకును. విడదీయుట కష్టసాధ్యము.

భౌతికశాస్త్రవేత్తలు Spectroscope అను యంత్రముతో ఈపరిశోధనలయందు చాలా సహాయము చేసినారు. * సూర్యకిరణములో గల వివిధములగు రంగు లెట్లు పరిశీలింపవచ్చునో యట్లే ఒక్కొక యెలిమెంటున్న తేజోరూపమును దాల్చినప్పుడు దాని తేజస్సునందు గల భేదములు ఈయంత్రమువలన కనిపెట్టవచ్చును. అట్టిభేదములు ఒక్కయెలిమెంటునకు ఒక్కరీతిగా ఉండును. దీనివలన రసాయనపరీక్షకులకు గొప్పసాహాయ్యము గలిగినది. ఏయే ఎలిమెంట్లకు ఏయేగుణములు గలవో నిశ్చయము చేయబడినది. ఆగుణములన్నిటిని పరీక్షించినచో కొన్నికొన్ని ఎలిమెంటులు ఏకగుణముకలవిగా తేలెను. అట్టి ఎలిమెంట్లు ఒకజాతికి చేరినవని ఏర్పరచుకొనగా అట్టిజాతులు కొన్ని ఈ 92 ఎలిమెంట్లలోను ఏర్పడినవి. ఆవరుసలో 2, 10, 18, 36, 54, 86 స్థానముల నాక్రమించిన ఎలిమెంట్లు ఏకగుణము గలిగి ఒకజాతికి చేరియున్నవి. 3,11,19,37,55 స్థానముల నాక్రమించినవి మరియొకజాతిలోనివి. ఇట్లే ప్రధానముగా 8 జాతు లేర్పడుచున్నవి. చిత్రముచూడుము. ప్రతిజాతిలోను వరుసగా వచ్చుఎలిమెంట్ల స్థానమును చెప్పు అంకెలకు అంతరము వరుసగా † 8, 8, 18, 18, 32 గా ఉండును. ఇందు ఒకసూత్ర మేదో యున్నట్లు పొడగట్టక మానదు. మరియు, $[2 \times 2^2=8, 2 \times 3^2=18, 2 \times 4^2=32]$ ఇవియే పైనచూపబడిన యంతరములు. వీటిని గురించి ఇంతకంటె నిచట వ్రాయుటకు వీలులేదు. దీనియం దేదో ఒకవిశేషము గలదు అను ననుమానము గలుగుటకుగాను ఇంతమాత్రము వ్రాసి వదలివేయుచున్నాను. ఈఅంతరముల నాధారముజేసికొని 92 ఎలిమెంట్లకు స్థానము లేర్పాటుచేయబడినవి. 55 వ ఎలిమెంటు వంటిది (55 + 32) 87 వ ఎలిమెంటు అయి యుండవలెగదా! కాని అట్టిది ఇంకను కనిపెట్టబడలేదు. నేడో రేపో కనిపెట్టబడవచ్చును. ఇట్లే నాల్గయిదు ఎలిమెంట్లు కనిపెట్టబడినవి. వాటిగుణములును ఉండవలసిన జాతికి చేరియే యుండెను. ఇది రసాయనభౌతికశాస్త్రములకు చేరిన యొక యద్భుతమగు విషయము.

పర్యవసానము

అనంతవికారమయమగు జగత్తునందు గల వివిధవస్తువులును 92 ఎలిమెంట్లతో సృజింపబడినవి. వస్తువులలో భేదము అనంతముగాదు, 92 మాత్రమే. ఇది పర్యవసానము.

ఎలక్ట్రాను (Electron)
ప్రోటాను (Proton)-వీనియుత్పత్తి

పైనుదాహరించిన 92 ఎలిమెంట్లు అవిభజనీయములని శాస్త్రజ్ఞులు చాలాకాలము వరకు నిశ్చయించుకొనియుండిరి. అట్టిసందర్భములో, భౌతికశాస్త్రములోని యొకశాఖయందలి విమర్శనలవలన అద్భుతమగు క్రొత్తసంగ

* ఇంద్రధనస్సులోని రంగులు సూర్యకిరణములయందలి తేజస్సులోని విభాగములే. ఏవస్తువునైనను కొలిమిలోనుంచి వేడిచేయించినచో అది తేజస్సును వెదజల్లును. దానిని పరీక్షించవచ్చును.

† 2, 10, 18, 36, 54, 86—10-2=8; 18-10=8; 36-18=18; 54-36=18; 86-54=32; 3, 11, 19, 37, 55, 87-11-3=8; 19-11=8; 37-19=18; 55-37=18; ? 87-55=32.

తులు బయలు దేరినవి. ఈ ఎలిమెంట్లు అవిభజనీయములు కావనియును, అన్నియును విభజన చేయబడగలిగిన కేయనియును, భాగములు చేసినతర్వాత గోచరించునవి రెండేవస్తువులనియును, ఈ రెండేదేనిని విభజించినను కనిపెట్టబడుననియును సిద్ధాంతమైనది. ఇది 1896-వ సంవత్సరప్రాంతమున ఆరంభమై నాల్గయిదు సంవత్సరములలో కృతనిశ్చయమైనవిషయముగా తేలినది. ఇంగ్లాండు దేశమందలి కేంబ్రిడ్జిసర్వకళాపరిషత్తునందలి భౌతికశాస్త్రవేత్తలలో అగ్రగణ్యుడగు సర్ జే. జే. థామ్సనుగారు, వారిశిష్యవర్గము ఈయద్భుతమగు విషయమును కనిపెట్టిరి. గాలిలో విద్యుచ్ఛక్తి వలన మెఱుపుకలుగుట మనమందరమును ఎఱిగినవిషయమేగదా! అటిమెఱుపును భౌతికశాస్త్రాగారమందు ప్రయోగమువలన కనుపరుపవచ్చును. ఈమెఱుపును మనల నావరించుగాలియందే కాక ఇంకను అనేకవాయువుల యందును చూపవచ్చును. ఏగాలి నుపయోగించినను ఒకగాజుగొట్టములో దానిని భద్రపరచవలెను. (ఆ) ఆ గొట్టమునకు ఈ చివర ఆచివర లోహపుతీగ లమర్పబడియుండును. ఒక

(ఆ)




గాలిని తీసివేయు పంపునకు పోవు గొట్టము.

ఆ=ఆనోడు. కే=కేతోడు. మె=మెఱుపు.

గొట్టములోని గాలిని తీసివేయుచు తీసివేయును ఆ, కే, ల నడుమ అగపడు చిత్రచిత్రములు చూడవలసినదే గాని వ్రాయ వీలులేదు.

దాని(Anode)ద్వారావిద్యుచ్ఛక్తిప్రవేశించును. రెండవదాని(Cathode)నుండి వెలుపలికిపోవును. వీటిని, 'ఆనోడు' 'కేతోడు' అని అందురు. ఈ రెండిటిమధ్య మెఱుపుపుట్టును. అందలి గాలిని క్రమముగా గాలియంత్రముచేత తీసివేసి గాలియొక్క దట్టమును, సాంద్రతను తగ్గించవచ్చును. సాంద్రత బాగుగా తగ్గినకొలది మెఱుపులో అనేకచిత్రవిచిత్రములు కాన్పించును. ఈవిశేషమును పరిశీలించుటకొరకై థామ్సనుగారు ప్రయోగముల నారంభించిరి. అందు తేలిన దేమనగా కేతోడునుండి ఒకవిధమగు కిరణములు ఉద్భవించుట, ఆకిరణములకు కొన్నికొన్ని నిశ్చితములగు గుణము లుండుట మొదలైనవింతలు. ఆగొట్టమున ఏగాలి నుపయోగించినను సరే, ఆనోడు కేతోడులు ఏ లోహముచేత చేయబడినను సరే కేతోడు కిర

ణములు ఆగుణములనే కలిగి, ఆ చిహ్నము లనే తాల్చియుండును. ఇది యొక యద్భుతమైన మూలవిషయము. ఏమనగా ఆకిరణము యొక్క గుణపరిశోధన చేయగా సూర్యకిరణములకును వీటికిని తారతమ్య మున్నటులు తేలినది. సూర్యకిరణములు తరంగజాలములు, వస్తురూపములు గావు. పదార్థాత్మకములు కావు ఈ కేథోడు కిరణములుఅతిసూక్ష్మ మగు అణుజాలములు. ఒక్కొక్క అణువుయొక్క బరువు, ఒక్కొక అణువు నాశ్రయించియున్న విద్యుచ్ఛక్తి, ఈ రెంటిని థామ్సనుగారు కొలచియున్నారు. ఈకొలతలలో భేదములేక బరువుశక్తి రెండును ఇంతింతయని నిర్ధారణ చేయబడినది. ఇదివరలో ఉదజనియను గాలి అన్ని పదార్థములలోను తేలికదైనది అని చెప్పి యున్నాను. ఈ సూక్ష్మాణువు (Electron) ఈ యెలక్ట్రాను,ఉదజని యాటముకంటె 1845 రెట్లు తేలికదైనదని ప్రయోగములవలన, లెక్కలవలన, తేలిన యంశము. (ఞ)

ఎలక్ట్రాను-ప్రోటానుల బరువు, పరిమాణము, చూపు పట్టిక (ఞ)

| వస్తువు | బరువు (గ్రాము) † | పరిమాణము (బంతికంతి ఆకారము) ‡ సెంటిమీటర్లలో-అడ్డకొలత. ⊖ |
|---|---|---|
| ఎలక్ట్రాను | $\frac{9}{\text{కోటి, కోటి, కోటి, కోట్లు}}$ అనగా $9 \times 10^{-28}$ గ్రాము | $3.7 \times 10^{-13}$ సెంటిమీటరు అనగా $\frac{3.7}{\text{పదిలక్షలకోట్లు}}$ భాగము, సెంటుమీటరులో |
| ప్రోటాను | $1.66 \times 10^{-24}$ గ్రాము గ్రాములో $\frac{166}{\text{లక్ష,కోటి,కోటి,కోట్లు}}$ భాగము | $2.06 \times 10^{-16}$ సెంటిమీటరు $\frac{206}{\text{పదివేలకోటికోట్లు}}$ భాగము, సెంటిమీటరులో |
| ఉదజని ఆటము (అణువు) Hydrogen atom | $1.66 \times 1^{0-24}$ గ్రాము | $2 \times 10^{-8}$ సెంటిమీటరు అనగా సెంటిమీటరులో $\frac{2}{10{,}0000000}$ భాగము $\left(\frac{2}{\text{పదికోట్లు}}\right)$ |

† ఒకతులము 11.5 గ్రాములకు రమారమి సమానమగును. అట్టిగ్రాములో కోటిభాగమును $10^{-7}$ గ్రాము అని వ్రాయుదురు. అనగా $\frac{1}{10000000} = 10^{-7}$. క్రింద ఒకటితరువాత ఏడుసున్న లున్నవి గనుక $10^{-7}$ అని వ్రాయుట. $10^{-28}$ అనగా, ఒకటి పైన, క్రింద ఒకటి వ్రాసి 28 సున్నలుంచిన వచ్చుభాగము అని అర్థము.

‡ ఒక అంగుళములో $2\frac{1}{2}$ సెంటిమీటర్లు ఉండును.

కనుక కేతోడుకిరణములు సూర్యకిరణముల వలె తరంగపరంపరలు గాక విశేషవేగముతో రువ్వబడిన ఎలక్ట్రానులయొక్క పరంపర యని తేలినది. వీటి వేగము సాధారణముగా ఒక సెకనుకు 10,000 మైళ్లు. సూర్యకిరణములవంటి తేజస్సుయొక్క వేగము ఒక సెకనుకు 186,000 మైళ్లు. ఈ యెలక్ట్రానులు (electrons) కేతోడునుండి బయలుదేరును. ఇట్లనే ఆనోడునుండి ఆనోడు కిరణములు బయలుదేరును. వీటికి పాజిటివుకిరణము లనిపేరు. ఇవియును సూక్ష్మతరములగు అణుపరంపరలే. వీటిని ప్రోటానులందురు. ప్రోటాను ఎలక్ట్రాను కంటె 1844 రెట్లు బరువైనను దానికంటె ఆకారమందు మిక్కిలిసూక్ష్మముగా ఉండును. దాని నాశ్రయించియున్న విద్యుచ్ఛక్తి ఎలక్ట్రానునందలి శక్తితో సమానము కాని ఎలక్ట్రాను ఋణవిద్యుచ్ఛక్తితో (negative electricity) చేరియుండును. ప్రోటాను ధనవిద్యుచ్ఛక్తితో (Positive electricity) కూడియుండును. ఈరీతిని అనేకవిశేషము లీపరిశోధనల వలన తేలినవి. కాని ప్రస్తుతాంశ మేమనగా విశ్వమంతయును యవిభజనీయము లగు 92 ఎలిమెంట్లతో జేయబడి రసాయనశాస్త్రజ్ఞుల సిద్ధాంతమునకు విచ్ఛేదము సంభవించినది. జగత్తంతయును 92 ఎలిమెంట్లతోగాక ఎలక్ట్రాను, ప్రోటాను, అను రెండింటచేతనే నిర్మింపబడినది అను గొప్పసూత్రము ఏర్పడినది. అనంతభేదములు గలవని మొదట భ్రమపడితిమి. లేదులేదు, ఇవన్నియును తొంబదిరెండు వేరువేరు ద్రవ్యములయొక్క వికారములని ఎంతో ఆనందించితిమి. ఇదే గొప్పఅద్భుతమని నమ్మితిమి. తరువాత 92 భేదములు లేవు, విశ్వమంతయు రెంటియొక్క వికారములను సంగతి తెలిసికొంటిమి. ఇంతకంటె అద్భుత ముండునా యని తోచకమానదుగదా. ఈ సిద్ధాంతము శాస్త్రముచే సాధింపబడినది కాని, వేదాంతుల యూహలవలన నిశ్చయింపబడినవిషయము కాదు. కాన భౌతికశాస్త్రమువలన ద్రవ్యమందుఅనగా స్థూలపదార్థమందు (Matter) ద్వైత మేర్పడినది. ఇది యొక గొప్పసారాంశము.

(సశేషము)

---

# దాంపత్యవిషయము-సాదీ

ఉ. భా. సంద్యాయం వేంకటసుబ్బయ్యగారు

[సాదీ పర్షియా దేశపుకవి. ఈయన జ్ఞానులలో నొకఁడు]

'ఆయభాగ్యుండె రాజు, శుద్ధాంతరంగ
మై విధేయమై యువని యర్ధాంగి యొప్ప;
సంగలార్పకు డైన బాధాళిఁ గూర్చి
తదపనోదిని రాత్రి సీదండఁ జేరు.

వానికోరికలును ఫలవంతము లగు
వేని హృదయానురూపిణి యాను భార్య;
శ్రీ విమలయేని మృదు వచస్స్నిగ్ధయేని
రోయఁజూడకు రూపవిరూపములను.

చారు రూపిణి కంటెను జారశీల
యైన భార్యయ లెస్స, రూపాతిశయము
మఱగు పలచు సేవఃపరంపరలు కోట్లు
రంభయే దుస్స్వభావ జాగ్రత్త, సఖుఁడ.

పాంసులల నుండి పరమదౌర్భాగ్య జనులఁ
జెలఁగి సర్వేశ్వరుండు రక్షించుఁగాక—
చిట్టిబుట్టలు రేఁగెడు చిటఁటికొంప
కంటెఁ గారాగృహమ్ము సుఖప్రదమ్ము.

ఏపమును గూర్చు చిత్తప్రవృత్తి గల్గు
పడఁతిగల కొంపలోఁ గూలఁబడుటకన్న
ననవరతయాన మగును ముదావహమ్ము.

భర్తృకంఠాతిశాయినై భార్యకంఠ
మే గృహాంతరమునయందు మ్రోఁగు నాగృ
హాంగణకవాటమును మూయుమయ్య, శాంతి
దాయకంబైన యానంద ధామమునకు.

నీగృహిణి రచ్చ కెక్కెడు డింపు మొండె,
ఉవిదవలె నింటిలోఁ బడియుండు మొండె;
నూతనులముందు దా సంఘరీతిగా మె-
లంగు నట్లొనరింపు; కాలంబు దీతి
కాటి కేఁగనే సతి యింటిబైటఁ బడుట.

ఏటి కొకసారి గృహిణి గ్రహింపు పూర్వ
హాయనము వాడఁబడిన పంచాంగమెట్లు
పనికి వచ్చును నేఁడు? సౌభ్రాత్ర మూర్తి!

అడుగులకుఁ జాలకుండినయట్టి పాద
రక్షలను దాల్చుకంటె నే రక్ష లేని
పాదములతోడ నడచుట భద్రమగును;
గృహాతిరస్కారమునకన్న గహనవీథి
యానము లనంతములు మేలుగా నెఱుఁగుము.

---

# హిమాలయ తీర్థములు

## ౨

### కేదారనాథము-గంగోత్రీ-యమునోత్రీ

బదరీనాథమునకు తరువాత, హిమాలయపర్వతములందు అధిక సంఖ్యాకులగు యాత్రికులు దర్శించు తీర్థము కేదారనాథము. ఇది హరిద్వారమునుండి 149 మైళ్లు. అలక్నందా తీరముననే బదరీనాథమునకు బోవుమార్గమునుండి రుద్రప్రయాగవద్ద చీలి మందాకినీ తీరమువెంట కేదారనాథమునకు బోవలయును. ఈ మార్గమందును యాత్రికులు దిగుటకు దగ్గరదగ్గర చట్టీలు కలవు. వీనియందు యాత్రికులకు గావలసిన సకలసౌకర్యములు లభించు చుండును. ఆటుతరువాత గంగోత్రీ, యమునోత్రీ తీర్థములు. మొదటి రెండుతీర్థములకు బోవునంతమంది యాత్రికులు లీకడసటి తీర్థములకు బోకపోయినప్పటికి మొత్తముమీద ప్రతిసంవత్సరము వీనిని సందర్శించువారు గూడ గలరు. ఈనాలుగు తీర్థములును పూర్వకాలమున గఢవాల్ సంస్థానాధీశుల యధీనమందుండెను. ఇప్పటికిని దీనికి జెందిన ధార్మికవిషయములందు వీరికి కొంతహక్కు గలదు. ఈసంస్థానమునకు ప్రస్తుతపు ముఖ్యపట్టణము టిహిరీ నగరము. ఇది భాగీరథీ, భిలంగనా సంగమస్థానమున విలసిల్లి యున్నది. దీనిని క్రీ. శ. 1819 వ సంవత్సరమున సుదర్శనశాహామహారాజు నిర్మించెను. మంచి మనోహరస్థానములందొకటి యని చెప్పవచ్చును. ఇచటనుండి తొమ్మిదిమైళ్లు ఉత్తరమున, సముద్రతటమునుండి 7,900 అడుగులఎత్తున క్రీ. శ. 1877 వ సంవత్సరమందు హిజ్ హైనెస్ మహారాజా ప్రతాపశాహా గట్టించిన ప్రతాపనగరము కలదు. ఇది ప్రస్తుతము రాజకుటుంబమునకు గ్రీష్మకాలనివాసముగ నుపయోగపడుచున్నది. టిహిరీకి 30 మైళ్లతూర్పున క్రీ. శ. 1896 వ సంవత్సరమందు హిచ్. హిచ్. మహారాజా సర్ కీర్తిశాహా, కె. సి. ఎస్. ఐ. కీర్తినగరమను పేరొకదానిని గట్టించెను.

టిహిరీకి నలువదిమైళ్లదూరమున దక్షిణ పార్శ్వమునందు వర్తమాన పరిపాలకుడను మహారాజా నరేంద్రశాహా, సి. ఎస్. ఐ. క్రీ శ. 1920 సంవత్సరమున నరేంద్రనగరమును గట్టించెను. ఇది యిప్పుడు శీతకాలావాసముగ నుపయోగపడుచున్నది. టిహిరీనుండి కేదారనాథము 70 మైళ్లు, యమునోత్రి 74, గంగోత్రి 100 మైళ్లు. ప్రస్తుత టిహిరీపాలకుడు ధర్మపరాయణుడని ప్రసిద్ధి. ఇతడీతీర్థముల నన్నింటి స్వయముగ దర్శించి వాని యభివృద్ధికై సదుపాయములను గావించి యున్నాడు. దేవస్థానములందలి ధార్మికకార్యనిర్వహణమందెట్టి విఘ్నములు గాని, లోపములు గాని, దోషములు గాని కలుగకుండుటకై "గఢవాల్ రాజ్యతీర్థ సుధారవిధాన" మనుపేర నొక ప్రణాలిక నేర్పరచియున్నారు. 1925 వ సంవత్సరమునుండి ఈస్కీము అమలులో నున్నది. టిహిరీ నగరమందు బదరీనాథ, కేదారనాథ దేవాలయములు గలవు. సంపూర్ణగఢవాల్ ప్రాంతమునకే కాక, అల్మోరా జిల్లా సమేతముగ నారాజ్యమున కంతటికి టిహిరీ నరేశులు పాలకులుగ నుండినకాలమున వారీదేవాలయములకు సమర్పించిన మడిమాన్యము లిప్పటికిని వాని యనుభవమందే యున్నవి.

హరిద్వారమునుండి బయలుదేరిన యాత్రికులు రుద్రప్రయాగవద్ద చీలి కేదారనాథమునకేగి యటనుండి నాలా, ఉఖీమఠములమీదుగా చమోలీ చేరి యక్కడినుండి బదరీనాథమునకు బోవుదురు. కానిచో దేవప్రయాగవద్దనే చీలి భాగీరథివెంట గంగోత్రివరకు బోయి యచటనుండి మల్లా, బులందాచట్టీలమీదుగా కేదారనాథమునకేగి మరల మీద చెప్పిన మార్గమున బదరికి బోవుదురు. లేక టిహిరీమీదుగా గాని, డేరాదూన్, మసూరీ నగరములమీదుగా గాని యమునోత్రికి బోయి యక్కడ

నుండి మరలి సిమలీ, నాకోరులమీదుగా గంగోత్రి కేగి యటనుండి వెనుకటివలెనే బదరీనాథము చేరుచుందురు. హరిద్వారమునుండి బదరీనాథమునకు బోదలచిన నెచట గాని చీలవలసిన యవసరము లేదు. తిన్నగ అలకనందా తీరమునకే పోవలయును. కేదారమున కేగి బదరికి బోవ నెంచిన రుద్రప్రయాగవద్దచీలవలయును. అట్లు గాక నాలు గుతీర్థములను సేవింపదలచిన హరిద్వారమునుండి దేవప్రయాగ, టిహిరీలమీదుగనో లేక డేరాదూన్, మసూరి, ధరాసూలమీదుగనో పోవచ్చును. ఇవన్నియు చిత్రపటమును జూచినచో బాగుగ విదితము కాగలవు. ఈనాలుగుయాత్రలు గావింప నెంచిన కనీసము మూడు మాసములు పట్టును. కేవలము కేదారనాథ, బదరీనాథ ములనే దర్శింప నెంచినచో మూడుపక్షములు పట్టును. ఏతీర్థములకు బో నెంచినను ఈవ్యాసముయొక్క మొందటి భాగమున వ్రాసిన నియమము లన్నింటిని ప్రయాణకాల మందు పాలించుచుండవలయును. హిమాలయపర్వతము లందు ఈనాలుగే కాక వీనితో గలసి వచ్చునవి సత్పథము, కైలాసమునని మరిరెండు తీర్థములు గలవు.

## 3

## సత్పథయాత్ర

సత్పథమునకు బోవుమార్గము కేవలము ఆషాఢ, శ్రావణమాసములందుమాత్రమే తెరువబడును. బదరీనాథమునకు తరువాత 2 మైళ్లపర్యంతము సరియైన మార్గమే కలదు. అనంతరము 5 మైళ్లవరకు మహాకఠిన మార్గము. పిమ్మట లక్ష్మీవనమను స్థానము వచ్చును. దీనిసమీపమున, [?]అలకాపురినుండి మంచుగడ్డలక్రిందుగా వచ్చి ప్రవాహరూపమున ప్రకటమైన అలకనందయొక్క దృశ్యము మిగుల రమణీయముగ నుండును. అటుతరువాత మార్గము మహావికటమైనది. 4 మైళ్లవరకు ఎగుడుదిగుడుగా నడచుచు బోవలయును. అంత నరనారాయణపర్వతము నుండి పడుచున్న శతధారల సందర్శన మతిమనోహర మైనది. కొంచె మావల కేగిన చక్రతీర్థము వచ్చును. ఇది వర్తులాకారమున నొప్పు నొక గొప్ప మైదానము. ఇచట ప్రవేశించినతోడనే ప్రకృతిసౌందర్యముయొక్క సీమను జూచిన ట్లగును. చిత్తమునందు ఋషిజనోచితములగు భావము లుత్పన్నములగును. నితాంతనిర్జనమయ్యు నచ టనే స్థిరముగ వసింపవలయునను బుద్ధి జనించును. అనంతరము ఒక అరమైలుదూర మెక్కినచో నెదురుగ నొక పెద్దబండ కన్పించును. ఆరాతివద్దనుండి పశ్చిమముగా మైలున్నర నడచిపోవలయును. సాధారణముగా నీమార్గమంతయును ఘనీభూతహిమముమీద నడువవలసినదే. అప్పు డచట నెదురుగ నొక నల్లని కొండయు, దాని యడుగున సత్పథసరోవరమును నేత్రగోచర మగును. ఇది మైలున్నర విశాలమై త్రికూటాకృతి నొప్పు పర్వతావృతమై, శుద్ధనిర్మలజలపరిపూర్ణమై భాసిల్లుచుండును. దీని కరమైలు ఆవల చంద్రకుండమును, దాని కొక మైలుమీద సూర్యకుండమును గలవు. సత్పథము వద్ద హిమాలయముల శృంగములు స్ఫాటికసోపానముల వలె గన్పించును. దీనికి స్వర్గారోహణమని పేరు. వాస్తవమున కీ ప్రదేశము స్వర్గమే. శీతబాధ లేనిచో సాక్షాత్తు వైకుంఠమే యగును. చక్రతీర్థమునుండి యచటికి ప్రాతఃకాలమున బోవలయును. అక్కడ కట్టెలు దొరకవు. వెంట నేదైన పుల్లలవస్తువును, శుష్కభోజనమును, మార్గమును బాగుగ నెరిగియుండు మనుజుని నుంచికొనవలయును. మరియు ధరించుటకును, శయనించుటకును, ఊనివస్త్రములను, కంబళ్లను దీసికొనిపోవలయును. ఉష్ణము కలుగచేయు వస్తువులగూడ వెంట నుంచికొనవలయును. సత్పథమువద్ద మకాముచేయుట కొక గుహ ఉన్నది. కాని వాన గురిసినచో పైనుండి నీటిబొట్లు పడుచుండును.

## ౪

## కైలాసమానససరోవరముల యాత్ర

ఈయాత్రకు బోవుటకు మార్గములు చాల కలవు; కాని వానిలో మానాఘాటి, నీతిఘాటి, ఆల్మోరా, సేలంగ్, గంగోత్రీలగుండా పోవుదారులు ముఖ్యమైనవి. అందు మానాఘాటిగుండ పోవుమార్గ మిందు వ్రాయబడుచున్నది. నిజమున కీయాత్ర గావింపవలయునన్న ధనాఢ్యులగు అమీరులైన గావలయు; లేనిచో పట్టి ఫకీరు

లైన గావలయును. అట్లు గాక మన్యమ్ర శేణివార లగు చో నొంటరిగా బోవలసివచ్చినయెడల త్రోవలో దొంగల భయ మత్యంతముగ గలదు. తుపాకులు లోనగు అస్త్ర శస్త్రముల వెంట నుంచికొనవలయును. పదిరోజులకు సరిపోవువానికి దక్కువ కాకుండ ఆహారపదార్థములను ఎప్పుడు వెంట నుంచికొనవలయును. ఈపర్వతమార్గ ముల నన్నింటి బాగుగ నెరిగిన మనుజు నొకని వెంట నుంచికొనుట ముఖ్యావసరము.

మొట్టమొదట ఆరేడురోజులపర్యంతము మహా వికటమైన మార్గమున నడచిపోయినయెడల టిబ్బెట్ రాజ్యమునందలి థాప్పానామకపట్టణము వచ్చును. ఈ గ్రామమందును సకలవిధములగు ఆహారపదార్థములు లభించును. అటుపిమ్మట నడువవలసిన మార్గము కష్టమైనది కాదు. అవసరమైనయెడల స్వారీకి బరువు మోయుటకు ఎడ్లుసైతము దొరకును.

థాప్పాతరువాత రెండుదినముల ప్రయాణము సాగించిన దప్పూచ్ అను వేరొక గ్రామము వచ్చును. ఇచటనుండి రెండుదినములతరువాత చివచిలింగ్ నామక గ్రామమును, అచటనుండి రెండుదినములతరువాత జ్ఞానిమామండియను స్థానమును వచ్చును. జ్ఞానిమామండి యను నది గొప్ప వ్యాపారము జరుగుచోటు. ఇచట సమస్తవిధములైన పదార్థములు దొరకును. ఊనీ, పశ్మీనావస్త్రములిచట మేలుతరగతివి దొరకును. జ్ఞానిమామండినుండి ర దినములపర్యంతము ప్రయాణము గావించినచో కైలాసశిఖరము నేత్రగోచరమగును. ఇదియే జగత్ పితరులగు పార్వతీపరమేశ్వరుల ఆవాసము. దీని యాకృతి యంతయు నొక విశాలమైన దేవాలయమును బోలియుండును. దీని సమీపముననే మానససరోవర మున్నది. ఈసరసీపరిక్రమము సుమారు 72 మైళ్లుండును. శుభ్ర, గంభీర, వినిర్మల, జలపరిపూర్ణమైన యీ సరోవరము యొక్క శోభను, నాలుగువైపులయందలి నైసర్గికదృశ్యమును, ఘనీభూత తుహిన సంఛన్న కైలాస శృంగంబుల యందంబును కనులార గాంచి యానందించవలసినదే కాని వ్రాయుటకు వీలులేదు.

## 2. హరిద్వారమునుండి దేవప్రయాగ-రుద్రప్రయాగలమీదుగ కేదారనాథము 149 మైళ్లు

| సంఖ్య | చట్టీల పేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హరిద్వారమునుండి దూరము-మైళ్లు. | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 1 | రుద్రప్రయాగ | - | 95 | ఇక్కడనుండి ఒకమార్గము అలకనందాతీరమువెంట బదరీనాథమునకు బోవును. రెండవది మందాకినీవెంట శ్రీకేదారనాథధామమున కేగును. |
| 2 | ఛతోలీ | 5 | 100 | మార్గము సమానము. సులభమైనది. |
| 3 | తిల్ వాడా | 1 | 101 | ,, ,, |
| 4 | రాంపూర్ | 1 | 102 | ,, ,, ఈస్థానము మంచిది. ఇచటనుండి రెండున్నర మైళ్లమీద రాధారీబంగాళా యున్నది. |
| 5 | అగస్తముని | 4½ | 106½ | మార్గము సమానమైనది. |
| 6 | సౌరీ | 2 | 108½ | ,, ,, |
| 7 | చంద్రాపురీ | 2 | 110½ | ,, ,, |

| సంఖ్య | చట్టీల పేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హరిద్వారమునుండి దూరము-మైళ్లు. | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 8 | భీరీ | 2½ | 113 | ఇక్కడ భీమదేవుని దర్శనము చేసికొనవలయును. |
| 9 | కుండచట్టీ | 3½ | 116½ | ఇంచుక ఎగుడుదారి. |
| 10 | గుప్తకాశి | 2½ | 119 | ఎగుడుదారి. ఇక్కడ మహాదేవుని దర్శనమగును. |
| 11 | నాలా | 1½ | 120½ | మార్గము సరలము. ఇక్కడనుండి ఒక మార్గము ఉఖీమఠము మీదుగా బదరీనారాయణమునకు పోవును. కేదారేశుని దర్శించి బదరీనాథమున కేగువారు ఇంతవరకు మరలివచ్చి ఇక్కడినుండి ఉఖీమఠమార్గమును గైకొనవలయును. |
| 12 | భేత్తా | 2 | 122½ | మార్గము సమానమై, మిగుల మనోహరముగ నుండును. యాత్రికులు తమవద్దనుండు అనవసరపు సామానును ఇచటి చౌధరివద్ద ఒప్పగించి కేదారము వెళ్లవచ్చును. ఏలనన బదరీనాథమున కేగుటకు కేదారమునుండి మరలి ఇచ్చటికి వచ్చితీరవలయును. |
| 13 | ఫ్యాంగ్ తల్లా | 1 | 123½ | కొంచెము దిగుడుమార్గము. ఇక్కడ దారులో నానావిధపాత్రములు తయారగుచుండును. |
| 14 | ఫ్యాంగ్ మల్లా | ½ | 124 | ఎగుడుదారి. |
| 15 | మైఖండా | 2 | 126 | ఇచట మహిషాసురమర్దనీదేవిని దర్శించవలయును. |
| 16 | ఫాటా | 2 | 128 | మార్గము సమానము. |
| 17 | రాంపూర్ | 3 | 131 | మంచిస్థానము. |
| 18 | త్రిజుగీనారాయణ్ | 4¾ | 135¾ | ఎగుడుదారి. గంగోత్రికి పోయివచ్చువారు ఇచటినుండి కేదారమున కేగుదురు. ఇచట మూడుయుగములకు సంబంధించిన ధుని (కుండము) కలదు. |
| 19 | సోమద్వారా | 3¼ | 139 | ఇక్కడ సోమనదీ మందాకినుల సంగమము. ఇకముందు ఎక్కుడారంభమగును. |
| 20 | గౌరీకుండము | 3 | 142 | ఇక్కడ ఉష్ణజలముల స్రోతస్సులు కలవు. |
| 21 | రాంవాడా | 4 | 146 | ఇక్కడనుండి కేదారము కేవలము మూడుమైళ్లు మాత్రమే. అచట రాత్రికి నిలువనిష్టము లేనివారు తమ సామానంత నిక్కడనే జాగ్రత్తపరచుకొనవలయును. రొక్కమును మాత్రము వెంట నుంచికొనవలయును. |

| సంఖ్య | చట్టీల పేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హరిద్వారమునుండి మొత్తము మైళ్లు | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 22 | పురీకేదారనాథము | 3 | 149 | ఇచట కేదారేశ్వరుని దర్శనము గలుగును. అమితమైన చలి ఎదురుగుండ శుభ్రహిమాలయ శృంగముల మనోరంజకమగు దృశ్యము గానవగును. |
| | | | | కేదారనాథము, మధ్యమహేశ్వరము, తుంగనాథము, రుద్రనాథము, కల్పేశ్వరము అనునవి పంచకేదారములు. పౌరాణికగాథల ననుసరించి కేదారమున మహాదేవుని కట్యధోభాగమును, మధ్యమహేశ్వరమున నాభిప్రదేశమును, తుంగనాథమున బాహుప్రదేశమును, రుద్రనాథమున ముఖమును, కల్పేశ్వరమున జటయు గలవని ప్రఖ్యాతి. కావున నీ తీర్థము లన్నింటిని దర్శించినవారికి మహాదేవుని సమగ్రదర్శన మగును. |

## 3. కేదారనాథమునుండి బదరీనాథమునకు 101 మైళ్లు

| సంఖ్య | చట్టీల పేరు | చట్టీల పరస్పర దూరము | కేదారనాథమునుండి మొత్తము మైళ్లు | స్థానముల సంక్షిప్తవర్ణనము |
|---|---|---|---|---|
| 1 | వాలా | - | 23 | కేదారమునుండి యింతవరకు పోయినమార్గముననే మరలి రావలయును. ఇక్కడినుండి ముందు కొంతదూరమువరకు దిగుడుదారి. తరువాత ఎక్కుడు ఆరంభమగును. |
| 2 | ఉఖీమఠము | 3 | 26 | ఇచట కేదారేశుని యర్చకుడగు రావల్ నివసించుచుండును. ఆయనగద్దీ (ఆసనము) ఇచట నున్నది. ఇచటనుండి మధ్యమహేశ్వరము 19 మైళ్లు. |
| 3 | గణేశచట్టీ | 3½ | 29½ | మార్గము సమానము. |
| 4 | పోథీవాసా | 5 | 34½ | ఈస్థానము దిగుటకు మంచిది. |
| 5 | చోప్తా | 3 | 37½ | ఎగుడుదారి. ఇక్కడినుండి మరియొక మార్గము తుంగనాథమున కేగును. |
| 6 | పాంగర్‌వాసా | 4 | 41½ | దిగుడుదారి. |
| 7 | మండల్ | 4 | 45½ | దిగుడుదారి. ఇచటనుండి యొక మార్గము రుద్రనాథమునకు బోవును. ఇచటనుండి రుద్రనాథము 15 మైళ్లు. |
| 8 | గోపేశ్వరము | 4½ | 50 | ఇక్కడ ప్రాచీనకాలమునాటి యొకగొప్ప దేవాలయము కలదు. |

| సంఖ్య | చట్టీల పేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హరిద్వారమునుండి దూరము-మైళ్లు | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 9 | చమోలీ | 3 | 53 | ఇక్కడ బదరీనాథమార్గము కలియును. ఇచటనుండి బదరీనాథము 48 మైళ్లు. మొత్తము కేదారమునుండి బదరీధామము 101 మైళ్లు. |

## 4. హరిద్వారమునుండి దేవప్రయాగ టిహిరీలమీదుగా యమునోత్రి 165 మైళ్లు గంగోత్రి 193 మైళ్లు

| సంఖ్య | చట్టీల పేరు | చట్టీల పరస్పర దూరము | హరిద్వారమునుండి దూరము-మైళ్లు | స్థానముల సంక్షిప్తవర్ణనము |
|---|---|---|---|---|
| 1 | దేవప్రయాగ | - | 58 | ఇక్కడనుండి ఒకమార్గము అలకనందాతీరమున బదరీనాథమునకు బోవును. మరియొకమార్గము భాగీరథీ తీరము వెంట గంగోత్రీ యమునోత్రీలకు బోవును. దారి కొంచెము ఎగుడుదిగుడుగ నుండును. |
| 2 | ఖర్సాడా | 10 | 68 | స్థానము మంచిది. |
| 3 | కోటేశ్వర్ | 4 | 72 | కోటేశ్వరమహాదేవుని దర్శనము లభించును. |
| 4 | వంద్రాళ్ళ | 6 | 78 | మంచిస్థానము. |
| 5 | క్యారీ | 8 | 92 | ,, |
| 6 | టిహరీ | 6 | 86 | ఇది గఢవాల్ సంస్థానమునకు రాజధాని. ఇప్పటి మహారాజు శ్రద్ధాళుడు, ధర్మతత్పరుడు నగుటచే లోకు లీయనను మాటలాడు 'బదరీనాథు' డని యందురు. ఇక్కడనుండి మసూరీ నలువది మైళ్లు. |
| 7 | పరాశు | 5½ | 97½ | సమానమైన మార్గము. |
| 8 | భల్దియానా | 6 | 103½ | ,, ,, |
| 9 | ధాన్ | 5 | 108½ | ,, ,, |
| 10 | ధరాసూ | 10 | 118½ | హరిద్వారమునుండి ఇంతవరకు నొకేమార్గము. ఇక్కడనుండి ఒకటి యమునోత్రికిని, రెండవది గంగోత్రికిని బోవును. అందు యమునోత్రికి బోవుమార్గము ఎగుడుదిగుడుగ నుండును. |
| 11 | కల్యాణీ | 5 | 122½ | ఈమార్గమందు నీరు దొరకదు. వీలైనచో కొంతనీటిని సేకరించి కొనిపోవలయును. ధనముగల దాతలెవరైన చలివేంద్రలుగూడ నేర్పరచుచుందురు. |

| సంఖ్య | చట్టీల పేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | [illegible] | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
| --- | --- | --- | --- | --- |
| 12 | బరహ్ఖాలా | 5 | 127½ | సమానమగు మార్గము. |
| 13 | సిలక్యారీ | 5 | 132½ | మార్గము తిన్నగ బోవును. ఈచట్టికి తరువాత ఎగుడు ఆరంభమగును. ఇచటనుండి రాబోవుచట్టీవరకు కాలిబాటయును మామూలుమార్గమును గలవు. కాలిబాటను బోయిన మహాప్రయాసమగునుకావున సరియైన మార్గమున బోవుటయే మంచిది. ఈమార్గమునను చలివేంద్రలకావశ్యకము గలదు. |
| 14 | రాడీధార్ | 5 | 137½ | ఇక్కడ చట్టీ ఏమియును లేదు. ఇటుతరువాత సాధారణపు దిగుడుదారి చాలదూరమువరకు బోవును. |
| 15 | డంగాల్ గాడ్ | 2 | 139½ | ఇక్కడివరకుగూడ నీళ్లు దొరకుట దుర్లభము. |
| 16 | సిమలీ | 2 | 141½ | ఇక్కడనుండి ఒకమార్గము ఉత్తరకాశికి బోవును. గంగోత్రికి బోవువారు ఇక్కడగూడ చీలవచ్చును. |
| 17 | గంగానీ | 2 | 143½ | ఇచట కాలీకమలీ బాబాయొక్క ధర్మశాలకలదు. యమునదగ్గరగనే ప్రవహించుచుండును. ఇచటనుండి మార్గము కష్టమైనది కాదు. |
| 18 | ఖైరాల్ చట్టీ | 2 | 145½ | సరియైన మార్గము. |
| 19 | జగన్నాథ్ | 3 | 148½ | దారి ఒకమైలు ఎగుడు. తరువాత రెండుమైళ్లు సమానము. |
| 20 | జమునాచట్టీ | 1 | 149½ | దారి సమానము. ఇచట యమునానదిమీద దారు నిర్మితమైన సేతు వున్నది. దాటుటయందు జాగరూకత గలిగియుండవలయును. (ఈవ్యాసమును చదువుట తటస్థించిన వదాన్యులగు ధనాఢ్యు లెవరైన నిచట లోహపువంతెనను గట్టింపసంకల్పించినయెడల నట్టివారు తిన్నగ గఢవాల్ మహారాజుతో ఉత్తరప్రత్యుత్తరములు సలుపుకొనవచ్చును.) |
| 21 | ఓజరీచట్టీ | 2 | 151½ | ఇక్కడఘాటి సరిగా పాండుకేశ్వరముదగ్గర అలకనందాఘాటివలె మిగుల మనోహరమైనది. ఒక్కమైలు మాత్రము ఎగుడుమార్గము. తక్కిన దంతయు సరళమైనది. |
| 22 | డడోటీ | 2½ | 154 | రెండుమైళ్లవరకు తిన్నని, సమానమైన మార్గము. తరువాత వంతెనను దాటవలయును. ఈవంతెనయు దృఢమైనదికాదు. |

| సంఖ్య | చట్టీలపేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హరిద్వారమునుండి మొత్తము దూరము | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 23 | రానాగావ్ | 2 | 156 | అరమైలు ఎగుడుమార్గము. తక్కినది సమానము. |
| 24 | హనుమాన్‌చట్టీ | 2 | 158 | ఇచట హనుమాన్ గంగానామకనదిని వంతెనమీదుగ దాటవలయును. |
| 25 | ఖర్‌సాలీ | 3 | 162 | మూడుమైళ్లు సమానమగుదారి. తరువాత ఒకమైలు ఎగుడు. యమునోత్రియొక్క పండాలు ఇచటనే వాసము చేయుచుందురు ఇచటనుండి మూడుమైళ్లు తరువాత ఈమార్గము యమునను దాటి బీఫ్‌గ్రామము వరకును బోయియున్నది. |
| 26 | మార్కండేయతీర్థము | - | - | ఇది ఖర్‌సాలీ కెదురుగ యమున కావలిప్రక్క నూతనముగా నిర్మింపబడినస్థానము. ఇచటనొక ఉష్ణజలకుండముకలదు. |
| 27 | యమునోత్రి | 4 | 166 | మార్గము ఒకమైలు సమానము. తరువాత అరమైలు ఎగుడు, అరమైలు సమానము. మరల నొకమైలు ఎగుడు, ఒకమైలు సమానము. మొదటీమార్గ మంతయు మిగుల కఠినమైయుండెను కాని యిప్పుడు చాలవరకు సులభసాధ్యమైనది. యమునోత్రియందు ఉడుకుచుండు వేడినీటి కుండములు గలవు. ఆనీటిలో అన్నము, రొట్టె మొదలగు పదార్థములన్నియు నుచితసమయములో నుడికి తయారగుచుండును. యమునాదేవతయొక్క దేవాలయము కలదు. ఈస్థానము సముద్రతటమునుండి 10,000 అడుగుల యెత్తున నున్నది. ఇచట మురాదాబాదువాసి రఘునందన నిర్మిత ధర్మశాల యాత్రికులకు దిగుటకు ప్రశస్తమైనది. |

ఇక్కడనుండి గంగోత్రికి బోవుటకు సిమలీవరకు 25 మైళ్లు వెనుకకు దిరిగివచ్చి యటనుండి సిగోటుమీదుగా నాకోరిచేరవలయును. సిమలీనుండి నాకోరి 11 మైళ్లు. ఇచట దేవప్రయాగమీదుగా గంగోత్రికి బోవుమార్గము కలియును. హరిద్వారమునుండి గంగోత్రీమార్గము దేవప్రయాగ, టిహరీలమీదుగ ధరాసూపర్యంత మిదివరకే వర్ణింపబడినది. కావున నిచట ధరాసూనుండి యారంభమగును.

## 5. హరిద్వారమునుండి దేవప్రయాగ, టిహిరీ, ధరాసులమీదుగా గంగోత్రికి బోవుమార్గము

| సంఖ్య | చట్టీల పేరు. | | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | [illegible] | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|---|
| 1 | ధరాసూ | ౬ | - | 118 | హరిద్వారమునుండి యింతవరకును, ఇచటినుండి యమునోత్రి వరకును బోవుమార్గ మిదివరలో వివరింపబడినది. ఇక నిచటనుండి గంగోత్రి కేగుదారి చూపబడును. |
| 2 | డుండాచట్టీ | | 9 | 127 | మార్గము సమానము. నిబిడమైన యరణ్యమధ్యముగుండ బోవలసి వచ్చుటచే మార్గమంతయుగడుమనోరంజకముగనుండును. |
| 3 | నాకోరీ | | 3 | 130 | ఇచట యమునోత్రినుండి వచ్చుమార్గము కలియును. |
| 4 | ఉత్తరకాశి | | 6 | 136 | ఇది పరమపవిత్రమైన, సుప్రసిద్ధమైన, ప్రాచీనస్థానము. ఇచట పురాతనకాలపు మందిరము లనేకములు గలవు. వానిలో విశ్వనాథదేవాలయ మొకటి. దేవాసురసంగ్రామసమయమున వెలువడిన శక్తివిశేషము దర్శనీయము. జయపురమహారాజు గట్టించిన ఏకాదశరుద్రుల దేవాలయ మత్యంతమనోహరముగ నుండును. గఢవాల్ సంస్థానమందలి కాలీకమలీవారి క్షేత్రములకును ధర్మశాలలకును నిది కేంద్రస్థానము. ఈస్థానము దినదిన మభివృద్ధి నొందుచున్నది. |
| 5 | గంగోరీ | | 3 | 139 | ఇక్కడ దోడీతాలమునుండి వెలువడిన అసీగంగా భాగీరథిలో గలియును. "డోడీతాల్"అనునది యొకమనోహరమగు సరోవరము. ఇచటనుండి సుమారు 16 లేక 17 మైళ్ల దూర ముండును. ఈసరోవరము ఆపదాగ్రహిమాచ్ఛాదితపర్వతపరివృతమైన,యోజనద్వయవిస్తీర్ణమైన యొక రమణీయమగు మైదానపు మధ్యమం దున్నది. మహా దివ్యదృశ్యము. |
| 6 | సైతాలా | | 3 | 142 | మార్గము గంగాతీరమువెంట దిన్నగ బోవును. |
| 7 | మనేరీ | | 4 | 14€ | ,, ,, |
| 8 | కుమాల్టీ హాట | | 4 | 150 | ,, ,, |
| 9 | మల్లాచట్టీ | | 2 | 152 | ఇచటనుండి వేరొకమార్గము బూఢాకేదారముమీదుగ కేదారనాథమునకు బోవును. |

| సంఖ్య | చట్టీలపేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హరిద్వారమునుండి మొత్తము మైళ్లు | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 10 | భట్వాడి లేక భాస్కరప్రయాగ | 2 | 154 | తిన్నని మార్గము. అనవసరమైన సామానునంతయు నిచట చౌకీదారునిపరము జేసి అతనినుండి యొకరసీదును తీసికొనవలయును. గంగోత్రినుండి మరల నిచటికి వచ్చి తీసవలయును గాన నపుడు తీసికొనవచ్చును. |
| 11 | ఝుక్కీ | 6 | 160 | మార్గము సరళమైనదే కాని ఒకమైలుదూరము దారి గట్టిది కాదు. ఎప్పుడుబట్టిన నపుడు శిథిలమై జారిపోవుచుండునుగాన జాగరూకతతోడ బోవలయును. |
| 12 | గంగనానీ | 3 | 163 | ఈమార్గమున అరమైలు పోయినపిదప దీనాయను చిన్ననదిమీద నొక వంతెనయు, దానితరువాత నొకమైలుదూరమున కూలానదిమీద వేరొకవంతెనయు గలవు. వీని తరువాత గంగపైవంతెన వచ్చును. ఈవంతెన కీవలనే మార్గమునకు నించుక ఎత్తుగా ఋషికుండమను ఉష్ణజలస్రోతము గలదు. ఇదియొక పవిత్రమైన ప్రసిద్ధతీర్థము. |
| 13 | లోహారీనాగ్ | 4 | 167 | మార్గము పాషాణమయము. సామాన్యముగ ఎగుడుదిగుళ్లుగలవు. గంగనానీనుండి ఒకమైలుదూరము దనగల్, డబ్రానీ యను రెండువంతెనలు భాగీరథిపై నిర్మింపబడి యున్నవి. మరియు నిచట సహజానందబ్రహ్మచారియొక్క ధర్మశాల కలదు. |
| 14 | సోనగంగా | 1 | 168 | ఇదియొక చిన్నచట్టీ. |
| 15 | సుక్కీ | 4 | 172 | ఎగుడుదారి. |
| 16 | ఝూలా | 3 | 175 | ఒక్కమైలు ఎగుడు బాట. తరువాత దిగుడు, సమము నైన మార్గము. |
| 17 | హార్సిల్ లేక హరిప్రయాగ | 2½ | 177½ | ఇచటనుండి అరమైలుమీద శ్యామప్రయాగ(శ్యామగంగా భాగీరథీల సంగమస్థానము)కలదు. ఇచట గంగాప్రవాహము దేశమందలి సమభూమియందువలె వేరువేరుపాయలై పారుచుండ సాదృశ్య మెంతయు అద్భుతమై చిత్తాకర్షకముగ నుండును. ఈమైదానము సముద్రతటమునుండి 6000 యడుగుల ఎత్తున నున్నది. ఇచట ప్రవేశించిన |

| సంఖ్య | చట్టీల పేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హరిద్వారమునుండి దూరము- | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| | | | | తోడనే ఎదియో దివ్యలోకమున ప్రవేశించినట్లుండును. శ్యామప్రయాగనుండి రెండుమైళ్లమీద గుప్తప్రయాగయు, నచటనుండి ½ మైలు తర్వాత హరిప్రయాగయు గలవు. ఇచట నొక లక్ష్మీనారాయణదేవాలయమున్నది. ఫారెస్టువిభాగపు బంగాళాయు, సీమకేసుల యారామమును గలవు. ఇచట సమస్తవిధములైన ఊని వస్త్రము లమ్మబడుచుండును. |
| 18 | అణీయాపుల్ | ½ | 178 | భాగీరథిమీద నిచట అణీయా యను పేరుగల వంతెన యున్నది. దానిదగ్గర నొక చిన్నచట్టియు గలదు. |
| 19 | ధరాలీ | 2 | 180 | మార్గము సమానము. ఇక్కడ ధరియాలులను నొక జాతివారు గలరు. వీరు నేలంగఘాటి ద్వారా టిబెట్టుతో వ్యాపారము చేయుచుందురు. ఈ మార్గము గుండా కైలాస, మానససరోవరముల కేగతలచినవారు వీరిని వెంటబెట్టికొని పోవలయును. ధరాలీకి దగ్గర దగ్గర సాధుజనుల కుటీరము లనేకములు కలవు. వానియందు మంచిమంచి ప్రసిద్ధపురుషులు వాసము చేయుచుందురు. |
| 20 | జాంగలా | 4 | 184 | సమానమును, మనోరంజకమును నగు మార్గము. ఇక్కడనుండి మైలున్నర తరువాత నేలంగిఘాటికి బోవుటకుమార్గము చీలును. |
| 21 | భైరోంఘాటీ | 2½ | 186½ | మైలున్నరవరకు సరియగుమార్గము. ఒకమైలు ఎగుడుదారి. ఇది అసలు గంధకపు పర్వతము. కావున నెల్లప్పుడు వేడిగనుండును. స్థాన మత్యంతరమణీయము. దేవదారువృక్షముల నిబిడారణ్యము. ఇచట కాలీకమలీవారి ధర్మశాల కలదు. |
| 22 | గంగోత్రీ | 6½ | 193 | భైరోంఘాటికి క్రిందుగా నూతనమార్గము నిర్మింపబడినందున యిప్పుడిది 1¼ మైలుదూర మెక్కువైనది. హరిద్వారము నుండి యిప్పుడు సరిగా 193 మైళ్లు. అసలు భాగీరథి యొక్క ఉద్గమస్థాన మిచటనుండి 18 మైళ్లు ఇంకను ముందున్నది. కాని యాప్రదేశ మత్యంతదుర్గమ మగు కారణమున యాత్రిక జనులు ఇక్కడే తమమనోరథ |

| సంఖ్య | చట్టీల పేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | [illegible] | [illegible] | [illegible] | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|---|---|
| | | | | | | ముల బూర్తిగావించుకొందురు. దర్శన, స్పర్శన, స్నానాదికములచే సంతృప్తులై, కృతకృత్యులై యాత్రికు లీచటనుండి జలమును నించికొనిపోవుదురు. ఈ స్థానము కొంతదూరమువరకు సమముగ నుండును. దేవదారువృక్షములు దట్టముగ నిండుకొనియున్నవి. ఈ పురినుండి కొంచెము దిగువను కేదారగంగయొక్క సంగమస్థాన మున్నది. అక్కడనుంచి ఒకఫర్లాంగుక్రింద శివలింగముమీద చాలఎత్తునుండి గంగాధార పడుచుండును. ఇచట జయపురమహారాజు గట్టించిన విశాలమగు గంగామందిరము గలదు. అందు జయపురమహారాజుయొక్క అన్నక్షేత్రముసైతము గలదు. మరియు కాలీకమలీవారి ధర్మశాలా, అన్నక్షేత్రములును, పంజాబు సింధుక్షేత్రమువారి అన్నక్షేత్రమును గలవు. |

## 6. డేరాడూన్, మసూరీ, ధరాసూల మీదుగ హరిద్వారమునుండి గంగోత్రిమార్గము.

### మసూరీనుండి గంగోత్రికి 113 మైళ్లు

| | | మసూరీనుండి చట్టీలదూరము | |
|---|---|---|---|
| 1 మసూరీ | - | - | హరిద్వారమునుండి డేరాడూన్‌వరకు రైలుమీద రావచ్చును. అచటినుండి మసూరి 8 మైళ్లు. మోటార్లు, బండ్లు మున్నగునవి మసూరివరకు వచ్చును. నానావర్ణకుసుమసంపూర్ణములైన మసూరీపర్వతములు దేవతానగరముల దలపించుచుండును. |
| 2 సువాఖోలీ | 6 | 6 | మార్గము మిక్కిలి మనోహరము. ఇచటినుండి టిహారీ సుమారు 34 మైళ్ళుండును. |
| 3 వతూృడా | 6 | 12 | దిగుడుదారి; మంచిరోడ్డు. |
| 4 మోల్ ధార్ | 5 | 17 | మార్గము సరళము, నత్యంతరమణీయమునైనది. విశేషించి పూర్వాహ్ణమందైనచో మార్గమంతయు నీడతో నిండియుండును. ఇచటినుండి మూడుమైళ్లు ఎగుడుబాట. తరువాత నాలుగుమైళ్లు దిగుడు. |

| సంఖ్య | చట్టీలపేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | [illegible] | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 5 | అంధియారీ | 7 | 24 | ఎగుడుదిగుడుమార్గము. బసచేయుటకు గ్రామములందు చోటు దొరకును. ఆహారపదార్థములు గూడ నీగ్రామములందే లభించును. |
| 6 | చాపడా | 1 | 25 | ఇచట నొక రాధారీబంగాళా కలదు. |
| 7 | త్యాడ్‌చట్టీ | 6 | 31 | రెండుమైళ్లు దిగుడు. 4 మైళ్లు ఎగుడుదారి. |
| 8 | ధరాసూ | 7 | 38 | 6½ మైళ్లమీద గంగోత్రిమార్గము వచ్చును. మరి అరమైలువచ్చిన ధరాసు గలదు. |
| 9 | గంగోత్రీ | 75 | 113 | ఈమార్గ మిదివరకే వివరింపబడినది. |

## 7. గంగోత్రినుండి కేదారనాథము 123 మైళ్లు

| | | | గంగోత్రినుండి దూరము మైళ్లు | |
|---|---|---|---|---|
| 1 | మల్లాచట్టీ | - | 40 | గంగోత్రీనుండి ఇంతపర్యంతము పూర్వకథితమార్గమువెంటనే రావలయును. ఇక్కడనుంచి ముందు కొంచెము కఠినమైన దారి. |
| 2 | సౌరాకీగాడ్ | 3 | 43 | మార్గము సరియైనది. |
| 3 | ప్యాలూ | 3 | 46 | ఈమార్గ మత్యంతకఠినమైన ఎగుడుకలది. |
| 4 | ఘూంటాచట్టీ | 3 | 49 | ఒకమైలు ఎగుడు. రెండుమైళ్లు సమానము. ఇచట పంజాబ్ సింధుక్షేత్రమువారి ధర్మశాల కలదు. |
| 5 | బేలక్ | 4 | 53 | అతికఠినమగు ఎగుడుదారి. |
| 6 | పంగరానా | 5 | 58 | దిగుడుదారి. ఒడ్డొరక మెక్కువ. జాగరూకతతోడ దిగవలయును. |
| 7 | ఝూలా | 4 | 62 | ఎగుడుదిగుడుదారి. మధ్య ధర్మగంగానామక నది కలదు. దాని తరువాత మార్గము సమానము. |
| 8 | బూఢాకేదార్ | 5 | 67 | పైచట్టీనుండి మూడుమైళ్లతరువాత అగూడానామక గ్రామము కలదు. దానికి రెండుమైళ్ల తరువాత బూఢాకేదారము వచ్చును. ఇచట మహాదేవాలయమును, కాలీకమలీవారి క్షేత్రమును గలవు. |
| 9 | తోలాచట్టీ | 4 | 71 | కొంతవరకు ఎగుడు, తరువాత సమానము. |

| సంఖ్య | చట్టీల పేరు. | చట్టీల పరస్పర దూరము-మైళ్లు. | హృషీకేశమునుండి దూరము | స్థానముల సంక్షిప్తవర్ణనము. |
|---|---|---|---|---|
| 10 | ప్యాకకనీ | 2 | 73 | ఎగుడుదారి. దీనికి భైరోంచట్టీ యనియు పేరు కలదు. ఇచట నొక ఆంగ్లేయమహోదయుడు కట్టించిన భైరవ దేవాలయ మున్నది. |
| 11 | ఘోంటా | 3 | 76 | ఎగుడుదిగుడైన మార్గము. |
| 12 | ధుత్తూచట్టీ | 9 | 85 | నాలుగుమైళ్లు దిగుడు. తక్కినది సమానము. ఇచట రఘునాథ మందిరము, కాలీకమలీవారి ధర్మశాలా క్షేత్రములును గలవు. ఇచట భిలంగనానదిమీద నొకవంతెన కట్టబడు చున్నది. |
| 13 | గవానాచట్టీ | 1 | 86 | సామాన్యముగ ఎగుడుదారి. |
| 14 | గౌమాండా | 3 | 89 | ఎగుడుదారి |
| 15 | దులందాచట్టీ | 3 | 92 | ,, |
| 16 | వాలీచట్టీ | 3 | 95 | అరమైలు ఎగుడును, అరమైలు దిగుడును నైన మార్గము. తరువాత సమము. |
| 17 | మగ్గాకీమాండా | 9 | 104 | ప్యాంక్వాల్యానామకస్థానమువరకు ఎగుడుదారి. తరువాత రెండుమైళ్లు దిగడు. అనంతరము సమానము. మేఘము లావరించియున్న తరుణమున ఈదారి సెప్పటికిని బోగాదను, మాస్తుచూస్తూ ఉండగనే మంచుగడ్డలు పడ గండ్లు గూలును. ఆదగ్గరి గ్రామములనుండి యొకమను జుని దారిని బాగుగ నెరిగినవాని వెంట నుంచికొనవల యును. మిక్కిలి ఎత్తయినదారి. అరమైలు పొడుగున మంచుగడ్డలమీద నడువవలసివచ్చును. అందువలన పాదరక్షలు లేనివారికి కొంచెము దుఃఖము గలుగును కాని ఇతరులకు గాదు. |
| 18 | త్రిజుగీనారాయణ్ | 5 | 109 | ఒక్కమైలు దిగుడు. తక్కిన నాలుగుమైళ్లు సామాన్య ముగ దిగుడుదారి. దృశ్యము మనోరంజకము. ఎదురుగ హిమాలయోన్నత శృంగములు నేత్రపర్వము గావించును. ఇచటినుండి తరువాతిమార్గ మిదివరకే వివరింపబడినది. |

* ఇందలి 2, 3, 4 భాగములలోని విషయములు, చట్టీలవృత్తాంతములు శ్రీ బ్రహ్మచారి చక్రధరశర్మగారి గ్రంథమునుండి గైకొనబడినవి.






శ్రీయుత ఆర్. కోసలేంద్రరావుగారు, బి. ఏ.

వీరు ఈడ్పుగంటి రాఘవేంద్రరావుగారి మేనల్లుడు. అర్థశాస్త్రమునందు ప్రావీణ్యమును బడయుటకు ఇంగ్లండునకు పోయినారు.

---







శ్రీమతి వి. పాపాయమ్మగారు
తూర్పుగోదావరి జిల్లాబోర్డున నియమింపబడిన సభ్యురాలు.

---



## బాబర్ మరణశాసనము

తన యారసుఁడును, యువరాజును నగు, హుమయూన్ పాదుషాకై తండ్రి బాబర్‌చక్రవర్తి యొక్కమరణశాసనమును వ్రాసియుంచెను. బాబరు సర్వమతసామరస్యమునకు, భూతదయకును, ధర్మసూక్ష్మజ్ఞతకు నీశాసనము నిదర్శనము. దీని మాతృక భూపాలసంస్థానపు గ్రంథాలయమున జూడనగును.

## దీని యాంధ్రానువాదము

కొడుకా! భరతవర్షమున వసించు ప్రజలు వివిధములగు మతముల నవలంబించువారలై యున్నవారు. దీనిని పాలించుటకు నీయధీన మొనర్చినవాఁడు లోకైకనాథుఁడు సర్వేశ్వరుఁడు. నీయభివందనముల వాని కర్పించుట కిది విషయము. కనుక నీకర్తవ్య మిది.

౧. మతవైషమ్యము నీ మనసున నంటనీకుము. ప్రజలయం దాయామతావలంబకులయొక్క యాచారవ్యవహారముల, మర్యాదల గమనించి నీన్యాయపరిపాలన నిష్పాక్షికమై యుండనిమ్ము.

౨. ముఖ్యముగ గోవధలను మానుకొనుము. దీనిని వదలితివో ప్రజల హృదయమే నీవశమగును. వారి కృతజ్ఞతాబంధములచే నీకు వారు కట్టుబడుదురు. దాని కిదియే మార్గము.

౩. పూజామందిరములకు - ఏమతమువారివైనను సరే-చ్యుతి నాపాదింపకుము. సదా ధర్మరతుఁడవై మెలగుము. అట్లు వర్తించితివో సంతుష్టిశాంతులు దేశమునందు వ్యాపించి రాజులకును, ప్రజలకును సన్నిహితత్వమును వెలయఁజేయును.

౪. ఇస్లాం మతమునుగూర్చి ప్రచారము చేయవలెనన్న దానికి సాధనము హింస కాదు. దయాదాక్షిణ్యము లను కత్తియే దానికి పరమాయుధము. షీయాలకును సున్నీలకును గలప్రభేదమును పాటింపకుము. అట్లు చేయకపోతివో ఇస్లాంమతము సన్నగిలుటకు మొదలిడును. ప్రజల రుచిభేదముల నగసి సంవత్సరములకు ఋతుభేదములవలెనే పాటింతువేని దేశమురుజారహితమై విలసిల్లును.

—టి. శివశంకరం.

---

## 1931 లో జరిగిన క్రొత్తజనాభాలెక్కలు

[ఇండియా గెజెటు ప్రకటనము]

"మతములనుబట్టి నిర్ణయింపబడిన జనసంఖ్య మొత్తములు చాలవరకు సరిగానే యున్నవి. బొంబాయి బర్మారాష్ట్రములలోమాత్రము కొన్ని ప్రాంతముల లెక్కలు సమగ్రములుగా లేవు. కొన్ని రాష్ట్రములలో ప్రధానములగు మతముల మొత్తములుమాత్రమే చూపింపబడెను.

1921 మొదలు 1931 వరకు 10 ఏండ్లలోను హిందువులలో 100 కి 10 వంతునను, మహమ్మదీయులలో 13 వంతునను, సిక్కులలో 33 వంతునను, బౌద్ధులలో 8 వంతునను, పార్సీలలో 5 వంతునను జనసంఖ్య పెరిగినది" అని దొరతనమువారు తెలిపిరి.

### భారత దేశమున మొత్తము జనసంఖ్య

| | |
|---|---|
| భారత దేశమున మొత్తముజనసంఖ్య | 352,986,876 |
| పురుషుల సంఖ్య | 181,921,914 |
| స్త్రీలసంఖ్య | 171,064,962 |

1921 కంటె 100 కి 10.6 వంతున జనసంఖ్య పెరిగినది.

| | |
|---|---|
| హిందువులసంఖ్య | 238,330,912 |
| మహమ్మదీయులు | 77,743,928 |
| సిక్కులు | 4,366,442 |
| క్రైస్తవులు | 5,961.794 |

### బ్రిటిషు యిండియాలో జనసంఖ్య

| | |
|---|---|
| మొత్తము | 271,273,107 |
| హిందువులు | 176,984,435 |
| మహమ్మదీయులు | 67,085,510 |
| సిక్కులు | 3,192,169 |
| క్రైస్తవులు | 3,581,703 |

### అజ్మీరు-మేర్వారా రాష్ట్రము

| | |
|---|---|
| మొత్తము | 560,292 |
| హిందువులు | 434,509 |
| సిక్కులు | 341 |
| జయినులు | 19,497 |
| మహమ్మదీయులు | 97,133 |
| క్రైస్తవులు | 6,947 |

### అసాము

| | |
|---|---|
| మొత్తము | 8,622,251 |
| హిందువులు | 4,931,760 |
| సిక్కులు | 2,497 |
| జయినులు | 2,636 |
| బౌద్ధులు | 14,955 |
| మహమ్మదీయులు | 2,755,914 |
| క్రైస్తవులు | 202,586 |

### బెలూచిస్థానము

| | |
|---|---|
| మొత్తము | 463,508 |
| హిందువులు | 91,432 |
| సిక్కులు | 8,638 |
| మహమ్మదీయులు | 405,309 |
| క్రైస్తవులు | 8,044 |

### వంగరాష్ట్రము

| | |
|---|---|
| మొత్తము | 50,122,550 |
| హిందువులు | 21,537,921 |
| బౌద్ధులు | 315,801 |
| మహమ్మదీయులు | 27,530,321 |
| క్రైస్తవులు | 180,572 |

### బీహారు - ఒరిస్సా

| | |
|---|---|
| మొత్తము | 37,676,576 |
| హిందువులు | 31,010,660 |
| మహమ్మదీయులు | 4,264,776 |
| క్రైస్తవులు | 34',710 |

### బొంబాయి

| | |
|---|---|
| మొత్తము | 21,854,841 |
| హిందువులు | 16,619,866 |
| సిక్కులు | 20,723 |
| జయినులు | 199,979 |
| బౌద్ధులు | 1,890 |
| పార్సీలు | 89,548 |
| మహమ్మదీయులు | 5,452,133 |
| క్రైస్తవులు | 317,042 |
| యూదులు | 17,443 |

### బర్మా

| | |
|---|---|
| మొత్తము | 14,645,969 |
| హిందువులు | 574,697 |
| జయినులు | 77,895 |
| మహమ్మదీయులు | 606,841 |

### మధ్యరాష్ట్రములు - బేరారు

| | |
|---|---|
| మొత్తము | 15,507,723 |
| హిందువులు | 14,460,105 |
| మహమ్మదీయులు | 682,854 |
| క్రైస్తవులు | 50,584 |

### కొడగు (కూర్గు)

| | |
|---|---|
| మొత్తము | 163,327 |
| హిందువులు | 146,007 |
| మహమ్మదీయులు | 13,777 |
| క్రైస్తవులు | 3,430 |

### మదరాసు

| | |
|---|---|
| మొత్తము | 46,575,670 |
| హిందువులు | 40,392,900 |
| మహమ్మదీయులు | 3,316,083 |
| క్రైస్తవులు | 1,770,328 |

### ఢిల్లీ

| | |
|---|---|
| మొత్తము | 636,246 |
| హిందువులు | 398,863 |
| సిక్కులు | 6,437 |
| జయినులు | 5,345 |
| మహమ్మదీయులు | 206,960 |
| క్రైస్తవులు | 16,989 |

### సరిహద్దురాష్ట్రము

| | |
|---|---|
| మొత్తము | 2,425,076 |
| హిందువులు | 142,797 |
| సిక్కులు | 42,510 |
| మహమ్మదీయులు | 2,227,303 |
| క్రైస్తవులు | 12,213 |

### పంజాబు

| | |
|---|---|
| మొత్తము | 23,580,852 |
| హిందువులు | 6,328,588 |
| సిక్కులు | 3,064,144 |
| జయినులు | 35,284 |
| బౌద్ధులు | 5,723 |
| మహమ్మదీయులు | 13,332,460 |
| క్రైస్తవులు | 414,788 |

### సంయుక్తరాష్ట్రము-ఆగ్రా-అయోధ్య

| | |
|---|---|
| మొత్తము | 48,408,763 |
| హిందువులు | 40,905,523 |
| సిక్కులు | 46,500 |
| జయినులు | 67,954 |
| మహమ్మదీయులు | 7,181,927 |
| క్రైస్తవులు | 205,009 |

---

### కవిసార్వభౌమ, రవీంద్రనాథ టాగూరుగారు



కలకత్తా విశ్వవిద్యాలయసంస్కృతశాఖవారు వీరికి బిరుదము నొసగిరి.

---

బ్రిటిషు ప్రభుత్వ నూతన మంత్రిమండలి




కూర్చున్నవారు: స్నోడను, బాల్డువిన్, మాక్డనాల్డు, శామ్యూల్, సాంకేగార్లు. నిలుచున్నవారు: కునులిఫ్ లిస్టరు, థామస్, రీడింగు, చేంబర్లేను, హోరుగార్లు.

## బ్రిటిషు ప్రభుత్వ నూతనమంత్రిమండలి

సర్ సామ్యూల్ హోరుగారు, ఇండియామంత్రి
రీడింగుప్రభువు, విదేశాంగమంత్రి
రాంసే మాక్డొనాల్డుగారు, ప్రధానామాత్యుడు
స్టాన్లీ బాల్డ్వినుగారు, లార్డు ప్రెసిడెంటు ఆఫ్ కౌన్సిలు
సర్ హెర్బర్టు శామ్యూలుగారు, దేశీయమంత్రి
ఫిలిప్ స్నోడెనుగారు, కోశాగారమంత్రి
సాంకీప్రభువు, లార్డు ఛాన్సలరు
జె. హెచ్. థామస్ గారు, డొమినియనుల అధినివేశమంత్రి
నెవిల్లి చాంబర్లేనుగారు, ఆరోగ్యశాఖామాత్యుడు
సర్ కనలిఫ్ లిస్టరుగారు, వాణిజ్యమంత్రి
సర్ జాన్ గిల్మోరుగారు, వ్యవసాయమంత్రి

---

## హాల్ కెయిన్

హాల్ కెయిన్ (Hall Caine) మొన్నటి ఆగష్టు ౩౧-వ తేదీ రాత్రి పదునొకండు గంటలకు పదునాలు నిముషములున్నదనగా దివంగతుడైన వార్త రూటరు సంజయుడు తెలుపుచున్నాడు. హాల్ కెయిన్ ప్రపంచ ప్రఖ్యాతిగన్న అధునికాంగ్ల నవలాకారులలో నొకడు. సర్ బిరుదాంచితుడు. నవలలో ఉపకథ లుండరాదనియు, ఒక్కొక్క నవల ఒక్కొక్క కథతోడనే కుదింపబడవలయుననియు నను సంప్రదాయమును నెలకొల్పిన ఆంగ్ల మహాగ్రంథరచయితలలో ఈతడు మొదటివాడు కాకున్నను తొలిజట్టుకు చెందినవాడు. ఇటీవల బయలుదేరుచున్న నవలలకంటె హాల్ కెయిన్ నవలలు ఎన్నిరెట్లో పెద్దవి. అయినను ఈతడు తన ఈపెద్దనవలల నెప్పుడును ఉపకథలతో జటిలమొనర్పలేదు; నవలకొరకే కథయను సంప్రదాయమును విడనాడలేదు. హెచ్. జి. వెల్సు( H. G. Wells) నవలలవలె హాల్ కెయిన్ నవలలుకూడ Semi-religious గా నుండును.

హాల్ కెయిన్ నవలల కథారంగము Isle of Man. ఇది ఆంగ్లదీవుల చెంతగల ఒక చిన్నదీవి. లివర్పూలు (Liverpool) హార్బరుకు కొంచెము సమీపము. ఇంగ్లండునుండి ఆదీవికి పోవువారు సాధారణముగ లివర్పూలునుండియే పోవుదురు. ఆదీవియందు పిల్లులకు తోకలుండవు. ప్రపంచమున మఱియెచ్చటను లేని విచిత్రపు పిల్లులకు జనిస్థానమగు ఈచిన్నద్వీపమునందలి మానవుల ఆచారవ్యవహారముల వర్ణనలతో హాల్ కెయిన్ నవలలు పిక్కటిల్లియుండును. ఈతని నవలలోని కథావస్తువుకంటె 'ఐల్ ఆఫ్ మ్యాన్' నందలి మానవుల ఆచారవ్యవహారవర్ణనమే చదువరుల నెక్కువగ నాకర్షించును. ఆదీవిలోని మానవుల జీవితవిధానమునందలి అంతర్యమును ప్రపంచమువారు గ్రహించునట్లు చేసినగ్రంథకర్త హాల్ కెయిన్ ఒక్కడే. ఈతని నవలలయందు ఆద్వీపవాసుల నిత్యకృత్యములు, ఆరామనివాసము విపులవివరణము నందినవి. ఆద్వీపము దరిద్రులు నివసించుటకు చాల అనుకూలమైనది. పన్నుబందులు లేవు అద్దెలు అల్పాల్పము. ఆహారపదార్థములు కారుచౌక. దర్జీవాండ్రే లేరు. ఇక ఆసంబంధమైన ఖర్చు ఎట్లుండును? ఈవిషయము లన్నియు హాల్ కెయిన్ గ్రంథములందు చక్కగ వర్ణింపబడినవి. కష్టకాలమునందు ఈద్వీపవాసులు చూపు ఓర్పును ఈతడు 'శిల్పము మెఱయ' చిత్రించియున్నాడు. ఈతని గ్రంథములను గూర్చిన ఇతరవివరముల నిపుడు తడవ తలంపలేదు. ఈతనిని గూర్చి రెండుమూడువిషయములు మాత్రము తెలిపి విరమింతును.

అవి హాల్ కెయిన్ సారస్వతజీవితమున నూతనముగ ప్రవేశించిన దినములు. తాను రచియించిన నవలనొకదానిని ఈతడు ఒక పబ్లిషరు దగ్గఱకు గొనిపోయినాడు. పబ్లిషరు మొదట దాని ప్రచురణమున కంగీకరింపలేదు. కాని కొన్నిరోజులు గడిచినపిమ్మట ప్రచురించుట కెట్లో అంగీకరించెను. వెంటనే ముద్రణము ప్రారంభించుటకు ప్రయత్నములు జరిగెను. కాపీరైటు టరములవిషయమై సంప్రతింపులు నడచెను. వెంటనే సొమ్ము ఇచ్చివేయవలసినచో నూరుపౌనులు, లేదా అప్పటికి పాతికపౌనులును, పుస్తకముల అమ్మకముమీద కొంత కమీషను (Royalty) ఇచ్చుటకు పబ్లిషరు ఒప్పుకొనెను. పబ్లిషరు ఒక్కసారిగా నూరుపౌనులు ఇత్తుననగా హాల్ కెయిన్‌కు పట్టరాని సంతోషము కలి

గెను. వెంటనే నూరుపౌనులను చేతిలో వేయించుకొనుటకే ఈతడు నిశ్చయించెను. తన నిశ్చయమును సంతోషపూర్వకముగ ఈతడు పబ్లిషరున కెఱింగించెను. సరే యని పబ్లిషరు ఇట్టి టరములను లిఖితమొనర్చి సంతకములు చేయుటకు నిర్దిష్టములైన ఒడంబడికకాగితములు కొనివచ్చుటకు ప్రక్కగదిలోనికి పోయెను. హాల్ కెయిన్ కును, పబ్లిషరుకును జరుగుచుండిన సంభాషణము నంతయు ఆగదియందు ఒకమూల కూర్చుండియుండిన ఆగ్రంథప్రచురణాలయపు గుమాస్తా—పొట్టివాడు, ముసలివాడు—వినుచుండెను. కాగితములు తెచ్చుటకు తన యజమాని ప్రక్కగదిలోనికి వెళ్లియుండిన సమయమున ఆగుమాస్తా మెల్లగా హాల్ కెయిన్ దగ్గఱకు వచ్చి అప్పుడు నూరుపౌనులు పుచ్చుకొని చేతులు కడిగికొనుటకంటె అప్పటికి పాతికపౌనులుమాత్రము పుచ్చుకొని శాశ్వతముగ రాయల్టీ పొందుచుండుట మంచిపద్ధతియని నొక్కిచెప్పెను. అయాచితముగ వచ్చిన ఈయుపదేశరత్నమును అదృష్టవంతుడగుటచే హాల్ కెయిన్ జారవిడువలేదు. తనమనసు మార్చుకొనెను. అంతలో కాగితములతో పబ్లిషరు ప్రవేశించెను. అప్పుడు ఈతడు పబ్లిషరుతో తన అభిప్రాయమును మార్చుకొంటిననియు, తనకు రెండవ పద్ధతియే ఇష్టమనియు చెప్పెను. ఈప్రకారము నిర్ణయము జరిగెను. పుస్తకము ముద్రితమయ్యెను. లక్షలకొలది ప్రతులు సెలవయ్యెను. రాయల్టీక్రింద హాల్ కెయిన్ కు కొన్నివేల పౌనులు వచ్చెను. భాగ్యరేఖ బయలుపడెను. తన ఈయైశ్వర్యమునకు ఆముసలి పొట్టిగుమాస్తా ఉపదేశము పునాదియని హాల్ కెయిన్ తన మిత్రులతో తఱుచు చెప్పుచుండువాడు. స్థిరప్రతిష్ఠ గలిగినతరువాత ఈతనికి తనగ్రంథములవలన సాలుకు ఇరువదివేల పౌనుల ఆదాయము వచ్చుచున్నది.

సాలుకు ఇరువదివేల పౌనుల ఆదాయము, సారస్వతజగత్తున సాటిలేని ప్రతిష్ఠ కలిగి వఱలుచుండిన హాల్ కెయిన్ వృద్ధాప్యమున తన పిచ్చిచేష్టచే నలుగురిలో నవ్వులపాలాయెను. ఈతనికి స్వోత్కర్ష ఇష్టము కాదు గాని వయసు చెల్లినతరువాత చేయదొడగిన వికృతచేష్టచే ప్రత్యేకప్రకటనము పడసెను. సుప్రసిద్ధనాటకకర్త యగు షేక్స్పియరును ఆకారరేఖయందు తాను అచ్చముగ పోలియుండినట్లు ఈతడు విశ్వసించెను. విశ్వసించి ఆకారరేఖయందే గాక దుస్తులయందును ఆతనిని పోలియుండుటకు ఈతడు నాలుగుశతాబ్దులకు పూర్వము షేక్స్పియరు ధరించినట్లు బొమ్మలలో చూపబడు మోస్తరు దుస్తులను ధరించువాడు. ప్రాబడి పోయిన దుస్తులను ధరించుటచే షాపునందు ప్రియముగల ఇంగ్లీషుసంఘమున ఈతడు ఆభాసపాత్రు డయ్యెను. ఈవికృతచేష్టచే ఈతనిప్రతిష్ఠకుగూడ కొంత భంగము కలిగినదని చెప్పవచ్చును. ఈవికారపుదుస్తులను విడనాడమని హాల్ కెయిన్ మిత్రులు బ్రతిమాలిరి. అయినను ఈతడు మానలేదు. ఆనాడు షేక్స్పియరు తొడిగినమాదిరి దుస్తులనే ఈనాడు మరణించువఱకు ఈతడు తొడుగుచుండువాడు.

—ఆంధ్ర శేషగిరిరావు, బి. ఏ.

---




## ఏకోదరులు

గ్రంథకర్త: మొక్కపాటి నరసింహశాస్త్రిగారు, సాహితీసమితి, పిఠాపురము. వెల 0-8-0.

సాధారణముగా నవలను చదువగానే యిది బాగుందా, లేదా యని నిర్ణయించుకోడం ప్రధాన విషయం. దీనికి జవాబు చెప్పుకొని గాని, గుణదోష విమర్శ జోలి యెవ్వడూ పెట్టుకోడు. నిజానికి విమర్శవల్ల తేలదు ఒకనవల బాగు, ఓగు. ఏకోదరులను జదివి పుస్తకము మూయగానే నాలో జనించినభావం "చిన్నదైనా ఎంత బాగుంది!" అని. అదే గ్రంథకర్తకు ధన్యత్వాన్ని ఆపాదించేది.

ఏకోదరులు ముగ్గురు. వెంకట్రామయ్య, రమణమ్మ, శివరామయ్య. వీరిలో పెద్దవాడు వెంకట్రామయ్య యేదో ఉద్యోగంలో జేరి, పెద్దలపద్ధతిని సాంఘిక జీవనం సాగిస్తాడు. రమణమ్మ చిన్నప్పుడే యిల్లు పట్టుతుంది. కడగొట్టువాడు శివరామయ్యలో పుట్టుతుంది భావసంఘర్షణ. బాల్యవివాహము, ఆజన్మ వైధవ్యం మీదగల విముఖత్వానికి, కూడా చదువుకొనేపిల్ల ఇందిర మీద మోహంతోనై, బ్రహ్మసమాజంలోనికి తన్ని దింపుతుంది. ఇందిరను పెండ్లి చేసుకొంటాడు. దేశోద్ధరణకని దిగితే దుఃఖసంప్రాప్తి తప్ప వేరేమిన్ని సమకూడదు. కాని ఈదుఃఖాగ్నిలో పుటంవేసినందువల్లనే, శివరామయ్యశీలము పరిశుద్ధమవుతుంది. తనమీద బెంగపెట్టుకొని తల్లి చనిపోతుంది. ఇందిర తనకు దూరమూరమై కృశించి ప్రాణాలు విడుస్తుంది. ఇందిర భూమినిపెట్టిన కూతుర్ని గోదావరి పొట్టపెట్టుకుంది. ఈదుఃఖ పరంపరలే రమణమ్మ, శివరామయ్యలకు అన్యోన్యత కుదిరిస్తాయి. సాంసారికజీవనంలో యెండుకట్టెలైన వీరిరువురికి పునరుజ్జీవనకరణంగా జాతీయోద్యమము వచ్చి, యిద్దర్నీ జైలుకు చేరుస్తుంది. కుటుంబవాసనాబలముచేతనేమో వెంకట్రామయ్యకూడా జైలుకు చేరుకుంటాడు. "నీ తెలివి తక్కువ చేసినా మళ్లీ ధర్మంకోసం పాటుపడే భాగ్యం పరమేశ్వరుడు కటాక్షించాడు" ఆముగ్గురికిని. ఇది కథ.

నవలకు ఆటినంతకథ కాకపోవచ్చు. మంచినీళ్ల ప్రాయంగా నుండవచ్చు. కాని మంచినీళ్లకుండే గుణం దీనికీ ఉంది. ఎక్కువ తీపి లేకపోతే ఎక్కువ మత్తుకూడా లేదు. మోహం అశాశ్వతమనిన్నీ, ధర్మబద్ధమైన ప్రేమయే నిశ్చలమైనదనిన్నీ, అందుకు ఉదాహరణమే సంఘాన్ని వదలిన కొడుకుమీదగూడ తల్లికి గల అపార ప్రేమ అనిన్నీ యీనవలలో మూలభావం.

కథలో రెండు విషయాలు విమర్శనీయంగా ఉన్నాయి. ఒకటి: ఒక్కరాత్రిలోనే ఇందిరపై శివరామయ్యకు పుట్టేవెగటు. దీనికి తగినంత కారణమేమిన్ని లేదు. శివరామయ్య నిజంగా సంస్కారభావప్రేరితుడై ఇందిరను పెండ్లి చేసికొన్నాడా, లేక ఇందిరమీది మోహమే యితన్ని సంస్కరణ పరాయణునిగా చేసిందా యనేది సందిగ్ధవిషయం. రెండుకారణాలు నిర్దేశింపబడినవి కాని యేది ప్రబలమో రుజువు లేదు. అందువలననే, శివరామయ్యకు వచ్చే కష్టములకు సందర్భము, కారణము నిర్ణయించడం కష్టమవుతుంది. రెండవది: ఏకోదరులను జైలుకు లాగడం. శివరామయ్య, రమణమ్మ విషయమెట్లున్నా, వెంకట్రామయ్యను గ్రంథకర్త జైలుకు పట్టితీసికొచ్చినాడు, పోలీసువాళ్లలాగా.

శాస్త్రిగారు కరుణరసపుపట్టులందు చూపే ప్రతిభ యితరపట్టులందు కానరాదు. 'కరుణ'యే వీరికి గట్టిపట్టు, 'హాస్యం' కాదని నానిశ్చయం. 'బారిష్టరుపార్వతీశం' నికి వలగొన్న వారి కీమాట నచ్చకపోవచ్చు.

శైలి ధారాళమైనది. సామాన్యమైన వాడుక భాష. కష్టమైనపదము లుంట్లనే ఉండవు. పిల్లలకైనా అర్థమవుతుంది.

గు. వెం. సు.

---

## ప్రతిబింబములు

గ్రంథకర్త: మొక్కపాటి నరసింహ శాస్త్రిగారు, సాహితీసమితి, పిఠాపురము. వెల రు ౧.

ఇందులో ఐదు కథ లున్నాయి. 'లక్ష్మి', 'మహాత్ము', 'చిత్తరువు', 'శిల్పిద్వయం', 'భిక్షువు' అని వాటికి నామకరణం. మొదటి రెండున్ను, కడపటిదిన్ని 'భారతి'లో ప్రకటితమైనవే. కడమ రెండున్ను 'సఖి' పత్రికాముఖమున వెలువడినవి. కథల పుస్తకములు కొద్దిగా వున్న యీరోజులలో యీ సంపుటము ఆవశ్యకమే.

ఈకథలకు 'ప్రతిబింబములు' అని శీర్షిక నొసంగుటలో గ్రంథకర్తగారియుద్దేశ్యమేమో! జీవన ప్రతిబింబములని తోస్తుంది. కాని అన్నీ కథలు జీవనప్రతిబింబము లనిపించుకోవు. 'మహాత్ము', 'భిక్షువు' రెండున్ను అద్భుతకథలు. సన్న్యాసుల మహిమ గాని, వనస్పతుల ప్రభావం గాని, నిజమో అబద్ధమో నే జెప్పలేను, రెండున్ను అసామాన్యం, అద్భుత మనుట రూఢి. శాస్త్రిగారి రచనాధోరణిమాత్రం జీవనప్రతిబింబములుగా నుండవలెనని యే. కాని కథావస్తువు అట్టిది కాదు. 'చిత్తరువు'లో చిత్తరువునకు జీవకళ నాపాదించడం తెలుగు కథలలో అపూర్వము. నాకు తెలిసినంతవరకు ఆస్కారు వైల్డు నవల 'Picture of Dorian Grey'లో సజీవమైనచిత్తరువు నాధారంగా గొని కథ నడుస్తుంది. దానికి, శాస్త్రిగారి యీకథకు చాలా తేడా కలదు. పోలిక శాస్త్రిగారి కనుకూలించదు. 'చిత్తరువు'లో గూడ కథ స్వల్పము. వర్ణనాచాతురిమాత్రము గలదు. 'లక్ష్మి'వంటి కథలు తెలుగులో సామాన్యంగానే ఉంటాయి. కాని శాస్త్రిగారి రచనలో సంకోచము లేకుండా విప్పిచెప్పడమనే గుణం మెచ్చుకొలకు, ఏత ద్విపరీతమునకు కూడా కారణం గావచ్చు. 'శిల్పిద్వయము' ఒక్కటే యీసంపుటములో ఉన్నతభావోపేతమైనది. బాహ్యము, దైహికమైన సౌందర్యమునకన్న అంతరస్థము, ఊహాసిద్ధమైన సౌందర్యమే శాశ్వతము. ఆనందదాయకము అని కథయొక్క మూలభావము. దీనికై వారు చేసిన కెంపకము కొంత అనవసరంగా కన్పడుతుంది. ఇంతకు కారణము వీరు కథలను నవలలపద్ధతిని వ్రాయడం.

గు. వెం. సు.

---

## Our Duties to Hindu Widows

## హిందూవితంతువులు-వారిపట్ల మనధర్మములు

క్రౌను ౧, పు. సైజు. పు. ౩౨.

ఇది యొకచిన్న ఆంగ్లగ్రంథము, సరస్వతీసంఘ ప్రకటితము. వెల ఒక అణా.

వలయువారు: సరస్వతీసంఘము, ౨౨, పిడారియరు కోవెలవీథి, జార్జిటవును, మద్రాసు—అని వ్రాయవలెను.

హిందూవితంతువుల నుద్ధరించవలెనని ప్రచురణకర్తల యుద్దేశ్యము. వారికి గృహపరిశ్రమలను, వైద్యవిద్యను, ఇతర జీవనోపాయము లగు వృత్తులను నేర్పి వారు జీవితమును సౌఖ్యముగ గడపునటుల మనము తోడ్పడవలెనని ప్రచురణకర్తలు కోరుచున్నారు. వీరి యుద్దేశ్యమెంతయు ప్రశంసనీయము. మనమందరము ఈవిషయమై ముఖ్యముగ తోడ్పడవలెనని వేరుగ జెప్పనక్కరలేదు. కాని విషయములు ఇందు తగాదాఅంశములుగ నున్నవి. బాల్యవివాహము హిందువులలో పూర్వ మెన్నడును లేదనియు, హైందవస్త్రీలు సర్వసాధారణముగ స్వయంవరము నే అవలంబించినవారనియు, బాల్యవివాహములు అసంఖ్యాకలగు బాలవితంతువు లేర్పడుటకు అవకాశ

ముగ నున్నవనియు, బాల్యవివాహములచే దుర్బలమగు సంతాన మేర్పడుచున్నదనియు. ౭, ౮ సంవత్సరముల బాలికలను యుక్తజ్ఞానము వచ్చిన పురుషులకు పరిణయ మొనర్చుటచే అట్టి కన్యలతో, అనగా రజస్వల గాని తమ భార్యలతో, వారు అక్రమప్రవర్తనమును గావించుచు న్నారనియు ప్రచురణకర్తలు తెలుపుచున్నారు. వీటిని సప్రమాణముగ వీరు చూపజాలకున్నారు. ఈవిషయములు కేవలము సత్యదూరములని వ్రాయుట కింతయు చింతిలుచున్నాడను. వీటిని ఖండించుట కిచట స్థలము చాలదు. ఇట్టి రీతిగాదా అంశములను వ్రాయకున్న బాగుండెడిది.

జరుగుమిల్లి సాంబశివరావు, బి. ఏ.

---

## God's Lenses
## ఐశ్వరీయాదర్శములు
## (Prohibition & Spirituality)
### (పాననిషేధము - అధ్యాత్మత)

క్రౌను ౮ పు. సైజు, పు. ౧౮౮. వెల రు. ౨.

మద్యపాననిషేధము నొనరించు నొక చిన్న పుస్తకము. (ఆంగ్లము.) వస్తుతః రాజధానియం దంతటు, కనీసము కడపజిల్లాయందైన త్రాగుబోతు తనమును మాన్పవలయునని మద్రాసు గవర్నరుగారి పేర పంపబడిన ప్రార్థనారూపకమగు బహిరంగపత్ర మిది. దీనిని వ్రాసి పంపిన అవధానం కృష్ణమునిగారు రాయలసీమ కడపజిల్లా నివాసి. మద్యపానమును మాన్పించుటకై సర్కారువారు ఏర్పరచిన కమిటీలలో కొంతకాలము పనిచేసి యుండుటవలన నించుకైన లాభము గానక తుద కిట్టి కమిటీలన్నియు నామకార్థము, అమాయకులగు లోకులను భ్రమింపజేయుట కేర్పడినవని నిశ్చయముచేసికొని వీరు వానినుండి వేరై స్వయముగ దమ సంకల్పసిద్ధికై పాటు పడుచున్నట్లు ఈ గ్రంథమును జదువుటవలన దెలియుచున్నది. ఇట్టివేయగు మూడు బహిరంగపత్రములను ఇదివరలో గవర్నరుగా నుండిన గోషన్ ప్రభువుగారి పేర బంపియుండిరి. కాని వీరి ప్రార్థనానుసార మింతవరకు నేమియు గావింపబడకుండుట జూచి ఈనాల్గవ పత్రమును క్రొత్తగా వచ్చిన గవర్నర్ స్టాన్లేగారి పేర వ్రాసియున్నారు. కాని ఈప్రయత్నమును ఇంతవరకు ఫలోన్ముఖమైనట్లు గన్పించదు. వీరి మిత్రులలో నొకరు వచించినలాగున త్రాగుబోతులకు దూరదృష్టికాని రసజ్ఞతకాని శూన్యము. అన్యథా ఈముని వేరొక గ్రంథమును తమతలమీద వేయక పూర్వమే, వారీదుర్వ్యసనమును మానుకొనియుందురు. కావున నీరెండు వ్యాపారములు అంతమువరకు సాగవలసినవే. అనగా నైదైవరాజ్యనియమము చేత త్రాగుడు గాని గ్రంథకర్తయొక్క ప్రయత్నముకాని అడ్డగింపబడువంతవరకు నీరెండు కార్యములును సాగుచుండవలసినవే. ప్రస్తుతపు రాజ్యప్రణాళికైఖరి జూడ దుర్వ్యసనముల కొలగించుటకు మారుగ వానికి వ్యతిరేకముగ కృషిచేయు వారిని, వారియత్నములను నిర్మూలించుటకే కంకణము గట్టుకొనియున్నట్లు గనుపడుచున్నది. అందులకుగాను సుమారు రెండుసంవత్సరములనుండి ప్రస్తుతపు దొరతనమువారికి పట్టుగొమ్మల నదగిన పోలీసువారు ఇండియనుల శాంతిసౌకర్యములకొరకని కావించుచున్న కార్యక్రమములే ప్రబల సాక్ష్యములుగ నున్నవి. ఏది ఎటులైనను గ్రంథకర్తమాత్రము దృఢసంకల్పుడై యుండుట శుభావహము.

ఉపదేశాత్మకమయ్యు నీపుస్తకము నవలవలె జదువుట కింపుగ నుండును. ఇందలి ముఖ్యవిషయము మద్యపాననిషేధమయ్యు సందర్భానుసారముగా ననేక విషయము లిందు జర్చింపబడియున్నవి. గవర్నరుగారి లెజిస్‌లేటివ్ కౌన్సిల్ యొక్క అకర్మణ్యతయు, అందలి మెంబర్ల అశక్తతయు బాగుగ వివరింపబడినవి. మెంబర్లకు గవర్నరుగారిని సంతోషపెట్టి వారిమన్ననలను బొందవలెనని యుండునంతటి యుత్కటచాపల్యము ప్రజలను సంతోషపెట్టవలయునని యుండదు. ఇక మినిస్టరులకో ఒకచేతిలో విద్య, రెండవచేతిలో ఎక్సైజు అనగా దేశీయ-ఉత్పత్తిపదార్థములపై పన్ను మొదలగు వాని యథేచ్ఛరీతి విధించి వాని నభివృద్ధిచేయుట. పానద్రవ్యములును దేశీయోత్పత్తులే; దానినిగూడ నభివృద్ధిపరచవలసి యుండును.

విద్యయువదని నీతిని పెంపొందించుటకు గావున ఒక్కరే మినిస్టరు నీత్యానీతుల రెండింటిని అభివృద్ధి పరచవలయును. ఇది యెక్కలి అసంగతమైన విషయము. అట్లుగాక గ్రంథకర్త యొక్కడక్కడ సూచించిన విధమున ప్రస్తుత పరిపాలకుల సృష్టియందు మద్యపానము దోషములలో చేరినది కాదు ప్రకాలోలం! తరువాత నిక్కొలప్ప యూనివర్సిటీ విద్యల నిరర్థకతను ప్రతిపాదించుచు వీరు వ్రాసిన వాక్యములు నవ్వును బుట్టించును. ఎట్లనగా "విశ్వవిద్యాలయములందు గరపువిద్య, విద్యార్థులబుద్ధిని వికసింపజేయునది కాదు. సైన్సు గ్రాడ్యుయేటు అను వానికి భార్య ఎక్కడికైన వెళ్లినచో అన్నమెట్లువండుకొనవలెనో తెలియదు. ఇతిహాసవేత్త యగు గ్రాడ్యుయేటునకు అబ్బతద్దిన చెంతారీఖున వచ్చునదియు తెలియదు. స్వకీయ పౌరాణిక విద్యయనిన సర్వథా శూన్యము. వీరిని (యూనివర్సిటీ గ్రాడ్యుయేటులను) హనుమాన్ ఎవ్వరని యడిగినచో భీష్మునకు అతని రెండవ భార్యయందుబుట్టిన మూడవబిడ్డకుమారియని చెప్పువారును గలరు. ఫిలాసఫీ గ్రాడ్యుయేటుగారికి మీసాలపై అత్తరుపూతలు; 60 ఏండ్లు దాటినను ఇంద్రియ నిగ్రహముమాటయెత్తిన తలనొప్పి. అర్థశాస్త్రప్రవీణు డగు పొలిటికల్ ఎకానమీ గ్రాడ్యుయేటులవారికి వీపుమీద లంకామైరుమిల్లువస్త్రము మున్నగాని రాణించదు." యూనివర్సిటీవిద్యార్థుల గూర్చి ఇంకను నిట్టివే యుపహాస వాక్యములు పెక్కులు గలవు. అన్నింటి వ్రాయ నిచట చోటు చాలదు. కాన కావలసినవారీగ్రంథమునే చూచికొనవలయును. ఇదే విధమున హైకోర్టుతీర్పుల దోషములు, వానికి హేతువులు, ప్రాంతిక పరిపాలనములలో గల లోపములు కలెక్టరు మొదలుకొని గ్రామమునసబు వరకుగల యధికారులచర్యలు మొదలగువాని బాగుగ చిత్రించి యున్నారు. ఈవిషయము లన్నింటియందు గ్రంథము మొదటినుండి తుదివరకు మద్యపానమువలన గలుగు దురంతములన్నియు వర్ణింపబడి యున్నవి. ఈ దురంతముల నన్నింటి బారదోలి ప్రజల నీతిమంతులుగ చేయుడని యడుగడుగున గవర్నరుగారిని చేసిన ప్రార్థనలు పాషాణహృదయము నైనను గరగించును. మద్యపానమును నిషేధించుటవలన గలుగు సకలవిధములైన లాభనష్టములను జర్చించి యానష్టములకు పరిహారమార్గములనుగూడ గనుపరచియున్నారు. వీని యన్నింటి తరువాత అధ్యాత్మానుబంధము (Spiritual Supplement) అను శీర్షికక్రింద నీతివాక్యము లనేకములు గలవు ఎట్లనగా—

౧. "కవియొక్క గులాబీపువ్వు ఎప్పటికిని వాడదు."

౨. "చెడుపనులకంటె మంచిమాటలు మంచివి."

౩. "పాపము, భక్తి యనునవి వేర్వేరు విషయములు."

౪. "త్రాగుబోతులచే దమ్మలడియుటవలన చేసినపైతాను గూడ మద్యపాన నిషేధమునకు దీటు నిచ్చును."

౫. "కాళిదాసు శిరోమణిపరీక్షకు గూర్చుండినయెడల వానికి ౩౫ మార్కులైనా వచ్చియుండవు."

౬. "'నీయొక్క కుడిచెంపను త్రిప్పు'మని క్రీస్తు ఆజ్ఞాపించియుండెను. కాని గాంధియిట్లుఆజ్ఞాపించుట లేమియు లేకయే రెండుచెంపలను త్రిప్పి యున్నాడు."

౭. "త్రాగుబోతులు అద్వైతతత్వముచే దమ్ముదాము సమర్థించుకొనజాలుదురు. చెడువారు మంచివానిని గూడ చెడుగునకే యుపయోగించుకొందురు."

౮. "ఒకపర్యాయము అరిస్టాటిల్ అను గొప్ప తత్వశాస్త్రవేత్త సమయమునకు భోజనమునకు లేవకపోవుట వలన వానిభార్య యతని శిష్యుల యెదురుగనే చెడతిట్టినది. కాని యాయుపదేశముల కతడు జరవక యథాపూర్వము శిష్యులతో వాదవివాదములాడుచుండే మునిగియుండెను. అంతట నామె కోపమునుబట్టజాలక వేడివేడి యన్నపు పాత్రమునుదెచ్చి యతని తలమీదవైచెను పాప మాతత్వజ్ఞాని శిష్యులవంక దిరిగి నవ్వుచు 'మహా వ్వా! ఉరుము తరువాత వాన కురిసినది. నాకు చాల సంతోషము.' అని నుడివెను."

ఇట్టివేయును సూక్తములిందు వందలకు మించి కలవు. ఒక్కొక్క వాక్యమునుండి యొక్కొక్కనీతిని దీయ వచ్చును. ఇవికాక ధార్మిక లౌకిక ఉద్గ్రంథములలోని

విషయములు చక్కని నీతికథలుగ నిందు వ్రాయబడి యున్నవి. వేర్వేరుకథలనుండి వేరువేరు నీతుల గ్రహింప వచ్చును.

ఇది ప్రస్తుతము మద్యపానమును రూపుమాపవలయు నని ప్రయత్నించుచున్న వారందరు దప్పక చదువతగిన గ్రంథము. పికెటర్ల కిదిచాలా సాయముచేయును. ఊరక అంగళ్ల ముందు నిలుచుండి వచ్చువారికి చేతుల మోడ్చు కంటె కొంచెముగనో గొప్పగనో సదుపదేశము లొసంగ గలశక్తి పికెటర్లకు దీని జదువుటవలన గలుగును. దీనికి పూర్వము ప్రచురింపబడిన మూడుగ్రంథములగూడ జూచినయెడల నీయుద్యమమునకు సంబంధించిన సమస్త విషయముల జ్ఞానము కలుగుటకు వందియముండదు.

అది యటులుండ "ఈపుస్తకము నమ్ముటవలన వచ్చిన ప్రతి దమ్మిడియు త్రాగుబోతులయొక్క నిస్స హాయులగు భార్యాబిడ్డలను రక్షించునిమిత్తము వినియోగింపబడును." అని గ్రంథకర్తయే వ్రాసియుండుటవలన దీనినిగొని చదువువారికి రెండుప్రకారములగు లాభము కలుగగలదు. చివరకు ఈమునిగారిని ఈయుద్యమములో దిగుటకు ప్రేరేపించిన యొక ఘటనావృత్తాంతము నిందు బొందుపరచి దీనిని ముగించెదను.

"ప్రతిదినము పార్థసారథి దేవాలయమున కనేక మంది పోవుచుందురు. స్త్రీలనేకులు ముఖ్యముగా వంధ్యాత్వనివారణమునకై ప్రార్థించుకొనబోవుట కలదు. ఒకనాడు నేను (ముని) అచటనుండగా నొకయాబిడ వేరొకస్త్రీని 'నీవుకూడ నిందులకే వచ్చితివా' యని యడిగెను. అందులకా రెండవస్త్రీ యిట్లు ప్రత్యుత్తరము తెలుగులో నిచ్చినది:-"అక్కా! నేనువచ్చినది పోత్తిగా వేరువిధమైన వరముకొరకు. నాకు ౧౧ మంది బిడ్డలు. పార్థసారథిస్వామి వారికంటె నామగడెక్కువ గట్టివాడు. పలుకుబడిగలవాడు. దౌర్జన్యశీలుడు. నేడు నా బిడ్డలలో నైదుగురిని కలరా పొట్టను బెట్టుకొన్నది. నేను ఉడ్చిపనిచేసి జీవించేదానిని. ఒకపెద్దమనిషి నామీద కనికరించి ౨౫ రూపాయ లిచ్చినారు. శవములను గప్పుటకు ఖద్దరు గుడ్డము కొన్నాను. వారిని దీసికొని పోవుటకు సిద్ధముగానుండగా నామగడు కల్లుసారాయి కొరకై కొనుచువచ్చి, నన్నుదన్ని, శవములమీది ఖద్దరు గుడ్డము లాగికొని, నా మెడలోని మంగళసూత్రమును దెంచుకొని మరల కల్లంగడికి బరుగెత్తుకొనిపోయినాడు. నామగడు జేసినపాపము లన్నింటిని క్షమించుటకుగాను వతనికొరకు ప్రార్థింప నిచటికి వచ్చినాను."

ఆహా! ఈ మెనుగన్న మాతృభూమి ధన్యురాలు గదా! నాకు ఒడలు గగుర్పొడిచినది. హిమాలయముల నుండి కన్యాకుమారివరకుగల దేవాలయములందలి గంట లన్నింటిని మ్రోగించిన బాగుండునని తోచినది. నాకు నోటివెంట మాటరాలేదు. ఆమె పాదములమీద వ్రాలి యామె మాయింటి యిలవేల్పని భావించిపూజించినాను. దైవానుగ్రహమువలన నిప్పటికిని ఇట్టి తల్లులు ఇక్కడక్కడ ఉన్నారు. మహాకష్టముమీద నామెను సమాధానపరచి నాదగ్గర అప్పుడున్న ౨౫ రూపాయల నామె కిచ్చినాను. నాకు మొట్టమొదట ఉద్బోధన కలిగిన దీమెకారణముననే. అదిమొదలుకొనియే నే నీమద్యపాన నిషేధమునకై కృషిసల్పుట. హా! స్టాన్ లే! నీకిప్పటికైన కంటికి నీరురాదా? ఇందులకైనా నీకు తీరిక లేదా? లేక హృదయమే (రోదన - యంత్రము) చెడినదా?

కల్లబొల్లి యనుతాపములు పనికిరావు. నీ గొప్ప పదవికి నీకుశిక్ష కలుగుచున్నది. నీవు సౌఖ్యముగా నుండుటచే ప్రపంచ మంతయు సుఖముగ నున్నదను కొనుచున్నాడవు. ఆహా? నీకిటువంటివారు తటస్థపడిన నెంత బాగుండును? కాని పిలిచినప్పు డంతయు దేవుడు రాడుకదా!"

వే. సు.

---

## మేధానిధులు

క్రౌను ౧౬ పుటల సైజు. పు. ౧౨౧. వెల రు. ౦-౧౨-౦.

గ్రంథకర్త: బూరుగుల పూర్ణయ్య శర్మగారు, సహాయాంధ్రోపాధ్యాయుడు, టేలరు ఉన్నత పాఠశాల, నరసాపురము.

వచనరూపమున నిందు విక్రమార్కుడు, ప్రతాపరుద్రుడు, భీమసేనుడు, రామప్రధాని, ఖడ్గతిక్కన, భీమకవి, రామకృష్ణకవి, చాణక్యుడు, తిమ్మరసమంత్రి అను నీతొమ్మండుగురను గూర్చినకథలు గలవు. భారత దేశౌన్నత్యమును దెలుపగల యిట్టి గ్రంథములే నేటి విద్యార్థు లాశ్యము జదువవలసినవి. కాన నిట్టివానిని మరి కొన్నిటిని సమర్థులగువారలు రచియింప నొప్పును.

గ్రంథమున రచనము సామాన్యము; వాక్యములు దీర్ఘములు. చివర తప్పొప్పుల పట్టిక యున్నను, కతిపయ దోషములు (గ్రంథకర్తవి, ముద్రాపకులవి) గ్రంథమున నిలిచిపోయినవి.

గ్రంథము వెల పంద్రెండణాలు.

దీనికను వ్యయ మెంత యెక్కువయయినను రెండణాలకు మించదు. "కీతికలోని ఈ గ్రంథరచనకు విషయసంపుటీకరణంబున శ్రీ వీరేశలింగము పంతులు గారి కవుల చరిత్రము, చంద్రగుప్తచరిత్రము, శ్రీయుత చిలుకూరి వీరభద్రరావుగారి తిమ్మరుసు చరిత్రము నా కెక్కుడు సహకారము లగుటచే" ననుటచే ప్రయాసయు నల్పమని తెలియుచున్నది. "క్షేమాభిలాషు లగు మిత్రవర్యు లిందలి స్ఖాలిత్యంబులఁ దెలిపిన ద్వితీయముద్రణమున సవరించుకొనెద"ననుటచే శోధ్యతయు కోరవడినది. ఇక ఇంత వెలయేల? పాఠ్యగ్రంథముగ నొకవేళ నిర్ణయింపబడునేని పంద్రెండణాలు నిచ్చి బాలురు తప్పక కొనవలసినదే కదా! కట్టా, ఇప్పటివిద్యావిధానమువలన విద్య యొకవంక, ఇట్లు గ్రంథముల విపరీతపు వెలలవలన ధన మొకవంక సన్నగిలుచున్నవి. దీనికి ప్రతీకార మావశ్యకము కాదా!

---

కల్యాణి

మాసపత్రిక. ప్రారంభము: ప్రజోత్పత్తిసంవత్సర శ్రావణమాసము. సంవత్సరచందా రెండురూపాయలు.

సంపాదకులు: శ్రీ గంటి సూర్యనారాయణ శాస్త్రిగారు, తపాలపెట్టె నెం. ౧౧౦, మదరాసు.

సంపాదకులు 'మనవి'యందు "ప్రస్తుత మాంధ్ర సారస్వతప్రపంచమున నెన్నియో మాసపత్రికలు వెలువడినవి, వెలువడుచున్నవి. కాని యవి సర్వాంగసుందరములు కాకుండుటచేత సర్వజనాదరణీయములు గాకున్నవి. ఒకటి, రెండు పత్రికలుమాత్రము బాహ్య వేషాడంబరముచేత నాంధ్రలోకమున తలలెత్తి సంచరించుచున్నవి. ఆంధ్రసారస్వతము, ఆంధ్రవిజ్ఞానము, ఆంధ్రకళలు, ఆంధ్రభాషౌన్నత్యము మున్నగునవి పత్రికలయందు మృగ్యములైనవి." అని నేడు ప్రకటితములగుచున్న పత్రికలను నిరసించిరి.

'ఆంధ్రపండిత మండలికిని, సారస్వతాభిమానులకును, ఆనందప్రదములగుటకు, 'నూత్నకళలతో కలకలలాడుచుండుటకు, 'ఆంధ్రాభిమానమునకు పాత్రమగుటకు పత్రికలు, 'సరసకవిత్వము, అలంకారవిలాసములు మృదుమధుర పదగుంభనములు, శయ్యాచమత్కారములు, భావగాంభీర్యము, ప్రకృతిసౌందర్య వర్ణనములు, నవరసప్రసారములు మొదలగు వానిచే విరాజిల్లు' చుండవలెనన్నారు.

కావున ఇట్టిపత్రిక నొకదానిని నెలకొల్పవలె నని బహుకాలమునుండి సంపాదకుల యత్నము. ఆ యత్నమే 'ప్రస్తుతము కల్యాణిరూపమున ఫలవంతమయినందుల' కు సంపాదకులు సంతసించుచున్నారు. 'ఈకల్యాణికి గ్రామ్యగ్రాంథికభాషలు రెండును రెండు నేత్రములు.' 'ప్రాచీనాధునిక కవిత్వ చమత్కారములయందు' ఈ 'కల్యాణి విహరించును.' 'నేతిబీరకాయ వంటి భావకవిత్వము (ఈసంచికయందును కలదు), రాజకీయరంగ విలాసములను ప్రాచీనానుశాసనములను కల్యాణి సహింపదు.'

ఇది యంతయు నొక పెద్ద యెత్తు. పత్రికలను పోషించుట బహుతరకష్టసాధ్యమగు నీకాలమున నింత యెత్తున నీపత్రికను ప్రారంభించిన సంపాదకులధైర్యము, భాషాభిమానము ఎన్నదగినవి. ఈప్రథమసంచికయందు తొలుదొలుత ప్రాచీన సంప్రదాయానుసారము కల్యాణికి, తత్సంపాదకునకు నభ్యుదయ పరంపరాభివృద్ధిని

గాంక్షించుచు పలువు రాశీర్వాద పరంపరలను గురిపించినారు. వీతదాశీర్వాదబలమున అచిరకాలముననే సంపాదకుల యాశయముబడి పత్రిక గుణోత్తర మగును గాక!

మరియు నీసంచికయందు పలువురు విద్యాధికులు రచియించిన గద్యపద్యవ్యాసములు గలవు. వానిలో స్త్రీరత్నముల వ్యాసములు నుండు. శ్రీ శ్రీ శ్రీ విక్రమదేవవర్మ మహారాజులుంగారి (జయపురము మహారాజుగారి) చిత్రము సంచిక ముఖపత్రము నలంకరించినది.

విజ్ఞానాభివృద్ధికి పత్రిక లావశ్యములు కావున దేశీయు లుచితరీతి నీపత్రికయొక్క యభివృద్ధికితోడ్పడి తన్మూలమున విజ్ఞానమును పెంపొందించుకొందురు గాక!

---

## బాలతంత్రము

౩౫౦ పుటల గ్రంథము. బైండు దిట్టముగా అందముగా నున్నది. వెల ౧-౮-౦.

గ్రంథకర్త: వల్లూరి సుబ్బరావుగారు, భిషగ్వర, ఆంధ్రవైద్యమండలి కార్యదర్శి.

'శిశుపోషణ - బాలరోగములు' అను నామాంతరముగల యీగ్రంథమును 'కౌమారభృత్య' మనుటయు దగును. "కౌమారభృత్యం నామ కుమారభరణ, ధాత్రీక్షీర దోషసంశోధనార్థం దు(దు)ష్ట స్తన్యగ్రహసముత్థా(త్థా)నాంచ వ్యాధీనా ముపశమనార్థం. —సుశ్రుతము.

శిశువుల పోషించెడి క్రమమును, తల్లుల స్తనక్షీరదోషములను శోధించెడి క్రమమును, దుష్టస్తన్యపానముచే జనించెడు వ్యాధులను, బాలుర రోగములును, బాలగ్రహావేశమువలన నేర్పడు వ్యాధులును, వానిని హరించు చికిత్సలును తెలుపునది బాలతంత్ర మనబడుచున్నది."

సామాన్యముగ వైద్యులలో బాలచికిత్స యెఱిగినవా రరుదు. కేవలము విశేషానుభవము లేక దానిని దెలియుట యసాధ్యము. పూర్వ మెప్పుడో 'జీవకతంత్రము', 'పార్వతకతంత్రము', 'బంధకతంత్రము' మొదలగు ప్రత్యేక బాలతంత్రగ్రంథములు పెక్కు లుండినవి. ప్రత్యేకించి యావిషయమును దెలుపుగ్రంథము లిప్పటివల నంతగ కానరావు. కావున నసాధ్యవిషయమగు బాలతంత్రమును క్షుణ్ణముగా దెలియుటకు అనుభవమువలెనే గ్రంథములును ఆవశ్యకములు. ఈయావశ్యకమును గుర్తించి గ్రంథకర్త దీని నిట్లు సంధానించినారు. కావున సర్వాంధ్రవైద్యప్రపంచమును వీరి యెడ కృతజ్ఞతను జూపదగును.

చరకసంహిత, సుశ్రుతసంహిత, వాగ్భటము, కుమారతంత్రము, శార్ఙ్గధరసంహిత, మాధవనిదానము మున్నగు నాయుర్వేదగ్రంథములు, ఆంగ్లవైద్యశాఖామణుల ఆంగ్లగ్రంథములు, పరిశోధనవ్యాసములు నీగ్రంథమున కాధారములు. బాలోపచారములు, స్తన్యపానక్రమము, దుష్టస్తన్యపానజనితరోగములు, బాలరోగములు, వానికి చికిత్స, ఔషధములు నను విషయములను మొదటిభాగమునను, బాలగ్రహములు, తత్ప్రతిషేధము నను విషయములు ద్వితీయభాగమునను వివరింపబడినవి.

ఆయా విషయములకు సరిపోవు ప్రమాణములు పైన పేర్కొనిన ఆయుర్వేదగ్రంథములనుండి యుద్ధరింపబడినవి. వానికి గ్రంథకర్త రచియించిన తెలుగు తాత్పర్యము, స్వానుభవపూర్వకమగు వివరణము గలదు. ఉద్ధృత సంస్కృత భాగములు దోషభూయిష్ఠములు. వైద్యగ్రంథము లిట్లు లుండుట అపాయకరము.

'దీనిలో ఆయుర్వేదాచార్యపరీక్ష పాఠ్యక్రమము ఇమిడియున్నదని యే నాయుద్దేశ్యము' అని గ్రంథకర్త భూమికయందు గలదు. దీనినిబట్టి యియ్యది ఆయుర్వేదాచార్యపరీక్షకు జదువువారికి పాఠ్యగ్రంథముగా నియమింపబడవలయుననుటగూడ గ్రంథకర్త యుద్దేశ్య మని తెలియకమానదు. ఇట్టియుద్దేశ్యము సముచితము.

'నేను దగ్గర లేని కారణముచే ప్రూఫులు సరిగా దిద్దుబాటు కానందున అచ్చు పొరబాటులు విశేషముగ పడుట తటస్థించినది' అని తప్పొకొన జూచినారు. నేటి గ్రంథకర్తల కిట్లను టొక పరిపాటి యయినది. 'రాబోవు కూర్పునందు (అవి) సవరింపబడును' అనిరి. ఈకూర్పు పుస్తకము లేమి కావలెను?

---

## కేసరి

చరిత్రవిషయిక నవల — లీలావతీ గ్రంథమాల; గ్రంథకర్త: నిర్మల వేంకటసోమయాజి గారు; పుటలు ౩౫౩; వెల ౧-౫-౦.

ఈనవలయందు వర్ణింపబడిన కథ పదమూడవ శతాబ్దమున జరిగినదనియు, ఇందు టిబెట్టుదండయాత్ర తప్ప భక్తియారు ఖిల్జీయొక్క జీవితచరిత్ర మంతయు వర్ణింపబడియున్నదనియు, కథ రసవంతముగ జేయుటకు గొన్ని చరిత్రాంశములను మార్చి యుంటిమనియు గ్రంథకర్త పీఠికలో తెలిపియున్నారు. వారణాసిప్రభు వగు మోహనసింహుడును, పాటలీపుత్రరాజ్యాధిపుడగు జగత్సింహుడును, జగత్సింహుని కొమార్తెయగు కేసరియు, బీహారుప్రతినిధియగు భక్తియారుఖిల్జీయు ప్రధాన పాత్రలు. మహమ్మదీయుల బారినుండి రసపుత్ర పాలిత రాష్ట్రముల ననేకములను మోహనసింహుడు రక్షించుటయు, భక్తియారు దరిద్రావస్థనుండి చివరకు మహమ్మదీయ ప్రభువుల యాదరణ బడసి రసపుత్రులపై మహమ్మదీయ వాహినుల నడుపుటయు, ఈ నవలయందు వివరముగ వర్ణింపబడియున్నవి. కొన్నిచోట్ల యుద్ధవర్ణన కేవలము అతిశయోక్తిని సూచించును. మరియు, బంధితుడగు జగత్సింహుని గాంచి, మోహనసింహుడు తాను సకాలమునకు రాజాలమియే యందులకు కారణమగుట, నాత్మహత్య కుద్యమించెనని గ్రంథకర్త వ్రాయుట పాత్రౌచిత్యభంగకరముగ నున్నది.

కేసరీ మోహనసింహు లొండొరులను ప్రేమించి చిరకాల(మకారణముగ) వియోగమునకు లోనై యుద్వాహితులగుట యీనవలయందలి ప్రేమకథ.

శైలి చక్కనిది. అచ్చుపొరపాట్లు మిక్కుటము. నవల పదునైదువత్సరముల క్రితము ప్రకటితము.

స. చం. శా.

---

## కావ్యాదర్శము (సంస్కృతము)

చెన్నపురి వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండు సన్సువారి ప్రచురణము. —

ఈనూతనప్రచురణమున శ్రీ జీవానంద విద్యాసాగర భట్టాచార్యుని (కలకత్తా సంస్కృత కలాశాలాధ్యక్షులు) వ్యాఖ్యానమును, వి. నారాయణ అయ్యరు (యం. ఎ., యం. యల్.) గారి యాంగ్లానువాదపీఠికలును గలవు. గ్రంథాంతమునందలి అనుబంధమున భామహ దండి కృతులనుండి కొన్ని సంవాదిశ్లోకము లుద్ధరింపబడియున్నవి.

విద్యాసాగరుని వివృతి సుబోధమై హృదయంగమముగ నున్నది. ఆంగ్లానువాదమును చక్కగ నున్నది.

---

## ఉన్మత్తరాఘవము

భాస్కరకవి సంస్కృతమున రచించిన ఉన్మత్తరాఘవమను ప్రేక్షణకమున కిది తెలుగు. తెలిగించిన వారు ఆకిలి శ్రీరామశర్మగారు. ఈయుపరూపకమునకు శ్రీ కోరాడ రామచంద్రకృతి యొక యనువాద మిదివరకే వెలువడియున్నది. ఇది రెండవది. దీనిని నెల్లూరు కళానిధి గ్రంథమాలవారు తృతీయకుసుమముగ బ్రకటించిరి. అనువాద మీనాందితో నారంభమగుచున్నది:—

‘పొలయలుకన్ బ్రకోపమున
మోము నిజేశు పదానతిన్ బ్రసా
ధిల సుమకున్ దదీయపద
దిగ్ధజతూపచితాంకయై స్వకా
మలత దదాస్య చంద్రునకు
మాఱుపొసంగి తదీయరక్తిమం
బొలసినయట్టు లెఱ్ఱనగు
నీశశిరశ్శశిరేఖ శ్రీలిడున్.

ఇంతకన్నను మూలశ్లోకమే సుబోధమనవచ్చియున్నది; చూడుడు:

కలా చాంద్రీ శంభోః ప్రణయకలహప్రాపితరుషః
ప్రణామే పార్వత్యాః పదకమల లాక్షాపరిచితా ;

శ్రైషా ధూయా దప్యాన్వదనశశినో రోమకలంపాత్
ప్రసాదే నారుణ్యం వినిమయవశేనేవ దధతీ.

అనువాద మించుక సుబోధముగ నుండిన మేలుగ నుండెడిది. ఒండు రెం డెడల నెట్లున్నను అనువాదము చక్కఁగనే యున్నది.

# గ్రంథస్వీకారము

## వర్ణాశ్రమధర్మములు

క్రౌను సైజు, పుటలు ౬౧, వెల ౦-౮-౦.

గ్రంథకర్త:—వావిలాల వెంకటశివావధాని గారు, బి. ఏ., సింధను సబ్ జడ్జి, మచిలీపట్టణము.

---

## శ్రీమదాంధ్ర లింగపురాణము

డెమ్మీ సైజు, పుటలు ౫౧౧, అట్ట బైండు.

గ్రంథకర్త:—విద్వాన్, ములుగు చంద్రమౌళి శాస్త్రిగారు.

ప్రకాశకులు:—నందికేశ్వర గ్రంథమండలివారు, తెనాలి.

---

## శ్రీపూసపాటి వంశానుచరితము

(ప్రథమభాగము)

విజయనగరం కళింగఫాన్-షా గ్రంథమాల ప్రథమ ప్రచురణము.

క్రౌను ౮ పుటల సైజు. పు. ౧౨౨. ఫెదర్ వేటు కాగితము. అ-మూల్యము.

సంపాదకుడు, ప్రకాశకుడును: దువ్వూరి జగన్నాథ శర్మగారు, విజయనగరము.

ఈ గ్రంథము నెవ్వరు పట్టినవారు చదువుటకు వీలు లేదు.

'For private circulation only, among patrons and scholars' అని ప్రకాశకుల ఆన.

---

## శ్రీమద్భజనగీతమంజరి

క్రౌను, పుటలు, ౪౪ + ౩౧. వెల తెలియదు.

కర్త:—గోపాలుని హనుమంతరాయ శాస్త్రి గారు, ముప్పాళ్ల, ఈపూరు పోస్టు (గుంటూరు)

---

## సువర్ణమాలా గంగాధర స్తవములు

శ్రీ శంకరాచార్య, అప్పయదీక్షిత విరచితములు. పులిపాక మహానందిశాస్త్రిగారిచే బరిశోధింపబడినవి.

ప్రకాశకులు:—శైవప్రచారిణీ గ్రంథమాలవారు, వరంగల్. వెల ౨ అణాలు.

---

## గృహలక్ష్మి - దసరాసంచిక

విలాసము, గృహలక్ష్మి కార్యాలయము, తపాలా పెట్టె ౬౫౨, ఎగ్మూరు, మదరాసు.

---

## అధ్యాత్మప్రకాశ

(కర్నాటక మాసపత్రిక)

సంపాదకుడు:—వై. సుబ్బారావుగారు, ఏడాది చందా రెండురూపాయలు.

ప్రకాశకులు:—అధ్యాత్మప్రకాశకార్యాలయము వారు, రెండవవీథి, చామరాజపేట, బెంగళూరు సిటీ.

---

## Karnatak Historical Review

ఆరునెలల కొకటిగ వెలువడు నాంగ్ల పత్రిక.

ప్రకాశకులు:—కర్నాటకచరిత్ర విమర్శకమండలివారు, ధార్వాడ.

---

# సాభిప్రాయ విశేషములు

## గాంధిమహాత్ముడు - వర్ధంత్యుత్సవములు

ప్రపంచవ్యాప్తములైన గాంధిమహాత్ముని 63-వ వర్ధంత్యుత్సవములు గాంధి యుగోదయమును పరిస్ఫుటముచేసినవి. ఆత్మవిస్మరణము చేసిన ప్రపంచమున కాత్మసంస్మరణమును జేసిన మహాత్ముడు నవయుగావతరణమును జేయుచున్న విధము ప్రపంచమునకు విస్మయమును సంభ్రమమును గలుగజేయుచున్నది. ప్రపంచేతిహాసములు దైవబలమును ఘోషించుచున్నను అసురబలము మహాసంభ్రమమును గలుగజేయుచున్నది. ప్రపంచేతిహాసము లనవరతము హిరణ్యాక్ష హిరణ్యకశిపు నృసింహావతారముల నారాధించుచున్నవి. ఆత్మవిజయమును ప్రతిపాదించిన ప్రహ్లాద ధ్రువ బుద్ధ దేవక్రైస్తవాదుల యితిహాసములు విస్మృతములై భౌతికాభిమానము ప్రబలినది. మతసంస్థలు, సాంఘికవ్యవస్థలు, రాజ్యాంగములు, సాహిత్యములు, శాస్త్రములు, కళలు, ధర్మములు భౌతికసంపదాయుక్తములైనవి. మానవలక్ష్యము నిత్యమైన ధర్మమునందును సత్యమునందును సంకుచితమై అనిత్యములైన భౌతికసంపదలందు విశ్వవ్యాపకమును గాంచినది. సర్వసంహారమును జేసిన ఐరోపామహాసంగ్రామానంతరమునందును ప్రపంచమునకు ధర్మసంస్మరణమును, ఆత్మవిశ్వాసమును గలుగలేదు. దైవదత్తములైన మహాశక్తులు సుందోపసుందోపాఖ్యానమువలె నాత్మవినాశనమునకు వినియోగపడుచున్నవి. ప్రపంచావృతమైన ప్రళయావస్థయం దాత్మవిశ్వాసము జాతులకును, సంఘములకును, వ్యక్తులకును దుర్లభముగ నున్నది. పాశ్చాత్యసంస్కారము భారతీయసంస్కారమును సకలావరణములందును స్తంభనముచేసినది. చైతన్యమయమైన భారతీయసంస్కారము జడప్రాయమైనది. పారతంత్ర్యము, గర్భదారిద్ర్యము బాహ్యాభ్యంతరయోగములను దుర్లభము చేసినది. భారతీయులకు భుక్తియును, ముక్తియును దుర్లభములైనవి. ఆత్మవిశ్వాస మంతరించి విధిబలము సకలవ్యవస్థలందును వేదవాక్యమైనవి. ఆత్మయందు విశ్వమును, విశ్వమునందు విశ్వేశ్వరుని, విశ్వేశ్వరునందు లీలాప్రపంచమును సందర్శించిన మహర్షుల సంతానమిపుడు మాయావాదోపహతమై, ఆత్మోద్ధరణమునకును, ప్రపంచోద్ధరణమునకును నిరుపయోగముగ నున్నది. సమ్మోహావస్థయందు మునిగియున్న భారతసంతానమునకును ప్రపంచమునకును నాత్మసంస్మరణము చేసిన గాంధిమహాత్ముని వర్ధంత్యుత్సవములు దుఃఖమయమైన లోకమునకు బ్రహ్మానందదాయకము లైనవి.

యూరపు నావరించిన మహాప్రళయావస్థ యుపశమించుట కాత్మసంస్మరణ మత్యంతావసర మైనది. పాశ్చాత్యశాస్త్రపరిశోధనలు సుఖరూపమునను దుఃఖదాయకంబులుగను నున్నవి. రాజ్యాదాయము మారణసాధనములకును, ప్రజాదాయము మద్యపానమునకును నిరంతరభోగారాధనమునకును వినియోగపడునపుడు రాజ్యములును, సంఘములును, వ్యక్తులును నిత్యమైన ధర్మాధారరహితములై వినాశమును బొందుట ప్రకృతిధర్మము. ప్రపంచేతిహాసములును, ప్రవృత్తియును నిట్టి మహాదృశ్యములలో నిండియున్నను పాశ్చాత్యపండితులకును, రాజ్యతంత్రజ్ఞులకును జ్ఞానోదయము గలుగకుండుట దురదృష్టము. పాశ్చాత్యరాజ్యములు స్వయముగ నాత్మహత్యను జేసికొనుట పాశ్చాత్యసంస్కారమునకు సహజఫలమైనను నిర్బంధముగను ప్రాచ్యరాజ్యముల కాత్మహత్యను చేయుట యధర్మము. ప్రకృతిసిద్ధములైన సుఖదాయకములైన భౌతికసంపదలతో లోకము నిండియున్నను కృత్రిమసంపదలను గల్పించుకొని ఆత్మనాశనమునకు బూనుకొనుట ప్రపంచము నావరించిన దురదృష్టము. విశ్వధారణమునకును పురుషార్థమునకువలెను మూలాధారము శాంతియును ధర్మమును గాని సంక్షోభమును నర్థకామములును గావు. విశ్వమంతయును ననంతముఖములను బోధించుచున్న యీపరమార్థము కృత్రిమరూపములను దాల్చి పరమానర్థములకు మూలముగ నున్నది.

వివిధమతములవారును వారి మతధర్మములను మతాచార్యులు ప్రతిపాదించిన నిత్యమైన ఆత్మధర్మార్థము వినియోగించకను నశ్వరములైన భౌతికప్రయోజనములకై వినియోగించుచు సంక్షోభాంకురములను నభివృద్ధిని జేయుచున్నవిధము భయంకరముగ నున్నది. జాతీయాహంకారము, మతాహంకారము, ధనాంధకారము, కులాభిమానము, విద్యాభిమానము, దేశాభిమానము మానవలత్యము ననిత్యములైన బాహ్యప్రయోజనములకు వినియోగపడునటులు నిత్యమైన ఆభ్యంతరప్రయోజనములకు వినియోగపడకున్నవి. అభిమానారాధన మాత్మవిస్మరణమునకును పరపీడనమునకును వినియోగపడుచు మహాసంక్షోభమునకు సాధనం బగుచున్నది. ఈ మహాసంక్షోభమయమైన ప్రళయావస్థ ననుభవించుచున్న ప్రపంచమునందు శాంతిస్థాపనమునకై ఆత్మశక్తిని, ఆత్మధర్మమును ప్రపంచమునకు వ్యక్తముచేయుట కవతరించిన గాంధిమహాత్ముని వర్ధంత్యుత్సవములు జాతిమతకులదశాభేదములు లేకను సకలజనులకును నాచరణయోగ్యములుగ నున్నవి. గాంధిమహాత్ముడాత్మసంయమయోగమును కర్మయోగమును అహింసాధర్మమునం దేకస్థాయియందు విశ్వశ్రుతియందు సమ్మేళనమును జేసి ఆత్మోపలబ్ధిని బొందగలవిధమును వారి పవిత్రజీవయాత్రయందు లోకమునకు పరిస్ఫుటము చేయుచు లోకమునకు మార్గదర్శకులై ధన్యవాదములకు పాత్రులుగ నున్నారు.

* * * *

## గాంధి యుగధర్మము

శ్రీ కృష్ణపరమాత్ముడు కురుక్షేత్రమునందు విజయున కాత్మవిజయమునకు జేసిన ధర్మోపదేశమునె గాంధిమహాత్ముడు భారతీయుల కాత్మవిజయమ్మునకు జేయుచున్నాడు. గోపాలనందనుడు గీతామృతము ననుగ్రహించుటకు విజయుడు నిమిత్తమాత్రుడైనటులు గాంధిమహాత్ముడు లోకమునకు సత్యాగ్రహము ననుగ్రహించుటకు భారతీయపూర్ణస్వరాజ్యమును నిమిత్తకారణముగ నున్నది. పురుషసూక్తప్రతిపాదితమైన ఆత్మసంస్కారమునకు సంతానమైన భారతీయులు సత్యాగ్రహసంస్కారమును నారాధించుటకును నుపదేశించుటకును నధికారులుగ నున్నారు. గత సంవత్సరమునందు సత్యాగ్రహసమరమునందు బాలబాలికలు, యువతీయువకులు, వృద్ధులు, పామరపండితులు, సామాన్యసంపన్నులు బలిదానము చేసినవిధ మాత్మవిజయమును పరిస్ఫుటము చేసినది. వేలకొలది శాంతిసైనికులు ఖద్దరు దీక్షావస్త్రధారులై నిర్బంధమందిరములందు కల్యాణమందిరములందువలె నాత్మానందము ననుభవించిరి. భారతీయాత్మవిజయమునకై ప్రాణమానధనములను సమర్పించిన యపూర్వేతిహాసము పాశ్చాత్యసంస్కారులకు భయసంభ్రమములను గలుగజేసి జిజ్ఞాసకు గారణంబైనది. ఈజిజ్ఞాస గాంధి-ఇర్విను సంధికిని, గాంధివిజయధ్యానములకును, గాంధిజయంత్యుత్సవములకును మూలముగ నున్నది. గాంధివారము భరతవర్షమునే కాకను ప్రపంచము నంతను గాంధిధర్మమయము చేసినది. ఆసేతుహిమాచలమును పర్యాప్తములైన మహోత్సవములు, నగరసంకీర్తనములు, భజనలు, అన్నదానములు, అర్చనాభిషేకములు, సభలు, సంబోధనలు, ప్రతిజ్ఞలు, మహాసంచలనములు భారతీయుల కాత్మసంస్మరణము గలిగిన విధమునకు నిదర్శనములు. భారతీయులకు గలిగిన యాత్మసంస్మరణము ప్రపంచమున కంతకును నాత్మసంస్మరణమును గలుగజేయుటకు సాధనముగ నున్నది. గాంధిమహాత్ముని ఆత్మశక్తి క్రైస్తవమతగురువులకును, రాజ్యాంగపండితులకును నాత్మపరీక్షకు సాధనం బగుచున్నది. ఆసురసంపదారాధనయందు లగ్నమై తరణోపాయమును గానలేకను పరితపించుచున్న ప్రాచ్యపాశ్చాత్యప్రపంచముల కాశాకాంతులు గోచరంబగుచున్నవి. ఆంగ్ల రాజ్యతంత్రజ్ఞులు గాంధిమహాత్ముడు బ్రిటీషు రాజ్యమున కవతరించిన పరమశత్రుండని నిందించినను మతగురువులు శాంతిస్థాపనమున కవతరించిన ఏసుక్రీస్తని శ్లాఘించుచున్నారు. భరతవర్షమునందువలెనే గ్రేట్బ్రిటనునందును లక్షలకొలది ప్రజలు గాంధిసందర్శనమును జేయుచు కృతార్థులగుచున్నారు. గాంధి వర్ధంత్యుత్సవములు పురుషసూక్త ప్రతిపాదితమైన ఆత్మస్వరూపమును, ఆత్మశక్తిని భారతీయులకు సంస్మరింపజేసినవి. భారతీయులు చిరకాలము విస్మరించిన యాత్మశక్తి నుద్ధరించి పూర్ణస్వరాజ్యమును, లోకశాంతిని బడయుటకు భగవంతు డనుగ్రహించుగాత!

*   *   *

ఆత్మశక్తి

ప్రపంచవృత్తియందు సకలశుభములనుబడయుటకును స్వీయతరణము మూలాధారముగ నున్నది. "స్వయం తీర్ణః పరాం స్తారయతి" యను ధర్మము సర్వత్ర చెల్లుచున్నది. దుర్భరమైన పారతంత్ర్యబాధయందు మునిగియున్న భరతవర్షమునకు జీవయాత్రసయితము దుర్లభముగ నున్న విధమును రాజ్యాంగములు, వ్యాపారవాణిజ్యములు, ఆర్థికనిర్ణయములు, సామాన్యవ్యవహారములు విశదము చేయుచున్నవి. లండనునందు రౌండుటేబిలు సమావేశమునందును, సిమ్లాయందు సామ్రాజ్యశాసనసభయందును, నితర రాజ్యాంగములందును మాటలయందును వాదనలందును గల పటుత్వము కార్యములయందు లేదని నిత్యానుభవము సువ్యక్తము చేయుచున్నది. గర్భదరిద్రమునందు మునిగి పన్నులభారముక్రిందను క్రుంగి నాశనమగుచున్న దేశమునందు క్రొత్తపన్నులను వేయుటయును, భాగ్యస్థితికి లక్ష్యమైన బంగారు వెండి ప్రచారమునకు ప్రతిబంధకములను గల్పించుటయును, వాగ్బంధనము చేయుటయును బ్రిటీషుపరిపాలనము గలుగజేయుచున్న జడత్వమునకు నిదర్శనములుగ నున్నవి. గ్రేటుబ్రిటనునందు జరుగుచున్న రాజ్యాంగార్థికసంక్షోభమును పాశ్చాత్యసంస్కారము గలుగజేసిన మహాసంక్షోభమును, ప్రపంచశాంతికిని స్వరాజ్యప్రాప్తికిని నారాధనయోగ్యమైన నవధర్మస్థాపనారాధనావసరమును విశదము చేయుచున్నవి.

లోకకల్యాణమునకును భారతీయస్వరాజ్యప్రాప్తికిని సత్యాగ్రహధర్మమును ప్రతిపాదించి ఆధర్మమును నిత్యజీవనమునందు సార్థకము చేయుచున్న గాంధిమహాత్ముని పవిత్రమైన జీవితవిధానము భారతీయులకువలెను సకలజనులకును నారాధనయోగ్యముగ నున్నది. సత్యాగ్రహమున కాత్మశక్తిపరములైన సత్యము, నిగ్రహము, అహింసాదిధర్మములు విజయమును బొందగల విధమును గాంధిమహాత్ముని దిగ్విజయము లోకమునకు పురుషసూక్తమువలెను పరిస్ఫుటము చేయుచున్నది. ఆత్మవిజయమును భారతసంస్కారణము వేలఏండ్లక్రితముననె గీతార్థమునందును పరిస్ఫుటము చేసినది. ఆత్మవిజయమును, ప్రపంచకల్యాణమును అనాసక్తియోగరూపమునను నిత్యజీవయాత్రరూపమునను ప్రత్యక్షముచేయుచు భారతీయులకును ప్రపంచమునకును నాత్మశక్తిప్రభావమును నవగాహనము చేయబూనిన గాంధిమహాత్ముని సంకల్పమును సార్థకము చేయుటకు విజయుని వంశీయులైన భారతీయులు కర్మయోగపరాయణులై ఆత్మవిజయమును స్థాపించెదరు గాక!

శ్లో. నష్టో మోహః స్మృతిర్లబ్ధా
త్వత్ప్రసాదా న్మయాఽచ్యుత,
స్థితోఽస్మి గతసందేహః
కరిష్యే వచనం తవ.

---

Printed and Published by K. Nageswara Rao, at the Andhra PatrikaPress, No.7,Thambu Chetty St.,Madras